Parshvadeva

Sri [illegible] Virachita

# SANGITA SAMAYASARA

# సంగీత సమయసారము

**Ancient Musical Treatise with Word for Word Translation and Paraphrase in Telugu**

Sangita Kalaprapurna, Gandharva Vidya Vachaspati,
Ganakaladhara, Gandharva Vidyabhushana,
Sangita Lakshya Lakshana Kovida
Prof : DWARAM BHAVANARAYANA RAO

శ్రీ పార్శ్వదేవ విరచిత

# సంగీతసమయసారము

(ప్రతిపదార్థ తాత్పర్య సహితము)

సంగీత కళాప్రపూర్ణ
ఆచార్య ద్వారం భావనారాయణ రావు

శ్రీ పార్శ్వదేవ విరచిత

# సంగీత సమయసారము

ప్రతిపదార్థ తాత్పర్య సహితము

సంగీత కళాప్రపూర్ణ

**ఆచార్య ద్వారం భావనారాయణరావు**

ప్రథమ ముద్రణ : 2004

కాపీలు : 1000 ప్రతులు

వెల : రూ. 500/- US $ 30

ప్రతులకు :

1. **శ్రీమతి ద్వారం వరదమ్మా భావనారాయణరావు**
   'శ్రీద్వారం', నెం. 17
   గెజిటెడ్ ఆఫీసర్స్ కాలనీ, ఇసుకతోట
   **విశాఖపట్నం - 530 022**
   ఫోన్ : 0891-2543465

2. **శ్రీ నేమాని వెంకటరమణ & Dr. శ్రీమతి ద్వారం లక్ష్మి**
   16/9, మునిరెడ్డి కాలనీ (వెస్ట్), శ్రీ పద్మావతీనగర్
   **తిరుపతి - 517 502**
   ఫోన్ : 0877-2242627

**ముద్రణ :**

**శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్**
మల్టీకలర్, వెబ్‌ఆఫ్‌సెట్ ప్రింటర్స్ & బుక్ మాన్యుఫేక్చరర్స్
మెయిన్‌రోడ్డు, **కొవ్వూరు-534 350**
ఫోన్ : 08813-231575 ఫ్యాక్స్ : 08813-232354



శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

ఈ గ్రంథము శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయముతో ప్రచురించబడినది.



నాదరూప దైవసమానులైన మానాన్న గారు సంగీతకళానిధి,
పద్మశ్రీ, కళాప్రపూర్ణ ప్రొ॥ **ద్వారం వేంకటస్వామి నాయుడు** గారికి,
ప్రేమైక మూర్తి మా అమ్మ **శ్రీమతి జగ్గయ్యమ్మ** గారికి నిరంతర ప్రణామాలు.

## FOREWORD

In my Foreword to Prof. Dwaram Bhava Narayana Rao's Telugu translation of the Chaturdandi Prakasika of Venkatamakhi I worte "the translation bears testimony not only to Prof. Rao's knowledge of music but also to his understanding of the Sanskrit language considering the fact that Venkatamakhi's style is terse and scientific. The world of music must be grateful to him for his selfless service and should benefit by his painstaking reasearch."

Prof. Rao's Telugu Chaturdandi Prakasika was published in June this year but the noble soul departed for his heavenly abode the very next month. It is, therefore, with a heavy heart that I am writing this Foreward to his Telugu translation of the Brihaddesi, Dattilam and Sangita Samayasaram Prof. Rao appears to have trnslated into Telugu sevaral other Sakskrit treatises without any publicity even his close associates not knowing the magnificient service he was rendering to the art of music. This, again, was another characteristic trait of Prof. Rao's nature.

It was perhaps the Almighty's will that such treatises should be translated into Telugu by Prof. Rao before he shed his mortal coil. Although he is no longer with us, the translation has been made available to the music world which should benefit by it with a sense of gratitude to its author.

### SANGITA SAMAYASARA

The translation into Telugu of this valuable work by Prof. Bhavanarayana Rao is another feather in his cap.

Sangita Kala Acharya
**T. S. PARTHASARATHY**
Fellow, Sangeet Natak Akademi &
Emeritus Fellow, Department of
Culture, Government of India

**Dr. Pappu Venugopala Rao**
Director (Programs)
American Institute of Indian Studies
**CHENNAI-600 004**

The evolution of Music in India is a fascinating story. Treatises on Music have been written from as early as 2nd Century BC. The concepts however have their origin in the Vedas, the up anishads, the epics and the Puranas. We have many Lakshana granthas in music, some ancient, some medieval and some modern.

The earliest endeavour of translating any work from Sanskrit into Telugu began with **Nannaya's** translation of **Mahabharata.** Unlike works in literature, technical books like this which deal with different aspects of music require a scholar of both Sanskrit and music to translate it.

Brevity and clarity of statement have been two great qualities that govern the very concept of writting the Lakshana granthas.

Late Sri Dwaram Bhavanarayana Rao was an excellent musician and a great musicologist with an unending thirst for knowledge.

It was his mission in life to give the world what he learnt from these books. He started this exercise of bringing out authentic translations, of some of the most important Sanskrit treatises on music into Telugu. His translation of **Chaturdandi Prakasika** stands testimony to his scholarship, his undying urge and his untiring efforts to bring translations of great musicology books.

Sri Bhavanarayana Rao took the task of one of the most commercially unproductive endeavors of translating Sanskrit books written on musicology into Telugu. It difinitely shows his deep detachment from materialism and attachment to mere knowledge. So long as people respect Vekatamakhi and his Chaturdandi Prakasika, Dattia and his work. Matanga and Brhaddesi, Parsvadeva and Sangita Samayasara. Dwaram Bhava Narayana Rao will be remembered that long. Late Dwaram Bhavanarayana Rao carved a niche for himself in the history of music with the monumnetal translation of the great works.

**Dr. Pappu Venugopala Rao**

**Dr. N. RAMANATHAN**
Chairperson, School of Fine and
Performing Arts, Professor &
Head, Department of Indian Music
University of Madras
**CHENNAI - 600 005**

I recall with pride and warmth my associaiton with Late Professor

Dwaram Bhavanarayanagaru. His enthusiasm and zeal for augmenting his knowledge of music history and theory was admirable and he spared no efforts in sharing it with others.

It is very laudable that Professor Dwaram Bhavanarayana garu chose ancient texts for translation into Telugu and the world of music is once again indebted to him for this contribution. The translation

contains the meaning for each word and also the purport of each

verse. The family of Bhavanarayanagaru needs to be commended for the steps taken to complete the projects undertaken by him during his lifetime. The world of music eagerly awaits the release of other unpublished works of his.

**Dr. N. Ramanathan**

# కృతజ్ఞతాభివందనాలు

జగద్విఖ్యాత వయోలిన్ విద్యాంసులు సంగీత కళానిధి, పద్మశ్రీ, కళాప్రపూర్ణ బిరుదాంకితులు, పూజ్యులు శ్రీ మా మామగారైన డా॥ ద్వారం వేంకటస్వామి నాయుడు గారి పుత్రుడిగా జన్మించి, శిష్యుడిగా లక్ష్య లక్షణ సంగీత శిక్షణను పొంది, సంగీతం యొక్క సమగ్ర స్వరూపాన్ని, మాధుర్య మహిమను యథాశక్తి గ్రహించి, సంగీతరంగానికి తనదైన సేవలనందించి, నాదబ్రహ్మైక్యం చెందిన నా పతిదేవులు ఆచార్య ద్వారం భావనారాయణరావుగారు జగమెరిగిన విద్వాంసులు. వారు చదువుకున్న, తెలుసుకొన్న విషయాలను, సంగీతరంగంలో ప్రముఖంగా పేర్కొనబడుతున్న సంగీతగ్రంథాలను ప్రతిపదార్థ, తాత్పర్యసహితంగా తెలుగులో ప్రకటించాలని, అవి నేటి సంగీతలోకానికి, భావితరాల వారికి కూడ ఎంతో ఉపయుక్తంగా వుంటాయని నాతో చెబ్తుండేవారు. అలా రూపుదిద్దుకున్న గ్రంథాల్లో ప్రథమంగా 'చతుర్దండీ ప్రకాశిక'ను 1999 డిసెంబరు నెలలో మద్రాసు మ్యూజిక్ అకాడమీ, 2000 జూన్ నెలలో విశాఖలోని విశాఖ మ్యూజిక్ & డ్యాన్స్ అకాడమీ, విశాఖపట్నంలో ఆవిష్కరణగావించడం, యావత్సంగీతలోకం శ్రీ ద్వారం భావనారాయణ రావు గారికి అభినందనలను అందించడం కళాభిమానులందరికీ విదితమే.

అదేకోవలో సుమారు 2 దశాబ్దాలకాలం కృషిచేసి, మరిన్ని గ్రంథాలను సిద్ధంచేశారు. వాటినికూడ ప్రకటించి సంగీతలోకానికి అందించడమే వారి భార్యగా, శిష్యురాలిగా వారి కందించే నిజమైన నివాళి అనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథాన్ని ప్రకటించపూనుకున్నాను. ఈ యజ్ఞంలో భాగంగా శ్రీ భావనారాయణరావుగారి రచనల్లో దత్తిలముని విరచిత 'దత్తిలం' గ్రంథానువాదాన్ని ప్రచురించాలనే మా సంకల్పాన్ని మున్ముందుగా గమనించి అనేకానేక మంగళా శాసనాలనందించి, ఆదరించిన సద్గురువులు శ్రీశ్రీశ్రీ శివానందమూర్తిగారు దివ్యచరణాలకు భక్తిప్రపత్తులతో వందనశతాల నర్పించుకుంటున్నాను. మా శ్రీవారు భావనారాయణగార్కి చిన్ననాటి నుండి వ్యక్తిగతంగా అతిసన్నిహితులై ఆయన యొక్క కళాజీవితానికి ఎంతో స్ఫూర్తినిచ్చి అన్నిరకాలయిన సహకారాన్ని అందించిన, అందిస్తున్న కళాప్రియులు శ్రీ వి.పి. రమణయ్య రాజాగారికి ప్రణామాలు.

ఈ గ్రంథరచనల్లో భాషాపరమైన సహకారం అందించిన కుమారి పెనుమర్తి లక్ష్మీనరసమ్మ (పి.ఒ.ఎల్., సంస్కృత విద్యాప్రవీణ, సంస్కృతోపన్యాకరాలు, యలమంచలి)కు నా ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

కాగా, ఈ పుస్తకరచనను ఆమూలాగ్రం పరిశీలించి, 'ముందుమాట'ను వ్రాసి ఆశీరభినందనలు తెలిపిన శాస్త్రీయ సంగీత, నృత్య కళాభిజ్ఞులు, 'సంగీత కళాచార్య' శ్రీమాన్ టి.ఎస్. పార్థసారధిగారికి నా ప్రణామాలు.

'శ్రీ బావగారు' వ్రాసిన సంగీత గ్రంథాలన్నింటినీ ప్రకటించాలనే దృఢసంకల్పంతో ఎనలేని కృషిసలుపుతున్న నా ద్వితీయ సోదరుడు చి॥ గుమ్మలూరి మణిభూషణ ప్రసాద్, మరదలు చి॥సౌ॥ రామసుబ్బలక్ష్మికి మనఃపూర్వక ఆశీర్వచనాలు.

ఈ గ్రంథాన్ని లేజర్ టైప్ సెట్టింగ్ చేసిన శ్రీ అన్నపూర్ణా గ్రాఫిక్స్ తిరుపతి అధినేత శ్రీ శర్మగారికి, అతిస్వల్పవ్యవధిలో, అత్యంత సుందరంగా అచ్చువేసిన శ్రీలక్ష్మి గణపతి బైండింగ్ వర్క్స్ (కొవ్వూరు) శ్రీ మన్యం నాగభూషణరావు సోదరులకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

శ్రీ మామగారు వ్రాసిన ప్రతిగ్రంథాన్ని ప్రచురణ చేయడంలోను, శ్రీ ద్వారం భావనారాయణరావు మెమోరియల్ ట్రస్ట్ ద్వారా ప్రతిసంవత్సరం జరిగే 'సంగీత శాస్త్ర శిరోమణి బిరుద ప్రధానోత్సవ నిర్వహణలో, ఇంకా ఈ ట్రస్ట్ తరపున జరుగుతున్న ప్రతి కార్యక్రమ నిర్వహణలో వెన్నంటి నిలుస్తున్న చిరంజీవి మా రెండవ అల్లుడుగారు శ్రీ శీలంశెట్టి ప్రభాకర్ (USA), మా అమ్మాయి చి॥ సౌ॥ శీలంశెట్టి ద్వారం వేంకటశారదా పద్మశ్రీలకు నా ప్రేమైక ఆశీస్సులు.

'సంగీత సమయసారం' మూలగ్రంథం ప్రస్తుతం ఏ భాషలోనూ లభ్యంకావటం లేదు. ఇట్టి సమయంలో ఈ గ్రంథం ఆచార్య ద్వారం భావనారాయణ రావుగారి అనువాదంతో సంగీతలోకానికి మిక్కిలి వుపయోగకారి కాగలదని విశ్వసిస్తూ ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాను.

భవదీయురాలు
**ద్వారం వేంకట వరదమ్మా**
**భావనారాయణరావు**

## కృతజ్ఞతాంజలి

ఈ గ్రంథప్రచురణకు

శ్రీ ద్వారం భావనారాయణరావు మెమోరియల్ ట్రస్ట్

కార్యక్రమాలన్నింటికీ

ఆర్థికంగా, శారీరంగా, మానసికంగా బలాన్ని అందిస్తున్న

**చి॥ గుమ్మలూరి మణిభూషణప్రసాద్**

**చి॥సౌ॥ గుమ్మలూరి రామసుబ్బలక్ష్మి** దంపతులకు

చి॥ శీలంశెట్టి ప్రభాకర్ (USA)

**చి॥సౌ॥ శీలంశెట్టి (ద్వారం) వేంకటశారదాపద్మశ్రీలకు**

ప్రేమపూర్వక దీవెనలు

# సంగీతసమయసారః

## సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవ విరచితః

## ప్రథమమధికరణమ్

నాదోత్పత్తి ర్యథాశాస్త్ర మిదానీ మభిధీయతే ।
స్వరో గీతం చ వాద్యం చ తాలశ్చేతి చతుష్టయమ్ ॥ 1 ॥

**ప్రతిపదార్థము :** ఇదానీం = ఇప్పుడు; యథాశాస్త్రం = శాస్త్రోక్త ప్రకారముగా; నాదోత్పత్తిః = నాదము యొక్క పుట్టుక; అభిధీయతే = చెప్పబడుచున్నది; స్వరః = స్వరము; గీతం= గీతము; వాద్యం = వాద్యము; తాలశ్చ ఇతి = తాళములని; చతుష్టయం = నాల్గు విధములు.

**తాత్పర్యము :** ఇప్పుడు శాస్త్రోక్త ప్రకారముగా నాదముయొక్క పుట్టుక చెప్పబడుచున్నది. స్వరము, గీతము, వాద్యము, తాళములని నాదము నాల్గు విధములు.

న సిధ్యతి వినా నాదం తస్మా న్నాదాత్మకం జగత్ ।
నాదాత్మాన స్త్రయో దేవాః బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ॥ 2 ॥

**ప్రతిపదార్థము :** నాదం వినా = నాదములేనిదే; న సిధ్యతి = (సంగీతము) సిద్ధించదు; తస్మాత్ = అందువలన; జగత్ = లోకము; నాదాత్మకం = నాదస్వరూపమైనది; బ్రహ్మవిష్ణుమహేశ్వరాః త్రయః దేవాః = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముప్పురును; నాదాత్మానః = నాదస్వరూపులు.

**తాత్పర్యము :** నాదములేనిదే సంగీత శాస్త్రము సిద్ధించదు గనుక లోకము నాదస్వరూపమైనది బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముప్పురును నాదస్వరూపులు.

నాభౌ యద్బ్రహ్మణః స్థానం బ్రహ్మగ్రంథిశ్చ యో మతః ।
ప్రాణ స్తన్మధ్యవర్తీ స్యా దగ్నేః ప్రాణాత్ సముద్భవః ॥ 3 ॥

**ప్రతిపదార్థము :** నాభౌ = నాభియందు; యత్ బ్రహ్మణః స్థానం = యేది బ్రహ్మకు స్థానమో; యశ్చ బ్రహ్మగ్రంధిః మతః = ఏది బ్రహ్మగ్రంథిగా చెప్పబడునో; సః ప్రాణః = అప్రాణము; తన్మధ్యవర్తీ = ఆనాభిబ్రహ్మగ్రంథుల మధ్యనుండునది; య్రె, అగ్నేః = అగ్నినుండి; ప్రాణాత్ = ప్రాణమునుండియు; సముద్భవః స్యాత్ = జన్మకలది యగుచున్నది.

**తాత్పర్యము :** నాభియందు యేది బ్రహ్మకు స్థానమో, ఏది బ్రహ్మగ్రంథిగా చెప్పబడునో ఆ ప్రాణము ఆనాభిబ్రహ్మగ్రంథుల మధ్యనుండునది అగ్నినుండి, ప్రాణమునుండియు పుట్టినీదియగుచున్నది.

> **అగ్నిమారుతయో ర్యోగాత్ భవే న్నాదస్య సంభవః ।**
> **నకారః ప్రాణ ఇత్యుక్తో దకారో వహ్నిరుచ్యతే ॥ 4 ॥**

**ప్రతిపదార్థము :** అగ్నిమారుతయోః యోగాత్ = అగ్ని వాయుసంయోగమువలన; నాదస్య సంభవః స్యాత్ = నాదముయొక్క పుట్టుక అగును; నకారః = నకారము; ప్రాణః ఇతి = ప్రాణమని; ఉక్తః = చెప్పబడినది; దకారః = దకారము; వహ్నిః ఉచ్యతే= అగ్నిగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అగ్ని! వాయుసంయోగమువలన నాదముయొక్క పుట్టుక అగును. నకారము ప్రాణమని చెప్పబడినది. దకారము అగ్నిగా చెప్పబడుచున్నది.

> **అర్థోఽయం నాదశబ్దస్య సంక్షేపాత్ పరికీర్తితః ।**
> **స చ పంచవిధో నాదో మతంగముని సమ్మతః ॥ 5 ॥**

**ప్రతిపదార్థము :** నాదశబ్దస్య అయం అర్థః = నాదశబ్దము యొక్క ఈఅర్థము; సంక్షేపాత్ = సంగ్రహముగా; పరికీర్తితః = చెప్పబడినది; మతంగముని సమ్మతః = మతంగమునికి అంగీకారమైన (ట్లుగ); సః నాదః = ఆనాదము; పంచవిధః = ఐదు విధములైనది.

**తాత్పర్యము :** నాదశబ్దము యొక్క ఈఅర్థము సంగ్రహముగా చెప్పబడినది. మతంగమునికి అంగీకారమైన (ట్లుగ) ఆనాదము ఐదువిధములైనది

> **అతిసూక్ష్మశ్చ సూక్ష్మశ్చ పుష్టోఽపుష్టశ్చ కృత్రిమః ।**
> **అతి సూక్ష్మో భవే న్నాభౌ హృది సూక్ష్మః ప్రకాశతే ॥ 6 ॥**

**ప్రతిపదార్థము :** అతిసూక్ష్మః = అతిసూక్ష్మము; సూక్ష్మః = సూక్ష్మము; పుష్టః =

పుష్టము; అపుష్టః = అపుష్టము; కృత్రిమశ్చ = కృత్రిమమును; (అని ఐదువిధములు); అతిసూక్ష్మః = అతి సూక్ష్మనాదము; నాభౌ భవేత్ = నాభియందుండును; హృది = హృదయమందు; సూక్ష్మః ప్రకాశతే = సూక్ష్మనాదము భాసించును.

**తాత్పర్యము** : అతిసూక్ష్మము, సూక్ష్మము పుష్టము, అపుష్టము కృత్రిమమును (అని నాదము ఐదువిధములు)అతిసూక్ష్మనాదము నాభియందుండును.హృదయమందు సూక్ష్మనాదము భాసించును.

**పుష్టోఽభివ్యజ్యతే కంఠే త్వపుష్టః శిరసి స్మృతః ।**
**కృత్రిమో ముఖదేశే తు స్థానభేదేన భాసతే ॥ 7 ॥**

**ప్రతిపదార్థము** : పుష్టః = పుష్టనాదము; కంఠే అభివ్యజ్యతే = కంఠమందు వ్యక్తమగును; అపుష్టః శిరసి స్మృతః = అపుష్టనాదము శిరస్సునందుండునని చెప్పబడినది; కృత్రిమః = కృత్రిమ నాదము; ముఖదేశే = ముఖమునందును; స్థానభేదేన = స్థానభేదముచే; భాసతే = స్పష్టమగుచున్నది.

**తాత్పర్యము** : పుష్టనాదము కంఠమందు వ్యక్తమగును. అపుష్టనాదము శిరస్సు నందుండునని చెప్పబడినది. కృత్రిమ నాదము ముఖమునందును స్థానభేదముచే స్పష్టమగుచున్నది.

**అవ్యక్తః శిరసీత్యుక్తః కైశ్చిత్ తన్నోపపద్యతే ।**

**బిందు రుత్పద్యతే నాదా న్నాదా న్నిఖిలవాఙ్మయమ్ ॥ 8 ॥**

**ప్రతిపదార్థము** : కైశ్చిత్ = కొందరిచే; అవ్యక్తం = అవ్యక్తమను నాదము; శిరసి ఇతి ఉక్తః = శిరస్సునందున్నదని చెప్పబడినది; తత్ న ఉపపద్యతే = అది సరికాదు; నాదాత్ = నాదమునుండి; బిందుః ఉత్పద్యతే = బిందువు పుట్టుచున్నది; నాదాత్ = నాదమునుండి, నిఖిల వాఙ్మయం = సమస్త వాఙ్మయము పుట్టుచున్నది.

**తాత్పర్యము** : కొందరిచే అవ్యక్తమను నాదము శిరస్సునందున్నదని చెప్పబడినది. అదిసరికాదు. నాదమునుండి బిందువు పుట్టుచున్నది. నాదము నుండి సమస్త వాఙ్మయము పుట్టుచున్నది.

మంత్రాదిస్థానభేదేన యో నాదః స్ఫురతి స్ఫుటమ్ ।
ఆరోహక్రమ త స్తజ్జైః స ఏవ ధ్వని రుచ్యతే ॥ 9 ॥

**ప్రతిపదార్థము** : మంత్రాదిస్థానభేదేన = మంత్రాదుల స్థానభేదముచే; ఆరోహ క్రమతః = ఆరోహక్రమముగా; తజ్జ్ఞైః = ఆయా అంశములనెఱిగిన పండితులచే; యః నాదః = యేనాదము; స్ఫుటం స్ఫురతి = స్పష్టముగా ప్రకాశించునో (వ్యక్తమగునో); సః ఏవ ధ్వనిః ఇతి = అదియే ధ్వనియని; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : మంత్రాదుల స్థానభేదముచే ఆరోహక్రమముగా ఆయా అంశములనెఱిగిన పండితులచే యేనాదము స్పష్టముగా ప్రకాశించునో (వ్యక్తమగునో) అదియేధ్వనియని చెప్పబడుచున్నది.

> **కాబులో బంబలశ్చైవ నారాటో మిశ్రక స్తథా ।**
> **ధ్వని శ్చతుర్విధః ప్రోక్తో గీతవిద్యావిశారదైః ॥ 10 ॥**

**ప్రతిపదార్థము** : కాబులః = కాబులము; బంబలః = బంబలము; నారాటః = నారాటము; తథా = అట్లే; మిశ్రకః = మిశ్రకము అని; ధ్వనిః = శబ్దము; గీతవిద్యావిశారదైః = సంగీతజ్ఞులచే; చతుర్విధః ప్రోక్తః = నాల్గువిధములుగా చెప్పబడినది.

**తాత్పర్యము** : కాబులము, బంబలము, నారాటము అట్లే మిశ్రకము అని శబ్దము సంగీతజ్ఞులచే నాల్గువిధములుగా చెప్పబడినది.

> **బాహుల్యా న్మంత్రసంస్పర్శైః మాధుర్యగుణసంయుతః ।**
> **కాబులః స పరిజ్ఞేయో గీతధ్వనివిశారదైః ॥ 11 ॥**

**ప్రతిపదార్థము** : మంత్రసంస్పర్శైః = మంత్రసంబంధముగల; గీతధ్వనివిశారదైః = పండితులైన గాయకులచే; బాహుల్యాత్ = అధికమైన; మాధుర్యగుణసంయుతః = మాధుర్యగుణముతో కూడిన; సః = ఆధ్వని; కాబులః పరిజ్ఞేయః = కాబులమని తెలియదగినది.

**తాత్పర్యము** : మంత్రసంబంధముగల పండితులైన గాయకులచే అధికమైన మాధుర్యగుణముతో కూడిన ఆధ్వని కాబులమని తెలియదగినది.

> **ఏరండకాండవ ద్యత్ర ఖణికాసంవివర్జితః ।**
> **నిస్సారో బంబల స్థాలో బాహులో న తు మధ్యభాక్ ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : ఖణికా సంవివర్జితః = గట్టిదనము విడిచిన (లేని); ఏరండకాండవత్= ఆముదపు చెట్టుకాండమువలె; బంబలః = బంబలధ్వని; నిస్సారః = సారములేనిది;

ఫోలః = తేలికయైనది; బాహులః =విపులమైనది; న మధ్యబాక్ = మధ్యము అయినది కూడకాదు.

**తాత్పర్యము** : గట్టిదనము విడిచిన (లేని); ఆముదపు చెట్టుకాండమువలె బంబలధ్వని సారములేనిది, తేలికయైనది, విపులమైనది, మధ్యము అయినది కూడ కాదు.

**బాహుల్యాత్ తారసంస్పర్శీ మాధుర్య గుణవర్జితః ।**
**నారాటోఽయం పరిజ్ఞేయో గీతధ్వనివిశారదైః ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : గీతధ్వనివిశారదైః = పండితులైన గాయకులచే; బాహుల్యాత్ = అధికముగ; అయం నారాటః = ఈ నారాట ధ్వని; మాధుర్యగుణ వర్జితః = మాధుర్య గుణమును విడచినదిగను; తారసంస్పర్శీ = తారస్థాయి కలదిగను; పరిజ్ఞేయః = తెలియదగినది.

**తాత్పర్యము** : పండితులైన గాయకులచే అధికముగ ఈ నారాటి ధ్వని మాధుర్య గుణమును విడచినదిగను, తారస్థాయి కలదిగను తెలియదగినది.

**ఏతద్ధ్వని గుణోన్మిశ్రో యత్ర సోఽయం తు మిశ్రకః ।**
**నారాట కాబులశ్చైకో మిశ్రః ఖాబులబంబలః ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; ఏతద్ధ్వనిగుణోన్మిశ్రః = ఈధ్వనులతో కలయిక కలదియగునో; సోఽయం = ఆ యీ ధ్వని; మిశ్రకః స్యాత్ = మిశ్రకధ్వనియగును; తత్ర = అందును; నారాటకాబులః ఏకః = నారాటకాబులధ్వనిమిశ్రమముమొదటిది; (ఒకటి) ఖాబుల బంబలః అన్యః = కాబులబంబలమిశ్రము మరియొకటి.

**తాత్పర్యము** : ఎక్కడ ఈధ్వనులతో కలయిక కలదియగునో ఆయీ ధ్వని మిశ్రకధ్వని యగును. అందును నారాటకాబులధ్వనిమిశ్రమము మొదటిది(ఒకటి). కాబులబంబల మిశ్రమము మరియొకటి.

**నారాటబంబలశ్చైవ ధ్వని ర్యత్ర సమిశ్రకః ।**
**ఇతి మిశ్రధ్వనిః ప్రోక్తః చతుర్ధా గీతవేదిభిః ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; నారాటః బంబలశ్చ మిశ్రకః స్యాత్ = నారాట బంబలధ్వనులు కలయునో; సః = అది; అన్యః మిశ్రకః = మరియొక మిశ్రమము; ఇతి = ఈవిధముగా; గీతవేదిభిః = గానకళాభిజ్ఞులచే; మిశ్రధ్వనిః చతుర్ధా ప్రోక్తః =

మిశ్రధ్వని నాల్గువిధములుగా చెప్పబడినది.

**తాత్పర్యము :** ఎక్కడ నారాట బంబలధ్వనులు కలయునో అది మరియొక మిశ్రమము. ఈవిధముగా గానకళాభిజ్ఞులచే మిశ్రధ్వని నాల్గువిధములుగా చెప్పబడినది.

## - అథ శరీరలక్షణమ్ -

**అంతరేణ య దభ్యాసం రాగవ్యక్తి నిబంధనమ్ ।**
**శరీరేణ సహోత్పన్నం శరీరం తత్ సమీరితమ్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము :** యత్ = ఏ; రాగవ్యక్తినిబంధనం = రాగస్పష్టీకరణ నిబంధముకల; అభ్యాసం = అభ్యాసము; అంతరేణ = లేకుండ; శరీరేణ సహ ఉత్పన్నం = శరీరముతో కూడ (స్వరూపత్వము) జనించునో; తత్ = ఆ ధ్వని; శారీరం సమీరితం = శారీరమని చెప్పబడినది.

**తాత్పర్యము :** ఏరాగస్పష్టీకరణ నిబంధము కలఅభ్యాసము లేకుండ శరీరముతో కూడ (స్వరూపత్వము) జనించునో ఆధ్వని శారీరమని చెప్పబడినది.

**చతుర్విధం భవేత్ తచ్చ కడాడం మధురం తథా ।**
**పౌశలం బహుభంగీతి చైషాం లక్షణ ముచ్యతే ॥ 17 ॥**

**ప్రతిపదార్థము :** తచ్చ = ఆ శారీరమును; కడాడం = కడాడము; మధురం = మధురము; పౌశలం = పౌశలము; బహుభంగీ ఇతి = బహుభంగియని; చతుర్విధం భవేత్ = నాల్గువిధములగును; తేషాం లక్షణం ఉచ్యతే = వాటి లక్షణము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ఆ శారీరమును కడాడము, మధురము, పౌశలము, బహుభంగియని నాల్గువిధములగును. వాటి లక్షణము చెప్పబడుచున్నది.

**త్రిషు స్థానేషు మధురం కడాడం పరికీర్తితమ్ ।**
**మంద్రే మధ్యే చ మాధుర్యా చ్ఛారీరం మధురం మతమ్ ॥ 18 ॥**

**ప్రతిపదార్థము :** త్రిషు స్థానేషు = మంద్ర-మధ్య-తారములయందు; మధురం = మధురమైనది; కడాడం పరికీర్తితం = కడాడమని చెప్పబడినది; మంద్రే మధ్యే చ మాధుర్యాత్ = మంద్ర, మధ్యములయందు మాధుర్యమువలన; మధురం శారీరం మతం = మధురముశారీరముగా భావింపబడినది.

**తాత్పర్యము :** మంద్ర-మధ్య-తారములయందు మధురమైనది కడాడమని చెప్పబడినది. మంద్ర, మధ్యములయందు మాధుర్యమువలన మధురశారీరముగా భావింపబడినది.

**జ్ఞేయం పౌశలశారీరం తారే రాగప్రకాశకమ్ ।**
**తచ్ఛారీరగుణా మిశ్రా యత్ర తద్బహుభంగికమ్ ॥ 19 ॥**

**ప్రతిపదార్థము :** తారే రాగప్రకాశకం = తారమందు రాగమును ప్రకాశింపజేయునది; పౌశల శారీరం జ్ఞేయం = పౌశలమను శరీరసంబంధియగును; యత్ర = ఎక్కడ; తచ్ఛారీరగుణాః మిశ్రాః = ఆ కడాడ, మధుర, పౌశల శరీరగుణ మిశ్రితములగునో; తత్ = అది; బహుభంగికం జ్ఞేయం = బహుభంగిగా చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** తారమందు రాగమును ప్రకాశింపజేయునది పౌశలమను శరీరసంబంధియగును. ఎక్కడ ఆ కడాడ- మధుర- పౌశలశరీరగుణములు మిశ్రితములగునో అది బహుభంగిగా చెప్పబడుచున్నది.

**పృథ గష్టవిధో భేద స్తస్య కంఠగుణాగుణైః ।**
**మాధుర్యంశ్రావకత్వం చ స్నిగ్ధత్వం ఘనతా తథా ॥ 20 ॥**

**ప్రతిపదార్థము :** తస్య = ఆశరీరముయొక్క; కంఠగుణాగుణైః = కంఠగుణ దోషములచేత;పృథక్ = వేరుగా; అష్టవిధః = ఎనిమిదివిధములైనది; మాధుర్యం శ్రావకత్వం చ = మాధుర్య- శ్రావకత్వములును; స్నిగ్ధత్వం = స్నిగ్ధత్వమును; ఘనతా = ఘనతయును.

**తాత్పర్యము :** ఆశరీరముయొక్క కంఠగుణదోషములచేత వేరుగా ఎనిమిది విధములైనది, మాధుర్య-శ్రావకత్వములును, స్నిగ్ధత్వమును, ఘనతయును

**స్థానకత్రయశోభా చ పంచ కంఠగుణాః స్మృతాః ।**
**ఖేటిః భేణి ర్భగ్నశబ్దః కంఠదోషా అమీ త్రయః ॥ 21 ॥**

**ప్రతిపదార్థము :** స్థానక త్రయశోభా చ = స్థానము త్రయశోభయని; కంఠగుణాః = కంఠగుణములు; పంచ స్మృతాః = ఐదు చెప్పబడినవి; ఖేటిః = ఖేటి; భేణిః = భేణి; భగ్నశబ్దః = భగ్నధ్వనియని; అమీ త్రయః = ఈ మూడును; కంఠదోషాః = కంఠదోషములు.

**తాత్పర్యము** : స్థానము, త్రయశోభయని కంఠగుణములు ఐదుచెప్పబడినవి భేటి, భేణి భగ్నధ్వనియని ఆమూడును కంఠదోషములు.

**మాధుర్యగుణసంయుక్తే కంఠే స్యా న్మధురో ధ్వనిః ।**
**స్నిగ్ధకంఠే ధ్వని స్తారో ప్యరూక్షః సరసో భవేత్ ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : మాధుర్యగుణ సంయుక్తే కంఠే = మాధుర్యగుణముతో కూడిన కంఠమందు; మధురః ధ్వనిః స్యాత్ = మధురధ్వని కలుగును; స్నిగ్ధకంఠే = స్నిగ్ధ కంఠమందు; తారః ధ్వనిః అపి = తారధ్వని అయినను; అరూక్షః = కఠినమైనదికాదు; సరసః భవేత్ = సరసమైనదియు అగును.

**తాత్పర్యము** : మాధుర్యగుణముతో కూడిన కంఠమందు మధురధ్వని పుట్టును. స్నిగ్ధకంఠమందు తారధ్వని అయినను కఠినమైనదికాదు. సరసమైనదియు అగును.

**సుస్వరశ్చైవ సాంద్రశ్చ ఘనకంఠే భవేద్ ధ్వనిః ।**
**కంఠే త్రిస్థానశోభే స్యాత్ త్రిస్థానే మధురో ధ్వనిః ॥ 23 ॥**

**ప్రతిపదార్థము** : ఘనకంఠే = ఘనకంఠమందు; సుస్వరః = సుస్వరమును; సాంద్రశ్చ= దట్టమునగు; ధ్వనిః స్యాత్ = ధ్వనియగును; త్రిస్థానశోభే కంఠే = త్రిస్థానశోభ కంఠమందు; త్రిస్థానే = మంద్ర- మధ్యమ- తార స్వరములందు; మధురః ధ్వనిః స్యాత్ = మధురధ్వని యగును.

**తాత్పర్యము** : ఘనకంఠమందు సుస్వరము దట్టమునగు ధ్వనికలుగును. త్రిస్థానశోభకంఠమందు మంద్ర-మధ్యమ -తారస్వరములందు మధురధ్వనికలుగును.

**భేటిః కంఠే ధ్వనిః స్థానత్రయస్పర్శీ గుణోజ్ఝితః ।**
**స్థానస్య పూరకః కృచ్ఛ్రాత్ భేణిః కంఠే ధ్వని ర్భవేత్ ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : భేటిః కంఠే ధ్వనిః = భేటియను కంఠధ్వనిప్రభేదము; స్థానత్రయస్పర్శీ= త్రిస్థానయుతము; గుణోర్జితః = గుణవర్జితము; కంఠే = కంఠమందలి; భేణిః ధ్వనిః = భేణిధ్వని, కృచ్ఛ్రాత్ = అతికష్టముగా; స్థానస్య పూరకః భవేత్ = స్థానపూరకమగును.

**తాత్పర్యము** : భేటియను కంఠధ్వని ప్రభేదము త్రిస్థానయుతము, గుణవర్జితము, కంఠమందలి భేణిధ్వని అతికష్టముగా స్థానపూర్వకమగును.

**వానరోష్ట్రఖరై స్తుల్యో భగ్నః కంఠే భవేద్ధ్వనిః ।**
**ఏతే భేదాః పరిజ్ఞేయాః శారీరేఽపి విచక్షణైః ॥ 25 ॥**

**ప్రతిపదార్థము :** కంఠే = కంఠమునందు; వానర ఉష్ట్రఖరైః తుల్యః = కోతి, ఒంటె, గార్ధభ సమానము అయిన; ధ్వనిః = ధ్వని; భగ్నః భవేత్ = భగ్నధ్వనియగును; విచక్షణైః =పండితులచేత; శారీరేఽపి = శరీరసంబంధమైనవిగా; ఏతే భేదాః = ఈ భేదములు; పరిజ్ఞేయాః = తెలియదగినవి.

**తాత్పర్యము :** కంఠమునందు కోతి, ఒంటె, గార్ధభసమానము అయిన ధ్వని భగ్నధ్వనియగును. పండితులచే శరీరసంబంధమైనవిగా ఈభేదములు తెలియదగినవి.

**ధ్వనిః క్షేత్రకాకూనాం నభేదః స్యాత్ ?**
**స్థిరకాకుస్వరములకు భేదములేదా ?**

**ధ్వనిః శారీరసంజాతవిచిత్రస్వరవర్తనః ।**
**ఛాయా తదాశ్రయా చార్యై ర్గీత మిత్యభిధీయతే ॥ 26 ॥**

**ప్రతిపదార్థము :** శరీర సంజాత విచిత్రస్వరవర్తనః ధ్వనిః = దేహమునుండి పుట్టినవిచిత్రమైన స్వరప్రవర్తనకలది ధ్వని; తదాశ్రయా ఛాయా = దానినాశ్రయించిన ఛాయ; ఆచార్యైః = సంగీతజ్ఞులచే; గీతమితి అభిధీయతే = గీతమని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** దేహమునుండి పుట్టిన విచిత్రమైనస్వరప్రవర్తనకలది ధ్వని. దాని నాశ్రయించిన ఛాయ సంగీతజ్ఞులచే గీతమని చెప్పబడుచున్నది.

**అనిబద్ధం నిబద్ధం చ గీతం తద్ద్వివిధం మతమ్ ।**
**ఆలప్త్యర్థనిబద్ధః స్యాత్ స్వరరాగ విభేదతః ॥ 27 ॥**

**ప్రతిపదార్థము :** తత్ గీతం = ఆగీతము; అనిబద్ధం = అనిబద్ధమనియు; నిబద్ధంచేతి = నిబద్ధమనియును; ద్వివిధం మతం = రెండువిధములుగా సమ్మతమైనది; స్వరరాగ విభేదతః = స్వర-రాగభేదముచే; ఆలప్తిః అర్థనిబద్ధః స్యాత్ = ఆలాపన అర్థనిబద్ధము అగును.

**తాత్పర్యము :** ఆ గీతము అనిబద్ధమనియు, నిబద్ధమనియును రెండువిధములుగా సమ్మతమైనది. స్వర-రాగభేదముచే ఆలాపన అర్థనిబద్ధము అగును.

**సాఽఽలప్తిర్ద్విధా జ్ఞేయా విషమా ప్రాంజలేతి చ ।**
**సాక్షరానక్షరా చేతి ద్విధాఽపి చతుర్విధా ॥ 28 ॥**

**ప్రతిపదార్థము** : సా ఆలప్తిః = ఆయాలాపన; విషమా ప్రాంజలాచే ఇతి = విషమమని; ప్రాంజలియని; ద్విధాఽజ్ఞేయా = రెండు విధములని తెలియనగును; ద్విధాఽపి = ఆ రెండును; సాక్షరా = సాక్షరయనియు; అనక్షరాచ ఇతి = అనక్షరయనియు; చతుర్విధా= నాల్గువిధములు.

**తాత్పర్యము** : ఆయాలాపన విషమమని, ప్రాంజలియని రెండువిధములని తెలియనగును. ఆ రెండును సాక్షరయనియు అనక్షరయనియు మరలరెండేసి విధములై మొత్తము నాల్గువిధములగును.

**చతుర్విధాఽప్యష్టవిధా సతాలాతాలభేదతః ।**
**సా పునః షోడశవిధా శుద్ధసాలక భేదతః ॥ 29 ॥**

**ప్రతివదార్థము** : సతాలాతాలభేదతః = తాల సహితము, తాలరహితము అనుభేదమువలన; చతుర్విధాఽపి = నాల్గు విధములైనఆలపనయును; అష్టవిధా = ఎనిమిది విధములైనది; సా పునః = ఆఅష్టవిధములైనదియు; శుద్ధసాలక భేదతః = శుద్ధ, సాలక భేదమువలన; షోడశవిధా = పదహారువిధములైనది.

**తాత్పర్యము** : తాలసహితము, తాలరహితము అను భేదమువలన నాల్గువిధములైనదిఆలాపనయును, ఎనిమిదివిధములైనది, ఆఅష్టవిధములైనదియు, శుద్ధ,సాలక భేదమువలన పదహారు విధములైనది.

**క్రమేణ లక్షణం తాసాం వక్ష్యే లక్ష్యానుసారతః ।**
**స్థాయ్యాదివర్ణసంయుక్తా వ్యక్తా స్థానత్రయేఽపిచ ॥ 30 ॥**

**ప్రతిపదార్థము** : లక్ష్యానుసారతః = లక్ష్యములననుసరించి; క్రమేణ = క్రమముగా; తాసాం లక్షణం వక్ష్యే = వాటి లక్షణమును చెప్పుచున్నాను; స్థాయ్యాదివర్ణసంయుక్తా = స్థాయిమొదలగు వర్ణములతో కూడినదియు; స్థానత్రయేఽపి = స్థానత్రయమందు కూడా; వ్యక్తా = స్పష్టముగాతెలియునదియు.

**తాత్పర్యము** : లక్ష్యములననుసరించి క్రమముగా వాటిలక్షణమును చెప్పుచున్నాను. స్థాయిమొదలగు వర్ణములతో కూడినదియు స్థానత్రయమందుకూడా స్పష్టముగా తెలియునదియు.

**నానాలంకార సంమిశ్రై రక్షరై ర్గమకైర్యుతా ।**
**విషమస్థాపనాయుక్తా గ్రహే మోక్షేఽప్యలక్షితా ॥ 31 ॥**

**ప్రతిపదార్థము :** నానాలంకారసంమిశ్రైః = అనేక అలంకారములతో కూడినవియగు; అక్షరైః = అక్షరములతోను; గమకైః = గమకములతోను; యుతా = కూడినదియు; గ్రహే = గ్రహణమందును; మోక్షేఽపి = విడుచుటయందునుకూడ; అలక్షితా = గుర్తింపబడనిదిగా.

**తాత్పర్యము :** అనేకఅలంకారములతో కూడినవియగు అక్షరములతోను, గమకములతోను కూడినదియు గ్రహణమందును విడుచుటయందునుకూడ గుర్తింపబడనిదిగా.

**ఆలప్తిః కథితా శుద్ధే విషమా గాయకోత్తమైః ।**
**చతుర్వర్ణసమాయుక్తా శుద్ధరీతివిరాజితా ॥ 32 ॥**

**ప్రతిపదార్థము :** ఆలప్తిః = ఆలాపన; శుద్ధే = శుద్ధమందు; విషమా = విషమముగ; గాయకోత్తమైః = సంగీతజ్ఞులచే; కథితా = చెప్పబడినది; చతుర్వర్ణసమాయుక్తా = నాల్గువర్ణములు కలదియు; శుద్ధరీతివిరాజితా = శుద్ధమైన రీతితో ప్రకాశించునదియు.

**తాత్పర్యము :** అలాపన శుద్ధమందు విషమముగ సంగీతజ్ఞులచే చెప్పబడినది. నాల్గువర్ణములు కలదియు శుద్ధమైన రీతితో ప్రకాశించునదియు.

**ప్రయోగైః సుకరై ర్యుక్తా స్థానకత్రయరంజితా ।**
**యథా సముచితన్యాస సంభావితచమత్కృతిః ॥ 33 ॥**

**ప్రతిపదార్థము :** సుకరైః ప్రయోగైః యుక్తా = సులువైన ప్రయోగములచే కూడినదియు; స్థానకత్రయరంజితా = మూడు స్థానములచే రంజింపజేయబడినదియు; యథాసముచితన్యాససంభావిత చమత్కృతిః = యోగ్యమైన విధముగా విన్యాసముకలది గనుక ఊహింపదగిన చమత్కారము కలదియు.

**తాత్పర్యము :** సున్నితమైన ప్రయోగములుకలదియు మూడుస్థానములయందును రంజింపజేయునదియు, యోగ్యమైన విధముగా విన్యాసముకలది గనుక ఊహింపదగిన చమత్కారముకలదియు.

**ఏతైర్గుణైర్యుతా శుద్ధే ప్రాంజలాలప్తిరీరితా ।**
**స్థానవర్ణక్రమావృత్తినియమేన వివర్జితా ॥ 34 ॥**

**ప్రతిపదార్థము :** ఏతైః గుణైః యుతా = ఈ గుణములతో కూడియున్నది; శుద్ధే = శుద్ధమందు; ప్రాంజలాలప్తిః = ప్రాంజలాలాపనగా; ఈరితా = చెప్పబడినది; స్థానవర్ణక్రమావృత్తినియమేన = స్థానము, వర్ణక్రమము, ఆవృత్తినియమములతో; వివర్జితా = సంబంధములేనిదియు.

**తాత్పర్యము :** ఈ గుణములతో కూడియున్నది శుద్ధమందు ప్రాంజలాలాపనగా చెప్పబడినది. స్థానము, వర్ణక్రమము, ఆవృత్తి నియమములు లేనిదియు.

**కోమలై ర్గమకైర్యుక్తాఽలంకారైర్లలితై రపి ।**
**ఉచితస్థాపనాఽఽలప్తిః సాలకే విషమా మతా ॥ 35 ॥**

**ప్రతిపదార్థము :** కోమలైః గమకైః = కోమలములైన గమకములతో; యుక్తా = కూడినదియు; లలితైః అలంకారైః అపి యుక్తా = లలితములైన అలంకారములతో కూడినదియు; ఉచిత స్థాపనాలప్తిః = ఉచితమైన స్థాపనాలాపన; సాలకే = సాలకమందు; విషమా మతా = విషమముగ భావింపడినది.

**తాత్పర్యము :** కోమలములైన గమకములతో కూడినదియు లలితములైన అలంకారములతో కూడినదియు ఉచితమైనస్థాపనాలాపన సాలకమందు విషమముగ భావింపబడినది.

**నానారీతియుతా రాగసత్తమాత్రసమాశ్రయా ।**
**లీననాదా చ సోల్లాసలలితన్యాసభూషితా ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** నానారీతియుతా = అనేక రీతులు కలదియును; రాగసత్తమాత్ర సమాశ్రయా =రాగ స్వరూప (బల) మాత్రమునాశ్రయించునదియు; లీననాదా = లీనమైన (కలసిన) నాదము కలదియు; సోల్లాసలలితన్యాసభూషితా = ఆహ్లాదముతో కూడిన మృదున్యాసముచే అలంకరింపబడినదియు.

**తాత్పర్యము :** అనేకరీతులు కలదియును, రాగస్వరూప(బల) మాత్రము నాశ్రయించునదియు లీనమైన(కలసిన) నాదముకలదియు ఆహ్లాదముతోకూడిన మృదున్యాసముచే అలంకరింపబడినదియు.

**ఏవంగుణయుతాఽఽలప్తిః సాలకే ప్రాంజలా మతా ।**
**తం హం శాఆదనై ర్వర్ణై రథవా సురజాక్షరైః ॥ 37 ॥**

**ప్రతిపదార్థము** : ఏవంగుణయుతాఽఽలప్తిః = ఇట్టి గుణములుకల ఆలాపన; సాలకే= సాలకభేదమందు; ప్రాంజలా మతా = ప్రాంజలిగా చెప్పబడుచున్నది; తం హంశా అదన్నైః వర్ణై = తం, హం, శా అదన వర్ణములచేత; అథవా = లేక; సురజాక్షరైః = దేవగణాక్షరములైన.

**తాత్పర్యము** : ఇట్టి గుణములుకలఆలాపన సాలకభేదమందు ప్రాంజలిగా చెప్పబడుచున్నది. తం, హం, శా అదన వర్ణములచేత లేక దేవగణాక్షరములైన.

**గీతాక్షరైశ్చ యద్వాన్యై రక్షరై ర్గణనై రపి ।**
**క్రియతే యది సాఽఽలప్తిః సాక్షరేతి నిగద్యతే ॥ 38 ॥**

**ప్రతిపదార్థము** : గీతాక్షరైః = గీతమునకు యోగ్యమైన అక్షరములచేతను; యద్వా = లేక; అన్యైః అక్షరైః = మరియే అక్షరముల చేతనైనను; గణనైరపి = గణనములచేతను (లెక్కచేతను); సా లప్తిః = ఆయాలాపన; యది క్రియతే = చేయబడిన యెడల; సా = అది; సాక్షరా ఇతి = సాక్షరాలాపనయని; నిగద్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : గీతమునకు యోగ్యమైన అక్షరముచేతను, మరియే అక్షరముల చేతనైనను, గణనములచేతను (లెక్కచేతను) ఆయాలాపన చేయబడిన యెడల అది సాక్షరాలాపనయని చెప్పబడుచున్నది.

**సైవాక్షరైర్విరహితానక్షరాలప్తిరీరితా ।**
**గ్రహ త్రయ సమాయుక్తా లయత్రయసమన్వితా ॥ 39**

**ప్రతిపదార్థము** : సైవ = అదియే; అక్షరైః = అక్షరములచే; విరహితా = లేనిదైనచో; అనక్షరాలిప్తిః = అనక్షరాలిప్తియని; ఈరితా = వర్ణింపబడుచున్నది; గ్రహత్రయసమాయుక్తా = మూడు గ్రహములతో కూడినదియు; లయత్రయసమన్వితా = మూడులయలతో కూడినదియును.

**తాత్పర్యము** : అదియే అక్షరములచే లేనిదైనచో అనక్షరాలిప్తియని వర్ణింపబడుచున్నది. మూడు గ్రహములతో కూడినదియు, మూడు లయలతో కూడినదియును.

**అనుబ్జాయిసమాయుక్తా న్యాసాపన్యాసభూషితా ।**
**వికృతాంశలయోపేతా విదారియతిరిచ్చృతా ॥ 40 ॥**

**ప్రతిపదార్థము** : అనుబ్జాయి సమాయుక్తా = వంకరయైన అనునయముతో కూడినదియు, న్యాసాపన్యాసభూషితా = న్యాసము మరియు అపన్యాసములతో అలంకృతమైనదియు; వికృతాంశలయోపేతా = వికృతమైన అంశములుగల లయతో కూడినది; విదారియతిరిచ్చృతా = యతిరహితమైనదియు అయినది.

**తాత్పర్యము** : వంకరయైన అనునయముతో కూడినదియు? న్యాసము మరియు అపన్యాసములతో అలంకృతమైనదియు; వికృతమైన అంశములుగల లయతో కూడినది యతిరహితమైనదియు అయినది.

**ఏవంగుణగణోపేతా తాలపట్యాలతిర్వరా ।**
**అతాలాలప్తిరుద్దిష్టా తాలయోగవివర్జితా ॥ 41 ॥**

**ప్రతిపదార్థము** : ఏవంగుణగణోపేతా = ఇట్టి గుణసముదాయముకలది; వరా = యోగ్యమైన; తాలపట్యాలతిః స్యాత్ = సతాలాలప్తి యగును; తాలయోగవివర్జితా = తాలవివర్జితమైనది; అతాలాలప్తి ఇతి ఉద్దిష్టా = అతాలాలప్తియని ఉద్దేశింపబడినది.

**తాత్పర్యము** : ఇట్టి గుణసముదాయముకలది యోగ్యమైన సతాలాలప్తియగును. తాలవివర్జితమైనది. అతాలప్తియని చెప్పబడినది.

**ఆలప్తిసంజ్ఞకా వర్ణాశ్చత్వారోఽన్వర్థసంజ్ఞకాః ।**
**స్థాయి సంచారిణౌ చైవ తథారోహ్యవరోహణౌ ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : ఆలప్తి సంజ్ఞకాః వర్ణాః చత్వారః = ఆలప్తి సంజ్ఞకవర్ణములు నాల్గును; అన్వర్థసంజ్ఞకాః = సార్థకమైన సంజ్ఞకలవి; స్థాయిసంచారిణౌ = స్థాయి- సంచారులు; ఆరోహ్యవరోహణౌ చ = ఆరోహ, అవరోహణములును (ఈనాల్గును ఆలప్తినామక వర్ణములు అన్వర్థములు).

**తాత్పర్యము** : అలప్తి సంజ్ఞకవర్ణములు నాల్గును సార్థకమైన సంజ్ఞకలవి. స్థాయి-సంచారులు ఆరోహ, అవరోహణములు (ఈనాల్గును ఆలప్తినామకవర్ణములు అన్వర్థములు).

**ఏకస్వరూపదేశీతి స్థాయివర్ణోఽభిధీయతే ।**
**సంచారీ స్వరసంచారావన్వర్థా వితరావపి ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : ఏకస్వరూపదేశీ ఇతి = ఏకస్వరూపదేశిగా; స్థాయివర్ణః అభిధీయతే= స్థాయివర్ణము చెప్పబడినది; స్వరసంచారా = స్వరసంచారముకలది; సంచారీ = సంచారి వర్ణము; ఇతరౌ అపి = ఆరోహఅవరోహణములుకూడా; అన్వర్థౌ = సార్థకములు.

**తాత్పర్యము** : ఏకస్వరూపదేశిగా స్థాయివర్ణము చెప్పబడినది. స్వరసంచారముకలది సంచారి వర్ణము. ఆరోహఅవరోహణములుకూడా సార్థకములు.

వర్ణాశ్రయాస్తు విజ్ఞేయా హ్యలంకారాస్త్రయోదశ ।
నామతో రూపతశ్చైవ సంక్షేపేణ బ్రవీమి తాన్ ॥ **44** ॥

**ప్రతిపదార్థము** : వర్ణాశ్రయాః = వర్ణములనాశ్రయించినవిగా; అలంకారాః = అలంకారములు; త్రయోదశ ఇతి విజ్ఞేయాః = పదమూడు అనితెలియదగినవి; తాన్= వాటిని; నామతః = నామములచేతను; రూపతః = స్వరూపములచేతను; సంక్షేపేణ = సంగ్రహముగా; బ్రవీమి = చెప్పుచున్నాను.

**తాత్పర్యము** : వర్ణములనాశ్రయించినవిగా అలంకారములు పదమూడు అనితెలియదగినవి. వాటిని నామములచేతను స్వరూపములచేతను సంగ్రహముగా చెప్పుచున్నాను.

**ప్రసన్నం పూర్వముచ్చార్య శనైః సందీపయేత్ స్వరమ్ ।**
**ప్రసన్నాది ర్భవేదేవం ప్రసన్నాంతో విలోమతః ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : పూర్వం = ముందు; ప్రసన్నం ఉచ్చార్య = ప్రసన్నవర్ణమునుచ్చరించి; శనైః = మెల్లగా; స్వరం సందీపయేత్ = స్వరమును ప్రకాశింపజేయవలెను (వృద్ధిచేయవలెను); ఏవం = ఇట్లు చేసిన; ప్రసన్నాదిః భవేత్ = ప్రసన్నాది వర్ణమగును; విలోమతః = విలోమమయిన యెడల; ప్రసన్నాంతో భవేత్ = ప్రసన్నాంతవర్ణమగును.

**తాత్పర్యము** : ముందు ప్రసన్నవర్ణమునుచ్చరించి మెల్లగా స్వరమును ప్రకాశింపజేయ వలెను (వృద్ధిచేయవలెను). ఇట్లుచేసిన ప్రసన్నాదివర్ణమగును. విలోమమయిన యెడల ప్రసన్నాంతవర్ణమగును.

**ఏవం ప్రసన్నమధ్యశ్చ ప్రసన్నాద్యంత ఏవ చ ।**
**ఏతే స్థాయి న్యలంకారా శ్చత్వారః పరికీర్తితాః ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : ఏవం =ఇట్లే; ప్రసన్నమధ్యః = ప్రసన్నమధ్యము; ప్రసన్నాద్యంతశ్చ = ప్రసన్నాద్యంతమును; ఏతే అలంకారాః = ఈ అలంకారములు; చత్వారః = నాల్గును; స్థాయిని పరికీర్తితాః = స్థాయియందు చెప్పబడినవి.

**తాత్పర్యము** : ఇట్లే ప్రసన్నమధ్యము ప్రసన్నాద్యంతమును ఈ అలంకారములు నాల్గును స్థాయియందు చెప్పబడినవి.

**స్వశ్రుతిస్థానసంభూతాం ఛాయాం శ్రుత్యంతరాశ్రయామ్ ।**
**స్వరో యద్గమయే ద్గీతే గమకోఽసౌ నిరూపితః ॥ 47 ॥**

**ప్రతిపదార్థము** : స్వశ్రుతిస్థానసంభూతాం = స్వశ్రుతిస్థానమందు జనించిన; శ్రుత్యంతరాశ్రయాం యత్ ఛాయాం = వేరొక శ్రుతినాశ్రయించిన ఏఛాయను; స్వరః =

స్వరము; గీతే = గీతమందు; గమయేత్ = పొందించునో; (పలికించునో); అసౌ గమకః నిరూపితః = ఆ గమకము నిరూపింపబడుచున్నది.

**తాత్పర్యము** : స్వశ్రుతిస్థానమందుజనించిన వేరొక శ్రుతినాశ్రయించిన ఏఛాయను స్వరము గీతమందు పొందించునో (పలికించునో) ఆ గమకము నిరూపింపబడుచున్నది.

**స్ఫురితః కంపితో లీన స్తిరిపు శ్చాహతస్తథా ।**
**ఆందోలిత స్త్రిభిన్నశ్చ గమకాః సప్త కీర్తితాః ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : స్ఫురితః = స్ఫురితము; కంపితః =కంపితము; లీనః = లీనము; తిరిపుః = తిరిపువు; ఆహతః = అహతము; ఆందోళితః = ఆందోళితము; త్రిభిన్నశ్చ= త్రిభిన్నమును అని; గమకాః = గమకములు; సప్త కీర్తితాః = ఏడుగా చెప్పబడినవి.

**తాత్పర్యము** : స్ఫురితము, కంపితము, లీనము, తిరుపువు, ఆహతము, ఆందోళితము, త్రిభిన్నమును అని గమకములు ఏడుగా చెప్పబడినవి.

**ఆరోహక్రమతో యత్ర స్ఫురంతి శ్రుతయః క్రమాత్ ।**
**అనుద్రుతాయ వేగేన తమాహుః స్ఫురితం బుధాః ॥ 49 ॥**

**ప్రతిపదార్థము** : అనుద్రుతాయ = అనుద్రుతముకొఱకు; వేగేన = వేగముచేతను; యత్ర = ఎక్కడ; క్రమాత్ = క్రమముగా; ఆరోహక్రమతః = ఆరోహక్రమముగా; శ్రుతయః స్ఫురంతి = శ్రుతులు స్ఫురించునో; తం = దానిని; స్ఫురితం = స్ఫురితముగా; బుధాః వదంతి = పండితులు చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : అనుద్రుతముకొఱకు వేగముచేతను ఎక్కడ క్రమముగా ఆరోహక్రమముగా శ్రుతులు స్ఫురించునో దానిని స్ఫురితముగా పండితులు చెప్పుచున్నారు.

**స్వరకంపో భవే ద్యత్ర ద్రుతద్విగుణవేగతః ।**
**కంపితో నామ గమకః స విజ్ఞేయో మనీషిభిః ॥ 50 ॥**

**ప్రతిపదార్థము** : ద్రుతద్విగుణవేగః = ద్రుతముకంటె రెండురెట్లు వేగముగా; యత్ర = ఎక్కడ; స్వరకంపః భవేత్ = స్వరకంపము జరుగునో; సః = అది; కంపితః నామ = కంపితమను; గమకః ఇతి = గమకముగా; మనీషిభిః =పండితులచే; విజ్ఞేయః = తెలియదగినది.

**తాత్పర్యము** : ద్రుతముకంటె రెండురెట్లు వేగముగా ఎక్కడ స్వరకంపము జరుగునో అది కంపితమను గమకముగా పండితులచే తెలియదగినది.

> **ద్రుతమానేన మసృణః స్వరో యత్ర విలీయతే ।**
> **స్వరాంతరక్రమేణైవ స భవే ల్లీనసంజ్ఞకః ॥ 51 ॥**

**ప్రతిపదార్థము** : ద్రుతమానేన = శీఘ్రగమనముచేతనే; మసృణః స్వరః = అందమైన స్వరము; స్వరాంతరక్రమేణైవ = స్వరాంతర క్రమముగనే; యత్ర = ఎక్కడ; విలీయతే= లీనమగునో; సః = ఆ గమకము; లీనసంజ్ఞకః = లీనమను పేరుగలదియగును.

**తాత్పర్యము** : శీఘ్రగమనముచేతనే అందమైన స్వరము స్వరాంతరక్రమముగనే ఎక్కడ లీనమగునో అగమకము లీనమను పేరుగలదియగును.

> **శ్రుతయో యత్ర వేగేన భ్రమం త్యావర్తరూపవత్ ।**
> **తమాహు స్తిరుపుం నామ్నా గమకం గీతవేదినః ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; శ్రుతయః = శ్రుతులు; ఆవర్తరూపవత్ = ఆవర్త (సుడి) రూపముగా; వేగేన భ్రమంతి =వేగముగా భ్రమించునో (తిరుగునో); తం = దానిని; గీతవేదినః = సంగీతజ్ఞులు; తిరుపుంనామ్నా = తిరుపువు అను గమకం ఆహుః= గమకమని చెప్పిరి.

**తాత్పర్యము** : ఎక్కడ శ్రుతులు ఆవర్త(సుడి) రూపముగా వేగముగా భ్రమించునో (తిరుగునో) దానిని సంగీతజ్ఞులు తిరుపు అను గమకముగా (చెప్పిరి).

> **స్వరః ప్రవర్తతే యత్ర సమాహత్యాగ్రహం స్వరమ్ ।**
> **ఆరోహక్రమతః సోఽయమాహతః పరికీర్తితః ॥ 53 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; అగ్రహంస్వరం = అగ్రహమైన స్వరము; ఆరోహక్రమతః = ఆరోహక్రమముగా; సమాహత్య = కూర్చి (నొక్కి); ప్రవర్తతే = ప్రవర్తించునో; (పలుకబడునో); సః అయం స్వరః = ఆ స్వరము; ఆహతః పరికీర్తితః = ఆహతగమకముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఎక్కడ అగ్రహమైన స్వరము ఆరోహక్రమముగా కూర్చి (నొక్కి) ప్రవర్తించునో (పలుకబడునో)ఆ స్వరమును ఆహతగమకముగా చెప్పబడుచున్నది.

**ఆందోలనం భవేద్యత్ర స్వరాణాం లఘుమానతః ।**
**ఆందోలితాఖ్యం గమకం గీతజ్ఞాస్తం ప్రచక్షతే ॥ 54 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; స్వరాణాం = స్వరములకు; లఘుమానతః = లఘుప్రమాణముచే; ఆందోలనం భవేత్ = ఆందోలనమగునో; తం =దానిని; గీతజ్ఞా= సంగీతాభిజ్ఞులు; ఆందోలితాఖ్యం గమకం ప్రచక్షతే = ఆందోలిత మను గమకముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : ఎక్కడ స్వరములకు లఘుప్రమాణముచే ఆందోలనమగునో దానిని సంగీతాభిజ్ఞులు ఆందోలితమను గమకముగా చెప్పుచున్నారు.

**స్థానకత్రయసంస్పర్శీ తత్తత్స్థానగుణై ర్యుతః ।**
**అవిశ్రాంతస్వరోపేత స్త్రిభిన్నగమకః స్మృతః ॥ 55 ॥**

**ప్రతిపదార్థము** : స్థానకత్రయసంస్పర్శీ = త్రిస్థానములను స్పృశించునదియు; తత్తత్స్థానగుణైః యుతః = ఆయాస్థానగుణములు కలదియు; అవిశ్రాంత స్వరోపేతః = విశ్రాంతిలేని స్వరములతో కూడినదియు (సాంద్రస్వరయుతము); త్రిభిన్నగమకః స్మృతః = త్రిభిన్నగమకముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : త్రిస్థానములను స్పృశించునదియు ఆయాస్థానగుణములుకలదియు, విశ్రాంతిలేని స్వరములతో కూడినదియు (సాంద్రస్వరయుతము) త్రిభిన్నగమకముగా చెప్పబడినది.

**ఇతి సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే**
**సంగీత సమయసారే ప్రథమమధికరణమ్ ॥**

## అథ సంగీతసమయసారే
## ద్వితీయమధికరణమ్

**భాండీకభాషయోద్దిష్టా భోజసోమేశ్వరాదిభిః ।**
**గేయలక్షణతః కేచిత్ వక్ష్యంతే లక్ష్యసంభవాః ॥ 1 ॥**

ప్రతిపదార్థము : గేయలక్షణతః = కొన్నిలక్షణములను (లక్ష్యములననుసరించి

లక్షణములను); భోజసోమేశ్వరాదిభిః = భోజ, సోమేశ్వరాదులచే; భాండీకభాషయా = గీర్వాణ భాష ద్వారా; ఉద్దిష్టాః = ఉద్దేశింపబడినవి; (అవి); వక్ష్యంతే = చెప్పబడుచున్నవి;

అథాలప్తిర్ద్విధా - రాగాలప్తికా తాలాలప్తిశ్చ । తత్ర రాగాలప్తిః కథ్యతే -

అథాలప్తిః ద్విధా = తరువాత ఆలప్తి రెండువిధములు; రాగాలప్తికా = రాగాలాపమనియు; తాలాలప్తిశ్చ = తాలాలాపమనియు; తత్ర = అందు; రాగాలప్తిః కథ్యతే = రాగాలాపము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** కొన్ని లక్షణములను (లక్ష్యములననుసరించి లక్షణములను) భోజ, సోమేశ్వరాదులచే గీర్వాణభాషద్వారా ఉద్దేశింపబడినవి. చెప్పబడుచున్నవి. తరువాత ఆలాపమురెండువిధములు, రాగాలాపమనియు, తాలాలాపమనియు, అందు రాగాలాపము చెప్పబడుచున్నది.

**స్వస్థానే ప్రథమే కుర్యాత్ స్వరా పాపాడికః పరమ్ ।**
**రాగాకార మపస్థానే వాత్సురాగోత్థఉచ్యతే ॥ 2 ॥**

**ప్రతిపదార్థము :** ప్రథమే = ముందుగా; స్వస్థానే = స్వస్థానమందు; స్వరాః = స్వరములు; (పరం -పూర్వాపరములుగా) పాపాడికః = పాపాడికము; కుర్యాత్ = చేయవలెను; అపస్థానే = అపస్థానమందు; రాగాకారం = రాగాకారము; వాత్ = వాయువునుండి; సురాగోత్థః ఉచ్యతే = సురాగము జనితమగునదిగా ఛాయాంతరముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ముందుగా స్వస్థానమందు స్వరములు (పూర్వాపరములుగా) పాపాడికము చేయవలెను. అపస్థానమందు రాగాకారము వాయువునుండి సురాగముజనితమగునదిగా ఛాయాంతరముగా చెప్పబడుచున్నది.

**యస్య వంశధ్వనౌ స్నిగ్ధే సమీచీ రక్తిరూర్జితా ।**
**వాంశికం గీతతత్త్వజ్ఞాః సురాగం కథయంతి తమ్ ॥ 3 ॥**

**ప్రతిపదార్థము :** స్నిగ్ధేవంశధ్వనౌ = మనోహరమైన వేణుధ్వనియందు; యస్య గీతస్య= ఏగీతమునకు; సమీచీ రక్తిః = యోగ్యమైన రక్తి; ఊర్జితా = ప్రకాశించునో; తం=దానిని; గీతతత్త్వజ్ఞాః = సంగీతజ్ఞులు; వాంశికం సురాగం కథయంతి = వాంశికసురాగముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : మనోహరమైన వేణుధ్వనియందు ఏగీతమునకు యోగ్యమైన రక్తి ప్రకాశించునో దానిని సంగీతజ్ఞులు వాంశికసురాగముగా చెప్పుచున్నారు.

**దిగ్ధం వాసో రక్తపీతాదిరాగైః ధ్యాన స్తద్వ చ్చిత్రరాగశ్చ కశ్చిత్ ।**
**గానే తజ్ఞా యేఽపరం శ్లాఘమానా స్తేషా మేషః స్వానుభూతిప్రసిద్ధః ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : ధ్యానః = ధ్వని; రక్తపీతాదిరాగైః = రక్తపీతాదిరాగములచే; దిగ్ధంవాసః = సర్వత్ర వ్యాపించిఉండునది; తద్వత్ = అట్లే; సః రాగః = ఆరాగము; కశ్చిత్ చిత్రరాగః = ఒకానొక చిత్రరాగము; గానే = గానమందు; తజ్ఞా యే = సంగీతజ్ఞులైనవారెవరైతే; పరం = గొప్పదానినిగా; శ్లాఘమానాః = శ్లాఘించుచున్న వారో; తేషాం = వారికి; ఏషః = ఈచిత్రరాగము; స్వానుభూతిప్రసిద్ధః = తమ అనుభూతిచేతనే ప్రసిద్ధమైనది, వాసః = వస్త్రము, (యధా=ఎట్లు), రక్తపీతాది రాగైః = ఎరుపు పసుపురంగులతో, దిగ్ధం = పూయబడియుండునో, తద్వత్ = అట్లే, ధ్యానః = ధ్వనిరూపమైన, చిత్రరాగము, కశ్చత్ = ఒకటియున్నది.

**తాత్పర్యము** : ధ్వని రక్తపీతాదిరాగములచే సర్వత్ర వ్యాపించిఉండునది. అట్లే ఆరాగము గానమందు ఒకానొకచిత్రరాగము సంగీతజ్ఞులైనవారు మరియొకదానిని దీనినిగొప్పగా శ్లాఘించుచున్నవారో వారికి ఈచిత్రరాగము తమ అనుభూతిచేతనే ప్రసిద్ధమైనది.

**యస్మిన్ స్వరే స్థాయిని చారురాగః స్వస్థానకం తత్ క్రియతే సుఖేన ।**
**అపస్థితిః సౌఖ్యవిపర్యయేణ ఛాయాంతరా స్తత్ర భవంతి రాగే ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : యస్మిన్ స్థాయిని స్వరే = యేస్థాయిస్వరమందు; సుఖేన = సుఖముగా; స్వస్థానకం క్రియతే = స్వస్థానకముగాచేయబడునో; తత్ =అది; చారురాగః = సురాగము; సౌఖ్యవిపర్యయేణ = సౌఖ్యేతరముగా; కుదురు కొననిస్థితిః = నుండుస్థితి; తత్ర రాగే = ఆరాగమందు; స్యాత్ చేత్ = ఉన్నయెడల; ఛాయంతరాః భవంతి = ఛాయాంతరములగుచున్నవి.

**తాత్పర్యము** : యేస్థాయిస్వరమందు రాగము సుఖముగా స్వస్థానకముగాచేయబడునో అది సురాగము. సౌఖ్యేతరముగా నుండుస్థితి ఆరాగమందు ఉన్నయెడల ఛాయాంతర ములగుచున్నవి.

**సప్తస్వరాణాం మధ్యేఽపి స్వరే యస్మిన్ సురాగతాః ।**
**స జీవస్వర ఇత్యుక్తే అంశోవాదీ చ కథ్యతే ॥ 6 ॥**

**ప్రతిపదార్థము :** సప్తస్వరాణాం మధ్యేఅపి = సప్తస్వరములలోకూడా; యస్మిన్ స్వరే = ఏస్వరమందు; సురాగతా = సురాగత్వముం (చారుత్వము)డునో; సః = అది; జీవస్వరః ఇతిఉక్తే =జీవస్వరమని చెప్పబడగా; అంశః = దాని విభాగము (విషయము); వాదీ కథ్యతే = వాదిస్వరమనిచెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** సప్తస్వరములలోకూడా ఏస్వరమందు సురాగత్వముం (చారుత్వము)డునో అది జీవస్వరమని చెప్పబడగా దాని విభాగము (విషయము) వాదిస్వరమనిచెప్పబడు చున్నది.

**జీవస్వరస్య సదృశః సంవాదీ స్వర ఉచ్యతే ।**
**వివాదీ స్యాత్ విసదృశః సోఽనువాదీ ద్వయాత్మకః ॥ 7 ॥**

**ప్రతిపదార్థము :** జీవస్వరస్య సదృశః = జీవస్వరమునకు సమానమైనది; సంవాదీ స్వరః ఉచ్యతే = సంవాదిస్వరముగా చెప్పబడుచున్నది; విసదృశః = సమానముకానిది; వివాదీ స్వరః స్యాత్ = వివాదిస్వరమగును; ద్వయాత్మకః సః = ఆరెండు విధముల గుణములను పొందినది; అనువాదీ స్యాత్ = అనువాదిస్వరమగును.

**తాత్పర్యము :** జీవస్వరమునకు సమానమైనది సంవాదిస్వరముగా చెప్పబడుచున్నది. సమానముకానిది వివాదిస్వరమగును. ఆరెండు విధముల గుణములను పొందినది అనువాది స్వరమగును.

**అనువాదీ సంవాదీ జీవస్వరకేకలా బహిః ।**
**బహుతమ బహుతరబహవః కార్యా రాగా విలౌల్యేన ॥ 8 ॥**

**ప్రతిపదార్థము :** అనువాదీ, సంవాదీ, జీవస్వరకే = అనువాది సంవాది స్వరములయందు; కలా= తాళాశ్రయమై (అవ్యక్తమధురముగా); బహిః = ప్రకటముగా; విలౌల్యేన= విభేదమునసరించి; బహుతమ, బహుతర, బహవః = అధికాధిక, అధికవృద్ధి, వృద్ధిగా; రాగాః కార్యాః = రాగములు చేయదగినవి (నిర్మించదగినవి).

**తాత్పర్యము :** అనువాది సంవాది స్వరములయందు తాళాశ్రయమైన (అవ్యక్త మధురముగా) నుండు విభేదమునసరించి అధికాధిక, అధికవృద్ధి, వృద్ధిగా రాగములుచేయదగినవి (నిర్మించదగినవి).

**విజానతా వివాదీ స స్వల్పః కార్యోఽథవా పునః ।**
**ప్రచ్ఛాదనీయో లోప్యో వా మనాక్ స్పర్శః స్వరస్య యః ॥ 9 ॥**

**ప్రతిపదార్థము :** యః స్వరస్య స్పర్శః = ఏస్వరముయొక్క స్పర్శము; స్వల్పః కార్యః = స్వల్పముచేయదగినదో; అథవా =లేక; పునః = మరల; ప్రచ్ఛాదనీయః = ఆచ్ఛాదింపదగినదో; వా = లేక; లోప్యః = లోపింపచేయదగినదో; సః = ఆస్వరము; వివాదీ విజానతా = వివాదిగా నెఱుగునది.

**తాత్పర్యము :** ఏస్వరముయొక్క స్పర్శము స్వల్పముచేయదగినదో లేక మరల ఆచ్ఛాదింపదగినదో లేక లోపింపచేయదగినదో ఆస్వరము వివాదిగా నెఱుగునది.

> **ప్రచ్ఛాదనం తదేవాహుః లోపః సర్వస్య నిష్కృతిః ।**
> **ఆదౌ యస్మిన్ స్వరే రాగ శ్చాల్యతే స గ్రహః స్మృతః ॥ 10 ॥**

**ప్రతిపదార్థము :** యః లోపః = ఏలోపము; సర్వస్య నిష్కృతిః = సమస్తమునకు పరిష్కారమో; తత్ ఏవ = దానినే; ప్రచ్ఛాదనం ఆహుః = ప్రచ్ఛాదనమని అందురు; ఆదౌ = ముందు; యస్మిన్ స్వరే = ఏస్వరమందు; రాగః చాల్యతే = రాగము ప్రవర్తింపబడునో; సః =అది; గ్రహః స్మృతః = గ్రహముగా తలవబడుచున్నది.

**తాత్పర్యము :** ఏలోపము సమస్తమునకు పరిష్కారమో దానినే ప్రచ్ఛాదనమని అందురు. ముందు ఏస్వరమందు రాగముప్రవర్తించబడునో అది గ్రహముగా తలవబడుచున్నది.

> **చాలయిత్వా స్వరే యస్మిన్ సన్న్యాస ఉపవేశ్యతే ।**
> **అపన్యాసః స విజ్ఞేయో గీతలక్షణవేదిభిః ॥ 11 ॥**

**ప్రతిపదార్థము :** చాలయిత్వా = గానముచేసిన; యస్మిన్ స్వరే = ఏస్వరమందు; సన్న్యాసః ఉపవేశ్యతే = న్యాసము ప్రవేశపెట్టబడునో (విరమింప జేయునో); సః = అది; అపన్యాసః ఇతి =అపన్యాసమని; గీతలక్షణవేదిభిః = సంగీతజ్ఞులచే; విజ్ఞేయః = తెలియదగినది.

**తాత్పర్యము :** గానముచేసిన ఏస్వరమందు న్యాసముప్రవేశపెట్టబడునో (విరమింప జేయునో) అది అపన్యాసమని సంగీతజ్ఞులచే తెలియదగినది.

> **అవయవా అవయవో యస్మిన్ స్వరే యద్యుపవేశ్యతే ।**
> **సన్న్యాసః కథితో గానవిద్యాతత్త్వవిచక్షణైః ॥ 12 ॥**

**ప్రతిపదార్థము :** అవయవా అవయవః = అవయవయములు, అవయవము; యస్మిన్ స్వరే = ఏస్వరమందు; యదిఉపవేశ్యతే = సమమోర్చినయెడల; గానవిద్యాతత్త్వ విచక్షణైః=

గాన కోవిదులచే; సః సన్యాసః కథితః = అది న్యాసముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : అవయవయములు, అవయవము ఏస్వరమందు అది సమకూర్చిన యెడల గానకోవిదులచే న్యాసముగా చెప్పబడుచున్నది.

**స మంద్రః సుతరాం లభ్యో రాగో యో మంద్రసప్తకే ।**
**యస్తారసప్తకే రాగః స్వరే తార ఉదాహృతః ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : యః రాగః = ఏరాగము; మంద్రసప్తకే = మంద్రసప్తకమందు; సుతరాం= అత్యంతము; లభ్యః =పొందదగినదో; సః మంద్రః =అది మంద్రస్వరము; తారసప్తకే స్వరే = తారసప్తకస్వరమందు; యః రాగః లభ్యః = ఏరాగము లభ్యమగునో; సః తారః ఉదాహృతః = అది తారస్వరముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏరాగము మంద్రసప్తకమందు అత్యంతము పొందదగినదో అది మంద్రస్వరము. తారసప్తకస్వరమందు ఏరాగము లభ్యమగునో అది తారస్వరముగా చెప్పబడినది.

**ఉక్తః షాడవ ఏకస్మిన్ స్వరే లుప్తే వివాదిని ।**
**వివాదిని స్వరద్వంద్వే లుప్తే త్వౌడవ ఇష్యతే ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : వివాదిని = వివాదిస్వరమందు; ఏకస్మిన్ స్వరే లుప్తే = ఒక స్వరములోపించిన యెడల; షాడవః ఉక్తః = షాడవతానమగును; వివాదిని స్వరద్వంద్వే లుప్తే తు = వివాదియందు రెండు స్వరములులోపించినయెడల; ఔడవః ఇష్యతే = ఔడవతానమగుచున్నది.

**తాత్పర్యము** : వివాదిస్వరమందు ఒక స్వరములోపించినయెడల షాడవతానమగును. వివాదియందు రెండు స్వరములు లోపించినయెడల ఔడవతానముగుచున్నది.

**వంశే న్యాసస్వరం పూర్వం స్థాయినం రచయేత్ తతః ।**
**తత్ర స్థాయిని రాగస్యారోపణం రాగవక్త్రకమ్ ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : వంశే = వేణువునందు; పూర్వం = ముందు; న్యాసస్వరం = న్యాసస్వరమును; తతః = తరువాత; స్థాయినం రచయేత్ = స్థాయిస్వరమును రచించవలెను; తత్ర స్థాయిని = ఆస్థాయియందు; రాగస్య ఆరోపణం = రాగారోపణము; రాగవక్త్రకమ్ = రాగవక్త్రకమగును.

**తాత్పర్యము** : వేణువునందు ముందు న్యాసస్వరము తరువాత స్థాయిస్వరమును రచించవలెను. ఆస్థాయియందు రాగారోపణము రాగవక్రకమగును.

**స్థాయిన ఉపరి ద్వ్యర్ధాదయః కస్మిన్నపి స్వరే ।**
**చాలయిత్వా పునారాగం స్థాయిన్యోపవేశయేత్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : స్థాయినః ఉపరి = స్థాయిపై; కస్మిన్నపి స్వరే = ఏదోఒక స్వరమందు; ద్వ్యర్ధాదయః చాలయిత్వా = ద్వ్యర్ధాదులు ప్రవర్తింపజేసి; పునః = మరల; రాగం = రాగమును; స్థాయిని ఏవ = స్థాయియందే; ఉపవేశయేత్ = ప్రవేశపెట్టవలెను; తదేవ ప్రథమస్వస్థానం ఆలప్తేః = అదే ఆలాపముయొక్క ప్రథమస్వస్థానము.

**తాత్పర్యము** : స్థాయిపై ఏదోఒకస్వరమందు ద్వ్యర్ధాదులు ప్రవర్తింపజేసి మరల రాగము ను స్థాయియందే ప్రవేశపెట్టవలెను. అదే ఆలాపముయొక్క ప్రథమస్వస్థానము.

**అన్యాసం ద్వ్యర్థమారభ్య చాలయిత్వా తు రాగకమ్ ।**
**కుర్యాద్ ద్వితీయస్వస్థానం గానలక్షణకోవిదః ॥ 17 ॥**

**ప్రతిపదార్థము** : గానలక్షణకోవిదః = సంగీతవేత్త; ద్వ్యర్థమారభ్య = గుణైకత్వమును ప్రారంభించి; రాగకం చాలయిత్వా = రాగమును ప్రస్తరించి; అన్యాసం = అపన్యాసముగా; ద్వితీయస్వస్థానం కుర్యాత్ = రెండవస్వస్థానమును చేయవలెను.

**తాత్పర్యము** : సంగీతవేత్త గుణైకత్వమును ప్రారంభించి రాగమునుప్రస్తావించి అపన్యాసముగా రెండవస్వస్థానమును చేయవలెను.

**స్వరస్య స్థాయినో యస్య ద్వ్యర్థస్తుర్య స్వరః స్మృతః ।**
**స ఏవ దేవతాయేతి తజ్జైస్తు వ్యపదిశ్యతే ॥ 18 ॥**

**ప్రతిపదార్థము** : యస్య స్థాయినః స్వరస్య = ఏస్థాయిస్వరముయొక్క; ద్వ్యర్థః = ఏకగుణము; తుర్యస్వరః స్మృతః = నాల్గవస్వరముగా చెప్పబడుచున్నదో; స ఏవ = అదియే; దేవతాయేతి = దేవతాయయని; తజ్జైః = సంగీతవిద్వాంసులచే; వ్యపదిశ్యతే= నిర్థేశింపబడినది; ద్విగుణస్యఅర్ధః ద్వర్ధః ఇతి వ్యుత్పత్తిః = ద్విగుణముయొక్క సగము అని వ్యుత్పత్తి.

**తాత్పర్యము** : ఏస్థాయిస్వరముయొక్క ఏకగుణము నాల్గవస్వరముగా చెప్పడుచున్నదో అదియే దేవతాయయని సంగీతవిద్వాంసులచే నిర్దేశింపబడినది. ద్వ్యర్థః అనుదానికి ద్విగుణముయొక్క సగము అనివ్యుత్పత్తి.

**అర్ధ స్థితే చాలయిత్వా రాగం కస్మిన్నపి స్వరే ।**
**కుర్యాత్ తృతీయస్వస్థానన్యాసాంతం గాయకోత్తమః ॥ 19 ॥**

**ప్రతిపదార్థము** : అర్ధస్థితే కస్మిన్నపి స్వరే = అర్ధస్థితియందున్న ఒకానొకస్వరమందు; రాగం చాలయిత్వా = రాగమును ప్రస్తరించి; గాయకోత్తమః = ఉత్తమగాయకుడు; తృతీయస్వస్థానన్యాసాంతం =. మూడవ స్వస్థానన్యాసాంతమును; కుర్యాత్ = చేయవలెను.

**తాత్పర్యము** : అర్ధస్థితియందున్న ఒకానొకస్వరమందు రాగమునుప్రస్తరించి ఉత్తమగాయకుడు మూడవస్వస్థానన్యాసాంతమును చేయవలెను.

**ద్వ్యర్థ ద్విగుణయో ర్మధ్యే స్వరయో ర్యే స్థితాః స్వరాః ।**
**అర్ధస్థితా స్త ఏకోక్తా అర్ధనీయా ఇతి స్ఫుటాః ॥ 20 ॥**

**ప్రతిపదార్థము** : ద్వ్యర్ధద్విగుణయోః స్వరయోః మధ్యే = ద్వ్యర్ధద్విగుణస్వరములలో; స్థితాః యే స్వరాః = ఉన్న యే స్వరములో; తే ఏవ = అవియే; అర్ధనీయాః ఇతిస్ఫుటాః = అర్ధనీయములని స్పష్టములైన; అర్ధస్థితాః ఉక్తాః = అర్ధస్థితములుగా చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : ద్వ్యర్ధద్విగుణస్వరములలో ఉన్న స్వరములేవో అవియే అర్ధనీయములను స్పష్టములైన అర్ధస్థితములుగా చెప్పబడుచున్నవి.

**ద్విగుణస్థాయిపర్యంతం చాలయిత్వా తు రాగకః ।**
**న్యాసస్వరోపవేశేన స్వస్థానం స్యాచ్చర్థకమ్ ॥ 21 ॥**

**ప్రతిపదార్థము** : ద్విగుణస్థాయిపర్యంతం = ద్విగుణస్థాయివరకు; రాగకం చాలయిత్వా= రాగమును నడిపించి; న్యాసస్వరోపవేశేన = న్యాసస్వరమును ప్రవేశపెట్టుటచే; స్వస్థానం= స్వస్థానసంబంధమైన; చ్చర్థకం స్యాత్ = చ్చర్థకముఅగును.

**తాత్పర్యము** : ద్విగుణస్థాయివరకు రాగమును నడిపించి న్యాసస్వరమును ప్రవేశపెట్టుటచే స్వస్థానసంబంధమైన చ్చర్థకమగును.

**మంద్రసప్తక మేవైత ద్విగుణా న్మధ్యసప్తకే ।**
**తన్మధ్యసప్తకం తారే ద్విగుణం స్యా ద్యథాక్రమమ్ ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : ద్విగుణాత్ = ద్విగుణత్వమువలన; మధ్యసప్తకే = మధ్యసప్తకమందు;

ఏతత్ మంద్రసప్తకమేవ = ఇది మంద్రసప్తకమే; తత్ మధ్యసప్తకం = ఈమధ్యసప్తకము; తారే = తారస్వరమందు; యథాక్రమం = క్రమముగా; ద్విగుణం స్యాత్ = ద్విగుణితమగును.

**తాత్పర్యము** : ద్విగుణత్వమువలన మధ్యసప్తకమందు ఇదిమంద్రసప్తకమే. ఈమధ్య సప్తకము తారస్వరమందు క్రమముగా ద్విగుణితమగును.

**స్థానాని ప్రస్రుతై స్త్రీణి స్వరైః కుర్యాత్ తురీయకమ్ ।**

**స్థానం సమగ్రశబ్దేన సారూఢి రచయేత్ పునః ॥ 23 ॥**

**ప్రతిపదార్థము** : ప్రస్రుతైః స్వరైః = ప్రస్రుతములైన స్వరములచే; త్రీణి స్థానాని = మూడు స్థానములను; (కలది) తురీయకం కుర్యాత్ = నాల్గవ స్థానమును చేయవలెను; పునః = మరల; తత్ స్థానం = ఆస్థానము; సమగ్ర శబ్దేన = సమగ్రశబ్దముచే; సారూఢి రచయేత్ = ఆరూఢిసహితముగా రచించవలెను.

**తాత్పర్యము** : ప్రస్రుతములైన స్వరములచే మూడుస్థానములను(కలది) నాల్గవస్థాన మునుచేయవలెను. మరలఆస్థానము సమగ్రశబ్దముచే ఆరూఢిసహితముగా రచించ వలెను.

**తంత్రై ర్వలవహిణీత్యా ? మారూఢిరభిధీయతే ।**
**చతుస్స్వస్థానకైః శుద్ధరాగస్యాకార ఈరితః ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : వలవహణీత్యాం = వలవహణియందు; తంత్రైః = తంత్రములచే; ఆరూఢిః అభియతే = ఆరూఢిచెప్పబడినది; చతుస్స్వస్థానకైః = చతుఃస్వస్థానములచే; శుద్ధరాగస్య ఆకారః ఈరితః= శుద్ధరాగస్వరూపము చెప్పబడినది.

**తాత్పర్యము** : వలవహణియందు తంత్రములచే ఆరూఢిచెప్పబడినది. చతుః స్వస్థానములచే శుద్ధరాగస్వరూపముచెప్పబడినది.

**స్థానే స్థానే స్వరాన్ సమ్యక్ స్థాపయన్ విబుధఃక్రమాత్ ।**
**జీవస్వరప్రధానైశ్చ న్యాసాంతైర్బహుధాకృతైః ॥ 25 ॥**

**ప్రతిపదార్థము** : విబుధః = పండితుడు, స్థానే స్థానే = ప్రతిస్థానమునందును; స్వరాన్= స్వరములను; సమ్యక్ = బాగుగ; క్రమాత్ = క్రమముగా; స్థాపయన్ = ప్రస్తారము చేయుచున్నవాడై; బహుధాకృతైః న్యాసాంతైః = అనేకములుగా చేయబడిన న్యాసాంత స్వరములచేతను, జీవస్వర ప్రధానైశ్చ = జీవస్వరములతో ప్రాముఖ్యము నొందిన;

**తాత్పర్యము** : సంగీత విద్వాంసుడు ప్రతిస్థానమునందును స్వరములనుబాగగుగా క్రమముగా స్వరములచేతను అనేకములుగా చేయబడినన్యాసాంతస్వరములచేతను, ప్రస్తారము చేయుచున్న వాడై జీవనస్వరములతో ప్రాధాన్యమునొందిన;

**ప్రసన్నైఃశుద్ధరాగస్య స్థాయిని స్థాపనోచ్యతే ।**
**ఇత్థం రాగం స్థిరీకృత్యారోపయేద్వంశికోత్తమః ॥ 26 ॥**

**ప్రతిపదార్థము** : ప్రసన్నైః = ప్రసన్నస్వరములచేతను; శుద్ధరాగస్య స్థాయిని = శుద్ధరాగము యొక్కస్థాయి యందు; స్థాపనా ఉచ్యతే = స్థాపనగా చెప్పబడుచున్నది; ఇత్థం = ఈవిధముగా; రాగం స్థిరీకృత్య = రాగమును స్థిరీకరించి; వంశికోత్తమః ఆరోపయేత్ = వేణువాదకుడు ఆరోపించవలెను.

తాత్పర్యము : ప్రసన్నస్వరములచేతను శుద్ధరాగముయొక్కస్థాయియందు స్థాపనగా చెప్పబడుచున్నది. ఈవిధముగా రాగమును స్థిరీకరించి వేణువాదకుడు ఆరోపించవలెను.

**తద్రాగనిప్రరామోత్తం (?)ధారయేత్ సమగాయినః ।**
**న్యా(య)సస్వరస్థాపనేన ఉచ్చారోత్తోభిధీయతే ॥ 27 ॥**

**ప్రతిపదార్థము** : సమగాయినః = సమగాయకులు; తద్రాగనిప్రరామోత్తాం ధారయేత్= ఆశుద్ధరాగము అధికరణముగా ధారణచేయవలెను; న్యా(య)నస్వరస్థాపయేత్ = న్యా(య)స స్వరస్థాపనచే; ఉచ్చారోత్తః అబిధీయతే = ఉచ్చారోత్తముగా చెప్పబడినది; తతో గాయినః= తరువాత గాయకులు; పూర్వోక్తప్రకారేణ = ముందుచెప్పబడినరీతిగా; రాగస్య ఆకారం = రాగముయొక్క ఆకారమును; స్థాపనాంచ = స్థాపనను;

**తాత్పర్యము** : సమగాయకులు ఆశుద్ధరాగ అధికరణముగా ధారణచేయవలెను. న్యా(య)న స్వరస్థాపనచే ఉచ్చారోత్తముగా చెప్పబడినది. తరువాత గాయకులు ముందుచ్పెబడిన రీతిగా రాగముయొక్క ఆకారమును స్థాపన చేయవలెను.

**రాగాలప్తిః క్షేత్రశుద్ధియుతా తాలవివర్జితా ।**
**రాగస్య శుద్ధతా క్షేత్ర శుద్ధిరి త్యభిధీయతే ॥ 28 ॥**

**ప్రతిపదార్థము** : రాగాలప్తిః = రాగాలాపము; క్షేత్ర శుద్ధయుతా =క్షేత్రశుద్ధి కలది; తాలవివర్జితా = తాల వర్జితమైనదియు; రాగస్య శుద్ధతా =రాగము యొక్కశుద్ధత; క్షేత్రశుద్ధిరితి = క్షేత్రశుద్ధియని; అభిధీయతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** రాగాలాపము క్షేత్రశుద్ధికలది. తాలవివర్జితమైనదియు రాగముయొక్క శుద్ధత క్షేత్రశుద్ధియని చెప్పబడుచున్నది.

**కృత్వాఽఽలప్తిం సతాలం చ తద్రాగం జనాన్వితవిమ్ ।**
**రూపకగాయినో గాయన్ తిక్తినా సహితం తతః ॥ 30 ॥**

**ప్రతిపదార్థము :** ఆలప్తిం = ఆలాపమును; సతాలంచ కృత్వా = తాలయుతముగా చేసి; తద్రాగం = ఆరాగమును; విజనాన్వితం = ఏకైకముగా(నిర్జనముగా); రూపకగాయినః = రూపకాలాపమును గానముచేయువారు; గాయన్ = పాడుచు; తతః = తరువాత; తిక్తినా సహితం = తిక్తితోకూడ;

**తాత్పర్యము :** ఆలాపమును తాలయుతముగాచేసి ఆరాగము ఏకైకముగా(నిర్జనముగా) రూపకాలాపనమును గానముచేయువారు పాడుచు తరువాత తిక్తితోకూడ.

**స్థాయాయా రూపకే యస్మిన్ తస్యా నానాప్రకారతః ।**
**ముహుర్ముహు ర్గహో యత్తు ప్రతిగ్రహణ ముచ్యతే ॥ 31 ॥**

**ప్రతిపదార్థము :** యస్మిన్ రూపకే స్థాయాయాః = ఏరూపకస్థాయయొక్క; గ్రహః = గ్రహణమొ (స్వీకరణము); తస్యాః = దానియొక్క; నానాప్రకారతః = అనేకవిధములైన; యత్ ముహుః ముహుః గ్రహః = యేమాటిమాటికి గ్రహణముకలదో; తత్ = అది; ప్రతిగ్రహణం ఉచ్యతే = ప్రతిగ్రహణముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ఏరూపకస్థాయయొక్క గ్రహణము(స్వీకరణము) దానియొక్క అనేకవిధములైన యేపునఃపునః గ్రహణముకలదో అది ప్రతిగ్రహణముగా చెప్పబడు చున్నది.

**యో యథా చాలితః స్థాయస్తం తథైవ నివేశయేత్ ।**
**విచిత్రస్య తు గీతస్య యథౌచిత్యోపవేశనమ్ ॥ 32 ॥**

**ప్రతిపదార్థము :** యః స్థాయః = ఏస్థాయ; యథాచాలితః =ఎట్లు చలితమగునో; తం=దానిని; తథైవ = అట్లే; నివేశయేత్ = ప్రవేశపెట్టవలెను; విచిత్రస్య గీతస్య తు = విచిత్రగానమునకు మాత్రము; యథౌచిత్యోపవేశనం = తగినరీతిగా ప్రవేశము (జరుగును).

**తాత్పర్యము :** ఏస్థాయ ఎట్లు చలితమగునో దానిని అట్లే ప్రవేశపెట్టవలెను. విచిత్రగాన మునకు మాత్రము తగిన రీతిగా ప్రవేశము(జరుగును).

స్థాయావిధేయా న తు సైకరూపా బహుప్రకారై ర్వికృతా విభాతి ।
విచిత్రరూపేఽపి మయూరకంఠో జగజ్జనప్రీతికరో యథా సః ॥ 33 ॥

**ప్రతిపదార్థము :** స్థాయా విధేయా = స్థాయ చేయదగినది; కింతు = కాని; సా =అది; న ఏకరూపా = ఒకే రూపముకలది కాదు; బహుప్రకారైః = అనేకవిధములుగా; వికృతా= వికృతిని పొంది; విభాతి = ప్రకాశించుచున్నది; విచిత్రరూపేఽపి = విచిత్రరూపమందు కూడ; మయూరకంఠః = మయూరస్వరము; యథా = ఎట్లు; జగజ్జనప్రీతికరః = లోకమందలి జనులందరికీ ఇష్టమగుచున్నదో; తథా = అట్లే; సః = ఆస్థాయికూడా; ప్రకాశించుచున్నది; స్థాయానామాని కథ్యంతే = (స్థాయనామములు చెప్పబడుచున్నవి).

**తాత్పర్యము :** స్థాయచేయదగినది. కాని అది ఒకే రూపముకలది కాదు. అనేక విధములుగా వికృతినిపొంది ప్రకాశించుచున్నది. విచిత్రరూపమందు కూడా మయూరస్వరము ఎట్లులోకమందలి జనులందరికీ ఇష్టమగుచున్నదో అట్లే ఆస్థాయ కూడ ప్రకాశించుచున్నది. (స్థాయనామములు చెప్పబడుచున్నవి).

వేణి; గతి,జాయి, అనుజాయి, ఓయార; వాలి; వహణి (ఢాదాలి) పసర; లలితగాఢ; పోచ్చగాఢ; అపఖల్లు; నిస్సరడ, లంఘిత దుర్వాస, పేర్థోపేట్టి, పేల్లోఫోల్లి, మోడోమోడి, గుంథాగుంథి, ఖచర, గాణాచేఠయ, తరహర, తత్తవణ, విదారి, భ్రమలీల, కాలసచేఠాయ, చిత్తాచేఠాయ, జోడణే (కరుణ) (గీతాచేఠాయ) (జోడియ చేఠాయ) శారీరాచేఠాయ, సాదాచేఠాయ, కర్తరి, (అధికర్తరి) (నఖకర్తరి) కురు (లే?ల) య, ముట్టేయ, ముకులిత, ఉచ్చనీచ, (తి?ని) కాయి (ఉక్కాయి) నిరత,ని (కి?గీ)తి, వ (తత?త్తు)డ; పరీవాడి, ఏన్నత, ఉట్టుండుల, హందుపాయి, వహిల, అధిక, అంఖుడు, నపాయి, భరణ, హరణ, ననగిద; నిక్కరడ; భజవణే, నిజవణే; సుభావ; హోలావ; రంగరక్తి, రీతి, అనుకరణే, ధరణి, ధరిమేల్లి, వివంధాయి, (మ?మి) త్థాయి; (గీతజ్యోతి) హోంభేకలా; ఛవి; ఛాయా; స్వస్థాన, అవస్థాన, అపస్థాన, నవణి, అంశ, ఘటనా, ఆక్రమణే, వక్ర(మ)తా, కంథరణే కలవర; (వేద?దేవ) ధ్వని; ఘనత్వ; ఆహత, అవతీర్ణ, బేక్కల, సుకరాభాస, దుష్కరాభాస, అసాధారణ, ఉచిత, బుడ్డాయే, వైసికే, ఏవముక్తః = ఇట్లుచెప్పబడిన; స్థాయాశబ్దేన = స్థాయశబ్దముచేతను; కిమభిధీయతే? = ఏమిచెప్పబడుచున్నది?

గత్యా గమకయోగేన రాగేణాన్యేన కేన వా ।
స్వరై ర్వృత్తిః స్వరవృత్తిస్థాయా ఇత్యభిధీయతే ॥ 34 ॥

**ప్రతిపదార్థము :** గత్యా =గతిచేతను; (నడక); గమకయోగేన = గమకముతో కలసియుండుటచేతను; రాగేణ = రాగములచేతను; అన్యేన కేన వా = ఇంక దేనిచేతనైనను; స్వరైః = స్వరములచే; వృతిః = వర్తనము; స్యాత్ = అగునో; స్వరవృత్తిః = ఆ స్వరవృత్తి; ఠాయ ఇతి = ఠాయమని; అభిధీయతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** గతిచేతను(నడక) గమకముతో కలసియుండుటచేతను రాగముల చేతను ఇంకదేనిచేతనైనను స్వరములచే ఆవర్తనము అగునో ఆ స్వరవృత్తి స్థాయమని చెప్పబడుచున్నది.

**స్థాయానాం కరణాన్యాహుః చత్వారి స్థానతానకే ।**
**గమకో మానమేతేషాం లక్షణాన్యభిదధ్మంహే ॥ 35 ॥**

**ప్రతిపదార్థము :** స్థానతానకే = స్థానతానములు; గమకః = గమకము; మానం = మానము; ఇతి = అని; స్థాయానాం = స్థాయలకు; చత్వారి కరణాని = నాలుగు కరణములు; ఆహుః = చెప్పిరి; ఏతేషాం = వీటికి; లక్షణాని అభిదధ్మహే = లక్షణములు చెప్పుచున్నాము.

**తాత్పర్యము :** స్థానము, తానము, గమకము, మానము- అని స్థాయలకు నాలుగు కరణములు చెప్పిరి. వీటికి లక్షణములు చెప్పుచున్నాము.

**తత్ర స్థాయ్యాదివర్ణానామాశ్రయః స్వరమండలః ।**
**స్థాన మిత్యుచ్యతే తస్మిన్నుదాహరణ ముచ్యతే ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** తత్ర = అందు; స్థాయ్యాదివర్ణానాం = స్థాయ్యాదివర్ణములకు; ఆశ్రయ= ఆధారమైన; స్వరమండలః = స్వర (సముదాయము) మండలము; స్థానమితి ఉచ్యతే = స్థానము అని చెప్పబడుచున్నది; తస్మిన్ ఉదాహరణముచ్యతే = దాని కుదాహరణము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అందు స్థాయ్యాదివర్ణములకు ఆధారమైన స్వర(సముదాయము) మండలము స్థానము అని చెప్పబడుచున్నది. దానికుదాహరణముచెప్పబడుచున్నది.

**యథా :** - వేలావల్యాం = వేలావలియందు; ధనిసరిగమప; ఛాయానాట్టాయాం = ఛాయానాట్టయందు; సరిగమపదని; ఇత్యాది = ఈమొదలగునవి; తానః = తానము; రాగాపేక్షయా = రాగాపేక్షచే; యో గమకాశ్రయః = యః గమకాశ్రయః స్వరః =

గమకాశ్రయమైన యేస్వరమో; సః = అది; తజ్ఞైః = సంగీతజ్ఞులచే; స్థానమిత్యుచ్యతే= స్థానమని చెప్పబడుచున్నది.

**యథా** :- వేలావల్యాం = వేలావలి(ళి)యందు; తస్థానే = తస్థానమందు; ధైవతః = ధైవతము; కంపితస్థానే షడ్జః = కంపిత(గమక) స్థానమందు షడ్జము; ఛాయానాట్టాయాం = చాయానాట్టయందు; కంపితస్థానే = కంపితస్థానమందు; గాంధారనిషాదౌ = గాంధారనిషాదములు; ఇత్యాది = ఈ మొదలగునవి; గమకాః కంపితాదయః = గమకములు కంపితాదులు;

> **రాగవ్యక్త్యనుకూలకా హి గమకాః రాగేఽపి సంచారిణః,**
> **తన్మాత్రా పరిమాణమేవ సుతరాం మానం వద న్త్యాదరాత్।**
> **సంగీతాకరకర్ణధారపదవీ మాధౌకమానాః పరమ్,**
> **స్వాదుత్వానుగుణాభవంతి హియథాశాకేరసాః షట్ చతే ॥37॥**

**ప్రతిపదార్థము** : యథా శాకే = కూరలో; షట్ రసాః = ఆరు రుచులవలె; స్వాదుత్వానుగుణా భవంతి = స్వాదుత్వ సంపాదకములగుచున్నవో; తథా = అట్లే, తే గమకాః = ఆగమకములు; రాగేఽపి = రాగమందును; సంచారిణః = సంచారులై; రాగవ్యక్త్యనుకూలకాః = రాగస్పష్టీకరణమునకు అనుకూలమగుచున్నవి; తన్మాత్రా-పరిమాణమేవ = అంతమాత్రపరిమాణముకలవానిని; సుతారాం = అత్యంతము; ఆదరాత్ = ఆదరణవలన; సంగీతాకర కర్ణధారపరవీమాఢౌకమానాః = సంగీత సాగరమును దాటగల నావికుల వలెనున్న సంగీతశాస్త్రజ్ఞులు మానం వదంతి= మానముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : కూరలో ఆరురుచులవలె గమకములు స్వాదుత్వసంపాదకములగు చున్నవి. ఆ గమకములు రాగమందును సంచారులై రాగస్పష్టీకరణమునకు అనుకూలమగుచున్నవి. అంతమాత్రపరిమాణముకలవానిని అత్యంతము ఆదరణ వలన సంగీతసాగరమును దాటగల నావికుల వలెనున్న సంగీతశాస్త్రజ్ఞులు మానముగా చెప్పుచున్నారు.

> **ప్రయోగైః కైశ్చిదపరైః సరీసా రాగచాలనా ॥ 38 ॥**

**ప్రతిపదార్థము** : అపరైః కైశ్చిత్ ప్రయోగైః = మరికొందరిచే కొన్ని ప్రయోగములద్వారా; రాగచాలానా సరీసా ఇతి = సరీసాఅని రాగచాలనమువని (చెప్పబడుచున్నది).

**తాత్పర్యము :** మరికొందరిచే కొన్ని ప్రయోగములద్వారా సరీసాఅని రాగచాలనము అని (చెప్పబడుచున్నది)

**అన్యైస్తు సరి సంగీతే (కంఠల?సావే) ణీతి నిగద్యతే ।**
**మాధుర్యసహితో గీతే శ్రుతిమాత్రస్తు కేవలమ్ ॥ 39 ॥**

**ప్రతిపదార్థము :** అన్యైః = మరికొందరిచే; యా సరి ఇతి సంగీతే = ఏది సరి అనునది సంగీతమందు; సా =అది; వేణీతి = వేణియని; నిగద్యతే = చెప్పబడుచున్నది; గీతే= గీతమందు; మాధుర్యసహితః = మాధుర్యముతో కూడినది; కేవలం మాత్రః = కేవలము శ్రుతిమాత్రమేయగునో; అపిచ = మరియు;

**తాత్పర్యము :** మరికొందరిచే ఏది సరి అనునది సంగీతమందు వేణియనిచెప్పబడు చున్నది; మరియు;

**స్వరాణాం సన్నివేశో యశ్చాతుర్యాత్ సా గతిర్భవేత్ ।**
**స్వరమాత్రేణ సదృశ స్థానాంతరనివేశనమ్ ॥ 40 ॥**

**ప్రతిపదార్థము :** యః స్వరాణాం సన్నివేశః చాతుర్యాత్ భవతి = ఏ స్వరసన్నివేశము నిపుణముగానగునో; సా = అది; గతిః భవేత్ = గతియగును; స్వరమాత్రేణ సదృశ= స్వరమాత్రముచేతనే సమానమైన; స్థానాంతరనివేశనం = మరియొక స్థానమునందు ప్రవేశము; ఇతి భేదః = అనుభేదము; జాయినః అనుజాయినశ్చ = జాయి, అనుజాయులకు; సముదిష్టః = ఉద్దేశింపబడినది.

**తాత్పర్యము :** ఎక్కడ స్వరసన్నివేశము నిపుణముగానగునో అది గతియగును, స్వరమాత్రముచేతనే సమానమైన మరియొక స్థానమునందు ప్రవేశము అనుభేదము జాయి, అనుజాయులకు ఉద్దేశింపబడినది.

**ఇతి భేదస్సముద్దిష్టోజాయినశ్చను జాయినః**

**స్వరమాత్రాధికో యస్మాత్ స్వరావృత్తివిధిక్రమాత్ ॥ 41 ॥**

**ప్రతిపదార్థము :** యస్మాత్ = దేనికంటె; స్వరమాత్రాధికః = స్వరమాత్రము అధికమగునో; స్వరావృత్తివిధిక్రమాత్ = స్వరావృత్తి విధిక్రమముగా; స్వరమాత్రమధిక మగునో; తదొయారం సముద్దిష్టం ప్రాయశ్చారోహి సంశ్రయమ్, సుశరీరాత్సముద్భూతా శ్రుతినామ వలిర్యధా ఓయారం = ఓయారముగా; సముదిష్టం = ఉద్దేశింపబడినది;

ప్రాయః = తరచుగా; యథా = ఏప్రకారముగా ఆరోహిసంశ్రయం = ఆరోహి ఆశ్రయము జరుగునో; తత్ = అది; సుశరీరాత్ = సుశరీరమునుండి; సముద్భూతా= ఉద్భవించిన; శ్రుతి నామ = శ్రుతియే; వలీ= వలి;

**తాత్పర్యము** : దేనికంటే స్వరమాత్రము అధికమగునో స్వరావృత్తివిధిక్రమముగా స్వరమాత్రమధికమగునో అది ఓయారముగా ఉద్దేశింపబడినది. తరచుగా ఆరోహి ఆశ్రయముజరుగునో సుశరీరమునుండిఉద్భవించిన శ్రుతియే వలి ఏప్రకారముగా;

**చరేత్ సమీరణోద్భూతతరంగావలివత్ వలీ ।**
**మంద్రాదిస్థానభేదేన ప్రవృత్తం శ్రుతికంపనమ్ ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : సమీరణోద్భూతతరంగావలివత్ చరేత్ = వాయుజనితతరంగ సముదాయమువలె ప్రవర్తించునో; సా వలీ = అదియు వలి; మంద్రాదిస్థానభేదేన = మంద్రాదిస్థానభేదముచే; ప్రవృత్తం = ప్రవర్తించిన; శ్రుతికంపనం = శ్రుతిచలనము.

**తాత్పర్యము** : వాయుజనితతరంగసముదాయమువలె ప్రవర్తించునో అదియు వలి మంద్రాదిస్థానభేదముచే ప్రవర్తించిన శ్రుతిచలనము.

**ఉరః కంఠశిరః స్థాఖ్యా వహణిక్రమతో భవేత్ ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : ఉరః = వక్షఃస్థలము; కంఠ = కంఠము; శిరస్థాణ్యా = శిరస్సు నందుండునదియే; క్రమతః =క్రమముగా; వహణిః భవేత్ = వహణియగును; వహణీ ద్వేధా = వహణి రెండు రకములు; ఆవలప్తివహణీ శీతశీతవహణీచ = ఆవలప్తివహణి, శీతశీతవహణి అని; పునః ద్విధా = మరల రెండు విధములు; ఖుత్తా, ఉత్ఫుల్లా = ఖుత్తా అనియు ఉత్ఫుల్లా అనియు;

**తాత్పర్యము** : వక్షఃస్థలము కంఠము శిరస్సునందుండునదియే క్రమముగా వహణి యగును. వహణిరెండురకములు ఆవలప్తి వహణి, శీతశీతవహణి అ.ని మరలరెండు విధములు ఖుత్తా అనియు, ఉత్ఫుల్లా అనియు;

**ప్రవిశంతి ఇవాన్తస్తే స్వరా యస్యాం విభాన్తిచ ।**
**ఖుత్తా సా కథ్యతే గానవిద్యాలక్షణవేదిభిః ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : అన్తస్తే ప్రవిశంతి ఇవ =లోపల ప్రవేశించునదివలె; యస్యాం= దేనియందు; స్వరాః = స్వరములు; విభాంతి = ప్రకాశించునో; సా = అది;

గానవిద్యాలక్షణవేదిభిః = గాయకపండితులచే; ఖుత్తా కథ్యతే = ఖుత్తాప్రభేదముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : లోపల ప్రవేశించునదివలె దేనియందు స్వరములు ప్రకాశించునో అది గాయకపండితులచే ఖుత్తాప్రభేదముగా చెప్పబడుచున్నది.

**యస్యాః స్వరా విరాజంతే నిర్గచ్ఛన్త ఇవోపరి ।**
**గానలక్షణతత్త్వజ్ఞైః ఉత్ఫుల్లా పరికీర్త్యతే ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : యస్యాః స్వరాః = దేని స్వరములు; ఉపరి నిర్గచ్ఛంతే ఇవ = పైకి పోవువానివలె; విరాజంతే = ప్రకాశించునో; గానలక్షణతత్త్వజ్ఞైః = గానవిశారదులచే; (అది) ఉత్ఫుల్లా పరికీర్తితే = ఉత్ఫుల్లాభేదముగా చెప్పబడుచున్నది; ఏవం = ఇట్లు; వలిరపి = వలియును; వహణీవ = వహణివలె; వేదితవ్యా = తెలియదగినది.

**తాత్పర్యము** : దేనిస్వరములు పైకి పోవువానివలె ప్రకాశించునో అది గానవిశారదులచే ఉత్ఫుల్లాభేదముగా చెప్పబడుచున్నది. ఇట్లు వలియును, వహిణివలె తెలియదగినది.

**వృత్తమౌక్తికవత్ కాచభూతవే విలసద్ధ్వనౌ ।**
**శ్రుతిః ప్రవర్తతే క్షిప్రం యత్ర దాలం తదుచ్యతే ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర ధ్వనౌ = ఏధ్వనియందు; కాచభూతలే = గాజుభూమియందు; వృత్తమౌక్తికవత్ = గుండ్రని ముత్యమువలె; విలసత్ = ప్రకాశించునదై; క్షిప్రం = త్వరితముగా; శ్రుతిః = శ్రుతి; ప్రవర్తతే = ప్రవర్తించునో; తత్ = అది; దాలం ఉచ్యతే= దాలముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఏధ్వనియందుగాజుభూమియందు గుండ్రనిముత్యమువలె ప్రకాశించు నదై త్వరితముగా శ్రుతిప్రవర్తించునో దానిని దాలముగా చెప్పబడుచున్నది.

**మాధుర్యయుక్తో లలితః స్వరో యత్ర ప్రసార్యతే ।**
**స్వరాంతరస్య సంయోగాత్ పసరం తం ప్రచక్షతే ॥ 47 ॥**

**లాలిత్యేన యదా నాదః తారస్థానే ప్రవర్తతే ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : మాధుర్యయుక్తః = మాధుర్యముతో కూడిన; లలితః స్వరః = లలితమైన స్వరము; యత్ర ప్రసార్యతే = ఎక్కడ ప్రసారమగునో; (స్వరాంతరస్య

సంయోగాత్ = మరియొక స్వరసంయోగమువలన) తం =దానిని; పసరం = పసరముగా; ప్రచక్షతే = చెప్పుచున్నారు; యదా = ఎప్పుడు; తారస్థానే = తారస్థానమందు; నాదః = నాదము; లాలిత్యేన ప్రవర్తతే = లలితముగా ప్రవర్తించునో;

**తాత్పర్యము** : మాధుర్యముతో కూడిన లలితమైన స్వరము ఎక్కడప్రసారమగునో (మరొయొకస్వరసంయోగమువలన) దానిని పసరముగా చెప్పుచున్నారు. ఎప్పుడు తారస్థానమందు నాదము లలితముగా ప్రవర్తించునో;

**తదా లలితగాఢం తం జగుర్గీతవిశారదాః ।**
**క్రమేణ గాఢతాం త్యక్త్వా లలితస్వరవర్తనమ్ ॥ 49 ॥**

**ప్రతిపదార్థము** : తదా = అప్పుడు; తం =దానిని; లలితగాఢం = లలితగాఢముగా; గీతవిశారదాః = గానకోవిదులు; జగుః =గానముచేసిరి; క్రమేణ = క్రమముగా; గాఢతాం త్యక్త్వా = గాఢత్వమును విడిచి; లలితస్వరవర్తనం = లలితమైన స్వరము ప్రవర్తించునది.

**తాత్పర్యము** : దానిని లలితగాఢముగా గానకోవిదులు గానముచేయుదురు. క్రమముగా గాఢత్వమును విడిచి లలితమైన స్వరము ప్రవర్తించునది.

**పోచ్ఛగాఢమితి ప్రోక్తం గీతలక్షణకోవిదైః ।**
**యత్ర ప్రవర్తతే మంద్రస్థానేఽతి మధురః స్వరః ॥ 50 ॥**

**ప్రతిపదార్థము** : పోచ్ఛగాఢమితి = పోచ్ఛగాఢమని; గీతలక్షణకోవిదైః = సంగీతజ్ఞులచే; ప్రోక్తం = చెప్పబడినది; యత్ర మంద్రస్థానే = యే మంద్రస్థానమందు; అతిమధురః స్వరః =మిక్కిలి మధురమైన స్వరము; ప్రవర్తతే = ప్రవర్తించునో;

**తాత్పర్యము** : పోచ్ఛగాఢమని సంగీతజ్ఞులచే చెప్పబడినది. యేమంద్రస్థానమందు మిక్కిలి మధురమైన స్వరము ప్రవర్తించునో;

**అపఖల్లః స విజ్ఞేయః గీతభాషావిశారదైః ।**
**క్రమేణ పరమం తారం గత్వాతిమసృణః స్వరః ॥ 51 ॥**

**ప్రతిపదార్థము** : సః =అది; అపఖల్లః = అపఖల్లముగా; విజ్ఞేయః = తెలియదగినది; క్రమేణ = క్రమముగా; పరమం తారం గత్వా = మిక్కిలి తారమును పొంది; అతిమసృణః స్వరః = మిక్కిలి సుందరస్వరము;

**తాత్పర్యము :** అది అపఖల్లముగాతెలియదగినది. క్రమముగా మిక్కిలితారమునుపొంది మిక్కిలి సుందరస్వరము;

> **పైచ్ఛల్యాత్ పతితో మంత్రేభవేన్నిస్సరదాభిధః ।**
> **ఈషదాహతసంయుక్తః స్వరో యత్ర విలంఘయేత్ ॥ 52 ॥**
> **స్వరాతంతరక్రమేణైవ లంఘితం తత్ ప్రచక్షతే ।**

**ప్రతిపదార్థము :** పైచ్ఛల్యాత్ = వ్యాపించుటచే; మంత్రే పతితః = మంత్రమందు పడునో; సః = అది; నిస్సరదాభిధః= నిస్సరదమనునది; భవేత్ = అగును; ఈషదాహత సంయుక్తః = కొంచెమాహతముతోకూడిన; స్వరః = స్వరము; యత్ర =ఎక్కడ; స్వరాంతరక్రమేణ = స్వరాంతరక్రమముగా; విలంఘయేత్ = లంఘిచునో; తత్ = దానిని; లంఘితం = లంఘితముగా; ప్రచక్షతే= చెప్పుచున్నారు.

**తాత్పర్యము :** వ్యాపించుటచే మంత్రమందు పడునో అది నిస్సరదమనునది అగును. కొంచెమాహతముతోకూడినస్వరము ఎక్కడ స్వరాంతరక్రమముగా లంఘించునో దానిని లంఘితముగా చెప్పుచున్నారు.

> **ఇదమేవ యదైకద్విత్రిస్వరాంతరితం భవేత్ ॥ 53 ॥**

**ప్రతిపదార్థము :** ఇదమేవ = ఈలంఘితమే; ఏకద్విత్రిస్వరాంతరితం = ఒకటిరెండు మూడు స్వరములచేత అంతరితమగునో;

**తాత్పర్యము :** ఈలంఘితమే ఒకటి, రెండు మూడు స్వరములచేత అంతరితమగునో;

> **తదా గీతకలాభిజ్ఞైః స్వరలంఘితమీరితమ్ ।**
> **తారమంద్రసమాయోగాత్ ప్రయోగో యత్ర దుష్కరః ॥ 54 ॥**

**ప్రతిపదార్థము :** తదా = అప్పుడు; గీతకలాభిజ్ఞైః = గానకోవిదులచే;స్వరలంఘితం ఈరితం = స్వరలంఘితముగాచెప్పబడినది; తారమంద్రసమాయోగాత్ = తార మంద్రముల కలయిక వలన; యత్ర = ఎక్కడ; ప్రయోగః = ప్రయోగము; దుష్కర= కఠినమో;

**తాత్పర్యము :** అప్పుడు గానకోవిదులచేస్వరలంఘితముగా చెప్పబడినది. తార మంత్రములకలయిక వలన ఎక్కడ ప్రయోగము కఠినమో అది పండితులచే

సః =అది; గీతజ్ఞైః = పండితులచే; దుర్వ్యాసః

**వర్తతే స తుగీతజ్ఞైః దుర్వ్యాసః పరికీర్తితః ।**
**పునరావర్తతే యత్ర ప్రయోగః పూర్వమాగతః ॥ 55 ॥**
**తదానీమేవ సా తజ్ఞైః పేర్థోపేర్థీతి గద్యతే ।**

**ప్రతిపదార్థము** : పరికీర్తితః = దుర్వ్యాసముగాచెప్పబడినది; పూర్వమాగతః = ముందు వచ్చిన; ప్రయోగః = ప్రయోగము; యత్ర = ఎక్కడ; పునః ఆవర్తతే = మరల ఆవృత్తమగునో; తదానీమేవ = అప్పుడే; సా =అది; తజ్ఞైః = సంగీతజ్ఞులచే; పేర్థోపేర్థీతిగద్యతే = పేర్థోపేర్థీయని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : అది పండితులచే దుర్వ్యాసముగా చెప్పబడినది. ముందువచ్చిన ప్రయోగముఎక్కడ మరల ఆవృత్తమగునో అప్పుడే అది సంగీతజ్ఞులచే పేర్థోపేర్థీయని చెప్పబడుచున్నది.

**గాఢత్వేన స్వరం సర్వం నుదేద్యత్ర స్వరాంతరమ్ ॥ 56 ॥**
**ఆరోహిక్రమతః సోక్తా ఫేల్లోఫేల్లీతి నామతః ॥ 57 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; గాఢత్వేన = గాఢముగా; స్వరం సర్వం = ప్రతిస్వరము; ఆరోహిక్రమతః = ఆరోహిక్రమముగా; స్వరాంతరం నుదేత్ = స్వరాంతరమును నినదించునో; సా =అది; నామతః = పేరుచేతను; ఫేల్లో ఫేల్లీతి = ఫేల్లోఫేల్లీయని; ఉక్తా = చెప్పబడినది. సముద్ధృత్య స్వర్థోన్యత్ర తేషామగ్రాణ్యధఃక్రమాత్ భజ్యతే సాపరిజ్ఞేయా మోడామోడీ తి సంజ్ఞయా, మోడామోడితి = మోడామోడియని; స్వరః = స్వరము; అన్యత్ర = మరియొక చోటునుండి; సముద్ధృత్య = ఎత్తబడినదై; తేషాం అగ్రాణి = వాటిలో అగ్రస్వరములను; అథః క్రమాత్ = క్రిందక్రమముగా; భజ్యతే = విభజింపబడునో; సా = అది; పరిజ్ఞేయా = తెలియదగినది.

**తాత్పర్యము** : ఎక్కడ గాఢముగా ప్రతిస్వరము ఆరోహిక్రమముగా స్వరాంతరమును నినదించునో అది పేరుచేతను ఫేల్లోఫేల్లీయని చెప్పబడినది. స్వరము మరియొకచోటునుండి ఎత్తబడి వాటిలో అగ్రస్వరములను క్రిందిక్రమముగా విభజింప బడునో అది మోడామోడియని తెలియదగినది.

**సప్తప్రయోగా ఏకత్ర వర్తంతేచేన్నిరంతరమ్ ॥ 58 ॥**
**స్ర్వ ?(స) గివాభిజ్ఞరచితా గుఫాగుంఫీతి సోదితా స్రగివ ।**

**ప్రతిపదార్థము :** సోదితా స్రగివ = దండవలె; అభిజ్ఞరచితా = పండితులచే రచింపబడిన; సప్తప్రయోగాః = సప్త ప్రయోగములు; నిరంతరం = సర్వదా; ఏకత్ర = ఒకచోట; వర్తంతే చేత్ = ఉన్నయెడల; సా =అది; గుంఫాగుంఫీతి ఉదితా = గుంఫాగుంఫి యని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** మోడామోడిఅయిన తెలియదగినది దండవలె పండితులచే రచింపబడిన సప్తప్రయోగములుసర్వదా ఒకచోట ఉన్నయెడల అది గుంఫాగుంఫీ యనిచెప్పబడు చున్నది.

**యత్ర గాఢః స్వరః సమ్య(గా?గ) నుతారే ప్రవర్తతే ॥ 59 ॥**
**ఖచరః స సముద్దిష్టో గీతభాషావిశారదైః ॥ 60 ॥**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; గాఢః స్వరః = గాఢస్వరము; సమ్యక్ = బాగుగా; అనుతారే ప్రవర్తతే = అనుతారమందు ప్రవర్తించునో; సః = అది; గీతభాషావిశారదైః= సంగీతజ్ఞులచే; ఖచరః ఇతి సముద్దిష్టః = ఖచరమని ఉద్దేశింపబడినది.

**తాత్పర్యము :** ఎక్కడ గాఢస్వరము బాగుగా అనుతారమందు ప్రవర్తించునో అది సంగీతజ్ఞులచే ఖచరమని ఉద్దేశింపబడినది.

**ఠాయం గమకసమ్మిశ్రం వర్తతే యన్మనోహరమ్ ।**
**గణాచేఠాయసంజ్ఞం తద్గీతవిద్భిరుదాహృతమ్ ॥ 61 ॥**

**ప్రతిపదార్థము :** యత్ మనోహరం = యేఅందమైన; ఠాయం = ఠాయము; గమక సమ్మిశ్రం వర్తతే చేత్ = గమకముతో కలసినట్లైనచో; తత్ =అది; గీతవిద్భిః = పండితులచే; గణాచేఠాయసంజ్ఞం ఇతి = గణాచేఠాయమని; ఉదాహృతం = చెప్పడమైనది.

**తాత్పర్యము :** యేఅందమైన ఠాయము గమకముతోకలసినట్లైనచో అది పండితులచే గణాచేఠాయమని చెప్పడమైనది.

**ఆహత్యా (దథ?దృత) యా యత్ర స్వరాణాం కంపనం భవేత్ ॥**
**ఠాయం తర(హరం) నామ్నా తమాహుర్గీతవేదినః ॥ 62 ॥**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; ఆద్రుతయా ఆహత్య = ఆహతమై ఆద్రుతముచే; స్వరాణాం కంపనం = స్వరకంపనము; భవేత్ = అగునో; తం ఠాయం = ఆఠాయమును; నామ్నా = పేరుచే; తరహరం = తరహరముగా; గీతవేదినః = గాయకోత్తములు; ఆహుః = చెప్పిరి.

**తాత్పర్యము :** ఎక్కడ ఆహతమై ఆద్రుతముచే స్వరకంపనము అగునో ఆఠాయమును తరహరముగా గాయకోత్తములు చెప్పిరి.

> **గీతస్యోపరి గీతజ్ఞైరాలప్తి రతికోమలా ।**
> **తత్త్రప్రవణరచితాఠాయం తత్తవణం విదుః ॥ 63 ॥**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; గీతస్య ఉపరి = గీతము తరువాత; అతికోమలా ఆలప్తిః = అతికోమలమైన ఆలాపన; నిగద్యతే = చెప్పబడునో (చేయబడునో); తత్తత్= ఆయాఠాయము; ప్రవణరచితా = ప్రవణరచన కలది అయినచో; తత్ = దానిని; తవణం విదుః = తవణమని తెలిసికొనిరి.

**తాత్పర్యము :** ఎక్కడ గీతము తరువాత అతికోమలమైన ఆలాపన చేయబడునో అయా ఠాయము ప్రవణ రచన కలదైనచో దానిని తవణమని తెలిసికొనిరి.

> **ఆలప్తిర్విలసత్తాలకాలా విశ్లేషితస్వరా ।**
> **వర్తతే చేన్నిరాలంబః స విదారీతి గద్యతే ॥ 64 ॥**

**ప్రతిపదార్థము :** ఆలప్తిః = ఆలాపము; విలసత్తాలకాలా = తాళకాలములతో (ప్రకాశించునదిగాను, కూడినదిగా)విశ్లేషితస్వరా = విశ్లేషింపబడిన స్వరములుకలదియు; నిరాలంబః = ఆలంబరహితముగాను; వర్తతే చేత్ = ఉన్నయెడల; సః = అది; విదారీ ఇతి = విదారియని; గద్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ఆలాపము తాళకాలములతో (ప్రకాశించునదిగాను, కూడినదిగా) విశ్లేషింపబడిన స్వరములుకలదియు అలంబరహితముగాను ఉన్నయెడల అది విదారియని చెప్పబడుచున్నది.

> **యస్తారమంద్రసంస్పర్శీ విచరేత్ పునరూర్ధ్వగః ।**
> **నాదో మాధుర్య సంయుక్తః స స్యాద్భ్రమరలీల (కా?కః) ॥ 65 ॥**

**ప్రతిపదార్థము :** యః నాదః = ఏనాదము; తారమంద్రసంశ్పర్శీ = తార మంద్రములను

స్పృశించుచు; పునః = మరల; ఊర్ధ్వగః = ఊర్ధ్వమునకు పోవునదై; విచరేత్ = నడచునో; అపిచ = మరియు; మాధుర్యసంయుక్తః = మాధుర్యము కలదియునగునో; సః = అది; భ్రమరలీలకః స్యాత్ = భ్రమరలీలకమగును.

**తాత్పర్యము** : ఏనాదము తారమంద్రములను స్పృశించుచు మరల ఊర్ధ్వమునకు పోవునదై నడచునో మరియు మాధుర్యముకలదియునగునో అది భ్రమరలీలకమగును.

**ప్రస్తుతేనైవ రాగేణ వర్తతే యత్ సుఖావహమ్ ।**
**తత్తు కాలస(లే?చే) ఠాయం కథితం గీతకోవిదైః ॥ 66 ॥**

**ప్రతిపదార్థము** : యత్ ఠాయం = ఏఠాయము; ప్రస్తుతేనైవ రాగేణ = ప్రస్తావించిన రాగముచే; తత్ =అది; గీతకోవిదైః = గాయకోత్తములచే; సుఖావహహం వర్తతే = సుఖమును కలుగజేయునో; కాలసచేఠాయం = కాలచేఠాయముగా; కధితం = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏఠాయము ప్రస్తావించిన రాగముచే అది గాయకోత్తములచే సుఖమును కలుగ జేయునో కాలసచే ఠాయముగా చెప్పబడినది.

**ఠాయం యద్భేదకత్వేన క్రియతే తద్విచక్షణైః ।**
**చిత్తాచేఠాయముదితం శ్రోతుశ్చిత్తానువర్తనాత్ ॥ 67 ॥**

**ప్రతిపదార్థము** : యత్ ఠాయం = ఏఠాయము; శ్రోతుః చిత్తానువర్తనాత్ = శ్రోతయొక్క మనస్సుహరించుట వలన; భేదకత్వేన క్రియతే = భేదకత్వముచేత; (మధించుట)చే చేయబడునో; తత్ = అది; విచక్షణైః = పండితులచే; చిత్తాచేఠాయమితి ఉదితం = చిత్తాచేఠాయమని చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏఠాయము శ్రోతయొక్క మనస్సుహరించుట భేదకత్వముచేత (మధించుట)చే చేయబడునో అది పండితులచే చిత్తాచేఠాయమని చెప్పబడినది.

**కరుణారాగయోగేన చిత్తహీనతయాఽథవా ।**
**కరుణా కాకుసంయుక్తా ఠా(యంస?యాసా) కరుణాభిధా ॥ 68 ॥**

**ప్రతిపదార్థము** : చిత్తహీనతయా =మనోరాహిత్యముచే; కరుణారాగయోగేన = కరుణరాగసంయోగముచే; అథవా =లేక; కరుణాకాకుసంయుక్తా = కరుణ కాకుస్వర ములలో కూడినది; సా ఠాయా కురుణాభిధా = అఠాయ కరుణయను పేరు కలదియగును.

**తాత్పర్యము** : మనోరాహిత్యముచే కరుణరాగసంయోగముచే లేక కరుణకాకు-స్వరములలో కూడినది ఠాయ కరుణయను పేరుకలదియగును.

**ఠాయం యద్వర్తతే గీతే తదాల(ప్తో?ప్త్యా) కృతం యది ।**
**గీతాచేఠాయమిత్యాహుః తజ్ఞా అన్వర్థసంజ్ఞకమ్ ॥ 69 ॥**

**ప్రతిపదార్థము** : యత్ ఠాయం = ఏఠాయము; గీతే వర్తతే = గీతమందున్నదో; తత్ = అది; ఆలప్త్యా కృతం యది = అలాపన చేతను చేయబడినచో; తజ్ఞాః = దానినెఱిగినవారు; అన్వర్ధసంజ్ఞకం = సార్థకమైన పేరుకల; గీతాచేఠాయమితి = గీతాచేఠాయమని; ఆహుః = పలికిరి

**తాత్పర్యము** : ఏఠాయము గీతమందున్నదో అది ఆలాపముచేతను చేసినయెడల దానినెఱిగినవారు సార్థకమైన పేరుకల గీతాచేఠాయమని పలికిరి.

**ప్రయోగోఽభిగుణో యత్ర పునర్ద్విగుణితో భవేత్ ।**
**స తు జోడియచేఠాయో దుష్కరః కథితో బుధైః ॥ 70 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర =దేనియందు; ప్రయోగః = ప్రయోగము; అభిగుణః = గుణవిశిష్టమగునో; పునః = మరల; ద్విగుణితః = రెండురెట్లు గుణముకలదియగునో; సః = అది; దుష్కరః = కష్టసాధ్యమైన; జోడియచేఠాయ ఇతి = జోడియచేఠాయముగా; బుధైః కథితః = పండితులచే చెప్పబడినది.

**తాత్పర్యము** : దేనియందు ప్రయోగము గుణవిశిష్టమగునో మరల రెండురెట్లు గుణముకలదియగునో అది కష్టసాధ్యమైన జోడియచేఠాయముగా పండితులచే చెప్పబడినది.

**లీలామాత్రేణ శారీరచ్ఛవిర్యత్ర ప్రవర్తతే ।**
**శరీరాచేఠాయ ఉక్తః సోఽయం గీతవిశారదైః ॥ 71 ॥**

**ప్రతిపదార్థము** : లీలామాత్రేణ = లీలగా; శారీరచ్ఛవిః = శరీరకాంతి; యత్ర ప్రవర్తతే= ఎక్కడ ప్రవర్తించునో; సోఽయం = అది; గీతవిశాలదైః =గీతజ్ఞులచే; శరీరాచేఠాయః ఇతి ఉక్తః = శారీరాచేఠాయమని చెప్పబడినది.

**తాత్పర్యము** : లీలగా శరీరకాంతి ఎక్కడప్రవర్తించునో అది గీతజ్ఞులచే శరీరాచేఠాయ మని చెప్పబడినది.

> భవేద్యత్ర సునాదోంఽతే తారస్థానగతధ్వనైః ।
> సాదాచేతాయ ఇత్యుక్తః స తు గీతవిచక్షణైః ॥ 72 ॥

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; తారస్థానగతధ్వనైః = తారస్థానమును పొందిన ధ్వనులచే; అంతే = చివర; సునాదః భవేత్ = ఇంపైన నాదముండునో; సః = అది; గీతవిచక్షణైః = సంగీతజ్ఞులచే; సాదాచేతాయ ఇతి ఉక్తః = సాదాచేతాయమని నిర్దేశింప బడినది.

**తాత్పర్యము** : ఎక్కడ తారస్థానమును పొందిన ధ్వనులచే చివర ఇంపైన నాదముండునో అది సంగీతజ్ఞులచే సాదాచేతాయమని నిర్దేశింపబడినది.

> అంగుళీభిశ్చతస్పృభిః ప్రత్యేకం హస్తయోర్ద్వయోః ।
> బహిర్యద్ధ్వన్యతే తంత్రీ ద్రుతం సా కర్తరీ మతా ॥ 73 ॥

**ప్రతిపదార్థము** : ప్రత్యేకం = ప్రత్యేకముగా; హస్తయోః ద్వయోః =రెండు చేతులయొక్క; చతస్పృభిః అంగుళీభిః = నాలుగువ్రేళ్లచేతను; యత్ తంత్రీ = ఏతీగ; ద్రుతం = త్వరితముగా; బహిః = బయటకు; ధ్వన్యతే = ధ్వనించునో; సా = అది; కర్తరీ మతా = కర్తరియని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ప్రత్యేకముగా రెండుచేతులయొక్క నాల్గువ్రేళ్లచేతను ఏ తీగ త్వరితముగా బయటకు ధ్వనించునో అది కర్తరియని చెప్పబడుచున్నది.

> కర్తరీసదృశః పాణిః దృశ్యతే యత్ర దక్షిణః ।
> తథా కోణహతిర్వామపాణినా సాఽర్ధకర్తరీ ॥ 74 ॥

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; కర్తరీసదృశః = కర్తరితో సమానమైన; దక్షిణః పాణిః దృశ్యతే = కుడిచేయి కనబడునో; తథా = అట్లే; వామపాణినా = ఎడమచేతితో; కోణహతిః స్యాత్ = కోణహతిజరుగునో; సా = అది; అర్ధకర్తరి = అర్ధకర్తరి యగును.

**తాత్పర్యము** : ఎక్కడ కర్తరితో సమానమైన కుడిచేయి కనబడునో అట్లే ఎడమచేతితో కోణహతి జరుగునో అది అర్ధకర్తరియగును.

> చతుర్భిః నఖరైర్యత్ర దక్షిణేనైవపాణినా ।
> ఆహతిః క్రియతే యత్ర యా తుసాజ్ఞేయా నఖకర్తరీ ॥ 75 ॥

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; దక్షిణేన పాణినా ఏవ = కుడిచేతితోనే; చతుర్భిః నఖరైః = నాల్గువ్రేళ్ల గోళ్లతోనే; ఆహతిః క్రియతే = ఆహతము చేయబడునో; సా నఖకర్తరీ జ్ఞేయా = అది నఖకర్తరిగా తెలియదగినది.

**తాత్పర్యము :** ఎక్కడ కుడిచేతితోనే నాల్గువ్రేళ్లగోళ్లతోనే ఆహతము చేయబడునో అది నఖకర్తరిగా తెలియదగినది.

**వాద్యతే యది వేగేన మధురం లభుధక్కులీ ।**
**శ్రుతయస్తత్ర సంజాతా జ్ఞేయాః కురులయాఖ్యయా ॥ 76 ॥**

**ప్రతిపదార్థము :** లబుధక్కులీ = వాద్యవిశేషము; వేగేన = వేగముగా; మధురం = తీయగా; యది వాద్యతే = మ్రోగించిన యెడల; తత్ర = అక్కడ; సంజాతాః శ్రుతయః= జనించిన శ్రుతులు; కురులయాఖ్యయా = కురులయాఖ్య అను పేరుగలవిగా; జ్ఞేయాః = తెలియదగినవి.

**తాత్పర్యము :** వాద్యవిశేషము వేగముగా తీయగా మ్రోగించినయెడల అక్కడ జనించిన శ్రుతులు కురులయాఖ్య అనుపేరుగలవిగా తెలియదగినవి.

**వంశే ముట్టేయముక్తం తద్గాత్రేముకులితం మతమ్ ।**
**త(తో?యో) ర్గమకబాహుల్యం కర్తుర్నైవ తు శక్యతే ॥ 77 ॥**

**ప్రతిపదార్థము :** తత్ = అది; వంశే = వేణువుయందు; ముట్టేయం ఉక్తం = ముట్టేయముగా చెప్పబడినది; గాత్రే = గాత్రమందు; ముకులితం = ముకులితముగా నిర్దేశింపబడినది; తయోః = ఆరెండింటికి; గమకబాహుల్యాత్ = గమకములధికము లగుట వలన; కర్తుః నైవ శక్యతే = ప్రయోక్తకే అశక్యమగును.

**తాత్పర్యము :** అది వేణువునందు ముట్టేయముగా చెప్పబడినది. గాత్రమందు ములితముగానిర్దేశింపబడినది. ఆరెండింటికి గమకములధికములగుటవలన ప్రయోక్తకే అశక్య మగును.

**యౌప్రోక్తౌ గీతభాషాయాం తారమంద్రౌ మనీషిభిః ।**
**తావేన కథితౌ లోకైరుచ్చనీచసమాఖ్యయా ॥ 78 ॥**

**ప్రతిపదార్థము :** మనీషిభిః = పండితులచే; గీతభాషాయాం = సంగీతశాస్త్రమందు; యౌ తారమంద్రౌ ప్రోక్తౌ = ఏ తార మంద్రములు చెప్పబడినవో; తౌ ఏవ = అవియే;

లోకైః = జనములచే; ఉచ్చనీచ సమాఖ్యయా కథితౌ = ఉచ్చనీచ మనుపేరుతో చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : పండితులచే సంగీతశాస్త్రమందు ఏ తార- మంద్రములు చెప్పబడినవో అవియే జనములచే ఉచ్చనీచమనుపేరుతో చెప్పబడుచున్నవి.

**స్ఫురితాదిస్వరో యత్ర తారస్థానం తు సంస్పృశతే ।**
**నిఖాయః సా భవేత్ స్థానవ్యక్తిశ్చోక్ఖాయికామతా ॥ 79 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; స్ఫురితాది స్వరః = స్ఫురితాదిస్వరము; తారస్థానం= తారస్థానమును; సంస్పృశేత్ = తాకునో; సా = అది; నిక్ఖాయి భవేత్ = నిఖాయి అగును; స్థానవ్యక్తిః = స్థానమును వ్యక్తీకరించునది; ఉక్ఖాయికా మతా = ఉక్ఖాయిగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఎక్కడ స్ఫురితాదిస్వరము తారస్థానమును తాకునో అదినిక్కాయి అగును. స్థానమును వ్యక్తీకరించునది ఉక్ఖాయిగాచెప్పబడుచున్నది.

**విషమప్రాంజలాలప్తౌ శ్వాన సంయమన(స్వ?త్వ) తః ।**
**ఠాయేఽతిర్గలహీనత్వం (?)నిరతం పరికీర్తితమ్ ॥ 80 ॥**

**ప్రతిపదార్థము** : విషమప్రాంజలాలప్తౌ = విషమప్రాంజలాలాపనయందు; శ్వాస సంయమనత్వతః = శ్వాసనిరోధమువలన; ఠాయే = ఠాయమందు; అతిః = మిక్కిలి; గళహీనత్వం = గళరాహిత్యమే; నిరతంపరికీర్తితం = ఆసక్తికరమైనదిగా చెప్పబడినది.

**తాత్పర్యము** : విషమప్రాంజలాలప్తియందు శ్వాసనిరోధమువలన ఠాయమందు మిక్కిలి గళరాహిత్యమే ఆసక్తికరమైనదిగాచెప్పబడినది.

**ఠాయం వివర్ధమాదాయ బలాత్ సంస్థాపనే పునః ।**
**అన్యూనాధికతా(నజ్ఞైః?తజ్ఞై)ర్నిగీతిః పరిగీయతే ॥ 81 ॥**

**ప్రయోగే వర్తతే యత్తు మందవత్యా స వత్తుడః ।**

**ప్రతిపదార్థము** : వివర్ధంఠాయం ఆదాయ = వృద్ధిపొందిన ఠాయను గ్రహించి; బలాత్= బలాత్కారముగా; అన్యూనాధికతా = న్యూనతాధికతలు లేక పోవుటను; సంస్థాపనే= సంస్థాపింపగా; తజ్ఞైః = సంగీతజ్ఞులచే; నిగీతిః పరిగీయతే = నిగీతియని చెప్పబడినది;

యత్ = ఏది; ప్రయోగే = ప్రయోగమందు; మందవత్యా వర్తతే = మందముగా నుండునో; సః = అది; వత్తుడః = వత్తుడప్రభేదము.

**తాత్పర్యము :** వృద్ధిపొందిన తాయను గ్రహించి బలాత్కారముగా న్యూనతధికతలులేక పోవుటను సంస్థాపింపగా సంగీతజ్ఞులచే నిగీతియని చెప్పబడినది. ఏది ప్రయోగమందు మందముగా నుండునో అది వత్తుడప్రభేదము.

**ఖ్యాతః పరివడిర్నామ్నా స ఏవాంతనిరన్తరః ।**
**ఏవసం తత్ సమాఖ్యాతమవసంతత్ ప్రవర్తతే ॥ 82 ॥**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది; అంతనిరంతరః = అంతము సంతతమైనదో; స ఏవ= అదియే; పరివడీతి = పరివ(వా)డియని; ఖ్యాతః = ప్రసిద్ధమైనది; యత్ = ఏది; అవసద్ ప్రవర్తతే = నిలకడకలిగి ప్రవర్తించునో; తత్ = అది; ఏవసం సమాఖ్యాత = ఏవసమని పిలువబడుచున్నది.

**తాత్పర్యము :** ఏది అంతము సంతతమైనదో అదియే పరివ(వా)డియనిప్రసిద్ధమైనది. ఏది నిలకడ కలిగి ప్రవర్తించునో అది ఏవసమని పిలువబడుచున్నది.

**తాయముట్టుండులం జ్ఞేయం గీతే వై(బై)సికివర్జితమ్ ।**
**అతిద్రుతగతిం గీతే వహిలాఖ్యా సమాదిశేత్ ॥ 83 ॥**

**ప్రతిపదార్థము :** గీతే =గీతమందు; వైసికివర్జితం = వైసికిరహితమైనదానిని; ఉట్టుండలం తాయం = ఉట్టుండులమను తాయముగా; జ్ఞేయం = తెలియదగినది; గీతే = గీతమందు; అతిద్రుతగతిం = మిక్కిలివేగమైన గమనముకలదానిని; వహిలాఖ్యా = వహిలమనుదానిగా; సమాదిశేత్ = ఉద్దేశింపవలెను.

**తాత్పర్యము :** గీతమందు వైసికిరహితమైనదానిని ఉట్టుండులమను తాయముగా తెలియదగినది. గీతమందు మిక్కిలి వేగమైన గమనముకలదానిని వహిలమను దానిగా ఉద్దేశింపవలెను.

**హేలయాఽపి భవత్యేవ గతిర్యాతి విలంబితా ।**
**శ్రోతుశ్చిత్తమతిక్రమ్య ప్రవృత్తమధికం విదుః ॥ 84 ॥**

**ప్రతిపదార్థము :** హేలయా = హేలగా (విలాసముగానైనను); గతిః = గమనము; అతివిలంబితా = మిక్కిలి విలంబమగునో; శ్రోతుః = సామాజికునియొక్క; చిత్తం =

మనస్సును; అతిక్రమ్య = అతిక్రమించి(దాటి); ప్రవృత్తం = ప్రవర్తించునో; తత్ =అది; అధికం విధుః = అధికమను నామముచే తెలియవలెను.

**తాత్పర్యము** : హేలగా (విలాసముగానైనను) గమనమమిక్కిలివిలంబమగునో సామాజికునియొక్కమనస్సును అతిక్రమించి(దాటి) ప్రవర్తించునోఅది అధికమను నామముచే తెలియవలెను.

**అసంపూర్ణస్వరం గానం తాయముక్ఖడమీరితమ్ ।**
**ఆలప్తౌ రూపకే వాస్యాదపూర్వోడ్డవణా యది ॥ 85 ॥**

**ప్రతిపదార్థము** : అసంపూర్ణస్వరం గానం = సంపూర్తికాని స్వరముకల గానము; ఉక్ఖడం (అంజ్ఞడం) = ఉక్ఖడ(అజ్ఞడ)మని; ఈరితం = చెప్పబడినది; అపిచ = మరియు; రూపకే ఆలప్తౌ వా = రూపకము లేదా ఆలాపనయందైనను; అపూర్వఉడ్డవణాస్యాత్ యది = అసాధారణమైన ప్లుతికల్గినయెడల; తదపి = అదియును; అంకుడ = అజ్ఞడముగా; ఈరితమ్ = చెప్పబడినది.

**తాత్పర్యము** : సంపూర్తికాని స్వరముకల గానము ఉక్ఖడ (అజ్ఞడ)మని చెప్పబడినది మరియు రూపకము లేదా ఆలాపనయందైనను అసాధారణమైన ప్లుతికల్గినయెడల అదియును అజ్ఞడముగా చెప్పబడినది.

**నాపాయిః సా పరిజ్ఞేయా గీతభాషావిశారదైః ।**
**యద్రైపకేఽథవాలప్తౌ వర్తతే రాగపూరణమ్ ॥ 86 ॥**

**ప్రతిపదార్థము** : యద్రూపకే ఆలప్తౌవా = రూపకమందుకాని, ఆలప్తియందుకాని; రాగపూరణం వర్తతే = రాగపూర్తి ఉన్నయెడల; సా =అది; గీతభాషా విశారదైః = సంగీతపండితులచే; నాపాయిః పరిజ్ఞేయా = నాపాయిగా తెలియదగినది.

**తాత్పర్యము** : రూపకమందుకాని, ఆలప్తియందుకాని రాగపూర్తి ఉన్నయెడల అది సంగీతపండితులచే నాపాయిగాతెలియదగినది.

**భరణం తత్ సముద్దిష్టం హరణం తద్విపర్యయః ।**
**భవేత్ సనిగి(తా?దా)ఖ్యం తన్మధురం యత్రప్రవర్తతే ॥ 87 ॥**

ప్రతిపదార్థము : తత్భరణం సముద్దిష్టం = అదిభరణముగా చెప్పబడినది; (రాగపూరణము ఆలప్తియందున్నచో); తద్విపర్యయః = దానికి విపరీతమైనదానిని;

హరణం = హరణమని అందురు; యత్ = ఏది; మధురం ప్రవర్తతే = మధురముగా నుండునో; తత్ = అది; ననగిదాఖ్యం = ననగిదమనుపేరు కలది.

తాత్పర్యము : అది భరణముగాచెప్పబడినది. (రాగపూరణము ఆలప్తియందున్నచో) దానికి విపరీతమైన దానిని హరణమని అందురు. ఏది మధురముగానుండునో అది ననగిదమను పేరుకలది.

విరీతమతో జ్ఞేయం బుధైర్నికరడాహ్వాయమ్ ।
రాగవ్యక్తిర్భజవణా సుశారీరసముద్భవా ॥ 88 ॥

**ప్రతిపదార్థము** : అతః = ఆసనగిరముకంటె; విపరీతం = ఇతరమైనది; బుధైః = పండితులచే; నికరడాహ్వాయం = నికరడమని; జ్ఞేయం = తెలియదగినది; సుశారీరసముద్భవా = మంచి దేహజనితమైన; రాగవ్యక్తిః = రాగస్పష్టత; భజవణా జ్ఞేయా = భజవణగా తెలియదగినది.

**తాత్పర్యము** : ఆసనగిరముకంటె ఇతరమైనది పండితులచే నికరడమని తెలియదగినది. మంచిదేహజనితమైన రాగస్పష్టత భజవణగా తెలియదగినది.

జితశ్వాసతయా యానం నామ్నా నిజవణం విదుః ।
సుభావః కథితస్తజ్ఞైః కోమలస్వరవర్తనమ్ ॥ 89 ॥

**ప్రతిపదార్థము** : జితశ్వానతయా = జయించబడిన ఊపిరిచేతను; యానం = ప్రయాణము(గతి, నడక); నామ్నా = పేరుచేతను; నిజవణం విదుః = నిజవణముగా తెలియుదురు; తజ్ఞైః = సంగీతజ్ఞులచే; కోమలస్వరవర్తనం = సున్నితమైన స్వరవర్తనకలది; సుభావః కథితః =సుభావయని చెప్పబడినది.

**తాత్పర్యము** : జయించబడిన ఊపిరిచేతను ప్రయాణము(గతి, నడక) పేరుచేతను నిజవణముగా తెలియుదురు. సంగీతజ్ఞులచే సున్నితమైన స్వరవర్తనకలది సుభావయని చెప్పబడినది.

హోలావః చిత్తసారః స్యాత్ రాగస్యాందోలనం భవేత్ ।
రక్తిస్వరూపరాగా స్యా ద్రాగచ్ఛాయా తదాశ్రయా ॥ 90 ॥

**ప్రతిపదార్థము** : చిత్తసార = చిత్తసారము; హోలావః స్యాత్ = హోలావమగును; తత్ర= అందు; రాగస్య ఆందోలనం భవేత్ = రాగచలనము (ఇటునటు

కదలిక)అగును; తదాశ్రయా రాగచ్ఛాయా = దానినాశ్రయించిన రాగచ్ఛాయ; రక్తిస్వరూపరాగా స్యాత్ = రాగ(రంగ) రక్తి అనబడును.

**తాత్పర్యము** : చిత్తసారము హోలావమగును. అందు రాగచలనము (ఇటునటుకదలిక) అగును. దానినాశ్రయించిన రాగచ్ఛాయ రాగ(రంగ)రక్తి అనబడును.

**సైవదేశాశ్రయత్వేన రీతిర్జ్ఞేయా విచక్షణైః ।**
**రాగేషు మిశ్రరాగస్య ఛాయాసంకరతా యది ॥ 91 ॥**
**భవేద్గీతలాభిజ్ఞైః సైవానుకరణోచ్యతే ।**

**ప్రతిపదార్థము** : సైవ = ఆ రంగరక్తియే; దేశాశ్రయత్వేన = దేశఆశ్రయముచే (కవిత); విచక్షణైః = పండితులచే; రీతిః జ్ఞేయా = రీతిప్రభేదముగాతెలియదగినది; రాగేషు = రాగములయందు; మిశ్రరాగస్య = మిశ్రరాగము(ల)యొక్క; ఛాయా సంకరతా యాది = ఛాయ కలసినచో; సైవ =అదియే; అనుకరణా ఉచ్యతే = అనుకరణగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఆ రంగరక్తియే దేశఆశ్రయముచే (కవిత) పండితులచే రీతిప్రభేదముగా తెలియదగినది. రాగములందు మిశ్రరాగము(ల)యొక్కఛాయ కలసినచో అదియే అనుకరణగా చెప్పబడుచున్నది.

**అనుతారాత్ పరశ్రుత్యోర్హానిశ్చాపశ్చ . . . (?) ॥ 92 ॥**

**ప్రతిపదార్థము** : అనుతారాత్ = అనుతారమువలన; పరశ్రుత్యోః = ఉత్తర(ఉత్తమ) శ్రుతులకు; హానిః = హానియు; చాపశ్చ = చాపమును; తత్ర = అక్కడ; భావయేత్ = ఊహించవలెను.

**తాత్పర్యము** : అనుతారమువలన ఉత్తర(ఉత్తమ)శ్రుతులకు హానియు చాపమును అక్కడ ఊహించవలెను. ఇచ్చట ఖాళిని కేవలము ఊహించి వ్రాసినవి సరిపోయినచో గ్రహించవలెను. హానిశ్చాపశ్చ తద్భవేత్ అనియును ఉండవచ్చును. అర్థముఅట్టిదే యగును.

**ధనైః సుగాఢతా తజ్ఞైః ధరణిః సముదాహృతః ।**
**ధరిమేల్లీతి విజ్ఞేయా గ్రహమోక్షౌ ధ్వనేరిహ ॥ 93 ॥**

**ప్రతిపదార్థము** : తజ్ఞైః = సంగీతజ్ఞులచే; ధనైః సుగాఢతా = ధనములచే గాఢత;

ధరణిః = ధరణిగా; సముదాహృతః = నిగదితమైనది; ఇహ = ఇక్కడ; ధ్వనేః = ధ్వనియొక్క; గ్రహమోక్షౌ =పట్టువిడుపులు; ధరిమేల్లీతి = ధరిమేల్లియని; విజ్ఞేయౌ = తెలియదగినవి.

**తాత్పర్యము** : సంగీజ్ఞులచే ధనములచే గాఢత ధరణిగా నిగదితమైనది. ఇక్కడ ధ్వనియొక్క పట్టువిడుపులు ధరిమేల్లియనితెలియదగినవి.

**ధ్వనివైచిత్ర్యముద్దిష్టం వివ(స్థాఇ?నాయీ) తినా మతః ।**
**ధ్వనేరత్యంతమాధుర్యం మిఠాయయీతి నిగద్యతే ॥ 94 ॥**

**ప్రతిపదార్థము** : ధ్వనివైచిత్ర్యం = శబ్దవిచిత్రతను; నామతః వవంథాయీతి = పేరుచేతను వివంధాయిగా; ఉద్దిష్టం = ఉద్దేశింపబడినది; ధ్వనేః = ధ్వనియొక్క; అత్యంతమాధుర్యం = మిక్కిలి మధురతను; మిఠాయీతి = మిఠాయి అని; నిగద్యతే= చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : శబ్దవిచిత్రతను పేరుచేతను ఉద్దేశింపబడినది. ధ్వనియొక్క మిక్కిలి మధురతను మిఠాయిఅని చెప్పబడుచున్నది.

**స్ఫుటనాధోజ్వలత్వం తు గీతజ్యోతిరుదాహృతమ్ ।**
**హకారానుకృతిః స్ఫారో హోంఫా వాయుధ్వనిః స్మృతా ॥ 95 ॥**

**ప్రతిపదార్థము** : స్ఫుటనాదోజ్వలత్వం = స్పష్టమైన నాదప్రకాశనము; గీతజ్యోతి = గీతజ్యోతిగా; ఉదాహృతం = చెప్పబడినది; హకారానుకృతిః = హకారమునుఅనుకరించు; స్ఫారః = విస్తారమైన; వాయుధ్వని = గాలియొక్కశబ్దము; హోంఫా స్మృతా = హోంఫా యని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : స్పష్టమైన నాదప్రకాశనము గీతజ్యోతిగా చెప్పబడినది. హకారమును అనుకరించు విస్తారమైన గాలియొక్కశబ్దము హోంఫాయని చెప్పబడుచున్నది.

**కలా సుక్ష్మీకృతః శబ్దచ్ఛవిః కోమలరుగ్మతా ।**
**కాకుశ్చ భావనా భాషా ఛాయారక్తిః సమర్థవాన్ ॥ 96 ॥**

**ప్రతిపదార్థము** : కలా సూక్ష్మీకృతః శబ్దః = సూక్ష్మముగా చేయబడిన ధ్వని కలాకలాయన బడును; కోమలరుగ్మతా = మృదుత్వముతో భాసించునది; ఛవిఃస్యాత్ = ఛవియనబడును; సమర్థవాన్ = సమర్థవంతమైనది; రక్తిః = ఆనందదాయకమైనది;

కాకుః = కాకుస్వర విశిష్టమైనది; భావనాభాషా = భావనతోకూడిన భాష; ఛాయా స్యాత్ = ఛాయయగును.

**తాత్పర్యము** : సూక్ష్మముగా చేయబడిన ధ్వని కలాకలాయనబడును. మృదుత్వముతో భాసించునది ఛవియనబడును.సమర్థవంతమైనది ఆనందదాయకమైనది కాకుస్వరవిశిష్టమైనది భావనతోకూడినభాష ఛాయయగును.

**రాగకాకుః క్షేత్రకాకుః యంత్రకాకుః స్వరోద్భవః ।**
**కాకుశ్చ దేశకాకుశ్చ కాకుః స్యాదస్య రాగజః ॥ 97 ॥**

**ప్రతిపదార్థము** : రాగకాకుః = రాగకాకువు; క్షేత్రకాకుః = క్షేత్రకాకువు; యంత్రకాకు= యంత్రకాకువు; స్వరోద్భవః కాకుః =స్వరజన్యకాకువు; దేశకాకుః = దేశకాకువు; అన్యరాగజః కాకుశ్చ = అన్యరాగజనితకాకువును;

**తాత్పర్యము** : రాగకాకువు, క్షేత్రకాకువు, యంత్రకాకువు, స్వరజన్యకాకువు, దేశకాకువు అన్యరాగజనితకాకువును;

**గీతవిద్యావిశేషజ్ఞైః షోఢా కాకురుదాహృతః ।**
**రాగస్య యా నిజచ్ఛాయా రాగకాకురితీరితా ॥ 98 ॥**

**ప్రతిపదార్థము** : గీత విద్యావిశేషజ్ఞైః = గానవిద్యామర్మములనెరిగిన పండితులచే; కాకు= కాకువు; షోఢా = ఆరువిధములుగా; ఉదాహృతః = చెప్పబడినది; రాగస్య = రాగముయొక్క; యానిజచ్ఛాయా = ఏ స్వచ్ఛాయయో; సా =అది; రాగకాకుః ఇతి = రాగకాకువనిచెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : గానవిద్యామర్మములనెరిగిన పండితులచే కాకువు ఆరువిధములుగా చెప్పబడినది. రాగముయొక్క ఏస్వచ్ఛాయయో అది రాగకాకువని చెప్పబడుచున్నది.

**సాముఖ్యా ప్రోచ్యతే భాషా గీతలక్షణవేదిభిః ।**
**స్వరస్య కస్యచిచ్ఛాయా విశేషః కశ్చిదీక్ష్యతే ॥ 99 ॥**

**ప్రతిపదార్థము** : యః = ఏది; కస్యచిత్ = ఒకానొక; స్వరస్య = స్వరముయొక్క; ఛాయావిశేషః = ఛాయావిశేషము; కశ్చిత్ ఈక్ష్యతే = ఒకటి చూడబడునో; సా = అది; ముఖ్యా భాషా = ప్రధానమైన భాషగా; గీతలక్షణవేదిభిః = సంగీతశాస్త్రజ్ఞులచే; ప్రోచ్యతే = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏది ఒకానొక స్వరముయొక్క ఛాయావిశేషము ఒకటిచూడబడునో అది ప్రధానమైన భాషగా సంగీతశాస్త్రజ్ఞులచే చెప్పబడినది.

**స్వరకాకురితి ప్రోక్తో గానలక్షణకోవిదైః ।**
**దేశాఖ్యా దేశకాకుశ్చ రాగచ్ఛాయా నిగద్యతే ॥ 100 ॥**

**ప్రతిపదార్థము** : గానలక్షణ కోవిదైః = సంగీతశాస్త్రజ్ఞులచే; సః = అది; స్వరకాకురితి ప్రోక్తః = స్వరకాకువనిచెప్పబడినది; దేశాఖ్యారాగఛాయా = దేశీరాగచ్ఛాయ; దేశకాకుః నిగాద్యతే = దేశకాకువుగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : సంగీత శాస్త్రజ్ఞులచే అది స్వరకాకువని చెప్పబడినది. దేశీరాగచ్ఛాయ దేశకాకువుగా చెప్పబడుచున్నది.

**రాగే రాగాంతరచ్ఛాయా కాకుఃస్యాదన్యరాగజః ।**
**సైవ ఉపరాగభాషాఖ్యాయతే । ఇయమేవ లోకే ఠాయేతిప్రసిద్ధా ॥ 101 ॥**

**ప్రతిపదార్థము** : రాగే = రాగమందు; రాగాంతరచ్ఛాయా = మరియొక రాగముయొక్క చాయ; అన్యరాగజః కాకుః స్యాత్ = అన్యరాగజనితకాకువు అగును; సా ఏవ ఉపరాగభాషా = అదియే ఉపరాగభాషగా; ఖ్యాయతే = పిలువబడుచున్నది; ఇయమేవ= ఇదియే; ఠాయా ఇతి = ఠాయఅని; లోకే = లోకమందు; ప్రసిద్ధా = ప్రసిద్ధమైనది

**తాత్పర్యము** : రాగమందు మరియొక రాగముయొక్క ఛాయ అన్యరాగజనితకాకువు అగును. అదియే ఉపరాగభాషగా పిలువబడుచున్నది. ఇదియే ఠాయఅని లోకమందు ప్రసిద్ధమైనది.

**కస్యచిద్గాయనస్యైషా రాగే కస్మింశ్చిదీక్ష్యతే ।**
**రక్తిస్వభావతస్తజ్ఞైః క్షేత్రకాకుర్మహీదవే ॥ 102 ॥**

**ప్రతిపదార్థము** : కస్యచిత్ గాయనస్య = ఒకానొక గాయకునియొక్క; కస్మింశ్చిత్ రాగే = ఒకానొక రాగమందు; రక్తిస్వభావతః = రక్తిస్వభావమువలన; ఏషా = ఇది; ఈక్ష్యతే = చూడబడుచున్నది; తజ్ఞైః = దానినెరిగిన పండితులచే; మహీతలే = భూలోకమందు; సః = అది; క్షేత్రకాకుః ఇతి = క్షేత్రకాకువుగా; ఉక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఒకానొక గాయకునియొక్క ఒకానొక రాగమందు రక్తిస్వభావమువలన ఇది చూడబడుచున్నది. దానినెరిగిన పండితులచే భూలోకమందు అది క్షేత్రకాకువుగా చెప్పబడినది.

**కిన్నరీవంశ వీణాసు రాగచ్ఛాయేవ దృశ్యతే ॥**
**కథ్యతే యంత్రకాకుః సా గానలక్షణకోవిదైః ।**
**స్నిగ్ధకోమలశబ్దస్య వినా యత్నేన కంపనమ్ ॥ 103 ॥**

**ప్రతిపదార్థము** : కిన్నరీవంశవీణాసు = కిన్నెర, వేణు, వీణలయందు, యా రాగచ్ఛాయా ఇవ = ఏది రాగచ్ఛాయవలె కనబడునో; సా యంత్రకాకుః కథ్యతే = అది యంత్రకాకువుగాచెప్పబడుచున్నది; స్నిగ్ధకోమలశబ్దస్య = మనోహరమైన, మృదువైన శబ్దముయొక్క; యత్నేన వినా = ప్రయత్నములేనిదే; న కంపనం = చలనముండదు.

**తాత్పర్యము** : కిన్నెర, వేణు, వీణలందు ఏది రాగచ్ఛాయవలె కనబడునో అది యంత్రకాకువుగా చెప్పబడుచున్నది. మనోహరమైన, మృదువైన శబ్దముయొక్క ప్రయత్నములేనిదే చలనముండదు.

**లఘుత్వేన సహోక్తం తన్నమనం గానకోవిదైః ।**
**రాగస్యావయవో రాగే యోన్యస్యాంశః స ఉచ్యతే ॥ 104 ॥**

**ప్రతిపదార్థము** : గానకోవిదైః = గాయకోత్తములచే; లఘుత్వేన సహ = లఘుత్వముతోకూడ; తన్నమనం = ఆనమనము (వంపు); ఉక్తం = చెప్పబడినది; సా ఏవ = అదియే; నవణిః = నవణీప్రభేదము; యః = ఏది; అన్యస్య రాగస్య అవయవః = ఇతరరాగముయొక్క అవయవము; రాగే = రాగమందు; ఉచ్యతే = అంశప్రభేదముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : గాయకోత్తములచే లఘుత్వముతోకూడ ఆనమనము (వంపు) చెప్పబడినది. అదియే నవణీప్రభేదము. ఏది ఇతరరాగముయొక్క అవయవము రాగమందు అంశప్రభేదముగా చెప్పబడుచున్నది.

**కారణాంశశ్చ కార్యాంశః సజాతీంయాంశ ఇత్యపి ।**
**తతః సదృశరాగోకసౌ విసదృశరాగజః ॥ 105 ॥**

**ప్రతిపదార్థము** : కారాణాంశః = కారణాంశము; కార్యాంశః = కార్యాంశమును; సజాతీయాంశ ఇత్యపి = సజాతీయాంశముకూడ; తతః = తరువాత; అసౌ =ఇది; సదృశరాగః = సదృశరాగము; విసదృశరాగజః = అసమానరాగజన్యము.

**తాత్పర్యము** : కారణాంశము, కార్యాంశమును, సజాతీయాంశముకూడ తరువాత ఇది సదృశరాగము అసమానరాగజన్యము.

**అంశో మధ్యస్థరాగస్య స్యాదంశాంశశ్చ సప్తధా ।**
**అంశో జనకరాగస్య కారణాంశ ఇతీరితః ॥ 106 ॥**

**ప్రతిపదార్థము :** మధ్యస్థరాగస్య అంశః = మధ్యస్థరాగముయొక్క అంశము; అంశాంశశ్చ= అంశాంశమును; సప్తధా స్యాత్ = ఏడువిధములగును; జనకరాగస్య అంశః = జనకరాగముయొక్క అంశము; కారణాంశ ఇతీరితః = కారణాంశమని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** మధ్యస్థరాగముయొక్కఅంశము, అంశాంశమును ఏడువిధములగును. జనకరాగముయొక్క అంశము కారణాంశమనిచెప్పబడుచున్నది.

**శ్రీరాగజనితే గౌడే శ్రీరాగస్యాంశకో యథా ।**
**అంశోఽన్యరాగస్య పునః కార్యాంశ ఇతి కథ్యతే ॥ 107 ॥**

**ప్రతిపదార్థము :** శ్రీరాగజనితే గౌడే = శ్రీరాగజనితగౌడమందు; యథా శ్రీరాగస్య అంశకః = శ్రీరాగముయొక్క అంశమువలె; అన్యరాగస్య అంశః = ఇతరరాగముయొక్క అంశము; కార్యాంశ ఇతి కథ్యతే = కార్యాంశమని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** శ్రీరాగజనితగౌడమందు శ్రీరాగము యొక్క అంశమువలె ఇతరరాగముయొక్క అంశము కార్యాంశమని చెప్పబడుచున్నది.

**యథా భైరవజాతాయా భైరవ్యా అంశకః పునః ।**
**భైరవే యది వర్తేత కార్యాంశ ఇతి కథ్యతే ॥ 108 ॥**

**ప్రతిపదార్థము :** యథాభైరవజాతాయాః = భైరవిజనితమైన; భైరవ్యాః అంశకః పునః= భైరవ్యాంశము; భైరవే యది వర్తేత = భైరవియందున్నయెడల; సః = అది; కార్యాంశః ఇతి కథ్యతే = కార్యాంశమని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** భైరవజనితమైన భైరవ్యాంశము భైరవియందున్నయెడల అది కార్యాంశమనిచెప్పబడుచున్నది.

**అంశేఽవాంతరభేదస్య సజాతీయాంశ ఇష్యతే ।**
**యథాకర్ణాటగౌడాంశో గౌడే మాలవనామని ॥ 109 ॥**

**ప్రతిపదార్థము :** అవాంతరభేదస్య అంశే = అవాంతరభేదముయొక్క అంశము;

సజాతీయాంశః ఇష్యతే = సజాతీయాంశమని ఇష్టమగుచున్నది; కర్ణాటగౌడాంశః = కర్ణాట గౌడాంశము; గౌడే = గౌడరాగమందు; మాలవనామని= మాలవనామమునందు;

**తాత్పర్యము** : అవాంతరభేదముయొక్కఅంశము సజాతీయాంశము ఇష్టమగుచున్నది. కర్ణాటగౌడాంశము గౌడరాగమందు మాలవనామమునందు;

**సదృశాంశో యథా శుద్ధవరాట్యామంశకః పునః ।**
**దృశ్యతే శుద్ధనాట్టాయాం సంవాదీ చ స కథ్యతే ॥ 110 ॥**

**ప్రతిపదార్థము** : యథాసదృశాంశః = సదృశాంశమువలె; శుద్ధవరాట్యాం అంశకః పునః = శుద్ధవరాటియందు అంశముమరల; దృశ్యతే యది = కనబడినచో; సః = అది; సంవాదీ కథ్యతే = సంవాదిగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : సదృశాంశమువలె శుద్ధవరాటియందు అంశము మరల కనబడినచో అది సంవాదిగా చెప్పబడుచున్నది.

**యథా విసదృశాంశశ్చ వేలావల్యాం చ గూర్జరీ ।**
**వికృతాంశో వివాదీ చ దూరాంతరిత ఏవ సః ॥ 111 ॥**

**ప్రతిపదార్థము** : యథా విసదృశాంశ్చ = విసదృశాంశమువలెను; వేలావల్యాం = వేలావలి యందు; గూర్జరీ చ = గూర్జరియు; వికృతాంశః = వికృతాంశము; వివాదీ చ = వివాదియు; సః = అది; దూరాంతరితః ఏవ = దూరాంతిరితమైనదియే.

**తాత్పర్యము** : విసదృశాంశమువలెను, వేలావలియందు గూర్జరియు వికృతాంశము వివాదియు అది దూరాంతరమైనదియే.

**రాగో నో యో విసదృశః సదృశో న చ తస్య యః ।**
**అంశో మధ్యస్థ రాగాంశో దేశాంఖ్యాంశో యథాభవేత్ ॥ 112 ॥**

**ప్రతిపదార్థము** : యః రాగః విసదృశః = ఏరాగము విసదృశమో; యః తస్య న సదృశః = యేది దానికి సదృశముకాదో; సః అంశః = ఆయంశము; మధ్యస్థరాగాంశః = మద్యస్థరాగాంశము; దేశాఖ్యః అంశః యథా భవేత్ = దేశాంశము ఎట్లగునో;

**తాత్పర్యము** : ఏరాగము విసదృశమో యేది దానికి సదృశముకాదో ఆయంశము మధ్యస్థరాగాంశము దేశాంశము ఎట్లగునో;

**వేలావల్యాం గానవిద్భిః అనువాదీ న చోచ్యతే ।**
**అంశాతరం చాంశమధ్యే కథ్యతేఽంశాంశ ఏవ సః ॥ 113 ॥**

**ప్రతిపదార్థము** : సః =అది; వేలావల్యాం = వేలావలియందు; అనువాదీ ఉచ్యతే = అనువాదిగా చెప్పబడుచున్నది; అంశమధ్యే యదంశాంతరం =అంశమధ్యమందలి ఏ అంశాంతరమో; సః = అది; అంశాంశ ఏవ ఇతి కథ్యతే = అంశాంశమనియే చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : అది వేలావలియందు అనువాదిగా చెప్పబడుచున్నది. అంశమధ్యమందలి ఏ అంశాంతరమో అది అంశాంశమనియే చెప్పబడుచున్నది.

**రాగోపరాగానల్పాంశ ఇతి న్యాసః క్వచిత్ పునః ।**
**రాగాంశయోః సమానత్వం దృశ్యతే గీతవేదిభిః ॥ 114 ॥**

**ప్రతిపదార్థము** : రాగోపరాగాన్ = రాగ -ఉపరాగములను; అల్పాంశ ఇతి న్యాసః = అల్పాంశమనియు; క్వచిత్ = ఒకానొక చోట; రాగాంశయోః = రాగాంశములకు; సమానత్వం = సమానతయు; గీతవేదిభిః దృశ్యతే = సంగీతజ్ఞులచే చూడబడినది.

తాత్పర్యము : రాగ- ఉపరాగములను అల్పాంశమనియు ఒకానొకచోట రాగాంశములకు సమానతయు సంగీతజ్ఞులచే చూడబడినది.

**రూపకే క్వచిదంశోఽపి స్ఫుటం రాగాయతే పునః ।**
**క్వచిచ్చాంశాయతే రాగో న క్వచిన్నియమస్తయోః ॥ 115 ॥**

**ప్రతిపదార్థము** : రూపకే = రూపకమందు; క్వచిత్ = ఒకచోట; అంశోఽపి = అంశముకూడ; స్ఫుటం = స్పష్టముగా; రాగాయతే = రాగమువలెనగును; క్వచిత్ = ఒకచోట; రాగః = రాగము; అంశాయతే = అంశమువలెనగును; తయోః = ఆరెండింటికి; క్వచిన్నియమః న = ఒక నియమము లేదు.

**తాత్పర్యము** : రూపకమందు ఒకచోట అంశముకూడ స్పష్టముగా రాగమువలెనగును. ఒకచోట రాగము అంశమువలెనగును. ఆరెండింటికి ఒక నియమములేదు.

**శిల్పిభిర్ఘటితా యద్వత్ తే స్థాయా ఘటనా మతా ।**
**శ్రూయమాణమభిక్రమ్య ప్రతిగ్రాహ్యో ధ్వనిర్యతః ॥ 116 ॥**

**ప్రతిపదార్థము** : శిల్పిభిః = శిల్పులచే; ఘటితా యద్వత్ = కూర్పుచేయబడిన విధముగా; తే స్థాయా = ఆస్థాయ; ఘటనా మతా = ఘటనమగుచున్నది; యతః = దేనినుండి; ధ్వనిః = ధ్వని; శ్రూయమాణం = వినబడుచునే; అభిక్రమ్య = అంతట వ్యాపించి; ప్రతిగ్రాహ్యః = ప్రతిగ్రహింపదగినదో;

**తాత్పర్యము** : శిల్పులచే కూర్పుచేయబడినవిధముగా ఆస్థాయ ఘటనమగుచున్నది. దేనినుండి ధ్వని వినబడుచునే అంతట వ్యాపించి ప్రతిగ్రహింపదగినదో;

**తదాక్రమణ మిత్యుక్తం గీతలక్షణకోవిదైః ।**
**యత్ర శబ్దస్య వలనం కుటిలం విద్యుతోయథా ॥ 117 ॥**

**ప్రతిపదార్థము** : గీతకోవిదైః = సంగీతజ్ఞులచే; యత్ర = ఎక్కడ; విద్యుతః కుటిలం యథా = మెఱుపుతీగవలె; శబ్దస్య వలనం స్యాత్ = శబ్దముయొక్క వంపు జరుగునో; తత్ = అది; ఆక్రమాణం ఇతి ఉక్తం = ఆక్రమణమని చెప్పబడినది.

**తాత్పర్యము** : సంగీతజ్ఞులచే ఎక్కడ మెరుపుతీగవలెశబ్దముయొక్క వంపుజరుగునో అది ఆక్రమణమనిచెప్పబడినది.

**వక్రతా సైవ గీతజ్ఞైః వంకాయిరితి కథ్యతే ।**
**స యత్ర మధురః శబ్దో భూయాత్ కలరవః స్మృతః ॥ 118 ॥**

**ప్రతిపదార్థము** : సా ఏవ వక్రతా = ఆవక్రత్వమే; గీతజ్ఞైః = సంగీతపండితులచే; వంకాయిరితి కథ్యతే = వంకాయిఅని చెప్పబడుచున్నది; మధురః శబ్దః = మధురమైన ధ్వని; యత్ర భూయాత్ = ఎక్కడ జరుగునో; సః కలరవః స్మృతః = అది కలరవమని చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఆ వక్రత్వమే సంగీతపండితులచే వంకాయి అని చెప్పబడుచున్నది. మధురమైన ధ్వని ఎక్కడ జరుగునో అది కలరవమని చెప్పబడుచున్నది.

**వేదధ్వనిరివాభాతి యత్ర దేవధ్వనిః స్మృతః ।**
**ఆహతస్త్రివిధః ప్రోక్తస్తిర్యగూర్ధ్వమధస్తథా ॥ 119 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; వేదధ్వనిరివ = వేదధ్వనివలె; ఆభాతి = ప్రకాశించునో; సః = అది; దేవధ్వనిః స్మృతః = దేవధ్వనియగును; ఆహతః = ఆహతము; తిర్యగూర్ధ్వం అధఃయథా = తిర్యక్, ఊర్ధ్వము; అధః = అని; త్రివిధః = ముప్పిధములైనది.

**తాత్పర్యము :** ఎక్కడ వేదధ్వనివలె ప్రకాశించునో అది దేవధ్వనియగును. ఆహతము తిర్యక్, ఊర్ధ్వము అని ముప్విధములైనది.

> **యః కంఠనాదవత్ తారాన్మంద్రం యాతోఽవతీర్ణకః ।**
> **స్థాయా స్వల్పపరీమాణా బోకలః స హి కథ్యతే ॥ 120 ॥**

**ప్రతిపదార్థము :** యః = ఏది; కంఠనాదవత్ = కంఠధ్వనివలె; తారాత్ = తారస్థాయినుండి; మంద్రం యాతః = మంద్రస్థాయికి పోవునదై; అవతీర్ణకఃస్యాత్ = దిగునో; యా = ఏది; స్వల్పపరీమాణా = స్వల్పపరిమాణముకలదియగునో; సః = అది; బోకలః కథ్యతే = బోకలమని చెప్పబడును.

**తాత్పర్యము :** ఏది కంఠధ్వనివలె తారస్థాయినుండి మంద్రస్థాయికిపోవునదై దిగునో ఏది స్వల్పపరిమాణముకలదియగునో అది బోకలమనిచెప్పబడును.

> **దుష్కరోఽపి హి యః శ్రోతుర్భాసతే సుకరో యథా ।**
> **ఉచ్యతేఽపస్వరో (హో?భా) సో గీతవిద్యావిశారదైః ॥ 121**

**ప్రతిపదార్థము :** యః = ఏ ధ్వని; దుష్కరోఽపి = కఠినమైనదైనను; శ్రోతుః = వినువానికి; యథా = ఏవిధముగ; సుకరః = తేలికయై; భాసతే = తోచునో; (అది) గీతవిద్యావిశారదైః = సంగీత శాస్త్రజ్ఞులచే; అపస్వరః = అపస్వరముగ; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ఏ ధ్వని కఠినమైనదైనను వినువానికి ఏవిధముగ తేలికయై తోచునో (అది) సంగీతశాస్త్రజ్ఞులచే అపస్వరముగ చెప్పబడుచున్నది.

> **యస్మాదనంతరం ఖా చ (?) శోభతే సోచితా స్మృతా ।**
> **బుడ్డాయిః శిథిలా గాఢా వృద్ధాలప్తిశ్చ కథ్యతే ॥ 122**

**ప్రతిపదార్థము :** యస్మాత్ = దేనికంటె; అనంతరం = పిమ్మట; ఖాచః = ఖాచము; శోభతే = ప్రకాశించునో; సా = అది; ఉచితా = ఉచితయని; స్మృతా = స్మరింపబడుచున్నది. బుడ్డాయిః = బుడ్డాయి; శిధిలా = శిధిలమైన; గాఢా = గాఢ; వృద్ధాలప్తిశ్చ = వృద్ధాలప్తియు; కద్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** దేనికంటె పిమ్మట ఖాచము ప్రకాశించునో అది 'ఉచిత' యని స్మరింపబడుచున్నది. బుడ్డాయి, శిధిల, గాఢ, వృద్ధాలప్తియు చెప్పబడుచున్నది.

> **అకంపా చార్ధకంపా చ కమ్పాఢ్యా బైసికీ త్రిధా ।**
> **రాగస్యాథః స్వరావృత్తేః యథౌచిత్యోపవేశనమ్ ॥ 123 ॥**

**ప్రతిపదార్థము** : రాగస్యాధః = రాగమునకు క్రిందుగను; స్వరావృత్తేః = స్వరావృత్తియొక్క; యథా ఔచిత్యఉపవేశనం = తగినవిధముగా ప్రవేశమునుకల్గునట్లు; వైసికీ = వైసికిప్రభేదము; అకంపా = అకంపము; అర్ధకంపా = అర్ధకంపనము; కంపాఢ్యా= అధికకంపనము అని; త్రిధా = ముప్విధములైనది.

**తాత్పర్యము** : రాగమునకు క్రిందుగను స్వరావృత్తియొక్క తగినవిధముగాప్రవేశమును కల్గునట్లు వైసికీప్రభేదము అకంపము, అర్ధకంపనము, అధికకంపము అని ముప్విధములైనది.

**ఇతిసంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే సంగీతసమయసారే**
**ద్వితీయమధికరణమ్**

---

## అథ తృతీయమధికరణమ్ ।

**అథ ప్రబంధసముచిత బహువిధదేశీ రాగాన్ షాడవౌడవసంపూర్ణభేదేన సామనామ కథయామి తత్ర కానిచన రాగాంగాని కథ్యంతే ।**

**ప్రతిపదార్థము** : అథ = తరువాత; ప్రబంధసముచిత = ప్రబంధమునకుతగిన; బహువిధ దేశీరాగాన్ = అనేకవిధములైన దేశీరాగములను; షాడవౌడవసంపూర్ణ భేదేన = షాడవ, ఔడవ, సంపూర్ణములను ప్రభేదముచే; సామనామ కథయామి = సామ(సంగీత) నామమును చెప్పుచున్నాను; తత్ర = అందు; కానిచన రాగాంగాని = కొన్ని రాగాంగములు; కథ్యంతే = తెలుపబడుచున్నవి.

**తాత్పర్యము** : తరువాత ప్రబంధమునకు తగిన అనేకవిధమములైన దేశీరాగములను షాడవ, ఔడవ, సంపూర్ణములను ప్రభేదముచే సామ (సంగీత) నామమును చెప్పుచున్నాను. అందు కొన్ని రాగాంగములు తెలుపబడుచున్నవి.

**రాగాచ్ఛాయానుకారిత్వాత్ రాగాంగాని విదుర్బుధాః ।**
**భాషాంగాని తథైవ స్యుర్భాషాచ్ఛాయానుకార (క?తః) ॥ 1 ॥**

**ప్రతిపదార్థము** : రాగాచ్ఛాయానుకారిత్వాత్ = రాగచ్ఛాయను అనుకరించుటవలన; బుధాః = పండితులు; రాగాంగాని విదుః = రాగాంగములను తెలుపుచున్నారు; తథైవ = అట్లే; భాషాచ్ఛాయానుకారతః = భాషాఛాయను అను(క)సరించుటవలన; భాషాంగాని స్యుః = భాషాంగములగుచున్నవి.

**తాత్పర్యము** : రాగచ్ఛాయను అనుకరించుటవలన పండితులు రాగాంగములను తెలుపుచున్నారు. అట్లే బాషాచ్ఛాయను అను(క)సరించుటవలన భాషాంగములగు చున్నవి.

**అంగచ్ఛాయానుకారిత్వాదుపాంగం కథ్యతే బుధైః ।**
**తానానాం కరణం తంత్ర్యాః క్రియాభేదేన కథ్యతే ॥ 2 ॥**

**ప్రతిపదార్థము :** అంగచ్ఛాయానుకారిత్వాత్ = అంగచ్ఛాయను అనుకరించుటవలన; బుధైః = పండితులచే; ఉపాంగం కథ్యతే = ఉపాంగమని చెప్పబడుచున్నది; తానానాం కరణం = తానములయొక్క కరణము (చేయుట); తంత్ర్యాః = తంత్రియొక్క; క్రియాభేదేన = క్రియాభేదముచే; కథ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అంగచ్ఛాయను అనుకరించుటవలన పండితులచే ఉపాంగమని చెప్పబడు చున్నది.తానములయొక్క కరణము (చేయుట) తంత్రియొక్క క్రియాభేదముచే చెప్పబడుచున్నది.

**క్రియాయా యద్భవేదంగం క్రియాంగం తదుదాహృతమ్ ।**
**షడ్జర్షభౌ చ గాంధారో మధ్యమః పంచమస్తథా ॥ 3 ॥**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది; క్రియాయాః = క్రియకు; అంగంభవేత్ = అంగమగునో; తత్ = అది; క్రియాంగం ఇతి ఉదాహృతం = క్రియాంగమని చెప్పబడుచున్నది; షడ్జర్షభౌ = షడ్జరిషభములు; గాంధారః = గాంధారము; మధ్యమః = మధ్యమము; పంచమః = పంచమము.

తాత్పర్యము : ఏది క్రియకు అంగమగునో అది క్రియాంగమని చెప్పబడుచున్నది. షడ్జరిషభములు గాంధారము, మధ్యమము, పంచమము.

**ధైవతశ్చ నిషాదశ్చ స్వరాః సప్తైవ కీర్తితాః ।**

**ప్రతిపదార్థము :** ధైవతః =ధైవతము; నిషాదశ్చ = నిషాదమని; స్వరాః = స్వరములు; సప్త ఏవ = ఏడే; కీర్తితాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** ధైవతము, నిషాదమని స్వరములు ఏడే చెప్పబడినవి.

## అథ స్వరవ్యవస్థా

**ద్వౌ ద్వౌ నిషాదగాంధారౌ త్రిస్త్రిశ్చర్షభధైవతౌ ॥ 4 ॥**
**చతుశ్చతుశ్చ విజ్ఞేయాః షడ్జమధ్యమపంచమాః ।**

**ప్రతిపదార్థము :** నిషాదగాంధారౌ = నిషాదగాంధారములు; ద్వౌద్వౌ = రెండు, రెండు; రిషభధైవతౌ = రిషభధైవతములు; త్రిఃత్రిః చ = మూడు మూడును; షడ్జమధ్యమపంచమాః = షడ్జ, మధ్యమ, పంచమములు; చతుః చతుః చ = నాల్గునాల్గని; విజ్ఞేయాః = తెలియదగినవి.

**తాత్పర్యము** : నిషాద గాంధారములు రెండు, రెండు రిషభ-ధైవతములు -మూడు, మూడును షడ్జ, మధ్యమ, పంచమములు నాల్గునాల్గని తెలియదగినవి.

## అథ రాగాంగరాగాః

మధ్యమాది, శంకరాభరణ, తోడ్డి, దేశీ, హిందోలా, శుద్ధబంగాలా, ఆక్రమపంచ, ఘంటారవ, గూర్జరి సోమరాగ, మాలవశ్రీ, దీపరాగ, వరాటిఇతి = అని = ద్వాదశ రాగాంగ సంపూర్ణరాగాః = 12 రాగాంగసంపూర్ణరాగములు; గౌడీ దేశీచ పహీనౌ, ధన్నాసి దేశాఖ్యాచరిహీనే ఇతి చత్వారో రాగాంగషాడవరాగా :- గౌడీ దేశీయును పహీరములు, పంచమరహితములు, దన్నాసి దేశాఖ్యా చ = ధన్నాసి, దేశానామకములును (2) రిషభరహితములు; రహీనములు, ఇతిచత్వారః = అను నాల్గును; రాగాంగ షాడబరాగాః = రాగాంగషాడవరాగములు; భైరవశ్రీరాగౌ = భైరవి శ్రీరాగములు; రిపహీనౌ = రిషభపంచమములు లేనివి; మార్గ హిందోల గుండకీధరిహీనే = మార్గహిందోళము మరియు గండకిలు ధైవతరిషభహీనములు; ఇతి = రాగాంగౌడబరాగములుఅని; వింశతీ రాగాంగ రాగాః = ఇరవైరాగములును; రాగాంగరాగములు; (20); కైశికి వేల ఉలి; శుద్ధవరాటి,అదికామోద, నాట్టాభిరి, బృహద్దాక్షిణాత్యా, లఘ్వీదాక్షిణాత్యా పౌరాలీ భిన్నపౌరాలీ, మధుకరీ, రంగన్తి, గోరంజి, ప్రథమ మంజరి, సాలవాహిని, నట్టనారాయణ, ఉత్పలీ, వేగరంజి, తరంగిణి, ధ్వనిః నాదాంతరి ఇతి = అని, భాషాసంపూర్ణరాగాః ఏకవింశతిః = భాషాసంపూర్ణరాగములు ఇరువదియొకటి (21); కర్ణాటబంగాల, సవేరిశ్చ = కర్ణాటబంగాల, సావేరి రాగములు; పహీనౌ = పంచమములేనివి; అంధాలి, శ్రీకంఠి, ఉత్పలి, ఇతి = అను; త్రయః = మూడు రాగములు; గహీనాః = గాంధారములేనివి; గౌడీ, శుద్దా, సౌరాష్ట్రి, భమ్మాని, ఇతి చత్వారః = అను నాల్గును; గరిహీనాః = గాంధారరిషభములు లేనివి; సైంధీరాగః గహీనః = సైంధి గాంధారహీనరాగము; ఛాయారాగః గహీనః = ఛాయారాగము షడ్జరహితము; ఇత్యేకాదశ రాగాః = అనుపదకొండు రాగములు; భాషాంగషాడబాః = భాషాంగషాడబములు; నాగధ్వనిః పధహీనః = నాగధ్వనిరాగము, పంచమధైవతరహితమైనది; ఆహీరి, గరిహీనః = ఆహీరి గాంధార- ధైవత- రిషభ రిషభహీన రాగము; కాంభోజః ధరిహీనః= కాంభోజి రహితరాగము; కచ్ఛేల్లి గౌల్లీరాగములు గాంధార నిషాదరహితరాగములు; గాంధారగతిః సపహీనః = గాంధారగతిరాగము షడ్జపంచమ రహితము; లలితా, త్రావణి, సైంధవః డోంబకి, సైంధవి, కాలింది,ఖసికా, ఇతి సప్తరాగాః = అను ఏడు రాగములు; పరిహీనాః = పంచమ రిషభహీనములు; ఇతి పంచదశ రాగాః = అను15 రాగములు; భాషాంగ ఔడవా ఇతి = భాషాంగ ఔడబములనియు; సప్త చత్వారింశత్ రాగాః = 47 రాగములు; భాషాంగాః = భాషాంగములు.

**అథ ఉపాంగరాగాః -**

సైంధవవరాటి; అంతలవరాటి, అవస్థానవరాటి, ద్రావిడవరాటి, ప్రతాపవరాటి, స్వరవరాటి, తురుష్క, తోడ్డి, సౌరాష్ట్ర గూర్జరీ, దక్షిణగూర్జరీ, ద్రావిడగూర్జరి, కర్ణాటగౌడ, ద్రావిడగౌడ, ఛాయాగౌడ,లా ఉలీగౌడ, భైరవీ, సంహలకామోద, దేవాల, మహురీ, ఛాయానాట్టా ఇతి అష్టాదశ = అను18 (?) ఉపాంగసంపూర్ణరాగాః = ఉపాంగ సంపూర్ణరాగములు; మహారాష్ట్రగూర్జరి, ఖంభాతి, గురుంజి, రామక్రి ఇతి= అను; చత్వారః రాగాః = నాల్గురాగములు; రిహీనాః = రిషభరహితములు; హుంజి- హీనా= హుంజిరాగము రహితము, మల్లారి గహీనా = మల్లారి- గాంధారరహితము; భల్లాతి రిహీనః = భల్లాతి రిషభహీనరాగము; ఏతే సప్త రాగాః= ఈయేడు రాగములు; ఉపాంగ షాడబాః = ఉపాంగషాడబరాగములు; ఛాయాతోడ్డి, దేశాలగౌడ, తురుష్కగౌడ, ప్రతాపవేలా ఉలి, పూర్ణట, ఏతే పంచ రాగాః = ఈఐదు రాగములు; పరిహీనాః = పంచమ-రిషభహీనములు; మధ్వారః గనిహీనాః = మధ్వారము గాంధార-నిషాదరహితరాగము; ఏతే షట్ రాగాః = ఈఆరు (6) రాగములు; ఉపాంగ ఔడవాః =ఉపాంగ ఔడవ(బ)ములు; ఇతి ఉపాంగరాగాః ఏకత్రింశత్ = అని ఉపాంగరాగములు ముప్పదియొకటి (31).

**అథ క్రియాంగరాగాః -**

దేవకి, త్రినేత్రకి, ఏతౌ సంపూర్ణరాగౌ = ఈ రెండును సంపూర్ణరాగములు; స్వభావకీ ధైవతహీనషాడబః = స్వభావకి ధైవతరహితషాడబ రాగము; ఏతే త్రయః క్రియాంగరాగాః = ఈ మూడును క్రియాంగరాగములు; ఇతి = అను; ఏకోత్తరశత సంఖ్యాపరిగణిత రాగమధ్యే = 101గా లెక్కింప బడినరాగములలో; లోకవ్యవహారసిద్ధానాం = లోకవ్యవహారమునందు ప్రసిద్ధములైన; కేషాంచిత్ రాగాణాం = కొన్నిరాగములకు; లక్షణం వక్ష్యే = లక్షణము చెప్పుదురు.

**మధ్యమాది చ తోడ్డీచ వసంతో భైరవస్తథా ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమాది చ తోడ్డీ చ వసంతః భైరవః = మధ్యమాది, తోడ్డీ, వసంతము, భైరవము, తథా = అట్లే;

**తాత్పర్యము** : మధ్యమాది, తోడ్డీ,వసంతము, భైరవము అట్లే;

**శ్రీరాగః శుద్ధబంగాలో మాలవశ్రీస్తథైవ చ ।**
**వరాటీ గౌడధన్నాసీ గూండకీ గూర్జరీ తథా ॥ 6 ॥**

**ప్రతిపదార్థము :** శ్రీరాగః = శ్రీరాగము; శుద్ధబంగాలః = శుద్ధబంగాలము; మాలవశ్రీ= మాలవశ్రీ; వరాటీ =వరాటి; గౌడధన్నాసీ = గౌడధన్నాసిరాగములు; గూండకి = గూండకి; గూర్జరి = గూర్జరీ; తథా = అట్లే;

**తాత్పర్యము :** శ్రీరాగము, శుద్ధబంగాలము, మాలవశ్రీ, వరాటి, గౌడధన్నాసిరాగములు గూండకి గూర్జరీ అట్లే;

> **దేశాఖ్యా దేశిరిత్యేతే రాగాంగాని విదుర్బుధాః ।**
> **వేలాఉలిస్తథాంధాలీ సాయాలీ ఫలమంజరీ ॥ 7 ॥**

**ప్రతిపదార్థము :** దేశాఖ్యా = దేశరాగము; దేశిః = దేశిరాగము; ఇతి ఏతే = అనునవి; రాగాంగాని విదుః = రాగాంగములుగా తెలియుదురు; వేలా ఉలిః = వేలా ఉలి; అంధాలీ = అంధాలి; సాయలీ = సాయలి; ఫలమంజరీ = ఫలమంజరి;

**తాత్పర్యము :** దేశరాగము, దేశిరాగము, అనునవి రాగాంగములుగా తెలియుదురు. వేలాఉలి, అంధాలి, సాయలి, ఫలమంజరి;

> **(వ?ల)లితా కైశికీ నాట్టా తథా శుద్ధా వరాటికా ।**
> **శ్రీకంఠీ చేతి భాషాంగా నవ రాగాః ప్రకీర్తితాః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము :** లలితా = లలిత; కైశికీ = కైశికి; నాట్టా =నాట్ట; శుద్ధా = శుద్ధ; వరాటికా = వరాటిక; శ్రీకంఠీ చ ఇతి = శ్రీకంఠియను; నవ రాగాః = తొమ్మిది రాగములు; భాషాంగాః ప్రకీర్తితాః = భాషాంగరాగములుగా ప్రసిద్ధములు.

**తాత్పర్యము :** లలిత, కైశికి, నాట్ట, శుద్ధ, వరాటిక, శ్రీకంఠియను, తొమ్మిదిరాగములు భాషాంగరాగములుగా ప్రసిద్ధములు.

> **షడ్వరాట్యశ్చ రామక్రిఖంభాతీ మల్హారస్తథా ।**
> **చతుశ్చతుశ్చ విజ్ఞేయా గౌడగూర్జర్య ఏవ చ ॥ 9 ॥**

**ప్రతిపదార్థము :** షడ్వరాట్యః = ఆరువిధములైన వరాటియు; రామక్రిఖంభాతీ = రామక్రి- ఖంభాతీ రాగములు; మల్హారః = మల్హారము; (చతుశ్చతుశ్చ) గౌడగూర్జర్యౌ= గౌడగూర్జరీ రాగములు.

**తాత్పర్యము :** ఆరు విధములైన వరాటియు రామక్రి- ఖంభాతీరాగములు మల్హారము గౌడగూర్జరీ రాగములు.

**ఛాయానాట్టా చ మల్హారీ భలాతశ్చైవ భైరవీ ।**
**అమీ రాగా నిగద్యంత ఉపాంగా నీతికోవిదైః ॥ 10 ॥**

**ప్రతిపదార్థము :** ఛాయానాట్టా = చాయానాట్ట; మల్హారీ = మల్హారి; భలాతః = భలాతము; భైరవీ = భైరవి; అమీ రాగాః = ఈరాగములు; ఉపాంగాని ఇతి నిగద్యంతే = ఉపాంగములని చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము :** చాయానాట్ట, మల్హారి, భలాతము, భైరవి, ఈరాగములు, ఉపాంగములని చెప్పబడుచున్నవి.

**దేవకీ సా చ విజ్ఞేయా క్రియాంగమితి సమ్మతా ।**
**మధ్యమగ్రామసంభూతా మధ్యమాంశగ్రహాన్వితా ॥ 11 ॥**

**ప్రతిపదార్థము :** సా దేవకీ = ఆ దేవకీ రాగము; క్రియాంగమితి విజ్ఞేయా = క్రియాంగమని తెలియదగినది; మధ్యమా గ్రామసంభూతా = మధ్యమగ్రామజనితము; మధ్యమాంశ గ్రహాన్వితా = మధ్యమాంశగ్రహముతో కూడినదియు;

**తాత్పర్యము :** ఆదేవకీ రాగము క్రియాంగమనితెలియదగినది. మధ్యమగ్రామజనితము మధ్యమాంశగ్రహముతో కూడినదియు;

**మధ్యమాదిరితి ఖ్యాతా శృంగారే వినియుజ్యతే ।**
**ఏతామేవ ప్రయుజ్యాదౌ వైణికా వాంశికాస్తథా ॥ 12 ॥**

**ప్రతిపదార్థము :** మధ్యమాదిరితిఖ్యాతా = మధ్యమాదియని ప్రసిద్ధినొందినదై; శృంగారే వినియుజ్యతే = శృంగారరసమందు ఉపయోగింపబడుచున్నది; ఏతాం ఏవ = దీనినే; వైణికాః = వైణికులు; వాంశికాః = వేణువాదకులు; ఆదౌ ప్రయుజ్య = మొదట ప్రయోగించి;

తాత్పర్యము : మధ్యమాదియని ప్రసిద్ధినొందినదై శృంగారరసమందు ఉపయోగింపబడుచున్నది. దీనినే వైణికులు వేణువాదకులు మొదట ప్రయోగించి;

**పశ్చాదభిమతం రాగం ప్రకుర్వంతి విచక్షణాః ।**

**మధ్యమాదిః**

**అంగం షాడవరాగస్య సంపూర్ణం చ సమస్వరమ్ ॥ 13 ॥**

**ప్రతిపదార్థము :** పశ్చాత్ = తరువాత; అభిమతం రాగం = ఇష్టమైన రాగమును; ప్రకుర్వంతి = ప్రయోగింతురు. మధ్యమాదిః

**తాత్పర్యము :** తరువాత ఇష్టమైనరాగమును ప్రయోగింతురు;

**షడ్జతారా గమంద్రా చ న్యాసాంశగ్రహమధ్యమా ।**
**తోడ్డీ నామ ప్రసిద్ధోఽయం రాగో హర్షే నియుజ్యతే ॥ 14 ॥**

**ప్రతిపదార్థము :** షాడవరాగస్య అంగం = షాడవరాగాంగము; సంపూర్ణం = సంపూర్ణరాగము; సమస్వరం = సమస్వరముకలదియు; షడ్జతారా = షడ్జము తారమందుకలదియు; గమంద్రా = గాంధారము మంద్రమైనదియు; న్యాసాంశగ్రహ మధ్యమా = న్యాసాంశగ్రహమధ్యమమైనదియు అయిన; తోడ్డీ నామ = తోడ్డీయను; అయం ప్రసిద్ధఃరాగః = ప్రసిద్ధమైనరాగము; హర్షే = సంతోషమందు; నియుజ్యతే = ప్రయోగింపబడును.

**తాత్పర్యము :** షాడవరాగాంగము సంపూర్ణరాగము సమస్వరముకలదియు షడ్జము తారమందుకలదియు గాంధారము మంద్రమైనదియు న్యాసాంశగ్రహ మధ్యమమై నదియు అయిన తోడ్డీయను ప్రసిద్ధమైన రాగము సంతోషమందు ప్రయోగింపబడును.

**॥ తోడ్డీ ॥**

**మార్గహిందోలరాగాంగం హిందోలో వేడిసంజ్ఞితః ।**
**అంశన్యాసే గ్రహే షడ్జః తస్య తారే తు మధ్యమః ॥ 15 ॥**

**ప్రతిపదార్థము :** మార్గహిందోలరాగాంగం = మార్గహిందోలరాగాంగము; హిందోల= హిందోలము; వేడిసంజ్ఞితః = వేడి అను సంజ్ఞకలది (వేడిసంజ్ఞకలదగుట వలన); అంశన్యాసే గ్రహే = అంశన్యాసగ్రహమందు; షడ్జః = షడ్జము; తస్య తారే తు = దానియొక్క తారమందుమాత్రము; మధ్యమః = మధ్యమము.

**తాత్పర్యము :** మార్గహిందోలరాగాంగము హిందోలము, వేడిఅనుసంజ్ఞకలది, (వేడిసంజ్ఞకలదగుటవలన) అంశన్యాసగ్రహమందు షడ్జము, దానియొక్క తారమందు మాత్రము మధ్యమము.

**షడ్జస్వరో భవేన్మంద్రే తోడితో రిధవర్జితః ।**
**సపయోః కంపితశ్చైవ శృంగారే వినియుజ్యతే ॥ 16 ॥**

**ప్రతిపదార్థము :** మంద్రే = మంద్రమందు; షడ్జస్వరః భవేత్ = షడ్జమగును; తోడిత= తోడివలన; రిధవర్జితః = రిషభ -ధైవతములచే విడువబడినది; సపయోః = షడ్జపంచమములందు; కంపితశ్చ ఏవ = కంపితమైనదిగ; శృంగారే వినియుజ్యతే = శృంగారరసమందు ప్రయోగింపబడును.

**తాత్పర్యము** : మంద్రమందు షడ్జమగును. తోడివలన రిషభధైవతములు విడువబడినది. షడ్జపంచమములందు కంపితమగును. శృంగారరసమందు ప్రయోగింపబడును.

**అయమేవ వసంతాఖ్యః ప్రోక్తో రాగవిచక్షణైః ।**

**ప్రతిపదార్థము** : రాగవిచక్షణైః = సంగీతకోవిదులచే; అయమేవ = ఇదియే; వసంతాఖ్యః రాగః =వసంతమను రాగముగా; ప్రోక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము** : సంగీతకోవిదులచే ఇదియే వసంతమనురాగముగా చెప్పబడినది.

**॥ వసంతం ॥**

**భిన్నషడ్జసముద్భూతో మన్యసోధాంశభూషితః ॥ 17 ॥**
**సమస్వరోరాపత్యక్తః ప్రార్థనేభైరవః స్మృతః ।**

**ప్రతిపదార్థము** : భిన్నషడ్జసముద్భూతః = భిన్నషడ్జమునుండి జనించినది; మన్యాసః= మధ్యమన్యాసము; ధాంశభూషితః = ధైవతాంశ అలంకృతము; సమస్వరః = సమస్వరము; రిపత్యక్తః = రిషభపంచమవర్జితము; ప్రార్థనే =ప్రార్థనమందు; భైరవః స్మృతః = భైరవము (గా)తలవబడుచున్నది.

**తాత్పర్యము** : భిన్నషడ్జమునుండి జనించినది మధ్యమన్యాసము ధైవతాంశ అలంకృతము సమస్వరమురిషభ పంచమవర్జితము ప్రార్థనమందుభైరవము (గా) తలవబడుచున్నది.

**॥ భైరవః ॥**

**శ్రీరాగష్టక్కరాగాంగం మతారో మంద్రగస్తథా ॥ 18 ॥**

**రిపంచమవిహీనోఽయం సమశేషస్వరాశ్రయః ।**
**షడ్జన్యాసగ్రహాంశశ్చ రసే వీరే ప్రయుజ్యతే ॥ 19 ॥**

**ప్రతిపదార్థము** : శ్రీరాగష్టక్కరాగాంగం = శ్రీరాగష్టక్కరాగాంగము; మతారః = మధ్యమతారము; మంద్రగః = గాంధారమంద్రము; అయం = ఇది; రిపంచమవిహీన= రిషభపంచమరహితము; సమశేషస్వరాశ్రయః =సమశేషస్వరమునాశ్రయించునది; షడ్జన్యాసగ్రహాంశః = షడ్జన్యాసగ్రహాంశము; వీరే రసే = వీరరసమందు; ప్రయుజ్యతే= ప్రయోగింపబడుచున్నది.

**తాత్పర్యము :** శ్రీరాగష్టక్కరాగాంగము మధ్యమతారము గాంధారమంద్రము ఇది రిషభపంచమరహితము సమశేషస్వరమునాశ్రయించునది. షడ్జన్యాసగ్రహాంశము వీరరసమందు ప్రయోగింపబడుచున్నది.

॥ శ్రీరాగః ॥

**శుద్ధషాడబరాగాంగం శుద్ధబంగాలసంజ్ఞితః ।**
**(నా?న్యా) సాంశో మధ్యమేనాస్య ప్రహర్షే వినియోజనమ్ ॥ 20 ॥**

**ప్రతిపదార్థము :** శుద్ధషాడబరాగాంగం = శుద్ధషాడబరాగాంగము; శుద్ధబండాల సంజ్ఞక= శుద్ధబంగాలమను సంజ్ఞకలది; అస్య = దీనికి; మధ్యమేన న్యాసాంశః = మధ్యమన్యా సాంశము; ప్రహర్షే = సంతోషమందు; వినియోజనమ్ = ఉపయోగము.

**తాత్పర్యము :** శుద్ధషాడబరాగాంగము శుద్ధబంగాలమను సంజ్ఞకలది. దీనికి మధ్యమన్యాసాంశము. సంతోషమందు ఉపయోగము.

॥ శుద్ధబంగాలః ॥

**మాలవాదేః భవేదంగం కైశికస్య సమస్వరా ।**
**సంపూర్ణతారమంద్రస్థషడ్జస్వరవిరాజితా ॥ 21 ॥**

**ప్రతిపదార్థము :** మాలవాదేః అంగం భవేత్ = మాలవాదికి అంగమగును; కైశికస్య సమస్వరా = కైశికికి సమానస్వరముకలది; సంపూర్ణా = సంపూర్ణరాగము; తారమంద్రష డ్జస్వరవిరాజితా = తారమంద్రములందు షడ్జము ప్రకాశించునది (ఉన్నది).

**తాత్పర్యము :** మాలవాదికి అంగమగును. కైశికికిసమానస్వరముకలది. సంపూర్ణరాగము. తారమంద్రములందు షడ్జము ప్రకాశించునది (ఉన్నది).

**షడ్జాంశన్యాససంపన్నా మాలవశ్రీరియం మతా ।**
**మూర్ఛనా శుద్ధమధ్యా చేత్ సైవ హర్షపురీ మతా ॥ 22 ॥**

**శృంగారే వినియోగః స్యాదనయోస్తు ద్వయోరపి ।**

**ప్రతిపదార్థము :** షడ్జాంశన్యాససంపన్నా = షడ్జాంశన్యాసమున్నది అయిన; ఇయం = ఇది; మాలవశ్రీః మతా = మలవశ్రీగా యిష్టమైనది; మూర్ఛనా = మూర్ఛన; శుద్ధమధ్యాచేత్ = శుద్ధమధ్యమమయినచో; సైవ = అదియే; హర్షపురీ మతా =

హర్షపురి యగును; అనయోః ద్వయోరపి = ఈ రెండింటికి; శృంగారే వినయోగః స్యాత్ = వినియోగమగును.

**తాత్పర్యము** : షడ్జాంశన్యాసమున్నది అయిన ఇది మాలవశ్రీగా యిష్టమైనది. మూర్ఛన శుద్ధమధ్యమమయినచో అదియే హర్షపురియగును. ఈరెండింటికి వినియోగమగును.

**॥ మాలవశ్రీ ॥**

**విభాషా రాగరాజస్య పంచమస్య వరాటికా ॥23॥**
**ధాంశా షడ్జగ్రహన్యాసా ధతారా మంద్రమధ్యమా ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : రాగరాజస్య పంచమస్య = రాగరాజమైన పంచమమునకు; విభాషా వరాటికా = వరాటిక విభాషయైనది; దాంశా = ధైవతాంశము; షడ్జగ్రహన్యాసా = షడ్జగ్రహన్యాసము కలది; ధతారా = ధైవతతారము; మంద్రమధ్యమా = మంద్రమందు మధ్యమముకలది.

**తాత్పర్యము** : రాగరాజమైన పంచమమునకు వరాటిక విభాషయైనది. ధైవతాంశము షడ్జగ్రహన్యాసముకలది. ధైవతతారము మంద్రమందు మధ్యమముకలది.

**సమశ్లేషస్వరా పూర్ణా శృంగారే యాష్టికోదితా ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : సమశ్లేషస్వరా = సమశ్లేషస్వరయుతము; పూర్ణా = సంపూర్ణరాగము; శృంగారే = శృంగారరసమందు; యాష్టికోదితా = పెద్దలచే చెప్పబడినది; (వినియోగ మునకు).

**తాత్పర్యము** : సమశ్లేషస్వరయుతము సంపూర్ణరాగము. శృంగారరసమందు పెద్దలచే చెప్పబడినది (వినియోగమునకు).

॥ వరాటీ ॥

గౌడః స్యాట్టక్కారాగాంగం నిన్యాసా శగ్రహాన్వితః ।
**వర్జితః పంచమేనైవ రసే వీరే నియుజ్యతే ॥ 25 ॥**

**రాగే రంగనిషాదిన్యా వదంతి న తు మే మతమ్ ।**

**ప్రతిపదార్థము** : గౌడః = గౌడము; టక్కారాగాంగం = టక్కారాగాంగము; స్యాత్ = అగును; నిన్యాసాంశగ్రహాన్వితః = నిషాదన్యాసాంశగ్రహసమన్వితము; పంచమేనైవవర్జితః

= పంచమస్వరత్యక్తము; వీరే రసే నియుజ్యతే =వీరరసమందు ప్రయోగించ బడునది; రంగనిషాదిన్యా రాగే వదంతి = రంగనిషాదిని (అగుటచే) రాగమందు (ప్రయోగము) చెప్పుచున్నాను; కింతు = కాని; మే మతం న = నామతముకాదు.

**తాత్పర్యము :** గౌడము, టక్కారాగాంగము అగును. నిషాదన్యాసాంశగ్రహసమన్వితము పంచమస్వరత్యక్తము వీరరసమందు ప్రయోగించబడునది. రంగనిషాదిని(అగుటచే) రాగమందు (ప్రయోగము) చెప్పుచున్నాను. కాని నామతముకాదు.

॥ గౌడ ॥

**అంగం ధన్నాసికా ప్రోక్తా శుద్ధకైశికమధ్యమే ॥ 26 ॥**

**షడ్జాంశగ్రహమన్యాసా షాడబా ఋషభోర్జితా ।**
**గాంధారమధ్యమస్వల్పా రసే వీరే నియుజ్యతే ॥ 27 ॥**

**ప్రతిపదార్థము :** ధన్నాసికా అంగంప్రోక్తా = ధన్నాసికాంగముగా చెప్పబడునది; శుద్ధకైశిక మధ్యమము కలది; షడ్జాంశగ్రహమన్యాసా = షడ్జాంశగ్రహము మన్యాసముకలది; షాడబా = షాడబరాగము; ఋషభోర్జితా = రిషభత్యక్తము; గాంధారపంచమ స్వల్పా = గాంధార పంచమములు (మంద్రమందుకలది)స్వల్పమైనది; వీరరసే నియుజ్యతే = వీరర మందు ప్రయోగింపబడుచున్నది.

**తాత్పర్యము :** ధన్నాసికాంగముగా చెప్పబడుచున్నది. శుద్ధకైశికమధ్యమము కలది. షడ్జాంశకగ్రహము మన్యాసము కలది. షాడబరాగము రిషభత్యక్తము, గాంధారపంచ మములు (మంద్రమందుకలది) స్వల్పమైనది. వీరరసమందు ప్రయోగింపబడుచున్నది.

॥ ధన్నాసీ ॥

**దేశిహిందోలరాగాంగం షడ్జాంశన్యాససంయుతః ।**
**రిధత్యక్తా గతారా చ శేషైరాందోలితా స్వరైః ॥ 28 ॥**

**పమంద్రా హాస్యశృంగారే గేయా గుండక్రుతిర్బవేత్ ।**

**ప్రతిపదార్థము :** దేశిహిందోలరాగాంగం = దేశిహిందోలరాగాంగము; షడ్జాంశన్యాస సంయుతా = షడ్జాంశన్యాసయుతము; రిధత్యక్తా = రిషభదైవతవర్జితము; గతారా = గాంధారతారము; శేషైః స్వరైః ఆందోలితా = మిగిలిన స్వరములచే కంపనముకలది;

పమంద్రా= పంచమమంద్రము; హాస్యశృంగారే గేయా = హాస్య- శృంగారరసములందు గానము చేయదగినది; గుండకృతిః భవేత్ = గుండకృతియగును.

**తాత్పర్యము :** దేశిహిందోలరాగాంగము షడ్జాంశన్యాసయుతము, రిషభధైవతవర్జితము, గాంధారతారము మిగిలిన స్వరములచే కంపనముకలది. పంచమమంద్రము హాస్య-శృంగారరసములందు గానము చేయదగినది గుండకృతియగును.

**॥ గుండకృతిః ॥**

**రిగ్రహాంశా చ మన్యాసా జాతా పంచమషాడవత్ ॥ 29 ॥**
**మమంద్రా చ నితారా చ రిధాభ్యామపి భూయసీ ।**

**గూర్జరీ తాడితా పూర్ణా శృంగారే వినియుజ్యతే ॥ 30 ॥**

**ప్రతిపదార్థము :** గ్రహాంశా = రిషభగ్రహాంశము కలది; మన్యాసా = మధ్యమన్యాసము; జాతా = అయినది; పంచమషాడవత్ = పంచమన్యాసము; మమంద్రా = మధ్యమమంద్రము; నితారా = నిసాదతారము; రిధాభ్యామపి = రిషభధైవతములకంటె; భూయసీ = అధికమైనది; గూర్జరీ తాడితా = గూర్జరిచేతను కొట్టబడినది; పూర్ణా = సంపూర్ణరాగము; శృంగారే వినియుజ్యతే = రసరాజమందువినియోగపడును.

**తాత్పర్యము :** రిషభగ్రహాంశముకలది. మధ్యమన్యాసము అయినది. పంచమన్యాసము మధ్యమమంద్రము నిషాదతారము, రిషభధైవతములకంటె అధికమైనది. గూర్జరీచేతను కొట్టబడినది. సంపూర్ణరాగము. రసరాజమందు వినియోగపడును.

**॥ గూర్జరి ॥**

**గాంధారపంచమా జ్ఞాతా ఋషభేణ వివర్జితా ।**
**గ్రహాంశన్యాససంబంధగాంధారా చ సమస్వరా ॥ 31 ॥**

**ప్రతిపదార్థము :** గాంధారపంచమాత్ జాతా = గాంధారపంచమములనుండి జనితమైనది; ఋషభేణవివర్జితా = రిషభముచే త్యక్తము; గ్రహాంశన్యాససంబంధ గాంధారః = గాంధారగ్రహాంశన్యాసముకలది; సమస్వరా = సమస్వరముకలది.

**తాత్పర్యము :** గాంధారపంచమములనుండి జనితమైనది. రిషభముచే త్యక్తము. గాంధారగ్రహాంశన్యాసముకలది. సమస్వరముకలది.

**నిషాదమంద్రా గాంధారస్ఫురితేన విరాజితా ।**
**షాడబా యది రాగాంగం వంశే పూర్ణే చ దృశ్యతే ॥ 32 ॥**

**ప్రతిపదార్థము** : నిషాదమంద్రా = మంత్రమందు నిషాదముకలది; గాంధారస్ఫురితేన విరాజితే =గాంధారస్ఫురణచేతనే ప్రకాశించునది; రాగాంగం = రాగాంగము; షాడబా యది = షాడబమైనచో; పూర్ణే = పూర్ణరాగము; వంశే దృశ్యతే = వేణువునందు కనబడుచున్నది.

**తాత్పర్యము** : మంత్రమందు నిషాదముకలది, గాంధారస్ఫురణచేతనే ప్రకాశించునది, రాగాంగము షాడబమైనచో పూర్ణరాగము వేణువునందు కనబడుచున్నది.

**దేశాఖ్యః స్యాదంగరేవ(?) గుప్తస్య గమంద్రా పంచమోజ్ఞితా ।**
**ఋషభాంశగ్రహన్యాసా తథా సమనిభూయసీ ॥ 33 ॥**

**ప్రతిపదార్థము** : రేవగుప్తస్య = రేవగుప్తకు; దేశాఖ్యః అంగః స్యాత్ = దేశి(శ) అంగమగును; గమంద్రా =గాంధారమంద్రము; పంచమోజ్ఞితా = రిషభాంశగ్రహ న్యాసము; తథా =అట్లే; సమనిభూయసీ = షడ్జమధ్యమనిషాదములందు అధికము.

**తాత్పర్యము** : రేవగుప్తకు దేశి అంగమగును. గాంధారమంద్రము రిషభాంశగ్రహ న్యాసము. అట్లే షడ్జమధ్యమనిషాదములందు అధికము.

**దేశీ నామ ప్రయోక్తవ్యా రాగోఽయం కరుణే రసే ।**

**ప్రతిపదార్థము** : దేశీ నామ = దేశీ రాగము; కరుణే రసే = కరుణరసమందు; ప్రయోక్తవ్యా = ఉపయోగింపదగినది.

**తాత్పర్యము** : దేశీరాగము కరుణరసమందు ఉపయోగింపదగినది.

**కకుభప్రభవా భాషా యా ప్రోక్తా భోగవర్ధనీ ॥ 34 ॥**
**వేలాఉలీ తదంగం స్యాత్ పరిపూర్ణసమస్వరా ।**

**ప్రతిపదార్థము** : యా = ఏది; భోగవర్ధనీ = భోగములనువృద్ధిపొందించు; భాషా = భాషయో; సా = అది; కకుభప్రభవా = దిగ్జనితము; వేలా ఉలీ = వేలా ఉలిరాగము; తదంగం స్యాత్ = దాని అంగము అగును; పరిపూర్ణసమస్వరా = పరిపూర్ణరాగమును, సమస్వరముకలదియును;

**తాత్పర్యము :** ఏది భోగములను వృద్ధి పొందించు భాషయో అది దిగ్ధనితము. వేలా ఉలిరాగముదానిఅంగముఅగును. పరిపూర్ణరాగమును, సమస్వరముకలదియును;

> **ధైవతాంశగ్రహన్యాసా ధతారా మంద్రమధ్యమా ॥ 35 ॥**
> **షడ్జేన కంపితా సేయం విప్రలంభే నియుజ్యతే ।**

**ప్రతిపదార్థము :** ధైవతాంశగ్రహన్యాసా = ధైవతాంశగ్రహన్యాసము; ధతారా = ధైవతతారము; మంద్రమధ్యమా = మంద్రమధ్యమము; షడ్జేన = షడ్జముచేత; కంపితా= కంపనముగల; సా ఇయం = ఆ యీ రాగము; విప్రలంభే నియుజ్యతే = విప్రలంభ శృంగార రసమందు ప్రయోగింప బడుచున్నది.

**తాత్పర్యము :** ధైవతాంశగ్రహన్యాసము ధైవతతారము, మంద్రమధ్యమము, షడ్జముచేత కంపనముగల ఆ రాగము విప్రలంభశృంగారరసమందు ప్రయోగింపబడుచున్నది.

### ॥ వేలా ఉలీ ॥

> **విభాషాంధాలికా ప్రోక్తా జాతా మాలవపంచమాత్ ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** విభాషా = విభాషచే; అంధాలికా ప్రోక్తా = అందాలిగా చెప్పబడుచున్నది; మాలవపంచమాత్ = మాలవపంచమమునుండి; జాతా = జన్మించినది

**తాత్పర్యము :** విభాషచే ఆందాలిగా చెప్పబడుచున్నది. మాలవపంచమమునుండి జన్మించినది.

> **బృహతీ దాక్షిణాత్యోత్థా గహీనా మధ్యమాంశకా ।**
> **షాడవా షడ్జమంద్రా చ నిధాల్పా మంద్రమధ్యభాక్ ॥ 37 ॥**
>
> **పంచమన్యాససంయుక్తా రసే వీరే నియుజ్యతే ।**

**ప్రతిపదార్థము :** బృహతీ = (అధికమైనది) బృహతి; మధ్యమాంశకా = మధ్యమాంశకము; షాడవా = షాడవము; షడ్జమంద్రా = షడ్జమంద్రము; నిధాల్పా = నిషాదధైవతాల్పకము; మంద్రమధ్యభాక్ = మంద్రమధ్యమము విలసిల్లునది; పంచమన్యాససంయుక్తా = పంచమ న్యాసముకల్గియున్నది; వీరరసే = వీరరసమందు; నియుజ్యతే = ఉపయోగింపబడుచున్నది.

**తాత్పర్యము :** (అధికమైనది)బృహతి మధ్యమాంశకము. షాడవము షడ్జమంద్రము.

నిషాదధైవతాల్పకము మంద్రమధ్యమము విలసిల్లునది. పంచమన్యాసము కల్గియున్నది. వీరరసమందు ఉపయోగింపబడుచున్నది.

॥ అంధాలీ ॥

**కకుభోత్థా రగత్యంగం ధాంతా మధ్యగ్రాహాంశకా ॥ 38 ॥**

**గతారా స్వల్పషడ్జా చ పంచమేన వివర్జితా ।**
**పమంద్రా సాయరీ జ్ఞేయా కర్తవ్యా కరుణే రసే ॥ 39 ॥**

**ప్రతిపదార్థము :** కకుభోత్థా = దిగ్జనితమును; రగత్యంగం = రగతికి అంగము; ధాంతా = ధైవతాంతము; మధ్యగ్రహాంశకా = మధ్యగ్రహాంశము; గతారా = గాంధారతారము; స్వల్పషడ్జా = షడ్జఅల్పము; పంచమేన వివర్జితా = పంచమత్యక్తము; పమంద్రా = పంచమమంద్రమును; సాయరీ జ్ఞేయా = సాయరిగా తెలియదగినది; కరుణే రసే కర్తవ్యా = కరుణరసమందు ప్రయోగార్హము.

**తాత్పర్యము :** దిగ్జనితమును రగతికి అంగము, ధైవతాంతము,మధ్యగ్రహాంశము, గాంధారతారము, షడ్జఅల్పము, పంచమత్యక్తము, పంచమమంద్రమును, సాయరిగాతెలియదగినది. కరుణరసమందు ప్రయోగార్హము.

॥ సాయరీ ॥

**గమంద్రా ధరితారా చ గ్రహాంశస్య సపంచమా ।**
**గమాఢ్యా చాల్పశేషా చ ప్రోక్తా ప్రథమమంజరీ ॥ 40 ॥**

**పంచమాదిర్యతస్తస్మాదుత్సవే వినియుజ్యతే ।**

**ప్రతిపదార్థము :** గమంద్రా = గాంధారమంద్రము; ధరితారా = ధైవతరిషభతారము; సపంచమాగ్రహాంశస్య = పంచమగ్రహాంశము; యతః పంచమాదిః = పంచమాది (వలన); ఉత్సవే వినియుజ్యతే = ఉత్సవమందు ప్రయోగింపబడుచున్నది; గమాఢ్యా= గాంధారసంవర్ధకము; అల్పశేషా =అల్పశేషమును; ప్రథమమంజరీ ప్రోక్తా = ప్రథమ మంజరిగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** గాంధారమంద్రము, ధైవతరిషభతారము, పంచమగ్రహాంశము, పంచమాది(వలన) ఉత్సవమందు ప్రయోగింపబడుచున్నది. గాంధారసంవర్ధకము అల్పశేషమును ప్రథమమంజరిగా చెప్పబడుచున్నది.

॥ ఫలమంజరీ ॥

**(ల?) గలితాటక్కరాగా తు తదంగం లలితా మతా ॥ 41 ॥**
**షడ్జాంశన్యాససంయుక్తా జ్ఞేయా వీరే రిపోజ్ఝితా ॥**

**ప్రతిపదార్థము :** టక్కరాగాత్ గలితా = టక్కరాగమునుండి చ్యుతమగుటవలన; లలితా తదంగం మతా = లలితటక్కరాగాంగముగా ఒప్పినది; షడ్జాంశసంయుక్తా = షడ్జాంశన్యాసయుతము; రిపోజ్ఝితా = రిషభపంచమవర్జితము; వీరే జ్ఞేయా = వీరరసమందు ప్రయోక్తవ్యము.

**తాత్పర్యము :** టక్కరాగమునుండి చ్యుతమగుటవలన లలితటక్కరాగాంగముగా ఒప్పినది. షడ్జాంశన్యాసయుతము రిషభపంచమవర్జితము వీరరసమందుప్రయోక్తవ్యము.

॥ లలితా ॥

**మగ్రహన్యాససంయుక్తా సాంశా తారేణ వర్జితా ॥ 42 ॥**

**సమస్వరా రిపత్యక్తా సమంద్రా స్వసికాభవేత్ ।**
**గాంధారాదిర్యతస్తస్మాత్ సంకీర్ణా కరుణే భవేత్ ॥ 43 ॥**

**ప్రతిపదార్థము :** మగ్రహన్యాససంయుక్తా = మగ్రహన్యాసయుతము; సాంశా = షడ్జాంశము; తారేణ వర్జితా = తారములేనిది; సమస్వరా = సమస్వరయుతము; రిపత్యక్తా = రిషభపంచమవర్జితము; సమంద్రా = షడ్జమంద్రము; స్వసికా భవేత్ = స్వసికయగును; యతః గాంధారాదిః = గాంధారాది యగుటవలన; సంకీర్ణా = సంకీర్ణమైనదియు; కరుణే భవేత్ = కరుణరసమందు ప్రయోగార్హము.

**తాత్పర్యము :** మగ్ర హన్యాసయుతము, షడ్జాంశము, తారములేనిది, సమస్వరయుతము. రిషభపంచమవర్జితము. షడ్జమంద్రము స్వసికయగును. గాంధారాదియగుటవలన సంకీర్ణమైనదియు కరుణప్రయోగార్హము.

॥ కైశికీ ॥

**షడ్జాంశా చ గ్రహన్యాసా సంపూర్ణా చ సమస్వరా ।**
**తథా తారా చ మంద్రా చ యావద్గాంధారపంచమౌ ॥ 44 ॥**

**భాషాయాః (?) పింజరీ తస్యా అంగం నాట్యాఽభిధీయతే ।**

**ప్రతిపదార్థము** : గ్రహన్యాసాషడ్జాంశా = షడ్జాంశగ్రహన్యాసము; సంపూర్ణా = సంపూర్ణరాగము; సమస్వరా = సమస్వరము; గాంధారపంచమౌ = గాంధార పంచమములు; తారా మంద్రా చ = తారమంద్రములు; (బహుశ క్రమముగా) పింజరీ స్యాత్ = పింజరియగును; తస్యాః = దానికి; భాషాయాః అంగం నాట్టా అభిధీయతే = భాషాంగమునాట్టరాగమగును.

**తాత్పర్యము** : షడ్జాంశగ్రహన్యాసము సంపూర్ణరాగము సమస్వరము, గాంధారపంచమములు, తారమంద్రములు, (బహుశ క్రమముగా) పింజరియగును. దానికి భాషాంగము నాట్టరాగమగును.

**॥ నాట్టా ॥**

**సౌవీరకస్య సౌవీరముఖ్యభాషా చ యా స్మృతా ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : పింజరిస్యాత్ = పింజరియగును; తస్యాః = దానికి; భాషాయాః అంగం నాట్టా అభిధీయతే = భాషాంగము నాట్టరాగమగును; యా = ఏది; సౌవీరకస్య= సౌవీరముయొక్క; సౌవీరిముఖ్యభాషా = సౌవీరము ప్రధాన భాషయో;

**తాత్పర్యము** : పింజరియగును. దానికి భాషాంగము నాట్టరాగమగును. ఏది సౌవీరముయొక్క, సౌవవీరము ప్రధాన భాష;

**తదంగం మోదకీ నామ్నా సైవ శుద్ధా వరాటికా ।**
**అస్యా న్యాసాంశయోః షడ్జప్రచురా ధనిపాస్తథా ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : తదంగం = దాని అంగము; మోదకీ నామ్నా = మోదకీ యనుపేరు కలది; సైవ = అదియే; శుద్ధా వరాటికా = శుద్ధవరాటి; అస్యాః న్యాసాంశయోః = దీని న్యాసాంశములందు; షడ్జప్రచురా = షడ్జప్రాచుర్యము కలది; తథా = అట్లే; ధనిపాః = ధైవత, నిషాద, పంచమములు;

**తాత్పర్యము** : దాని అంగము మోదకి యనుపేరుకలది. అదియే శుద్ధవరాటి. దీని న్యాసాంశములందు షడ్జప్రాచుర్యము కలది. అట్లే ధైవత, నిషాద, పంచమములు;

**సంపూర్ణోఽయం రసే శాంతే ప్రయోగోఽస్యాః ప్రదర్శ్యతే ।**
**శ్రీకంఠీ భిన్నషడ్జోత్థా గహీనా షాడబా భవేత్ ॥ 47 ॥**

**ప్రతిపదార్థము :** అయం సంపూర్ణః = ఇది సంపూర్ణరాగము; అస్యాః ప్రయోగః = దీని ప్రయోగము, శాంతే రసే = శాంతరసమందు; ప్రదర్శ్యతే =కనబడుచున్నది; శ్రీకంఠీ= శ్రీకంఠి; భిన్నషడ్జోత్థా = భిన్నషడ్జోద్భవము; గహీనా = గాంధార రహితము; షాడబా భవేత్ = షాడబరాగము.

**తాత్పర్యము :** ఇది సంపూర్ణరాగము. దీని ప్రయోగము శాంతరసమందు కనబడుచున్నది. శ్రీకంఠి భిన్నషడ్జోద్భవము. గాంధారరహితము. షాడబరాగము.

**(యాం?ధాం) శన్యాసగ్రహోపేతా తథా ధైవతభూయసీ ।**
**గుర్వాజ్ఞాకరణే యస్యా వినియోగః ప్రకీర్తితః ॥ 48 ॥**

**ప్రతిపదార్థము :** ధాంశన్యాసగ్రహోపేతా = ధైవతన్యాసాంశముతో కూడినది; తథా = అట్లే; ధైవతభూయసీ = ధైవతాధిక్యము కలది; గుర్వాజ్ఞాకరణే = గుర్వాజ్ఞకరణమందు; వినియోగః = ఉపయోగము; ప్రకీర్త్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ధైవతన్యాసాంశముతో కూడినది. అట్లే ధైవతాధిక్యము కలది. గుర్వాజ్ఞకరణమందు ఉపయోగము చెప్పబడుచున్నది.

**॥ శ్రీకంఠి ॥ భాషాంగాని ॥**

**భాషా స్యాత్ సైంధవీ నామ జాతా మాలవకైశికాత్ ।**
**తదంగం గాయకైర్జ్ఞేయా సైంధవీయం వరాటికా ॥ 49 ॥**

**ప్రతిపదార్థము :** సైంధవీ నామ భాషా స్యాత్ = సైంధవియను భాషయున్నది; సా మాలవకైశికాత్ జాతా = అది మాలవకైశికనుండి పుట్టినది; సైంధవీయం వరాటికా = సైంధవీయవరాటిక; తదంగం = దాని అంగముగా; గాయకైః = గాయకులచే; జ్ఞేయా= తెలియదగినది.

**తాత్పర్యము :** సైంధవియను భాషయున్నది. అది మాలవకైశికనుండి పుట్టినది. సైంధవీయవరాటిక దాని అంగముగా గాయకులచే తెలియదగినది.

**షడ్జాంశన్యాససంయుక్తా మమంద్రా సధకంపితా ।**
**గాంధారబహులా తజ్జ్ఞైః శృంగారే వినియుజ్యతే ॥ 50 ॥**

**ప్రతిపదార్థము :** షడ్జాంశన్యాస సంయుక్తా = షడ్జాంశన్యాసయుతము; మమంద్రా =

మధ్యమమంద్రము; సధకంపితా = షడ్జధైవత కంపితము; గాంధారబహులా = గాంధార బాహుళ్యయుతము; తజ్జ్ఞైః = సంగీతజ్ఞులచే; శృంగారే వినియుజ్యతే = శృంగార రసమందు ప్రయోగింపబడునది.

**తాత్పర్యము** : షడ్జాంశన్యాసయుతము. మధ్యమమంద్రము, షడ్జధైవతకంపితము, గాందారబాహుళ్యయుతము. సంగీతజ్ఞులచే శృంగారరసమందు ప్రయోగింపబడునది.

**నిషాదబహులా పూర్ణా షడ్జమంద్రా చ తాడితా ।**
**పూర్వోక్తవినియోగా చ్చ స్యాత్ కుంతలవరాటికా ॥ 51 ॥**

**ప్రతిపదార్థము** : నిషాదబహులా = నిషాదబాహుల్యయుతము; పూర్ణా = సంపూర్ణరాగము; షడ్జమంద్రా = షడ్జమంద్రము; తాడితా = తాడితము; కుంతలవరాటికా = కుంతల వరాటిక; పూర్వోక్తవినియోగా స్యాత్ = శృంగారమందు వినియోగము కలదగును.

**తాత్పర్యము** : నిషాదబాహుల్యయుతము. సంపూర్ణరాగము. షడ్జమంద్రము. తాడితము. కుంతలవరాటిక. శృంగారమందు వినియోగము కలదగును.

**॥ కుంతలవరాటీ ॥**

**మనిధేషు భవేన్మంద్రా షడ్జాంశన్యాసరాజితా ।**
**పరిపూర్ణస్వరైః సర్వైరవస్థానవరాటికా ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : మనిధేషు మంద్రా భవేత్ = మధ్యమ- నిషాద- ధైవతములందు మంద్రముకలది; షడ్జాంశన్యాసరాజితా = షడ్జాంశన్యాస ప్రకాశితము; సర్వైః పరిపూర్ణస్వరైః= సమస్త పరిపూర్ణస్వరములచేత; అవస్థానవరాటికా శోభతే = అవస్థానవరాటిక ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము** : మధ్యమనిషాద ధైవతములందు మంద్రముకలది, షడ్జాంశన్యాస ప్రకాశితము సమస్త పరిపూర్ణస్వరములచేత అవస్థానవరాటిక ప్రకాశించుచున్నది.

**॥ అవస్థానవరాటీ ॥**

**కంపితా పంచమే షడ్జే ధమంద్రా భూరిపంచమా ।**
**షడ్జాంశన్యాససంపన్నా స్యాత్ ప్రతాపవరాటికా ॥ 53 ॥**

**ప్రతిపదార్థము :** పంచమే షడ్జే = పంచమ- షడ్జములందు; కంపితా = కంపముకలదియు; ధమంద్రా = ధైవతమంద్రము; భూరిపంచమా = పంచమాధికము; షడ్జాంశన్యాససంపన్నా = షడ్జాంశన్యాసయుతము (అయినది); ప్రతాపవరాటికా స్యాత్ = ప్రతాపవరాటికా యగును.

**తాత్పర్యము :** పంచమ- షడ్జములందు కంపముకలదియు, ధైవతమంద్రము, పంచమాధికము షడ్జాంశన్యాసయుతము (అయినది) ప్రతాపవరాటిక యగును.

**మంద్రధైవతసంయుక్తా పంచమాహతకంపితా ।**
**షడ్జాంశన్యాససంపన్నా హతస్వరవరాటికా ॥ 54 ॥**

**ప్రతిపదార్థము :** మంద్ర ధైవతసంయుక్తా = మంద్రధైవతము కలది; పంచమాహత కంపితా = పంచమముచే ఆహతమగుట వలన కంపనము కలదియు; షడ్జాంశన్యాస సంపన్నా = షడ్జాంశన్యాసయుతము; హతస్వరవరాటికా = హతస్వరవరాటిక యగును.

**తాత్పర్యము :** మంద్రధైవతముకలది. పంచమముచే ఆహతమగుట వలన కంపనము కలదియు షడ్జాంశన్యాసయుతము హతస్వరవరాటికయగును.

**॥ హతస్వరవరాటీ ॥**

**ఋషభే స్ఫురితా భూరి నిమంద్రేణ విరాజితా ।**
**షడ్జాంశన్యాససంయుక్తా ద్రావిడీయం వరాటికా ॥ 55 ॥**

**ప్రతిపదార్థము :** ఋషభే స్ఫురితా = రిషభమందు ఆధిక్యము స్ఫురించునట్టియు; నిమంద్రేణ విరాజితా = నిషాదమంద్రమై ప్రకాశించునదియు; షడ్జాంశన్యాససంయుక్తా= షడ్జాంశన్యాసయుతము; ద్రావిడీయం వరాటికా స్యాత్ = ద్రావిడవరాటి యగును.

**తాత్పర్యము :** రిషభమందు ఆధిక్యము స్ఫురించునట్టియు నిషాదమంద్రమై ప్రకాశించు నదియు షడ్జాంశన్యాసయుతము ద్రావిడవరాటి యగును.

**టక్కారాగోద్భవా భాషా యోక్తా కోలాహలాఖ్యయా ।**
**తదుపాంగం రామకృతిః షడ్జన్యాసోపశోభితా ॥ 56 ॥**

**ప్రతిపదార్థము :** టక్కారాగోద్భవా = టక్కారాగజనితము; కోలాహలాఖ్యయా భాషాయా ఉక్తా = (కోలహలమను) భాషచే చెప్పబడినది; తదుపాంగం రామకృతిః = రామక్రి దానికి ఉపాంగము; షడ్జన్యిసోపశోభితా = షడ్జన్యాసముచే ప్రకాశించునది;

**తాత్పర్యము** : టక్కారాగజనితము (కోలహలమను) భాషచే చెప్పబడినది. రామక్రి దానికి ఉపాంగము. షడ్జన్యాసముచే ప్రకాశించునది.

॥ రామక్రి ॥

**మధ్యమాంశా పహీనా చ రసే వీరే నియుజ్యతే ।**
**షాడబా కకుభోద్భూతా ధాంశా సపవివర్జితా ॥ 57 ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమాంశా = మధ్యమాంశముకలది; పహీనా = పంచమ రహితము; వీరరసే నియుజ్యతే = వీరరసమందు ప్రయోగార్హము; షాడబా = షాడవరాగము; కకుభోద్భూతా = దిగ్జనితము; ధాంశా = ధైవతాంశము; సపవివర్జితా = షడ్జపంచమ వర్జితము.

**తాత్పర్యము** : మధ్యమాంశముకలది. పంచమరహితము. వీరరసమందు ప్రయోగార్హము. షాడవరాగము. దిగ్జనితము. ధైవతాంశము. షడ్జపంచమవర్జితము.

**మధ్యమేన నిషాదేన నిహితాందోలనక్రమా ।**
**శృంగారే విప్రలంభాఖ్యే గేయా కంభాతికా మతా ॥ 58 ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమేన నిషాదేన నిహితాందోలనక్రమా = మధ్యమముచేతను, నిషాదముచేతను క్రమముగా కంపనము కలది; విప్రలంబాఖ్యే శృంగారే = విప్రలంభ శృంగారమందు ; గేయా = గానముచేయదగినది; కంభాతికా మతా = కంబాతికగా సమ్మతము.

**తాత్పర్యము** : మధ్యమముచేతను, నిషాదముచేతను క్రమముగా కంపనముకలది. విప్రలంభ శృంగారమందు గానముచేయదగినది. కంబాతికగా సమ్మతము.

**స్వస్థానే తాడితః పూర్ణః షడ్జాంశన్యాససంయుతః ।**
**ప్రోక్తః కర్ణాటగౌడోఽయం ప్రతాపపృథివీభుజా ॥ 59 ॥**

**ప్రతిపదార్థము** : స్వస్థానే తాడితః = స్వీయస్థానమందు తాడితమైనది; పూర్ణః = సంపూర్ణమైనది; షడ్జాంశన్యాససంయుత = షడ్జాంశన్యాసయుతము (అని); అయం కర్ణాటగౌడః = ఈకర్ణాట గౌడరాగము; ప్రతాప పృథివీ భుజా = ప్రతాపరాజుచే; ప్రోక్త = చెప్పబడినది.

**తాత్పర్యము** : స్వీయస్థానమందు తాడితమైనది. సంపూర్ణమైనది. షడ్జాంశన్యాసయుతము (అని) ఈకర్ణాట గౌడరాగము ప్రతాపరాజుచే చెప్పబడినది.

**॥ కర్ణాటగౌడః ॥**

**షడ్జేనాందోలితః సాంగః పంచమర్షభవర్జితః ।**
**దేశాలాఖ్యగౌడో యమౌడబః పరికీర్తితః ॥ 60 ॥**

**ప్రతిపదార్థము** : షడ్జేనాందోలితః = షడ్జకంపనముగలది; సాంగః = షడ్జాంగమైనది; పంచమర్షభ వర్జితః = పంచమరిషభత్యక్తము; అయం దేశాలాఖ్యః గౌడః = ఇది దేశాల గౌడ; ఔడబః పరికీర్తితః = ఔడవరాగముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : షడ్జకంపనముగలది, షడ్జాంగమైనది. పంచమ- రిషభత్యక్తము. ఇది దేశాల గౌడ ఔడవరాగముగా చెప్పబడినది.

**॥ దేశాలగౌడః ॥**

**స్ఫురితః పంచమే షడ్జే గాంధారే తిరిపుస్తథా ।**
**నిన్యాసాంశసమాయుక్తో ద్రావిడో గౌడ ఉచ్యతే ॥ 61 ॥**

**ప్రతిపదార్థము** : పంచమే షడ్జే గాంధారే స్ఫురితః = పంచమ- షడ్జ- గాంధారములందు స్ఫురించునది (శోభించునది); తథా = అట్లే; తిరుపుః = పంచమమందు వక్రించునది (కంపనము) కలది; నిన్యాసాంశ సమాయుక్తః = నిషాదాంశ యుతము; ద్రావిడః గౌడః ఉచ్యతే = ద్రావిడగౌడముగా ఉక్తమైనది.

**తాత్పర్యము** : పంచమ, షడ్జాంశగాంధారములందు స్ఫురించునది (శోభించునది) అట్లే పంచమమందు వక్రించునది (కంపనము) కలది. నిషాదాంశ ద్రావిడ గౌడముగా ఉక్తమైనది.

**॥ ద్రావిడగౌడః ॥**

**రిపహీనో నిషాదాంశో గాంధారబహులస్తథా ।**
**మంద్రేణ తాడితః ప్రోక్తస్తౌరుష్కో గౌడ ఈరితః ॥ 62 ॥**

**ప్రతిపదార్థము** : రిపహీనః = రిషభ పంచమవర్జితము; నిషాదాంశః = నిషాదాంశము; తథా = అట్లే; గాంధారబహులః = గాంధారాధిక్యము కలది; మంద్రేణ తాడితః =

మంద్రతాడితము అయినది; తౌరుష్కః గౌడః ఈరితః = తురుష్కగౌడగా చెప్పబడినది.

**తాత్పర్యము :** రిషభ పంచమవర్జితము. నిషాదాంశము. అట్లే గాంధారాధిక్యము కలది. మంద్రతాడితము అయినది తురుష్కగౌడగా చెప్పబడినది.

**॥ తురుష్కగౌడః ॥**

**గూర్జరీ స్యాన్మహారాష్ట్రీ రిన్యాసాంశా చ తాడితా ।**
**నిమంద్రా చ పహీనే యముత్సవే వినియుజ్యతే ॥ 63 ॥**

**ప్రతిపదార్థము :** గూర్జరీ = గూర్జరి; మహారాష్ట్రీ స్యాత్ = మహారాష్ట్రదేశోద్భని (మహారాష్ట్రమునకు చెందినది); రిన్యాసాంశా = రిషభన్యాసాంశము; తాడితా = తాడితము; నిమంద్రా = నిషాదమంద్రము; పహీనా = పంచమవర్జితము; ఇయం ఉత్సవే వినియుజ్యతే = ఇది ఉత్సవమందు ప్రయోగార్హము.

**తాత్పర్యము :** గూర్జరి మహారాష్ట్రదేశోద్భని (మహారాష్ట్రమునకు చెందినది) రిషభన్యాసాంశము. తాడితము నిషాదమంద్రము. పంచమవర్జితము. ఇది ఉత్సవమందు ప్రయోగార్హము.

**॥ మహారాష్ట్రగూర్జరీ ॥**

**ఋషభేకంపితా + + సౌరాష్ట్రీ గూర్జరీ భవేత్ ।**

**॥సౌరాష్ట్రగూర్జరీ॥**

**మధ్యమే కంపితా పూర్ణా స్వరేష్వన్యేషు తాడితా ॥ 64 ॥**

**ప్రతిపదార్థము :** ఋషభే కంపితా = రిషభమందు కంపనముకలది; సౌరాష్ట్రీ గూర్జరీ భవేత్ = సౌరాష్ట్రగూర్జరి యగును; మధ్యమే కంపితా = మధ్యమమందు గమకముకలది; అన్యేషు స్వరేషు తాడితా = మిగిలినస్వరములందు తాడనముకలది.

**తాత్పర్యము :** రిషభమందు కంపనముకలది. సౌరాష్ట్రగూర్జరి యగును. మధ్యమమందు గమకముకలది. మిగిలిన స్వరములందు తాడనముకలది.

**సురీతి గూర్జరీ గానే రమ్యా దక్షిణదేశజా ।**

**॥ దక్షిణగూర్జరీ ॥**

**ఋషభాన్మంద్రతారాభ్యాం స్ఫురితా ద్రావిడీ భవేత్ ॥ 65 ॥**

**ప్రతిపదార్థము :** సురీతి = చక్కని రీతి (పద్ధతి)గలది; దక్షిణదేశ గూర్జరీ = దక్షిణదేశమందు జన్యమైన గూర్జరి (దక్షిణగూర్జరి); గానే రమ్యా = గానమునందు మనోహరమైనది; ఋషభాత్ = రిషభమునుండి; మంద్రతారాభ్యాం = మంద్రతారములనుండి; స్ఫురితా = స్ఫురించునది; ద్రావిడీ = ద్రావిడ దేశమునందు పుట్టిన;

**తాత్పర్యము :** చక్కని రీతి(పద్ధతి)గలది. దక్షిణదేశమందు జన్యమైన గూర్జరి (దక్షిణగూర్జరి) గానమునందు మనోహరమైనది. రిషభమునుండి మంద్రతారముల నుండి స్ఫురించునది ద్రావిడ దేశమునందు పుట్టిన;

**గూర్జరీ పరిపూర్ణేయం ప్రహర్షే వినియుజ్యతే ।**

**॥ ద్రావిడగూర్జరీ ॥**

**ఉపాంగత్వేన నాట్టాయాం ఛాయానాట్టా సమీరితా ॥ 66 ॥**

**ప్రతిపదార్థము :** గూర్జరీ భవేత్ = ద్రావిడగూర్జరియగును; అయం పరిపూర్ణః = ఇది పరిపూర్ణరాగము; ప్రహర్షే = సంతోషమందు; వినియుజ్యతే = ప్రయోగయోగ్యము; నాట్టాయాం ఉపాంగత్వేన = నాటయందు ఉపాంగత్వముచే; ఛాయానాట్టా సమీరితా= ఛాయానాటగా చెప్పబడినది.

**తాత్పర్యము :** ద్రావిడగూర్జరియగును, ఇది పరిపూర్ణరాగము, సంతోషమందు ప్రయోగయోగ్యము, నాటయందు ఉపాంగత్వముచే ఛాయానాటగా చెప్పబడినది.

**షడ్జాంశన్యాససంపన్నా గనిభ్యాం కంపితా తథా ।**
**పమంద్రా పరిపూర్ణా చ రసే వీరే నియుజ్యతే ॥ 67 ॥**

**ప్రతిపదార్థము :** షడ్జాంశన్యాససంపన్నా = షడ్జాంశన్యాసము కలది; పమంద్రా = పంచమమంద్రము; పరిపూర్ణా = పూర్ణరాగము; వీరే రసే నియుజ్యతే = వీరరసమందు ప్రయోగింపబడును.

**తాత్పర్యము :** షడ్జాంశన్యాసముకలది, పంచమ మంద్రము. పూర్ణరాగము. వీరరసమందు ప్రయోగింపబడును.

### ఛాయానాట్టా

**అంధాలికాంగమల్లారీ మధ్యమాంశగ్రహాన్వితా ।**
**రిమంద్రా చ గశూన్యా చ శృంగారే తాడితస్వరా ॥ 68 ॥**

**ప్రతిపదార్థము :** అంధాలికాంగమల్లారీ = అంధాలికకు అంగము మల్లారీ; మధ్యమాంశ గ్రహాన్వితా = మధ్యమాంశగ్రహయుతము; రిమంద్రా = రిషభమంద్రము; గశూన్యా= గాంధార రహితము; శృంగారే తాడితస్వరా = శృంగారరసమందు (కొట్టబడిన) తాడితమైన స్వరములు గలది.

**తాత్పర్యము :** అంధాలికకు అంగము మల్లారి. మధ్యమాంశ గ్రహయుతము రిషభమంద్రము. గాంధారరహితము శృంగారరసమందు (కొట్టబడిన) తాడితమైన స్వరములుగలది.

### ॥ మల్లారీ ॥

**లక్షణం వినియోగశ్చ భవేన్మల్లారికాసమమ్ ।**
**మల్లారస్య గనిత్యాగః పంచమస్ఫురణం భవేత్ ॥ 69 ॥**

**ప్రతిపదార్థము :** లక్షణం = లక్షణమును; వినియోగశ్చ = ప్రయోగమును; మల్లారికాసమం భవేత్ = మల్లారికి సమానమగును; మల్లారస్య = మల్లారమునకు; గనిత్యాగః = గాంధార- నిషాదవివర్జితము; పంచమస్ఫురణం భవేత్ = పంచమస్ఫుర ణమును అగును.

**తాత్పర్యము :** లక్షణమును ప్రయోగమును మల్లారికి సమానమగును. మల్లారమునకు గాంధార- నిషాద వివర్జితము. పంచమస్ఫురణమును అగును.

### ॥ మల్లారః ॥

**భిన్నషడ్జసముద్భూతా ధాంశన్యాసగ్రహాన్వితా ।**
**సమశేషస్వరా పూర్ణా గాన్వితా తారమంద్రయోః ॥ 70 ॥**

**ప్రతిపదార్థము :** భిన్నషడ్జసముద్భూతా = భిన్నషడ్జజనితమైనది; ధాంశన్యాసగ్రహాన్వితా= ధైవతన్యాసగ్రహయుతము; సమశేషస్వరా = సమానమైనటువంటిన్ని శేషమైన స్వరముగలది; పూర్ణా = సంపూర్ణరాగము; తారమంద్రయోగాన్వితా = తారమంద్రము లందు గాంధారము గలది.

**తాత్పర్యము :** భిన్నషడ్జజనితమైనది. ధైవతన్యాసగ్రహయుతము. సమానమైనటువంటిన్ని శేషమైన స్వరముగలది. సంపూర్ణరాగము. తారమంద్రములందు గాంధారముగలది.

**దేవాదిప్రార్థనాయాం తు భైరవీ వినియుజ్యతే ।**

**॥ భైరవీ ॥**

**హిందోలకస్యచ్ఛేవాటీ భాషా భల్లాతికా భవేత్ ॥ 71 ॥**

**ప్రతిపదార్థము :** దేవాదిప్రార్థనాయాం = దేవాదుల ప్రార్థనయందు; భైరవీ వినియుజ్యతే = భైరవి ప్రయోజ్యము; హిందోలకస్య = హిందోలకమునకు (చ్ఛేవాటీభాషా); భల్లాతికా భవేత్ = భల్లాతియగును.

**తాత్పర్యము :** దేవాదుల ప్రార్థనయందు, భైరవి ప్రయోజ్యము. హిందోలకమునకు (చ్ఛేవాటీభాషా) భల్లాతియగును.

**షడ్జాంశగ్రహణన్యాసా రిహీనా షాడబా భవేత్ ।**
**ధమంద్రోపాంగరూపా చ శృంగారే వినియుజ్యతే ॥ 72 ॥**

**ప్రతిపదార్థము :** షడ్జాంశగ్రహణన్యాసా = షడ్జాంశగ్రహన్యాసముకలది; రిహీనా = రిషభవర్జితము; షాడబా భవేత్ = షాడబరాగమగును; ధమంద్రః = ధైవతమంద్రము; ఉపాంగరూపా = ఉపాంగరూపమైనది; శృంగారే వినియుజ్యతే = శృంగారమందు ప్రయోగింపదగినది.

**తాత్పర్యము :** షడ్జాంశగ్రహన్యాసముకలది రిషభవర్జితము షాడబరాగమగును. ధైవతమంద్రము ఉపాంగరూపమైనది. శృంగారమందు ప్రయోగింపదగినది.

**॥ భల్లాతీ ॥**

**సామాన్యం చ విశేషం చ ద్వివిధం రాగలక్షణమ్ ।**
**చతుర్విధం చ సామాన్యం విశేషం చాంశకాదికమ్ ॥ 73 ॥**

**ప్రతిపదార్థము :** సామాన్యంచ = సామాన్యమనియు; విశేషం చ = విశేషమనియు; రాగలక్షణం ద్వివిధం = రాగలక్షణము రెండువిధములైనది; సామాన్యం చతుర్విధం= సామాన్యము నాల్గువిధములైనది; విశేషం చ = విశేషము; అంశకాదికం = అంశముమొదలగునవి.

**తాత్పర్యము** : సామాన్యమనియు విశేషమనియు రాగలక్షణము రెండువిధములైనది. సామాన్యము నాల్గువిధములైనది. విశేషము అంశము మొదలగునవి.

**యస్మిన్ వసతి రాగశ్చ యస్మాచ్చైవ ప్రవర్తతే ।**
**నేతా చ తారమంద్రాణాం యోర్థం చేజ్ఞోపలభ్యతే (?) ॥ 74 ॥**

**ప్రతిపదార్థము** : యస్మిన్ = దేనియందు; రాగః వసతి = రాగము నివసించును (ఉండునో); యస్మాత్ = దేనివలన (నుండి); ప్రవర్తతే = ప్రవర్తించునో; యః = ఏది?; తారమంద్రాణాం నేతా = తారమంద్రములకు నాయకమో (ప్రభుత); య= ఏది?; జ్ఞః = తెలియగోరు (వారికి); ఉపలభ్యతే = లభించు(ప) బడుచున్నదో;

**తాత్పర్యము** : దేనియందు రాగము నివసించునో (ఉండునో) దేనివలన (నుండి) ప్రవర్తించునో ఏది? తారమంద్రములకు నాయకమో (ప్రభుత) ఏది? తెలియగోరు (వారికి) లభించు(ప) బడుచున్నదో;

**గ్రహోపన్యాసవిన్యాససంన్యాసన్యాసగోచరః ।**
**పరిచార్యమితో యశ్చసోఽంశః స్యాద్ దశలక్షణః ॥ 75 ॥**

**ప్రతిపదార్థము** : గ్రహోపన్యాసవిన్యాస సంన్యాసగోచరః = గ్రహోపన్యాస, విన్యాస, సన్యాస, న్యాసరుష్టమైన; పరిచార్యమితః = సేవామితమైనది; యః = ఏదియగునో; సః = అది; దశలక్షణః అంశః స్యాత్ = దశవిధ(లక్షణ) ప్రభేదముకల అంశమగుచున్నది.

**తాత్పర్యము** : గ్రహోపన్యాస, విన్యాస, సన్యాస, న్యాసరుష్టమైన సేవామితమైనది ఏదియగునో అది దశవిధ (లక్షణ) ప్రభేదముకల అంశమగుచున్నది.

**ఇతి సంగీతరత్నాకరనామధేయ శ్రీపార్శ్వదేవవిరచితే సంగీత సమయసారే తృతీయమధికరణమ్ ॥**

## అథ చతుర్థమధికరణమ్

**అథ వక్ష్యే నిషిధ్యం చ విభాగేన సమాసతః ।**
**ప్రబంధో రూపకం వస్తు నిబద్ధస్యాభిధాత్రయమ్ ॥ 1 ॥**

**ప్రతిపదార్థము** : అథ= తరువాత; నిషిధ్యం = నిషేదింపదగినదియు; విభాగేన =

ప్రభేదముచేతను; సమానతః = పూర్తిగను; ప్రబంధః = ప్రబంధము; రూపకం వస్తు= రూపకమును; నిబద్ధస్య = ప్రబంధముయొక్క; అభిధాత్రయం = ముప్విధములైన అర్థమును; వక్ష్యే = చెప్పు (చున్నాను)దును.

**తాత్పర్యము :** తరువాత నిషేదింపదగినదియు ప్రభేదము చేతను పూర్తిగను ప్రబంధము రూపకమును ప్రబంధముయొక్క ముప్విధములైన అర్థమును చెప్పు(చున్నాను)దును.

**చతుర్ధాతుభిః షడ్భిశ్చాంగైర్యః స్యాత్ ప్రబధ్యతే ।**
**తస్మాత్ ప్రబంధః కథితో గీతలక్షణకోవిదైః ॥ 2 ॥**

**ప్రతిపదార్థము :** చతుర్భిః ధాతుభిః = నాల్గుధాతువులచేతను; షడ్భిః అంగైశ్చ = షడంగములచేతను; యః = ఏది; ప్రబధ్యతే = విస్తరించి (వర్ణించి) చెప్పబడునో; తస్మాత్ = అందువలన; సః = అది; ప్రబంధః ఇతి = ప్రబంధమని; గీతలక్షణకోవిదైః = సంగీతపండితులచే; కథితః = చెప్పబడినది.

**తాత్పర్యము :** నాల్గుధాతువులచేతను, షడంగములచేతను ఏది విస్తరించి (వర్ణించి) చెప్పబడునో అందువలన అది ప్రబంధమని సంగీతపండితులచే చెప్పబడినది.

**రామాంద్యారోపణా నేతుః(?)స్యాదస్మిన్ రూపకాభిధా ।**
**ఉద్గ్రాహాద్యాస్తు చత్వారః స్వరాదీని చ షట్ తథా ॥ 3 ॥**
**వసంతి యత్ర స జ్ఞేయః ప్రబంధో వస్తుసంజ్ఞయా ।**

**ప్రతిపదార్థము :** నేతుః = నాయకునకు; రామాద్యారోపణాత్ = రామాదులను ఆరోపించుట వలన; అస్మిన్ = ఈ పాత్ర (యందు); రూపకాభిదా = రూపకనామము కలదగును; ఉద్గ్రాహాద్యాః చత్వారః = ఉద్గ్రాహాదులు నాలుగు; స్వరాదీని షట్ = స్వరాదులు ఆరు; యత్ర = ఎక్కడ; వసంతి = ఉండునో; సః = అది; వస్తుసంజ్ఞయా ప్రబంధజ్ఞేయః = వస్తు ప్రబంధముగా తెలియదగినది.

**తాత్పర్యము :** నాయకునకు రామాదులను ఆరోపించుటవలన ఆ పాత్ర (యందు) రూపకనామముకలదగును. ఉద్గ్రాహాదులు నాలుగు. స్వరాదులు ఆరు ఎక్కడ ఉండునో అది వస్తు ప్రబంధముగా తెలియదగినది.

**ఆదావుద్గ్రాహ్యతే గీతం యేనోద్గ్రాహః స కీర్తితః ॥ 4 ॥**

**ప్రోక్తో మేలాపకస్తజ్ఞైరుద్గ్రాహధ్రువమేలనాత్ ।**
**ప్రబంధేషు ధ్రువత్వేన ధ్రువఇత్యభిధీయతే ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : యేన = దేనిచేతను (ఎవరిచేతను); ఆదౌ = మొదట; గీతం = గీతము; ఉద్గ్రాహ్యతే = (ఎత్తి) గ్రహింపబడునో; సః = అది; ఉద్గ్రాహః కీర్తితః = ఉద్గ్రాహమని చెప్పబడుచున్నది; ఉద్గ్రాహధ్రువమేలానాత్ = ఉద్గ్రాహధ్రువముల యొక్క కలయికచే; తజ్ఞైః మేలాపకః ప్రోక్తః = మేలాపకమగునని సంగీతజ్ఞులచే చెప్పబడినది; ప్రబంధేషు = ప్రబంధములయందు; ధ్రువత్వేన = (నిశ్చితత్వము) ధ్రువత్వముచే; ధ్రువః ఇత్యభిధీయతే = ధ్రువమని చెప్పబడినది.

**తాత్పర్యము** : దేనిచేతను (ఎవరిచేతను) మొదట గీతము(ఎత్తి) గ్రహింపబడునో అది ఉద్గ్రాహమని చెప్పబడుచున్నది. ఉద్గ్రాహధ్రువములయొక్క కలయికచే మేలాపకమగునని సంగీతజ్ఞులచే చెప్పబడినది. ప్రబంధములయందు ధ్రువత్వముచే ధ్రువమని చెప్పబడినది.

**స్వయం యత్ర ప్రబంధే స్యాదనేనైవ ప్రపూరణమ్ ।**
**ఆభోగః కథితస్తేన పరమమర్దిమహీభుజా ॥ 6 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర ప్రబంధే = ఏప్రబంధము; స్వయం = స్వయముగా; అనేనైవ ప్రపూరణం స్యాత్ = దీనిచేతనే పూర్ణమగునో; సః = అది; పరమర్దిమహీభుజా = పరమర్దిరాజుచే; ఆభోగః కథితః = ఆభోగమని చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏప్రబంధము స్వయముగా దీనిచేతనే పూర్ణమగునో అది పరమర్దిరాజుచే ఆభోగమని చెప్పబడినది.

**వర్జ్యౌ మేలాపకాభోగౌ ప్రబంధేషు ద్విధాతుషు ।**
**త్రిధాతుకప్రబంధేషు తయోరేకం వివర్జయేత్ ॥ 7 ॥**

**యేలాయాం ఢేంకికాయాం చ స్యాదన్తే నియమాదిమౌ ।**
**అన్యేషు (తు) ప్రబంధేషు స్యాతాం గీతానుసారతః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము** : ద్విధాతుషుప్రబంధేషు = ద్విధాతుక ప్రబంధములందు; మేలాపకాభోగౌ వర్జ్యౌ = మేలాపకాభోగములు విడువదగినవి; త్రిధాతుకప్రబంధేషు = త్రిధాతుక ప్రబంధములందు; తయోః ఏకం వివర్జయేత్ = ఆరెండింటిలో ఒకదానిని

విడువవలెను; డేంకికాయాం యేలాయాం = డేంకిక యేలయందు; నియమాత్ = నియమము వలన; అంతే = చివర; ఇమౌ స్యాత్ = ఈరెండును అగును; అన్యేషు ప్రబంధేషు = మిగిలిన ప్రబంధములందు; గీతానుసారతః స్యాతాం = గీతముల ననుసరించి అగుచున్నవి.

**తాత్పర్యము** : ద్విధాతుక ప్రబంధములందు మేలాపకాభోగములు విడువదగినవి. త్రిధాతుకప్రబంధములందు ఆ రెండింటిలో ఒకదానిని విడువవలెను. డేంకిక ఏలయందు నియమము వలన చివర ఈరెండును అగును. మిగిలిన ప్రబంధము లందు గీతములననుసరించి అగుచున్నవి.

**అంగత్వమేషాం కేనాపి యదుక్తం తన్న సాంప్రతమ్ ।**
**దేహస్యేవం నిబంధస్య ధారణాత్ ధాతవస్త్విమే ॥ 9 ॥**

**ప్రతిపదార్థము** : కేనాపి = ఎవనిచేతనైతే; ఏషాం = వీటికి; అంగత్వం యదుక్తం = అంగత్వము చెప్పబడినదో; తత్ = ఆఅంగత్వము; న సాంప్రతం = మంచిది కాదు; దేహస్య ఇవ = శరీరమువలె; నిబంధస్య = ప్రబంధముయొక్క; ధారణాత్ = ధారణవలన; ఇమే = ఇవి; ధాతవః భవంతి = ధాతువులగుచున్నవి.

**తాత్పర్యము** : ఎవనిచేతనైతే వీటికి అంగత్వము చెప్పబడినదో ఆ అంగత్వము ఇప్పుడు శరీరమువలె ప్రబంధముయొక్క ధారణవలన ఇవి ధాతువులగుచున్నవి.

**ద్విధాతుర్వా త్రిధాతుర్వా చతుర్ధాతురథాపి వా ।**
**ప్రబంధస్త్రివిధో జ్ఞేయో గీతవిద్యావిశారదైః ॥ 10 ॥**

**ప్రతిపదార్థము** : ద్విధాతుః = ద్విధాతుకప్రబంధము; త్రిధాతుః = త్రిధాతుక ప్రబంధము; చతుర్ధాతుః = చతుర్ధాతుక ప్రబంధముఅని; ప్రబంధః = ప్రబంధము; త్రివిధః జ్ఞేయః= ముప్విధములైనదిగా తెలియదగినది.

**తాత్పర్యము** : ద్విధాతుక ప్రబంధము, త్రిధాతుక ప్రబంధము, చతుర్థాతుక ప్రబంధము అని ప్రబంధములు ముప్విధములైనదిగా తెలియదగినది.

**అంగాని తు ప్రబంధానాం వదామః సాంప్రతం క్రమాత్ ।**
**నేత్రే కరౌ చ పాదౌ చ షడంగాని యథా తనోః ॥ 11 ॥**

**ప్రతిపదార్థము** : నేత్రే = నేత్రములు; కరౌ = హస్తములు; పాదౌచ = పాదములు;

తనోః యథా = శరీరమునకువలె; ప్రబంధానాం అంగాని = ప్రబంధముల అంగములను; సాంప్రతం = ఇప్పుడు; క్రమాత్ = వరుసగా; పదామః = చెప్పుచున్నాము.

**తాత్పర్యము** : నేత్రములు, హస్తములు, పాదములు శరీరమునకువలె ప్రబంధముల అంగములు ఇప్పుడు వరుసగా చెప్పుచున్నాము.

**పాదతేనౌ చ బిరుదపాటౌ తాలస్వరౌ తథా ।**
**మంగలద్యోతకస్తేనః పదమర్థప్రకాశకమ్ ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : పాదతేనౌ = పాదతేనములు; బిరుదపాటౌ = బిరుద, పాటములు; తాలస్వరౌ = తాలస్వరములు; తేనః = తేనము; మంగలద్యోతకః = శుభమును సూచించునది; పదం = పదము; అర్థప్రకాశకం = అర్థమునుప్రకాశింపజేయునది.

**తాత్పర్యము** : పాదతేనములు, బిరుద, పాటములు తాలస్వరములు తేనము శుభమును సూచించునది. పదము అర్థమును ప్రకాశింపజేయునది.

**తస్మాందగత్వమనయోర్నేత్రవత్ ప్రతిపాదితమ్ ।**
**కరాభ్యాముదయో యస్మాత్ పాదస్య బిరుదస్య చ ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : తస్మాత్ = అందువలన; అనయోః = పదతేనములు రెండింటికి; నేత్రవత్ = నేత్రమువలె; అంగత్వం ప్రతిపాదితం = అంగత్వము ఉట్టంకించబడినది; యస్మాత్ = దేనివలన; పాదస్య = పాదములకు; బిరుదస్య చ = బిరుదమునకును; కరాభ్యాముదయః = చేతులచేతనువలె జననము.

**తాత్పర్యము** : అందువలన పదతేనములు రెండింటికి నేత్రములవలె అంగత్వము ఉట్టంకించబడినది. దేనివలన పాదములకు బిరుదమునకును చేతులచేతను వలె జననము.

**తేన కార్యే కారణవదుపచారో నిరూపితః ।**
**స్యాద్గతిః స్వరతాలాభ్యాం పాదాభ్యామివ దేహినః ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : తేన = అందుచే; కార్యే = కార్యమందు; కారవత్ = కారణము (కరణము) వలె; ఉపచారః నిరూపితః = ఉపచారము నిరూపింపబడినది; దేహినః = శరీరికి; పాదాభ్యామివ = పాదములచేతను వలె; గీతస్య = గీతమునకు; స్వరతాలాభ్యాం = స్వరతాలములచే; గతిః స్యాత్ = గమనము (నడక) అగును.

**తాత్పర్యము** : అందుచేకార్యమందు కారణము (కరణము) వలె ఉపచారము నిరూపింపబడినది. శరీరికి పాదములచేతను వలె గీతమునకు స్వరతాలములచే గమనము (నడక) అగును.

**ప్రబంధస్య యదస్మా (దు?భిరు) క్తం పాదత్వమేకయోః ।**
**ఏతేషాం లక్షణమిదమిదానీమభిధీయతే ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : అస్మాభిః = మాచే; ఉక్తం = చెప్పబడిన; ప్రబంధస్య = ప్రబంధము యొక్క; ఏకయోః పాదత్వం = ఒకటైనది పాదత్వము; ఏతేషాం = వీటికి; ఇదానీమ్ = ఇప్పుడు; లక్షణం అభిధీయతే = లక్షణము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : మాచే చెప్పబడిన ప్రబంధముయొక్క ఒకటైనది పాదత్వము వీటికి ఇప్పుడు లక్షణము చెప్పబడుచున్నది.

**స్వయం యో రాజతే నాదః స్వరః స పరికీర్తితః ।**
**పదం స్వరాధికరణమర్థస్య ప్రతిపాదకమ్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : యః నాదః = ఏనాదము; స్వయం = స్వయముగా; రాజతే = ప్రకాశించునో; సః = అది; స్వరః పరికీర్తితః = స్వరముగా చెప్పబడుచున్నది; అర్థస్య ప్రతిపాదకం = అర్థమును బోధించునది; స్వరాధికరణం = స్వరమునకు అధికరణము (ఆధారము) అయినది; పదం = పదము.

**తాత్పర్యము** : ఏనాదము స్వయముగా ప్రకాశించునో అది స్వరముగా చెప్పబడుచున్నది. అర్థమును బోధించునది స్వరమునకు అధికరణమును (ఆధారము) అయినది పదము.

**సంస్కృతం ప్రాకృతం చైవ అపభ్రంశమితి త్రిధా ।**
**విరుశబ్దో విరుద్ధార్థో మహారాష్ట్రప్రసిద్ధితః ॥ 17 ॥**

**ప్రతిపదార్థము** : సంస్కృతం = సంస్కృతము; ప్రాకృతం = పాకృతము; అపభ్రంశమితి= అపభ్రంశమని ; పదం = పదము; త్రిధా = మూడు విధములైనది; మహారాష్ట్ర ప్రసిద్ధితః = మహారాష్ట్ర దేశప్రసిద్ధివలన; విరుశబ్దః విరుద్ధార్థః = విరుశబ్దము విరుద్ధార్థము కలది

తాత్పర్యము : సంస్కృతము పాకృతము అపభ్రంశమని పదము మూడు విధములైనది. మహారాష్ట్ర దేశ ప్రసిద్ధివలన విరుశబ్దము విరుద్ధార్థము కలది.

**పరేభ్యస్తత్ప్రదానేన విరుదం సూరిభిః స్మృతమ్ ।**
**తద్వీరరససంయుక్తం ద్విషాముద్వేదదాయకమ్ ॥ 18 ॥**

**ప్రతిపదార్థము** : పరేభ్యః = ఇతరులకొఱకు (శత్రువు కొఱకు); తత్ప్రదానేన = దానినిచ్చుట వలన; సూరిభిః = పండితులచే; విరుదం స్మృతం = విరుదముగా చెప్పబడినది; తత్ = అది; వీరరససంయుక్తం = వీరరసముతో కూడియున్నది; ద్విషాం= శత్రువులకు; ఉద్వేగదాయకం = ఉద్వేగమును చేకూర్చునది.

**తాత్పర్యము** : ఇతరులకొఱకు (శత్రువులకొఱకు) దానినిచ్చుటవలన పండితులచే విరుదముగా చెప్పబడినది. అది వీరరసముతో కూడియున్నది. శత్రువులకు ఉద్వేగమును చేకూర్చునది.

**రసాంతరేణ యద్యుక్తం తత్పదం విరుదం మతమ్ ।**
**సందోహో వాద్యవర్ణానాం పాటస్తాలానుగో భవేత్ ॥ 19 ॥**

**ప్రతిపదార్థము** : యత్ పదం = ఏపదము; రసాంతరేణ = మరియొక రసముతో; యుక్తం యది = కూడినచో; తత్ = ఆపదము; విరుదం మతం = విరుదముగా యిష్టమైనది; తాలానుగః = తాలముననుసరించునట్టి; వాద్యవర్ణానాం సందోహః = వాద్యవర్ణసముదాయము; పాటః =పాట (ము)

**తాత్పర్యము** : ఏపదము మరియొక రసముతో కూడినచో ఆపదము విరుదముగా యిష్టమైనది. తాలముననుసరించునట్టి వాద్యవర్ణ సముదాయము పాట (ము);

**తేన్నతేన్నతి యే వర్ణా గీతేఽసౌ తేన్నకో మతః ।**
**తాలః కాలక్రియామానం జ్ఞేయఃసంగీతసంగతః ॥ 20 ॥**

**ప్రతిపదార్థము** : తేన్నతేన్న ఇతి యే వర్ణాః = తేన్నతేన్నఅను వర్ణములు; గీతే = గానమందుకలవో; అసౌ = ఆవర్ణము; తేన్నక = తేన్నకముగా; మతః = అంగీకృతము.

**తాత్పర్యము** : తేన్నతేన్నఅను వర్ణములు గానమందు కలవో ఆవర్ణము తేన్నకముగా అంగీకృతము.

**చం (బూ?పూ)శ్చ కం(పి?వి)తా సేనా నీతిశ్చేతి (య?త)థా శ్రుతిః ।**

**(త?) ద్వ్యంగ్యాందీనా ప్రబంధానాం జాతయః పంచ కీర్తితాః ॥ 21 ॥**

**ప్రతిపదార్థము** : చంపూః = చంపువు; కవితా = కవిత్వము; సేనా = సైన్యము; నీతి = నీతియు; శ్రుతిః = శాస్త్రముఅని; వ్యంగ్యాదీనాం ప్రబంధానాం = వ్యంగ్యాంధి ప్రబంధముల యొక్క; జాతయః = జాతులు; పంచకీర్తితాః = (5)విధములుగా చెప్పబడినది

**గద్యపద్యమయీా చం (బూ?పూ) శక్తివ్యుత్పత్తిరభ్యాసః కవితా, హస్త్యశ్వరపదాతయః సేనా, భేదాః పరీక్షా విశ్వాసో వచనం మిత్రకార్యాణి నీతిః, శిక్షాజ్యోతిషనిరుక్త నిఘంటుచ్ఛందో వ్యాకరణాని శృతిః ।**

గద్యపద్యమయీా చంపూః = గద్యపద్య ఉభయాత్మకమైనది చంపూకావ్యము; శక్తివ్యుత్పత్తిరభ్యాసః కవితా = శక్తివ్యుత్పత్తి అభ్యాత్మకమైనది కవిత; హస్త్యశ్వరథపదాతయః సేనా = గజతురగరథపదాతులతో కూడినది సైన్యము, భేదః పరీక్షావిశ్వాసః వచనం మిత్ర కార్యాణి నీతః = భేదము, పరీక్ష, విశ్వాసము, మాట, మిత్రకార్యము, నీతి; శిక్షాజ్యోతిషనిరుక్తనిఘంటుఛందోవ్యాకరణాని శ్రుతిః = శిక్ష, జ్యోతిషము, నిరుక్తము, నిఘంటువు, వ్యాకరణము, వ్యాకరణము అనునవి శ్రుతి (శాస్త్రము).

తాత్పర్యము : చంపువు కవిత్వము, సైన్యము,నీతియు శాస్త్రముఅని వ్యగ్యాంది ప్రబంధముల యొక్క జాతకులు (5) విధములుగా చెప్పబడినది. గద్యపద్య ఉభయాత్మకమైనది చంపూకావ్యము. శక్తివ్యుత్పత్తి అభ్యాసాత్మకమైనది కవిత. గజతురగ రథపదాలతో కూడినది సైన్యము. భేదము, పరీక్ష, విశ్వాసము, మాట, మిత్రకార్యము నీతి. శిక్ష, జ్యోతిషము, విరుక్తము, నిఘంటువు, వ్యాకరణము అనునవి శ్రుతి (శాస్త్రము).

**తారావల్యాదయః సంజ్ఞాః జాతీనాంకై శ్చిదీరితాః ।**

**అంగసం(జ్ఞా?ఖ్యా) వియోగాత్తు నైవ తాః సమ్మతా మమ ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : తారావల్యాదయః = తారావళీ మొదలగు కావ్యములు; జాతీనాః సంజ్ఞాఇతి = జాతులయొక్క నామములుగా (విభాగములుగ); కైశ్చిత్ ఈరితాః = కొందరిచే చెప్పబడినవి; అంగసంఖ్యావియోగాత్తు = అంగసంఖ్యకు సమానము కాకపోవుటవలన; ఏతాః = ఈ తారావల్యాదులు; మమ = నాకు, నైవ సమ్మతాః = అంగీకృతములు కావు.

**తాత్పర్యము** : తారవళీమొదలగు కావ్యములు జాతులయొక్క నామములుగా

(విభాగములుగ) కొందరిచే చెప్పబడినవి. అంగసంఖ్యకు సమానము కాకపోవుటవలన ఈతారావల్యాదులు నాకు అంగీకృతములు కావు.

**అనిర్యుక్తాశ్చ నిర్యుక్తాస్తథా చైవభయా(త్మి?త్మ) కాః ।**
**ప్రభందాస్త్రి విధాస్తే చ ప్రోక్తా గీతవిశారదైః ॥ 23 ॥**

**ప్రతిపదార్థము :** అనిర్యుక్తాః = అనిరుక్తములు; నిర్యుక్తాః = నిర్యుక్తములు; ఉభయాత్మకాః = ఉభయాత్మకములని; ప్రబంధాః = ప్రబంధములు; త్రివిధాః ఇతి= మూడువిధములు అని; గీతవిశారదైః = సంగీతపండితులచే; ప్రోక్తాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** అనిర్యుక్తములు, నిర్యుక్తములు, ఉభయాత్మకములని ప్రబంధములు మూడు విధములని సంగీతపండితులచే చెప్పబడినవి.

**అంగమాత్రేణ విహితా అనిర్యుక్తా ఇతీరితాః ।**
**ఛందస్తాలాదినియమాన్నిర్యుక్తాస్తే నిరూపితాః ॥ 24 ॥**

**ప్రతిపదార్థము :** అంగమాత్రేణ = అంగమాత్రముగా; విహితాః = చేయబడినవి; అనిర్యుక్తాః ఇతి = అనిర్యుక్తములని; ఈరితాః = చెప్పబడినవి; ఛందస్తాలాదినియమాత్ = ఛందస్సు తాలము మొదలగు వాటి నియమమువలన; తే = అవి; నిర్యుక్తాః నిరూపితాః = నిర్యుక్తములని నిరూపించబడినవి.

**తాత్పర్యము :** అంగమాత్రముగా చేయబడినవి అనిర్యుక్తములని చెప్పబడినవి. ఛందస్సు, తాలము మొదలగు వాటి నియమమువలన అవి నిర్యుక్తములని నిరూపించబడినవి.

**క్వచిదంగం క్వచిచ్ఛందో గీతే యస్మిన్ విరాజతే ।**
**ఉభయాత్మకమిత్యాహుర్గీతం గీతవిశారదాః ॥ 25 ॥**

**ప్రతిపదార్థము :** యస్మిన్ గీతే = ఏగీతమందు; క్వచిత్ = ఒకచోట; ఛందః = ఛందస్సు; విరాజతే = ప్రకాశించునో (కనబడునో); తం గీతం = ఆగీతమును; గీతవిశారదాః = సంగీతజ్ఞులు; ఉభయాత్మకం ఇతి ఆహుః = ఉభయాత్మక ప్రబంధములని పలికిరి

**తాత్పర్యము :** ఏగీతమందు ఒకచోట ఛందస్సు ప్రకాశించునో ఆగీతమును సంగీతజ్ఞులు ఉభయాత్మక ప్రబంధమని పలికిరి.

**తాలార్ణవో విచిత్రం చ మండనం రాహడీ తథా ।**
**లోమ్లీలోమ్లరిదంతీ స్యాద(న్తి?ని)రుక్తాః పతాయుతాః ॥ 26 ॥**

**ప్రతిపదార్థము :** తాలార్ణవః = తాలార్ణవము; విచిత్రం చ = విచిత్రమును; మండనం= మండనము; తథా = అట్లే; రాహడీ = రాహడి; లోమ్లీతః = లోమ్లీతము; అరిదంతీ = అరిదంతి; ఏతే = ఇవి; పతాయుతాః = పదతాలయుతములు; అనిర్యుక్తాః = అనిర్యుక్తములు.

**తాత్పర్యము :** తాలార్ణవము విచిత్రమును మండనము అట్లే రాహడి లోమ్మితము అరిదంతి ఇవి పదతాలయుతములు అనిర్యుక్తములు.

**ధవలశ్చచ్చరీ చైవ పదనంఝపటస్తథా ।**

**చరిజా త్రిపదీ చైవ సింహపాదస్తథైవ చ ॥ 27 ॥**

**ప్రతిపదార్థము :** ధవలః = ధవలము; చచ్చరీ = చచ్చరి; వదనం = వదనము; ఝంపట= ఝంపటము (వదరమైనను కావచ్చును); చరిజా = చరిజ; త్రిపదీ = త్రిపది; తథైవ= అట్లే; సింహపాదః = సింహపాదము.

**తాత్పర్యము :** ధవలము, చచ్చరి, వదనము, ఝంపటము, చరిజ, త్రిపది మరియు సింహపాదము.

**పదం తాలసమాయుక్తా (?) మంగలం స్తవమంజరీ ।**
**అమీ సర్వప్రబంధాశ్చ నిర్యుక్తాః పరికీర్తితాః ॥ 28 ॥**

**ప్రతిపదార్థము :** పదం = పదము; తాలసమాయుక్తాః =తాళముతో కూడినవి; అపిచ= మరియు; మంగళం = మంగళము; స్వరమంజరీ = స్వరమంజరియు; అమీ స్వర ప్రబంధాశ్చ = ఈఅన్ని ప్రబంధములును; నిర్యుక్తాః పరికీర్తితాః = నిర్యుక్తములుగా చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము :** పదము తాళముతో కూడినవి. మరియు మంగళము స్వరమంజరియు ఈ అన్ని ప్రబంధములును నిర్యుక్తములుగా చెప్పబడుచున్నవి.

**తాలతేన్నతయో రోపి (?) నిర్యుక్తః పరికీర్తితః ।**
**సవితాసహితో వర్ణో నందనస్తే వితాయుతః ॥ 29 ॥**

**ప్రతిపదార్థము** : తాలతేన్నతయోరోపి = తాలతేన్నములచేనారోపి; నిర్యుక్తః పరికీర్తిత= నిర్యుక్తముగా నిగదితము; సవితాసహితః వర్ణః = షడ్జస్వర, విరుద, తాల సహితము వర్ణము; నందనః = నందనము; వితాయుతః = విరుదతాలయుక్తము.

**తాత్పర్యము** : తాలతేన్నములచే నారోపి నిర్యుక్తముగా నిగదితము. షడ్జస్వర, విరుద, తాలసహితము, వర్ణము, నందనము విరుదతాలయుక్తము.

**పతేతాసహితః సోఽయమహినందన ఉచ్యతే ।**
**పతావైర్హంసలీలా చ విపాతై రణరంగకః ॥ 30 ॥**

**ప్రతిపదార్థము** : పతేతాసహితః = పదతేన్న, తాలయుతము; అహినందనః = అహినందనముగా; ఉచ్యతే = చెప్పబడినది; హంసలీలా = హంసలీల; పతాయుతా = పదతాళయుతము; రణరంగకః = రణరంగకము; విపాతైః = విరుదపాటములతో; (ఒప్పుచున్నవి).

**తాత్పర్యము** : పదతేన్న, తాలయుతము అహినందనముగా చెప్పబడినది. హంసలీల పదతాళయుతము రణరంగకము విరుద పాటములతో (ఒప్పుచున్నవి).

**పాస్వతైర్నర్తనం చైవ అనిర్యుక్తా భవంత్యమీ ।**
**తాపసైర్మంగలాచారో గద్యం చైవోభయాత్మకౌ ॥ 31 ॥**

**ప్రతిపదార్థము** : పాస్వతైః = పాట; స్వర, తేన్నములచే; నర్తనం = నర్తనము; అమీ = ఇవి; అనిర్యుక్తాః భవంతి = అనిర్యుక్తములగుచున్నవి; మంగలీఆచారః = మంగళాచారము; తాపసైః = తాళపదస్వరములచేతను; గద్యంచ = గద్యము; ఉభయాత్మకౌ = ఉభయాత్మకములు.

**తాత్పర్యము** : పాట, స్వర, తేన్నములచే నర్తనము ఇవి అనిర్యుక్తములగుచున్నవి. మంగళాచారము తాళ పదస్వరములచేతను గద్యము ఉభయాత్మకములు.

**తాపా (:?) స్వకైఃశుకచంచుః శుకః సారీ చ తైః స్మృతః ।**
**ఆమోదః స్యాత్ సాపాతేస్తైస్తేపితాపైః సుదర్శనః ॥ 32 ॥**

**ప్రతిపదార్థము** : తాపాస్వకైః = తాళపాటస్వరములచే; శుకచంచుః = శుకచంచువు; శుకః =శుకము; సారీచ = సారియు; తైః = తాళపాటస్వరములచేతనే; స్మృతః =

చెప్పబడుచున్నది; సపాతేతైః = స్వరపాట తేన్నములచే; ఆమోదః స్యాత్ = ఆమోదమగును; తేపితాపైః = తేన్నపదతాళములచే; సుదర్శనః స్యాత్ = సుదర్శనమగును; (పి అను అక్షరము ఈగ్రంథమందు చెప్పిన షడంగములపేర్లలో దేని మొదటి అక్షరముగా నేను గుర్తించలేక పోతిని. మరియు ఇందు దీనికి ప్రత్యేకముగా లక్షణముకూడ చెప్పబడలేదు. దీనిపేరును సక్రమముగా గుర్తించవలెను. ఆయక్షరము క్రింద గీతపెట్టెదను).

**తాత్పర్యము** : తాళ, పాట, స్వరములచే శుకచంచువు శుకముసారియు తాళపాట స్వరములచేతనే చెప్పబడుచున్నది. స్వరపాట తేన్నములచే ఆమోదమగును. తేన్నపద తాళములచే సుదర్శనమగును.

> **పాతాపిపైః కందుకశ్చ తైః స్మృతో హర్షవర్ధనః ।**
> **పవాతే తైః ప్రమోదశ్చ పావితే తైర్మనోరమః ॥ 33 ॥**

**ప్రతిపదార్థము** : పాతాపిపైః = పాట తాళ, పదములచే; కందుకః = కందుకము; తైః=వాటిచేతనే; హర్షవర్ధనః స్యాత్ = హర్షవర్ధనము అగును; పవాతేతైః = పదవిరుదతేన్నములచే; ప్రమోదః = ప్రమోదము; పాటితేతైః = పాట, బిరుద, తేన్నములచే, మనోరమః స్యాత్ = మనోరమయగును.

**తాత్పర్యము** : పాటతాళపదములచే కందుకము వాటిచేతనే హర్షవర్ధనము అగును. పదబిరుదతేన్నములచే ప్రమోదము పాట, బిరుద, తేన్నములచే మనోరమయగును.

> **అంకధ్వనిస్తాపతేతైరనిర్యుక్తా అమీ స్మృతాః ।**
> **తాపిస్వతైస్త్రిపథకస్తాపావిశ్వైశ్చ వర్ధటీ ॥ 34 ॥**

**ప్రతిపదార్థము** : అంకధ్వనిః = అంకధ్వని; తాపతేతైః = తాళపదతేన్నముల చేతను; స్యాత్ = అగును; అమీ = ఇవి; అనిర్యుక్తాః స్మృతాః = అనిర్యుక్తములగు చున్నవి; తాపిస్వతైః = తాళ, (పి)స్వరములచే; త్రిపథకః = త్రిపథకము; తాపావిశ్వైశ్చ = తాళ, పాట, విరుద, స్వరములచే; వర్ధటీ స్యాత్ = వర్ధటియగును.

**తాత్పర్యము** : అంకధ్వని తాళపదతేన్నములచేతను అగును. ఇవి అనిర్యుక్తములగు చున్నవి. తాళ. (పి) స్వరములచే త్రిపథకము తాళ, పాట, విరుద, స్వరములచే వర్ధటియగును.

**నిర్యుక్తౌ కథితావేతౌ గీతవిద్యావిశారదైః ।**
**సపావితేతాయుక్తోఽసౌ సింహలీలేతి నామతః ॥ 35 ॥**

**ప్రతిపదార్థము :** ఏతౌ = ఈరెండును; నిర్యుక్తౌ కథితౌ = నిర్యుక్తములుగా చెప్పబడినవి; సపావితే యుక్తః = షడ్జస్వరపాట విరుద తేన్నతాళములతో కూడినది; నామతః = నామముచే; సింహలీలా ఇతి స్యాత్ = సింహలీలయని చెప్పబడినది.

**తాత్పర్యము :** ఈరెండును నిర్యుక్తములుగా షడ్జస్వరపాట విరుద తేన్నతాళములతో కూడినది నామముచే సింహలీలయని చెప్పబడినది.

**అనిర్యుక్తో భవేదేష గీతలక్షణకోవిదైః ।**
**పదతాలస్వరైస్తేన్నవిరుదాభ్యాం చ గీయతే ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** ఏషః = ఇది; అనిర్యుక్తః భవేత్ = అనిర్యుక్తమగును; పదతాలస్వరైః= పదతాళ స్వరములచేతను; తేన్నవిరుదాభ్యాం చ = తేన్నవిరుదములచేతను; గీయతే= గానము చేయుబడును.

**తాత్పర్యము :** ఇది అనిర్యుక్తమగును. పదతాళస్వరములచేతను తేన్నవిరుదములచేతను గానముచేయుబడును.

**నిర్యుక్తః శరభలీలః ప్రబంధః కథ్యతే బుధైః ।**
**ప్రతాపవర్ధనస్తస్మాదుమాతిలకసంజ్ఞకః ॥ 37 ॥**

**ప్రతిపదార్థము :** బుధైః = పండితులచే; శరభలీలప్రబంధః = శరభలీల ప్రబంధము; నిర్యుక్తః కథ్యతే = నిర్యుక్తముగా చెప్పబడినది; తస్మాత్ = అందువలన; ప్రతాపవర్ధన= ప్రతాపవర్ధనము; ఉమాతిలకసంజ్ఞకః = ఉమాతిలకము అను పేరుగలది.

**తాత్పర్యము :** పండితులచే శరభలీల ప్రబంధము నిర్యుక్తముగా చెప్పబడినది అందువలన ప్రతాప వర్ధనము ఉమాతిలకము అనుపేరుగలది.

**పంచాననః పంచభంగీ శ్రీరంగః శ్రీవిలాసకః ।**
**అనిర్యుక్తా అమీ సర్వే షడంగానీతి కీర్తితాః ॥ 38 ॥**

**ప్రతిపదార్థము :** పంచాననః = పంచాననము; పంచభంగీ = పంచభంగియు; శ్రీరంగ= శ్రీరంగము; శ్రీవిలాసకః = శ్రీవిలాస(క)ము; అమీసర్వే = ఇవిఅన్నియు; అనిర్యుక్తాః= అనిర్యుక్తములు; షడంగాని ఇతి = షడంగములని, కీర్తితాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** పంచాననము పంచభంగియు శ్రీరంగము శ్రీవిలాస(క)ము ఇవిఅన్నియు అనిర్యుక్తముల షడంగములని చెప్పబడినవి.

**ఇతి ద్విధాతుకాః సర్వే కథితాస్తదనంతరమ్ ।**
**త్రిధాతుకానహం వక్ష్యే ద్వ్యంగాదిక్రమభేదతః ॥ 39 ॥**

**ప్రతిపదార్థము :** ఇతి = ఈప్రకారముగా; ద్విధాతుకాః సర్వే = అన్నిద్విధాతుకములును; కథితాః = చెప్పబడినవి; తదనంతరం = అటుతరువాత; ద్వ్యంగ్యాదిక్రమభేదతః = ద్వ్యంగము మొదలగు భేదము(చే) ననుసరించి, త్రిధాతుకాన్ అహం వక్ష్యే = త్రిధాతుకములను నేను చెప్పుచున్నాను.

**తాత్పర్యము :** ఈప్రకారముగా అన్ని ద్విధాతుకములును చెప్పబడినవి. అటుతరువాత ద్వ్యంగముమొదలగు భేదము(చే)ననుసరించి; త్రిధాతుకములను నేను చెప్పుచున్నాను.

**లంభకో రససందోహో హంసపాదస్తథైవ చ ।**
**హరిర్విజయసంజ్ఞః స్యాదేకతాలీ తథైవ చ ॥ 40 ॥**

**ప్రతిపదార్థము :** లంభకః = లంభకము; రససందోహః = రససందోహము; హంసపాద= హంసపాదము; హరిః = హరి; విజయసంజ్ఞః = విజయము (హరివిజయమైనను కావచ్చును)ఏకతాలీ స్యాత్ = ఏకతాళము కలదగును; ఏకతాలిప్రబంధనామమగుచో (ఏకతాలియు అను అన్వయమగును); తథైవ = అట్లే;

**తాత్పర్యము :** లంభకము రససందోహము హంసపాదము హరివిజయము (హరివిజయమైనను కావచ్చును) ఏకతాళము కలదగును. ఏకతాలిప్రబంధ నామమగుచో (ఏకతాలియు అను అన్వయమగును) అట్లే;

**ధ్వనకుట్టనినామాని పదతాలసమాయుతః ।**
**పితాయుతోఽంకచారీ స్యాదనిర్యుక్తాః సమీరితాః ॥ 41 ॥**

**ప్రతిపదార్థము :** ధ్వనికుట్టనినామాని = ధ్వనికుట్టని; పదతాలసమాయుతః = పదతాలముతో కూడినదగును; పితాయుతః = (పి)తాళసంయుక్తమైన; అంకచారీ చ = అంకచారియు; అనిర్యుక్తాః సమీరితాః = అనిర్యుక్తములుగా చెప్పబడినది.

**తాత్పర్యము :** ధ్వనికుట్టని పదతాలముతో కూడిన దగును. (పి) తాళసంయుక్తమైన అంకచారియు అనిర్యుక్తములుగా చెప్పబడినది.

**విపదీ చ పదాయుక్తా కందశ్చైవ విపాయుతః ।**
**నిర్యుక్తౌ కథితావేతౌ గీతజ్ఞానవిచక్షణైః ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : పదాయుక్తా = పదయుతము; విపదీ = విపది; విపాయుతః = విరుదపాదయుతము; కందశ్చ = కందమును; ఏతౌ = ఈరెండును; నిర్యుక్తౌ కథితౌ= నిర్యుక్తములుగా చెప్పబడినవి.

**తాత్పర్యము** : పదయుతము విపదివిరుదపాదయుతము కందమును ఈరెండును నిర్యుక్తములుగా చెప్పబడినవి.

**జయమాలా చక్రవాలా తథా రాగకదంబకః ।**
**కాలార్ణవో ఝోంబటశ్చ రాసకశ్చోభయాత్మికాః ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : జయమాలా చక్రవాలా = జయమాల మరియు చక్రవాలములు; తథా = అట్లే; రాగకదంబకః = రాగకదంబకము; కాలార్ణవః = కాలార్ణవము; ఝోంపట= ఝోంపటము; రాసకశ్చ = రాసకమును; ఉభయాత్మికాః = ఉభయాత్మకములు.

**తాత్పర్యము** : జయమాల మరియు చక్రవాలములు అట్లే రాగకదంబకము కాలార్ణవము ఝోంపటము రాసకమును ఉభయాత్మకములు.

**గీయంతే పదతాలాభ్యామమీ గీతవిశారదైః ।**
**స్వరార్థస్తా (పి) సైర్జ్ఞేయః స్యాత్ తథా సింహవిక్రమః ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : అమీ = ఈప్రబంధములు; పదతాలాభ్యాం గీయంతే = పదతాలములచే గానముచేయబడును; స్వరార్థః = స్వరార్థము; తా(పి)సైః = తాపిసై అను సంజ్ఞచే; జ్ఞేయః = తెలియదగినది; తథా = అట్లే; సింహవిక్రమః స్యాత్ = సింహవిక్రమమగును.

**తాత్పర్యము** : ఈప్రబంధములు పదతాలములచే గానము చేయబడును. స్వరార్థము తాపిసై అను సంజ్ఞచే తెలియదగినది. అట్లే సింహవిక్రమమగును.

**కైవాడపాటకరణౌ తావివాసహితావుభౌ ।**
**తాపిసైః స్వరకరణం పతేతా లలి(తా) తథా ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : కైవాడపాటకరణౌ = కైవాడపాటకరణములు; తావివ = తాళ

విరుదములవలె; ఉభౌసహితౌ = రెండును కలసియుండును; తాపిస్తైః = తాళ(స్వరార్థ) ములచే; స్వకరణం = స్వకరణమును; తథా = అట్లే; లలితా = లలిత; పతేతా = పదతేన్నతాళయుతము.

**తాత్పర్యము** : కైవాడపాట కరణములు తాళవిరుదములవలె రెండును కలసి యుండును. తాళ (స్వరార్థ) ములచే స్వకరణమును అట్లే లలితపదతేన్న తాళయుతము.

**తేపాస్తైర్మిశ్రకరణమనిర్యుక్తా అమీ స్మృతాః ।**
**ఆర్యావృత్తద్విపథకా యే గాథా దండకాద్దిలాః ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : తేపాస్తైః = తేన్నపాట (స్వరముల)చే; మిశ్రకరణః = మిశ్రకరణము; భవతి = అగుచున్నవి; అవిమ్యక్తాః అయాం ఇవి అనిర్యుక్తములుగా చెప్పబడుచున్నవి. యేగాథాః = యేగాథలు; ఆర్యావృత్తద్విపథకాః = ఆర్యావృత్త ద్విపథకములో; తే = అవి; దండకాత్ = దండకమువలన; ఏ (ఇ)లాః = ఏలలు;

**తాత్పర్యము** : తేన్నపాట (స్వరముల)చే మిశ్రకరణము అగుచున్నది. ఇవి అని ర్యుక్తములుగా చెప్పబడుచున్నవి. యేగాథలు ఆర్యావృత్తద్విపథకములో అవి దండకమువలన ఏలలు;

**ఏతే స్యుః స్వసపతాయుక్తా మాతృకా పవితాయుతా ।**
**థడః పతేతాసహితో నిర్యుక్తాః కథితా అమీ ॥ 47 ॥**

**ప్రతిపదార్థము** : ఏతే = ఇవి; స్వపతాయుక్తాః స్యుః = స్వరపదతాళయుతములు; మాతృకా = మాతృక; పవితాయుతా = పదవిరుదతాళయుతము; థడః = థడము; పతేతా సహితః = పదతేన్నతాళయుతము; అమీ = ఇవి; నిర్యుక్తాః కథితా = నిర్యుక్తములుగా చెప్పబడినవి.

**తాత్పర్యము** : ఇవి స్వరపద తాళయుతములు. మాతృక పదవిరుద తాళయుతము. థడము పదతేన్న తాళయుతము. ఇవి నిర్యుక్తములుగా చెప్పబడినవి.

**పపాతాసహితో జ్ఞేయః సింహవిక్రాంతనామకః ।**
**కలహంసః క్రౌంచపదః స్వపతాసహితావుభౌ ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : సింహవిక్రాంత నామకః = సింహవిక్రాంతము; పపాతాసహితః జ్ఞేయ= పదపాటతాలయుతము; కలహంస = కలహంస(ము); క్రౌంచపదః = క్రౌంచపదము;

ఉభౌ = ఈరెండును; స్వపతాసహితౌ = స్వరపదతాళసహితములు.

**తాత్పర్యము** : సింహవిక్రాంతము పదపాటతాలయుతము. కలహంస (ము) క్రౌంచపదము ఈరెండును స్వరపదతాళసహితములు.

> **గీతవిద్యావిశేషజ్ఞైః కథితా ఉభయాత్మికాః ।**
> **శ్రీవర్ధన ఇతి ఖ్యాతః పాతాపిపతితో బుధైః ॥ 49 ॥**

**ప్రతిపదార్థము** : అమీ = ఇవి; గీతవిద్యావిశేషజ్ఞైః = సంగీతవిద్వాంసులచే; ఉభయాత్మికాః కథితాః = ఉభయాత్మకములుగా చెప్పబడినవి; శ్రీవర్ధన ఇతి ఖ్యాతః = శ్రీవర్ధన (నామక) ము; పాతాపి పతితః = పాటతాళయుతముగా; బుధైః ఖ్యాతః = పండితులచే ప్రసిద్ధముగా చెప్పబడినవి.

**తాత్పర్యము** : ఇవి సంగీతవిద్వాంసులచే ఉభయాత్మకములుగా చెప్పబడినవి. శ్రీవర్ధన (నామక)ము పాట తాళయుతముగా పండితులచే ప్రసిద్ధముగా చెప్పబడినది.

> **విరుదస్వరపదతాలైః స్వరపదకరణం స్వరాంకశ్చ ।**
> **జ్ఞేయా సా గజలీలా వర్తనీ వివర్తనీ చ పంచాపి (?) ॥ 50 ॥**

**ప్రతిపదార్థము** : స్వరపదకరణం = స్వరపదకరణము; స్వరాంకః = స్వరాంకము; గజలీలాః = గజలీల; వర్తనీ = వర్తని; వివర్తనీ = వివర్తనియు; పంచాపి = ఈఐదును; విరుదస్వరపదతాలైః = విరుదస్వరపదతాలములచే; జ్ఞేయాః = తెలియదగినవి.

**తాత్పర్యము** : స్వరపదకరణము, స్వరాంకము, గజలీల, వర్తని, వివర్తనియు ఈఐదును విరుదస్వర పదతాలములచే తెలియదగినవి.

> **విజ్ఞేయం బంధకరణం సవిపాతాయుతో బుధైః ।**
> **ప్రబంధశ్చిత్రకరణం పంచతాలేశ్వరస్తథా ॥ 51 ॥**

**ప్రతిపదార్థము** : బుధైః = పండితులచే; బంధకరణం = బంధకరణము; సవిపాతాయుత = (షడ్జ) స్వరివిరుద పాటతాళయుతముగా; విజ్ఞేయం = తెలియదగినది; చిత్రకరణం ప్రబంధం = చిత్రకరణప్రబంధము; పంచతాలేశ్వరః = పంచతాలేశ్వరము.

**తాత్పర్యము** : పండితులచే బంధకరణము (షడ్జ) స్వరివిరుదపాటతాళయుతముగా తెలియదగినది. చిత్రకరణప్రబంధము పంచతాలేశ్వరము.

**ప్రబంధస్తేన్నకరణం స్వతేతాపియుతః స్మృతః ।**
**తేపాసపయుతః ప్రాజ్ఞైశ్చతురంగ ఇతీరితః ॥ 52 ॥**

**ప్రతిపదార్థము :** తేన్నకరణం ప్రబంధం = తేన్నకరణ ప్రబంధము; స్వతేతాపియుతః స్మృతః = స్వరతేన్నతాళ (పి)యుతముగా తెలుపబడినది; చతురంగః = చతురంగము; తేపానపయుతః = తేన్నపాట షడ్జస్వరపదయుతముగా; ఈరితః = చెప్పబడినది.

**తాత్పర్యము :** తేన్నకరణ ప్రబంధము స్వర తేన్నతాళ(పి) యుతముగా, తెలుపబడినది. చతురంగము తేన్నపాట షడ్జస్వరపదయుతముగా చెప్పబడినది.

**అనిర్యుక్తా అమీ ప్రోక్తా గీతశాస్త్రవిశారదైః ।**
**తాతేపసయుతా తజ్జైర్నిర్యుక్తా సా చతుష్పదీ ॥ 53 ॥**

**ప్రతిపదార్థము :** గీతశాస్త్రవిశారదైః = సంగీతకోవిదులచే; అమీ = ఇవి; అనిర్యుక్తాః ప్రోక్తాః = అనిర్యుక్తములుగాచెప్పబడినవి; తజ్జైః = ఆ పండితులచే; తాతేపసయుతా ప్రోక్తా = తాళతేన్నపదషడ్జస్వరయుతమైన; సపా చతుష్పదీ = ఆ చతుష్పది; నిర్యుక్తా ప్రోక్తా = నిర్యుక్తముగా చెప్పబడినది.

**తాత్పర్యము :** సంగీతకోవిదులచే ఇవి అనిర్యుక్తములుగా చెప్పబడినవి. తాళతేన్నపద షడ్జస్వరయుతమైన ఆ చతుష్పది నిర్యుక్తముగా చెప్పబడినది.

**సపితాపయుతా తజ్జైర్హయలీలా నిగద్యతే ।**
**పపాతాస్వయుతౌ జ్ఞేయాస్త్రిభంగీ చోభయాత్మికౌ (?) ॥ 54 ॥**

**ప్రతిపదార్థము :** సపితాపయుతా = షడ్జస్వర(పి) తాళపదయుతము; హయలీలా నిగద్యతే = హయలీల యగును; పపాతాస్వయుతా = పదపాటతాళ స్వరయుతమైనది; త్రిభంగీ = త్రిభంగి; ఏతౌ = ఈరెండును; ఉభయాత్మికౌ = ఉభయాత్మకములు.

**తాత్పర్యము :** షడ్జస్వర (పి) తాళ పదయుతము హయలీలయగును. పదపాటతాళ స్వరయుతమైనది త్రిభంగి ఈరెండును ఉభయాత్మకములు.

**స్వతాపితేపసహితో జయశ్రీరితి కీర్తితః ।**
**స్యాద్ వస్తు విజయశ్రీశ్చ వర్ణస్వరచతుర్ముఖౌ ॥ 55 ॥**

**ప్రతిపదార్థము :** స్వతాపితేపసహితః = స్వరతాళ (పి)తేన్నపదములతో కూడినది;

జయశ్రీః ఇతి = జయశ్రీఅని; కీర్తితః = పేర్కొనబడినది; వస్తు = వస్తువు; విజశ్రీః = విజయశ్రీయు; వర్ణస్వరచతుర్ముఖౌ = వర్ణస్వరచతుర్ముఖములును;

**తాత్పర్యము** : స్వరతాళ (పి) తేన్నపదములతో కూడినది జయశ్రీయని పేర్కొన బడినది. వస్తువు విజయశ్రీయు వర్ణస్వర చతుర్ముఖములును;

> **స్వపాపతేతాసహితా విజ్ఞేయా గీతకోవిదైః ।**
> **ప్రబంధో వర్ధనానందస్తథా హరవిలాసకా ॥ 56 ॥**

**ప్రతిపదార్థము** : గీతకోవిదైః = సంగీత శాస్త్రజ్ఞులచే; స్వపాపతేతా సహితా = స్వరపాదపదతేన్నతాళయుతములుగా; విజ్ఞేయాః = తెలియదగినవి; తథా = అట్లే; వర్ధనానందః ప్రబంధః = వర్ధనానందము; హరవిలాసకా = హరవిలాసకము.

**తాత్పర్యము** : సంగీతశాస్త్రజ్ఞులచే స్వరపాదపదతేన్న తాళయుతములుగా తెలియదగినది. అట్లే వర్ధనానందము హరవిలాసకము.

> **కథ్యతే సపితాతేతా సహితావితి కోవిదైః ।**
> **అనిర్యుక్తా అమీ సర్వే నిర్యుక్తో వస్తుసంజ్ఞకః ॥ 57 ॥**

**ప్రతిపదార్థము** : సపితాతేతా సహితౌ = షడ్జస్వర (పితా) తేన్న తాళసహితములుగా; కథ్యతే = చెప్పబడినది; అమీ సర్వే = ఇవిఅన్నియు; అనిర్యుక్తాః = అనిర్యుక్తములు; వస్తుసంజ్ఞకః = వస్తునామక ప్రబంధముమాత్రము; నిర్యుక్తః = నిర్యుక్తము.

**తాత్పర్యము** : షడ్జస్వర (పితా) తేన్నతాళ సహితములుగా చెప్పబడినవి. ఇవిఅన్నియు అనిర్యుక్తములు. వస్తునామక ప్రబంధముమాత్రము నిర్యుక్తము.

ఇతి త్రిధాతుక ప్రబంధాః = ఇట్లు త్రిధాతుక ప్రబంధములు చెప్పబడినవి.

> **పతాయుక్తా ఢేంకికా చ ఏలా సాపవితాయుతా ।**
> **గీతవిద్యావిశేషజ్ఞైః స్మృతౌ తావుభయాత్మికౌ ॥ 58 ॥**

**ప్రతిపదార్థము** : ఢేంకికా పతాయుక్తా = ఢేంకిక పదతాళయుతము; ఏలా = ఏల; సాలవితాయుతా = షడ్జస్వరపదవిరుదతాళయుతము; తౌ ఉభౌ = అవి రెండును; ఉభయాత్మికౌ = ఉభయాత్మకములుగా; స్మృతౌ = తలచబడినవి.

**తాత్పర్యము** : ఢేంకిక పదతాళయుతము. ఏల షడ్జస్వరపదవిరుదతాళయుతము. అవి రెండును ఉభయాత్మకములుగా తలచబడినవి.

**ప్రోక్తావిమౌ చతుర్ధాత్ర క్వచిజ్ఝోంపడరాసకౌ ।**
**పున: ప్రబంధాస్త్రివిధాస్తే కథ్యంతే యథాక్రమమ్ ॥ 59 ॥**

**ప్రతిపదార్థము :** ఇమౌ = ఈరెండును; అత్ర = ఇక్కడ; చతుర్ధా = నాల్గువిధములుగా; ప్రోక్తౌ = చెప్పబడినవి; క్వచిత్ = ఒక్కొక్కచోట; జ్ఝోంపడంరాసకౌ ప్రోక్తౌ = ఝొంపడ రాసకములు చెప్పబడినవి; పున: = మరల; ప్రబంధా: త్రివిధా: = ప్రబంధములు ముప్విధములు; తే యథా క్రమం కథ్యంతే = అవి వరుసగా చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము :** ఈరెండును ఇక్కడ నాల్గువిధములుగా చెప్పబడినవి. ఒక్కొక్క చోట ఝొంపడ రాసకములు చెప్పబడినవి. మరల ప్రబంధములు ముప్విధములు. అవి వరుసగా చెప్పబడుచున్నవి.

**సూడక్రమాగతా: కేచిత్ కేచిదాలిక్రమస్థితా: ।**
**తథాఽన్యే విప్రకీర్ణాఖ్యా మునిభి: ప్రతిపాదితా: ॥ 60 ॥**

**ప్రతిపదార్థము :** కేచిత్ = కొన్ని; సూడక్రమాగతా: = సూడక్రమమునుండి వచ్చినవి; కేచిత్ = కొన్ని; ఆలిక్రమస్థితా: = ఆలిక్రమజనితములు, అన్యే = మరికొన్ని; విప్రకీర్ణాఖ్యా: = విప్రకీర్ణములని; మునిభి: = మహర్షులచే; ప్రతిపాదితా: = నిర్ధారింపబడినవి.

**తాత్పర్యము :** కొన్నిసూడక్రమమునుండి వచ్చినవి. కొన్ని ఆలిక్రమజనితములు. మరికొన్ని విప్రకీర్ణములని మహర్షులచే నిర్ధారింపడినవి.

**తత్ర సూడక్రమ: ప్రోక్త: పంచధా గీతవేదిభి: ।**
**ఆదావతిజఘన్య: స్యాజ్జఘన్యస్తదనంతరమ్ ॥ 61 ॥**

**ప్రతిపదార్థము :** తత్ర = అందు; సూడక్రమ: = సూడక్రమప్రభేదము; గీతవేదిభి= సంగీతజ్ఞులచే; పంచధా = ఐదువిధములుగా; ప్రోక్త: = చెప్పబడినది; ఆదౌ = ముందు (మొదట); అతిజఘన్య: = అతిజఘన్యము; (మిక్కిలినీచము) (అధమాధమము); తదనంతరం = తరువాత; జఘన్య = జఘన్యము; (అధమము).

**తాత్పర్యము :** అందు సూడక్రమప్రభేదము సంగీతజ్ఞులచే ఐదు విధములుగా చెప్పబడినది. ముందు (మొదటి) అతిజఘన్యము (మిక్కిలి నీచము) (అధమాధమము) తరువాత జఘన్యము (అధమము).

**తతో౽పి మధ్యమాఖ్యా స్యాదుత్తమాఖ్యస్తతః పరమ్ ।**
**అత్యుత్తమస్తతో జ్ఞేయస్తేషాం లక్షణముచ్యతే ॥ 62 ॥**

**ప్రతిపదార్థము :** తతః = తరువాత; మధ్యమాఖ్యః స్యాత్ = మధ్యమప్రబంధమగును; తతః పరం = తరువాత; ఉత్తమాఖ్యః = ఉత్తమమని తెలియదగినది; తతః = ఆతరువాత; అత్యుత్తమః = అత్యుత్తమమని; తేషాం = వాటికి; లక్షణం ఉచ్యతే = లక్షణము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** తరువాత మధ్యమప్రబంధమగును. తరువాత ఉత్తమమని ఆతరువాత అత్యుత్తమమని తెలియదగినది. వాటికి లక్షణముచెప్పబడుచున్నది.

**ఝొంబడో మట్టతాలేన తతోనిస్సారు ఝొంబడః ।**
**కుడుక్కేన తతో లంభో లంభో నిస్సారుకేణ చ ॥ 63 ॥**

**ప్రతిపదార్థము :** మట్టతాలేన = మట్టతాళముచేతను; ఝొంపడః = ఝొంపడము; మట్టఝొంపడము; తతః = తరువాత; నిస్సారుఝొంపడః = నిస్సారుఝొంపడము; తతః = తరువాత; కుడుక్కేన లంబః = కుడుక్కముచేత లంభము (కుడుక్క లంభము); నిస్సారుకేణ చ లంబః = నిస్సారులంభము.

**తాత్పర్యము :** మట్టతాళముచేతను ఝొంపడము, మట్టఝొంపడము తరువాత నిస్సారు ఝొంపడము తరువాత కుడుక్కము చేత లంభము (కుడుక్కలంభము) నిస్సారులంభము.

**ఝంపతాలేన లంభశ్చ రాసకశ్చైకతాలికా ।**
**అసావతిజఘన్యాఖ్యః సూడో గాయకసర్వతః ॥ 64 ॥**

**ప్రతిపదార్థము :** ఝంపతాలేన లంభః = ఝంపలంభము; ఏకతాలికా రాసకశ్చ = ఏకతాల రాసకము (అని); అసౌ = ఇది; గాయక సర్వతః = గాయక సర్వమునకు; అతి జఘనాఖ్యః సూడః= సూడక్రమము నందు అతిజఘన్యప్రబంధప్రభేదము.

**తాత్పర్యము :** ఝంపలంబము ఏకతాల రాసకము (అని) ఇది గాయకసర్వమునకు సూడక్రమమునందు అతి జఘన్యప్రబంధప్రభేదము.

**ఢేంకీ తతో ద్వితీయేన భవేత్తాలేన ఝొంబడః ।**
**మట్టేన ఝొంబడశ్చాథ తతో నిస్సారుఝొంబడాః ॥ 65 ॥**

**ప్రతిపదార్థము :** తతః = తరువాత; ఢేంకీ = ఢేంకి; ద్వితీయేన తాలేన ఝోంబడః భవేత్ = ద్వితీయ తాలఝోంబడము; అథ = తరువాత; మట్టేన ఝోంబడః = మట్టఝోంబడము; తతః = తరువాత; నిస్సారుఝోంబడః = నిస్సారుఝోంబడము.

**తాత్పర్యము :** తరువాత ఢేంకి ద్వితీయతాలఝోంబడము. తరువాత మట్టఝోం బడము. తరువాత నిస్సారుఝోంబడము.

**లంభకోఽథ కుడుక్కేన తతో నిస్సారులంభకః ।**
**ఝంపతాలేన లంభశ్చ రాసకశ్చైకతాలికా ॥ 66 ॥**

**ప్రతిపదార్థము :** అథ = తరువాత;కుడుక్కేన లంభకః = కుడుక్కలంభకము; తత= తరువాత; నిస్సారులంభకః = నిస్సారు లంభకము; ఝంపతాలేన లంభశ్చ = ఝంపతాలలంభము; ఏకతాలికా రాసకశ్చ = ఏకతాల రాసకమును.

**తాత్పర్యము :** తరువాత కుడుక్కలంభకము. తరువాత నిస్సారు లంభకము ఝంపతాల లంభము. ఏకతాల రాసకమును.

**సూడో జఘన్యనామాయం గీతజ్ఞైః సముదాహృతః ।**
**ఏలా పూర్వం తతో ఢేంకీ తస్మాద్ గారుగిఝోంబడః ॥ 67 ॥**

**ప్రతిపదార్థము :** జఘన్యనామాయం సూడః = జఘన్యమను (అధమము) సూడా క్రమము; గీతజ్ఞైః సముదాహృతః = సంగీత పండితులచే ఉదహరింపబడినది; పూర్వం = ముందు; ఏలా = ఏలయు; తతః = తరువాత; ఢేంకీ = ఢేంకియు; తస్మాత్ = తరువాత; గారుగిఝోంబడః = గారుగి ఝోంబడము.

**తాత్పర్యము :** జఘన్యమను (అధమము) సూడాక్రమము సంగీతపండితులచే ఉదహరింపబడినది. ముందు ఏలయు తరువాత ఢేంకియు తరువాత గారుగిఝోం బడము.

**ద్వితీయఝోంబడశ్చాథ తతో మట్టేన ఝోంబడః ।**
**ఝోంబడోఽథ తృతీయేన తతో నిస్సారుఝోంబడః ॥ 68 ॥**

**ప్రతిపదార్థము :** అథ = తరువాత; ద్వితీయ ఝోంబడః = ద్వితీయ ఝోంబడము; తతః =తరువాత; మట్టేన ఝోంబడః = మట్టఝోంబడము; అథ = తరువాత; తృతీయేన ఝోంబడః = తృతీయఝోంబడము; తతః = తరువాత; నిస్సారుఝోంబడః = నిస్సారు ఝోంబడము.

**తాత్పర్యము** : తరువాత ద్వితీయ ఝొంబడము. తరువాత మట్టఝొంబడము. తరువాత తృతీయ ఝొంబడము. తరువాత నిస్సారు ఝొంబడము.

**ఝొంబడో ద్రుతనిస్సారో లంభకో ఝుంభయా తతః ।**
**రాసకశ్చైవ తాలీ చ సూడోఽయం మధ్యమః స్మృతః ॥ 69 ॥**

**ప్రతిపదార్థము** : ద్రుతనిస్సారః ఝొంబడః = ద్రుతనిస్సార ఝొంబడము; తతః = తరువాత; ఝుంభయా లంభకః = ఝుంభాలంబకము; ఏకతాళీ రాసకశ్చ = ఏకతాలీ రాసకమును; అయం = ఇది; మధ్యమః సూడః స్మృతః = మధ్యమ సూడప్రబంధముగా నిశ్చితము.

**తాత్పర్యము** : ద్రుతనిస్సార ఝొంబడము. తరువాత ఝుంభాలంబకము. ఏకతాలీ రాసకమును. ఇది మధ్యమ సూడప్రబంధముగా నిశ్చితము.

**కరణం ప్రాగథైలాస్యాద్ఢేంకికా తదనంతరమ్ ।**
**గా (రా?రు) గ్యా ఝొంబడశ్చాథ ద్వితీయేనాపి ఝొంబడః ॥ 70 ॥**

**ప్రతిపదార్థము** : ప్రాక్ = మొదట; కరణం = కరణము; అథ = తరువాత; ఏలా = ఏలయు; తదనంతరం = దీని తరువాత; ఢేంకికా = ఢేంకియు; గారుగ్యా ఝొంబడః = గారుగిఝొంబడము; ద్వితీయేన ఝొంబడః = ద్వితీయ ఝొంబడము.

**తాత్పర్యము** : మొదట కరణము. తరువాత ఏలయు, దీని తరువాత ఢేంకియు, గారుగిఝొంబడము, ద్వితీయ ఝొంబడము.

**ఝొంబడశ్చైకతాలేన తతో మట్టేన ఝొంబడః ।**
**తృతీయఝొంబడశ్చాథ తతో నిస్సారుఝొంబడః ॥ 71 ॥**

**ప్రతిపదార్థము** : ఏకతాలేన ఝొంబడః = ఏకతాలఝొంబడము; తతః = తరువాత; మట్టేన ఝొంబడః = మట్టఝొంబడము; అథ = తరువాత; తృతీయ ఝొంబడః = తృతీయఝొంబడము; తతః = తరువాత; నిస్సారుఝొంబడః = నిస్సారుఝొం బడము.

**తాత్పర్యము** : ఏకతాలఝొంబడము, తరువాత మట్టఝొంబడము, తరువాత తృతీయఝొంబడము, తరువాత నిస్సారు ఝొంబడము.

**ఝొంబడోఽథ కుటుక్కేన ఝంపతాలేన లంభకః ।**
**రాసకశ్చైకతాలీ చ సూడఃస్యాదుత్తమాభిధః ॥ 72 ॥**

**ప్రతిపదార్థము** : అథ =తరువాత; కుటుక్కేన ఝొంబడః = కుటుక్కఝొంబడము; ఝంపతాలేన లంభకః = ఝంపాలంభకము; ఏకతాలీరాసకః = ఏకతాలీ రాసకమును; ఉత్తమాభిధః సూడః స్యాత్ = ఉత్తమసూడప్రబంధ ప్రభేదమగును.

**తాత్పర్యము** : తరువాత కుటుక్కఝొంబడము, ఝంపాలంభకము, ఏకతాలీ రాసకమును ఉత్తమ సూడప్రబంధప్రభేదమగును.

**గద్యం తతశ్చ కరణం వర్తన్యేలా చ ఢేంకికా ।**
**గారుగ్యా (ఝూ)చోంబడశ్చాథ ద్వితీయేనాపి ఝొంబడః ॥ 73 ॥**

**ప్రతిపదార్థము** : గద్యం = గద్యము; తతః = తరువాత; కరణం = కరణము; వర్తనీ= వర్తని; ఏలా = ఏలయు; ఢేంకికా = ఢేంకి; గారుగ్యా ఝొంబడః = గారుగిఝొంబడము; ద్వితీయేన ఝొంబడః = ద్వితీయఝొంబడము.

**తాత్పర్యము** : గద్యము తరువాత కరణము వర్తని ఏలయు ఢేంకి గారుగిఝొంబడము ద్వితీయఝొంబడము.

**ఝొంబడశ్చైకతాలేన ప్రతిమట్టేన ఝొంబడః ।**
**ఝొంబడోఽథ తృతీయేన తతో నిస్సారుఝొంబడః ॥ 74 ॥**

**ప్రతిపదార్థము** : ఏకతాలేన ఝొంబడః = ఏకతాలీ ఝొంబడము; ప్రతిమట్టేన ఝొంబడః = ప్రతిమట్టచోంబడము; అథ = తరువాత; తృతీయేన ఝొంబడః = తృతీయ ఝొంబడము; తతః = తరువాత; నిస్సారుఝొంబడః =నిస్సారుఝొంబడము.

**తాత్పర్యము** : ఏకతాలీ ఝొంబడము ప్రతిమట్ట ఝొంబడము తరువాత తృతీయ ఝొంబడము తరువాత నిస్సారు ఝొంబడము.

**ఝొంబడో ద్రుతనిస్సారో ఝంపాతాలేన లంభకః ।**
**రాసకశ్చైకతాలీ చ సూడః స్యాదుత్తమోత్తమః ॥ 75 ॥**

**ప్రతిపదార్థము** : ద్రుత నిస్సారః ఝొంబడః = ద్రుతనిస్సార ఝొంబడము;

ఝంపతాలేన లంభకః = ఝంపాలంభకము; ఏకతాలీ రాసకశ్చ = ఏకతాలీ రాసకమును; ఉత్తమోత్తమః సూడః స్యాత్ = ఉత్తమోత్తమసూడ ప్రబంధ ప్రభేదమగును.

**తాత్పర్యము :** ద్రుత నిస్సార ఝొంబడము ఝంపాలంబకము ఏకతాలీ రాసకమును ఉత్తమోత్తమ సూడ ప్రబంధ ప్రభేదమగును.

**ఉత్తమోత్తమసూడాంతర్గతైలాగానమాద్రుతమ్ ।**
**రాగస్య నియమాద్ గాతుర్నేతిరాగాంతరేణ తత్ ॥ 76 ॥**

**ప్రతిపదార్థము :** ఉత్తమోత్తమసూడాంతర్గతైలాగానం = ఉత్తమోత్తమ సూడాప్రభేదమందలి ఏలాగానము; ఆద్రుతం = ద్రుతాంతము; గాతుఃన = గాయకుని యొక్కకాక; రాగస్యనియమాత్ = రాగము యొక్కనియమము వలన; రాగాంతరేణ= మరియొకరాగముచే; తత్ = ఆగానము.

**తాత్పర్యము :** ఉత్తమోత్తమసూడా ప్రభేదమందలి ఏలాగానము ద్రుతాంతము గాయకుని యొక్క కాక రాగముయొక్క నియమమువలన మరియొక రాగముచే ఆగానము.

**తదుక్తం రాసరాగభ్యామౌచిత్యాత్ సైవ గీయతే ।**
**ప్రౌఢానేనైవ రాగేణ సూడోఽపి పరిగీయతే ॥ 77 ॥**

**ప్రతిపదార్థము :** రసరాగాభ్యాం ఔచిత్యాత్ = రాసరాగౌచిత్యమువలన; గీయతే = గానముచేయబడును; అనేనైవ రాగేణ = ఈరాగముచేతనే; ప్రౌఢా = ప్రౌఢమైన (ప్రౌడసూడ) సూడః అపి పరిగీయతే = సూడప్రబంధముకూడ గానము చేయబడుచున్నది.

**తాత్పర్యము :** రసరాగౌచిత్యమువలన గానముచేయబడును. ఈరాగము చేతనే సూడ ప్రబంధముకూడ గానము చేయబడుచున్నది.

**అత ఉత్తమసూడే తు రాగస్య నియమం వినా ।**
**ఛందస్వతీ సంకరైలా మాత్రైలా పరిగీయతే ॥ 78 ॥**

**ప్రతిపదార్థము :** అతః = అందువలన; ఉత్తమసూడే తు = ఉత్తమసూడాప్రభేదమందు; రాగస్య నియమం వినా = రాగనియమము లేకనే; ఛందస్వతీ = ఛందస్సుకల (ఏల); సంగరైలా = సంగర ఏలా; మాత్రైలా = మాత్రాఏల; పరిగీయతే = గానముచేయబడు చున్నది.

**తాత్పర్యము** : అందువలన ఉత్తమ సూడా ప్రభేదమందు రాగనియమము లేకనే ఛందస్సుకల (ఏల) సంగర ఏలా మాత్రా ఏల గానము చేయబడుచున్నది.

**మధ్యేమధ్యే మంకుడస్య రాగస్య నియమేన తు ।**
**వర్ణైలా వర్ణమాలైలా దేశాఖ్యైలా చ గీయతే ॥ 79 ॥**

**ప్రతిపదార్థము** : మధ్యే మధ్యే = మధ్యమధ్యన; మంకుడస్య రాగస్య నియమేనతు = మంకుడరాగనియమముచేతను మాత్రము; వర్ణైలా = వర్ణఏలా; వర్ణమాలైలా = వర్ణమాల ఏలా; దేశాఖ్యైలా = దేశైలా; గీయతే = గానము చేయబడుచున్నది

**తాత్పర్యము** : మధ్యమధ్యన మంకుడరాగనియమముచేతను మాత్రము వర్ణఏలా వర్ణమాల ఏలా దేశైలా గానముచేయబడుచున్నది.

**ఉత్తమోత్తమసూడే తు ప్రథమం మాతృకా భవేత్ ।**
**పంచతాలేశ్వరో యద్వా హృద్యం గద్యమథాపి వా ॥ 80 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్తమోత్తమ సూడే = ఉత్తమోత్తమ సూడయందు; ప్రథమం = మొదట; మాతృకాభవేత్ = మాతృకయగును; యద్వా = లేక; పంచతాలేశ్వరః = పంచతాలేశ్వరముగాని; అథాపి వా = లేక; హృద్యం గద్యం భవేత్ = మనోహరమైన గద్యముగాని యగును.

**తాత్పర్యము** : ఉత్తమోత్తమసూడయందు మొదట మాతృకయగును. లేక పంచతాలేశ్వరముగాని, లేక మనోహరమైన గద్యముగాని యగును.

**ఆలిక్రమోయమేవోక్తః ప్రతాపపృథివీభుజా ।**
**అస్మిన్నేలా చ ఢేంకీ చ తతో గారుగితాలతః ॥ 81 ॥**

**ప్రతిపదార్థము** : ప్రతాపపృథివీభుజా = ప్రతాపమహారాజుచే; ఆలిక్రమః అయమేవ = ఈ ఆలిక్రమ ప్రభేదమే; ఉక్తః =చెప్పబడినది; అస్మిన్ = ఈ ఆలిక్రమమందు; ఏలా = ఏలయు; ఢేంకీ = ఢేంకియు; తతః = తరువాత; గారుగితాలతః= గారుగి తాళముచేత

**తాత్పర్యము** : ప్రతాప మహారాజుచే ఈఆలిక్రమ ప్రభేదమే చెప్పబడినది. ఈ ఆలిక్రమ మందు ఏలయు ఢేంకియు తరువాత గారుగి తాళముచేత;

**ద్వితీయేన చ తాలేన ప్రతిమట్టాభిధేన చ ।**
**తతో నిస్సారుతాలేన ఝొంబడో లంభకస్తథా ॥ 82 ॥**

**ప్రతిపదార్థము :** ద్వితీయేన చ తాలేన = ద్వితీయతాళముచేత; ప్రతిమట్టాభిధేన చ = ప్రతిమట్టతాళము చేతను; తతః = తరువాత; నిస్సారుతాలేన = నిస్సారుతాళము చేతను; ఝొంబడః = ఝొంబడము; లంభకః = లంభకము; తథా = అట్లే;

**తాత్పర్యము :** ద్వితీయ తాళముచేతను, ప్రతిమట్టి తాళము చేతను, తరువాత నిస్సారు తాళము చేతను ఝొంబడము లంబకము అట్లే ప్రతిమట్టతాళము చేతను.

**రాసకశ్చైకతాలీ చ స్థాయినో నవ కీర్తితాః ।**
**శేషాః సంచారిణః షట్ చ పరివృత్తిసహిష్ణవః ॥ 83 ॥**

**ప్రతిపదార్థము :** రాసకః ఏకతాలీ = ఏకతాలీ రాసకమును; నవ = (ఈ) తొమ్మిదియు; స్థాయినః కీర్తితాః = స్థాయిప్రబంధములుగా చెప్పబడినవి; పరివృత్తిసహిష్ణవః = పరివృత్తిని సహించు; శేషాః = మిగిలిన; షట్ చ = ఆరు (6) ను; సంచారిణః = సంచారి ప్రబంధములు.

**తాత్పర్యము :** ఏకతాలీ రాసకమును (ఈ)తొమ్మిదియు స్థాయి ప్రబంధములుగా చెప్పబడినవి. ఆరు(6) ను సంచారి ప్రబంధములు.

**ఉత్తమః ప్రాక్స్వరార్థః స్యాత్ స్వరాంకో వా థఢోఽథవా ।**
**కరణం వా త్రిభంగిర్వా యద్వా క్రౌంచపదాభిధః ॥ 84 ॥**

**ప్రతిపదార్థము :** ప్రాక్ స్వరార్థః = ప్రాక్స్వరార్థము (ముందరి స్వరార్థము); ఉత్తమః స్యాత్ = ఉత్తమమగును; స్వరాంకఃవా = స్వరాంకముగాని; అథవా = లేక; థఢః = థడము; కరణం వా = కరణముగాని; త్రిభంగిర్వా = త్రిభంగికాని; యద్వా = లేక; క్రౌంచపదాభిధః = క్రౌంచపదముగాని;

**తాత్పర్యము :** ప్రాక్స్వరార్థము (ముందరి స్వరార్థము) ఉత్తమమగును. స్వరాంకముగాని లేక థడము కరణముగాని త్రిభంగికాని లేక క్రౌంచ పదముగాని;

**భవేచ్చరభలీలో వా పంచభంగిరథాపివా ।**
తత్రైలా ఢేంకికా చైవ తతో గారుగిలాలతః ॥ 85 ॥

**ప్రతిపదార్థము :** శరభలీలః = శరభలీల గాని; అథాపి వా = లేక; పంచభంగి వా = పంచభంగికాని; భవేత్ = అగతును; తత్ర = అందు; ఏలా = ఏలయు; ఢేంకికా చ = ఢేంకియు; తతః = తరువాత; గారుగితాలతః = గారుగి తాళమువలన;

తాత్పర్యము : శరభలీల గాని లేక పంచభంగికాని అగును. అందు ఏలయు ఢేంకియు తరువాత గారుగితాళమువలన;

**ద్వితీయేన చ తాలేన తతో నిస్సారుతాలతః ।**
**ఝొంబడో లంభకో రాసశ్చైకతాలీతి కీర్తితాః ॥ 86 ॥**

**ప్రతిపదార్థము :** ద్వితీయేన తాలేనచ = ద్వితీయతాళముచేతను; తతః = తరువాత; నిస్సారుతాలతః = నిస్సారుతాళము వలన; ఝొంబడః = ఝొంబడము; లంభకః = లంభకము; ఏకతాలీరాసశ్చ = ఏకతాళరాసకమును; కీర్తితాః = చెప్పబడినవి;

**తాత్పర్యము :** ద్వితీయ తాళముచేతను తరువాత నిస్సారు తాళమువలన ఝొంబడము లంభకము ఏకతాళరాసకమును చెప్పబడినవి.

**స్థాయినోఽష్టాపి హీనే తు పంచ సంచారిణః స్మృతాః ।**
**ఏలా స్యాన్మధ్యమే పూర్వం ఢేంకికా తదనంతరమ్ ॥ 87 ॥**

**ప్రతిపదార్థము :** అష్టాపి స్థాయినః హీనే = (8) ఎనిమిది స్థాయి (ప్రబంధములు) లు లేనపుడును; పంచసంచారిణః స్మృతాః = (5) ఐదు సంచారి ప్రబంధములు చెప్పబడినవి; మధ్యమే = మధ్యమ ప్రభేదమందు; పూర్వం = మొదట; ఏలా స్యాత్ = ఏలయగును; తదనంతరం = అటు తరువాత; ఢేంకికా స్యాత్ = ఢేంకియగును.

**తాత్పర్యము :** ఎనిమిది స్థాయి (ప్రబంధములు) లు లేనపుడును ఐదు సంచారి ప్రబంధములు చెప్పబడినవి. మధ్యమప్రభేదమందు మొదట ఏలయగును. అటుతరువాత ఢేంకియగును.

**గారుగ్యాఖ్యేన తాలేన ద్వితీయేన చ ఝొంబడః ।**
**తతో నిస్సారులంభశ్చ రాసకశ్చైకతాలికః ॥ 88 ॥**

**ప్రతిపదార్థము :** గారుగ్యాఖ్యేన తాలేన = గారుగితాళముచేతను; ద్వితీయేన ఝొంబడ= ద్వితీయ ఝొంబడము; తతః = తరువాత; నిస్సారులంభశ్చ = నిస్సారులంభమును; ఏకతాలికః రాసకశ్చ = ఏకతాళరాసకమును;

**తాత్పర్యము** : గారుగితాళముచేతను ద్వితీయ ఝొంబడము తరువాత నిస్సారులంబమును ఏకతాళరాసకమును;

> **ఇతి సప్త సముద్దిష్టాః ప్రబంధాః స్థాయినో బుధైః ।**
> **క్రమేణ శేషాశ్చత్వారో యథావిధి సమీరితాః ॥ 89 ॥**

**ప్రతిపదార్థము** : ఇతి = ఈవిధముగా; సప్తస్థాయినః ప్రబంధాః = ఏడు స్థాయి ప్రబంధములు; బుధైః సముద్దిష్టాః = పండితులచే చెప్పబడినవి; క్రమేణ = క్రమముగా; శేషాః చత్వారః = మిగిలిన నాల్గును; యథావిధి = శాస్త్రమునను సరించి; సమీరితా= చెప్పబడినవి.

**తాత్పర్యము** : ఈవిధముగా ఏడు స్థాయిప్రబంధములు పండితులచే చెప్పబడినవి. క్రమముగా మిగిలిన నాల్గును శాస్త్రమునను సరించి చెప్పబడినవి.

> **జఘన్యే ప్రథమే ఢేంకీ ద్వితీయేన తు ఝొంబడః ।**
> **నిస్సారుణా పితాలేన లంభా రాసైకతాలికా ॥ 90 ॥**

**ప్రతిపదార్థము** : ప్రథమే జఘన్యే = మొదటి జఘన్యమందు; ఢేంకి = డేంకిక; ద్వితీయేన ఝొంబడః = ద్వితీయ ఝొంబడము; నిస్సారుణా = నిస్సారుతాళముచేతను; పితాలేన= పితాళముచేతను; లంభా = లంభయు; రాసైకతాలికా = ఏకతాళరాసకము.

**తాత్పర్యము** : మొదటి జఘన్యమందు ఢేంకిక ద్వితీయఝొంబడము నిస్సారు తాళముచేతను పితళము చేతను లంభయు ఏకతాళరాసకము.

> **షడేతే స్థాయినః ప్రోక్తాస్త్రయోఽన్యే తు యథారుచి ।**
> **భవంత్యతిజఘన్యే తు మట్టతాలేన ఝొంబడః ॥ 91 ॥**

**ప్రతిపదార్థము** : ఏతే షట్ స్థాయినః ప్రోక్తాః = ఈ ఆరు (6) స్థాయిప్రబంధములు చెప్పబడినవి; యథారుచి భవంతి = యథేష్టముగా అగుచున్నవి; అతిజఘన్యే తు = అధమాధమమందు; మట్టతాలేన ఝొంబడః = మట్టతాలముచేతను ఝొంబడము

**తాత్పర్యము** : ఈఆరు (6) స్థాయిప్రబంధములు. యథేష్టముగా అగుచున్నవి. అధమాధమమందు మట్టతాలముచేతను ఝొంబడము.

> **నిస్సారు ఝొంబడో లంభో రాసకశ్చైకతాలికా ।**
> **పంచైతే స్థాయినో జ్ఞేయా ద్వావన్యౌ తు యథారుచి ॥ 92 ॥**

**ప్రతిపదార్థము** : నిస్సారు ఝోంబడః = నిస్సారు ఝోంబడము; లంభః = లంభము; ఏకతాలికా రాసకశ్చ = ఏకతాల రాసకము; ఏతే పంచ = ఈఐదును; స్థాయినః జ్ఞేయాః = స్థాయిప్రబంధములుగా తెలియదగినవి; అన్యౌ ద్వౌ = మిగిలినవి రెండు; యథారుచి = యథేష్టము.

**తాత్పర్యము** : నిస్సారు ఝోంబడము లంభము ఏకతాల రాసకము ఈఐదును స్థాయి ప్రబంధములుగా తెలియదగినవి. మిగిలినవి రెండు యథేష్టము.

**త్యక్త్వా కు+కనిస్సారు లంభావాదౌ ధ్రువం న్యసేత్ ।**
**అంతరే చండనిస్సారుమట్టాది స్యాద్ ధ్రువాదికాః ॥ 93 ॥**

**ప్రతిపదార్థము** : ఆదౌ =మొదట; కుటుకనిస్సారులంభౌ = కుటుక నిస్సారు లంభములను; త్యక్త్వా = విడిచి; ధ్రువం న్యసేత్ = ధ్రువమునుంచ వలెను; అంతరే= మధ్యయందు; చండనిస్సారుమట్టాది = చండనిస్సారు మట్టతాళము మొదలగు; ధ్రువాదికాః స్యాత్ = ధ్రువాదికములు అగును

**తాత్పర్యము** : మొదట కుటుకనిస్సారు లంభములను విడిచి ధ్రువమునుంచవలెను. మధ్యయందు చండనిస్సారు మట్టతాళము మొదలగు ధ్రువాదికములు అగును.

**ఏక ఏవ ప్రబంధశ్చేన్మలరూపేణ గీయతే ।**
**తాలేనైకేన నానార్థః స సూడో విప్రకీర్ణకః ॥ 94 ॥**

**ప్రతిపదార్థము** : ఏకః ఏవ ప్రబంధఃచేత్ = ఒకే ప్రబంధమైన యెడల; మలరూపేణ గీయతే = మలరూపముగా గానముచేయబడుచున్నది; ఏకేన తాలేన = ఒకతాళముచేత; నానార్థః = అనేకార్థకమైన; సః = అది; సూడః = సూడప్రబంధముగా; విప్రకీర్ణకః = విప్రకీర్ణము.

**తాత్పర్యము** : ఒకే ప్రబంధమైన యెడల మలరూపముగా గానము చేయబడుచున్నది. ఒకతాళము చేత అనేకార్థమైన అది సూడప్రబంధముగా విప్రకీర్ణము.

**ఏకైకశోఽపి గాతవ్యః ప్రబంధో వినియోగతః ।**
**అథసూడాక్రమాశ్రిప్రబంధలక్షణం వక్ష్యే ।**
**ఉద్గ్రాహః ప్రథమార్ధం య ధేంకికాయాం విధీయతే ॥ 95 ॥**

**ప్రతిపదార్థము** : వినియోగతః = వినియోగమునసుసరించి; ప్రబంధః= ప్రబంధము;

ఏకైకశో౽పి = ఒకటొకటిగా; గాతవ్యః = గానము చేయదగినది; అథ = ఇప్పుడు; సూడాక్రమాశ్రిత= సూడాక్రమమునాశ్రయించిన; ప్రబంధలక్షణం వక్ష్యే = ప్రబంధముయొక్క లక్షణమును చెప్పుచున్నాను; యః = ఏ; ఉద్గ్రాహః = ఉద్గ్రాహము; ప్రథమార్ధం = ప్రథమార్ధము; ఢేంకికాయాం = ఢేంకియందు; విధీయతే = విధింపబడునో;

**తాత్పర్యము** : వినియోగమునననుసరించి ప్రబంధము ఒకటొకటిగా గానముచేయదగినది. ఇప్పుడు సూడాక్రమమునాశ్రయించిన ప్రబంధముయొక్క లక్షణమును చెప్పుచున్నాను. ఏ ఉద్గ్రాహము ప్రథమార్ధము డేంకియందు విధింపబడునో;

**ఆవృత్త్యా తచ్చ గాతవ్యం సమం వా విషమగ్రహే ।**
**ద్వితీయార్ధం తు తేనైవ సకృద్గీతేన గీయతే ॥ 96 ॥**

**ప్రతిపదార్థము** : తచ్చ = అది; ఆవృత్త్యా = ఆవృత్తిచేతను; గాతవ్యం = గానము చేయదగినది; సమంవా = సమముగాని; విషమగ్రహే = విషమగ్రహమందు; ద్వితీయార్ధం= ద్వితీయార్ధము; తేనైవ గీతేన = ఆగీతముచేతనే; సకృత్ = ఒకసారి; గీయతే = గానము చేయబడును.

**తాత్పర్యము** : అది ఆవృత్తిచేతను గానముచేయదగినది. సమముగాని, విషమగ్రహమందు ద్వితీయార్ధము ఆగీతముచేతనే ఒకసారి గానము చేయబడును.

**మేలాపకస్తతః స్తాలయుక్తో గేయోవికల్పతః ।**
**ఉద్గ్రాహే చైవ మేలాపే ఢేంకితాలో భవేద్ యతః ॥ 97 ॥**

**ప్రతిపదార్థము** : తతః = తరువాత; మేలాపకః = మేలాపకము; తాలయుక్తః = తాళయుతముగా; వికల్పతః = వికల్పముగా; గేయః = గానముచేయదగినది; ఉద్గ్రాహే= ఉద్గ్రాహమందు; మేలాపే చ = మేలాపకమందును; యతః = ఎందువలన;ఢేంకితాలః భవేత్ = ఢేంకితాళమగుచున్నదో;

**తాత్పర్యము** : తరువాత మేలాపకము తాళయుతముగా వికల్పముగా గానము చేయదగినది. మేలాపకమందును ఎందువలన ఢేంకితాళమగుచున్నదో;

**తస్మాదస్య ప్రబంధస్య నామ ఢేంకీతి కీర్తితమ్ ।**
**తాలో (త్రా)న్యో లయశ్చాన్యస్తతో వారద్వయం బుధైః ॥ 98 ॥**

**ప్రతిపదార్థము** : తస్మాత్ = అందువలన; అస్య ప్రబంధస్య= ఈప్రబంధమునకు; ఢేంకీతి నామ కీర్తితం = ఢేంకియను పేరు ఉంచబడినది; అత్ర = ఇక్కడ; తాలః అన్యః = తాళము వేరైనది; లయశ్చ అన్యః = లయ మరియొకటి; తతః = అందువలన; వారద్వయం = రెండుసార్లు; బుధైః = పండితులచే(చెప్పబడినది).

**తాత్పర్యము** : అందువలన ఈప్రబంధమునకు ఢేంకియను పేరు ఉంచబడినది. ఇక్కడ తాళము వేరైనది, లయ మరియొకటి. అందువలన రెండుసార్లు పండితులచే (చెప్పబడినది).

**ఏకగీతధ్రువస్యాద్యం సానుప్రాసం పదద్వయమ్ ।**
**అన్యగీతేన గాతస్య తృతీయోఽంఘ్రిధ్రువాశ్రయః ॥ 99 ॥**

**ప్రతిపదార్థము** : ఏకగీతధ్రువస్య ఆద్యం = ఏకగీతధ్రువముయొక్క మొదలును; సానుప్రాసం = అనుప్రాసయుతముగా; పదద్వయం = పదద్వయమును; అన్యగీతేన = మరియొక గీతముచే; గేయస్య = గానముచేయవలసిన దానియొక్క; తృతీయః = మూడవదైన; అంఘ్రిధ్రువాశ్రయః = పాదధ్రువాశ్రయము (కల్గి);

**తాత్పర్యము** : ఏకగీతధ్రువముయొక్క మొదలును అనుప్రాసయుతముగా పదద్వయమును మరియొక గీతముచే గానముచేయవలసిన దానియొక్క మూడవదైన పాదధ్రువాశ్రయము (కల్గి);

**ఆభోగం చ సకృద్ గీత్వా ధ్రువం గీత్వా తతః పునః ।**
**ఉద్గ్రాహతాలమానేన తస్య న్యాసో విధీయతే ॥ 100 ॥**

**ప్రతిపదార్థము** : ఆభోగం = ఆభోగమును; సకృత్ = ఒక్కసారి; గీత్వా = గానముచేసి; తతః = తరువాత; ధ్రువం గీత్వా = ధ్రువమునుపాడి; పునః = మరల; ఉద్గ్రాహతాలమానేన = ఉద్గ్రాహతాళప్రమాణముచే; తస్య = దానికి; న్యాసః విధీయతే= న్యాసమువిధించబడును.

**తాత్పర్యము** : ఆభోగమును ఒక్కసారి గానముచేసి తరువాత ధ్రువమునుపాడి మరల ఉద్గ్రాహతాళప్రమాణముచే దానికి న్యాసము విధించబడును.

## ॥ఢేంకీ సామాన్యలక్షణమ్ ॥

**ఉద్గ్రాహస్యాదిమం భాగం గాయేద్ వారద్వయం తతః ।**
**సకృదేవ ద్వితీయార్ధం తతోఽపి గమకైర్యుతమ్ ॥ 101 ॥**

**ప్రతిపదార్థము :** ఉద్గ్రాహస్య ఆదిమం భాగం = ఉద్గ్రాహముయొక్క మొదటిభాగమును; వారద్వయం = రెండుసార్లు; గాయేత్ = గానముచేయవలెను; తతః = తరువాత; ద్వితీయార్ధం సకృత్ ఏవ = ద్వితీయార్ధము ఒక్క పర్యాయమే; తతోఽపి = అంతకంటెను; గమకైః యుతం = గమకములతో కూడ; గాయేత్ = గానము చేయవలెను.

**తాత్పర్యము :** ఉద్గ్రాహముయొక్క మొదటిభాగమును రెండుసార్లు గానముచేయవలెను. తరువాత ద్వితీయార్ధము ఒక్కపర్యాయమే. అంతకంటెను గమకములతో కూడ గానము చేయవలెను.

**మేలాపకం వికల్పేన తతో వారద్వయం ధ్రువమ్ ।**
**ఆభోగం చ సకృద్ గీత్వా ప్రావేణ న్యాస ఇష్యతే ॥ 102 ॥**

**ప్రతిపదార్థము :** మేలాపకం = మేలాపమును; వికల్పేన = వికల్పముగను; తతః = తరువాత; ధ్రువం = ధ్రువమును; వారద్వయం = రెండుసార్లు; ఆభోగం = ఆభోగమునుకూడ, సకృత్ = ఒకసారి; గీత్వా = గానముచేసి; ప్రావేణ న్యాసః ఇష్యతే= ప్రావముచే న్యాసము ఇష్టమగుచున్నది (కోరబడుచున్నది).

**తాత్పర్యము :** మేలాపమును వికల్పముగను తరువాత ధ్రువమును రెండుసార్లును ఆభోగమునుకూడ ఒకసారి గానముచేసి ప్రావముచే న్యాసము ఇష్టమగుచున్నది (కోరబడుచున్నది).

**భాగోఽపి ఝొంబడే కార్య ఇతి కేచిత్ ప్రచక్షతే ।**
**గీతేన ప్రాక్తనేనైవ యత్రోద్గ్రాహః పదాంతరైః ॥**

**ప్రతిపదార్థము :** భాగోఽపి = భాగముకూడ; ఝొంబడే = ఝొంబడమందు; కార్యః ఇతి = చేయవలెనని; కేచిత్ ప్రచక్షతే = కొందరు చెప్పుచున్నారు; ప్రాక్తనేన గీతేన ఏవ = మొదటి గీతముచేతనే; యత్రః = ఎక్కడ; పదాంతరైః ఉద్గ్రాహః = పదాంతరములచే ఉద్గ్రాహము.

**తాత్పర్యము :** భాగముకూడ ఝొంబడమందు చేయవలెనని కొందరుచెప్పుచున్నారు. మొదటి గీతముచేతనే ఎక్కడ పదాంతరములచే ఉద్గ్రాహము.

**వివక్షితార్థశేషస్య పూర్ణత్వాపాదనాయ చ ।**
**అపరః క్రియతే యోఽసౌ స భాగః పరికీర్తితః ॥ 104 ॥**

**ప్రతిపదార్థము :** వివక్షితార్థశేషస్య =వివక్షితమైన అర్థశేషముయొక్క; పూర్ణత్వాపాదనాయ = పూర్ణతాసంపాదన కొఱకు; అపరః = మరియొకటి; క్రియతే = చేయబడునో; అసౌ = అది; భాగః పరికీర్తితః = భాగమని చెప్పబడినది.

**తాత్పర్యము :** వివక్షితమైన అర్థశేషముయొక్క పూర్ణతాసంపాదన కొఱకు మరియొకటి చేయబడునో అది భాగమని చెప్పబడినది.

**శరీరస్య యథా ఛాయా భవత్యవ్యయచారిణీ ।**
**హ్రాసవృద్ధియుతా చైవ ఝొంబడే గమకస్థితిః ॥ 105 ॥**

**ప్రతిపదార్థము :** శరీరస్య ఛాయా యథా = శరీరముయొక్క నీడవలె; అవ్యయ చారిణీ= నిరంతర సంచారియగు; హ్రాసవృద్ధియుతా = క్షీణవృద్ధియుతమైన; గమకస్థితిః = గమకవ్యాపారము; ఝొంబడే భవతి = ఝొంబడమందగుచున్నది.

**తాత్పర్యము :** శరీరముయొక్క నీడవలె నిరంతరసంచారియగు క్షీణవృద్ధియుతమైన గమకవ్యాపారము ఝొంబడమందగుచున్నది.

**తారజో తారజశ్చేతి ఝొంబడో జాతియుగ్మకమ్ ।**
**తారో ధ్వనిః సముద్దిష్టో గాయకైః స్థానకాఖ్యయా ॥ 106 ॥**

**ప్రతిపదార్థము :** తారజః = తారజము; అతారజశ్చ = అతారజము అని; ఝొంబడ= ఝొంబడము; జాతియుగ్మకం = రెండుజాతులుకలది; గాయకైః = గాయకులచే; స్థానకాఖ్యయా = స్థానకనామముచే; తారః ధ్వనిః సముద్దిష్టః = తారధ్వని చెప్పబడినది.

**తాత్పర్యము :** తారజము, అతారజము అని ఝొంబడము రెండుజాతులు కలది. గాయకులచే స్థానకనామముచే తారధ్వనిచెప్పబడినది.

**తేన తారేణ సంయుక్తో ఝొంబడస్తారజః స్మృతః ।**
**తారజస్య పరిజ్ఞేయం తత్ర భేదచతుష్టయమ్ ॥ 107 ॥**

**ప్రతిపదార్థము :** తేన తారేణ సంయుక్తః = ఆతారస్థానముతో కూడిన; ఝొంబడః= ఝొంబడము; తారజః స్మృతః = తారధ్వనిజనితముగా చెప్పబడినది; తత్ర = అందు;

తారజస్య = తారజమునకు (ఝూంబడమునకు); భేదచతుష్టయం పరిజ్ఞేయం = నాల్గుభేదములని తెలియదగినది.

**తాత్పర్యము** : అతారస్థానముతో కూడిన ఝూంబడము తారధ్వనిజనితముగా చెప్పబడినది. అందు తారజమునకు (ఝూంబడమునకు) నాల్గుభేదములని తెలియదగినది.

**తచ్చ దుష్కరమేవోక్తం గీతవిద్యావిశారదైః ।**
**ఆదౌ ప్రతాపతిలకో భవేద్ధి ప్రతాపసంగమః ॥ 108 ॥**

**ప్రతిపదార్థము** : గీతవిద్యావిశారదైః = సంగీతపండితులచే; తత్ = అది; దుష్కరమేవ ఉక్తం = దుష్కరమనియే చెప్పబడినది; ఆదౌ = మొదట; ప్రతాపతిలకః = ప్రతాపతిలకము; భవేత్ = అగును; ప్రతాప సంగమః = ప్రతాపసంగమము.

**తాత్పర్యము** : సంగీతపండితులచే అది దుష్కరమనియే చెప్పబడినది. మొదట ప్రతాపతిలకము అగును. ప్రతాపసంగమము.

**తతోఽచలప్రతాపః స్యాత్ తతశ్చ ప్రతాపవర్ధనః ।**
**ఉద్గ్రాహే స్థానకస్థిత్యా ప్రతాపతిలకో భవేత్ ॥ 109 ॥**

**ప్రతిపదార్థము** : తతః = తరువాత; అచలప్రతాపః = అచలప్రతాపము; స్యాత్ = అగును; తతః = తరువాత; ప్రతాపవర్ధనః = ప్రతాపవర్ధనము; స్యాత్ = అగును; ఉద్గ్రాహే = ఉద్గ్రాహమందు; స్థానకస్థిత్యా = స్థానస్థితిచేత; ప్రతాపతిలకః భవేత్ = ప్రతాపతిలకమగును.

**తాత్పర్యము** : తరువాత అచలప్రతాపము అగును. తరువాత ప్రతాపవర్ధనము అగును. ఉద్గ్రాహమందు స్థానస్థితిచేత ప్రతాపతిలకమగును.

**ప్రతాపసంగో మేలా(ప)స్థానకస్య నివేశనాత్ ।**
**స్మృతోఽచలప్రతాపోఽసౌ ప్రాప్తే స్థానకనిర్మితేః ॥ 110 ॥**

**ప్రతిపదార్థము** : మేలాపస్థానకస్య నివేశనాత్ = మేలాపకస్థానప్రవేశమువలన; ప్రతాపసంగః స్మృతః = ప్రతాపసంగము చెప్పబడును; స్థానకనిర్మితేః = స్థాననిర్మాణము కలదగుటవలన; అసౌ = అది; అచలప్రతాపః = అచల ప్రతాపము అగును.

**తాత్పర్యము** : మేలాపకస్థానప్రవేశమువలన ప్రతాపసంగముచెప్పబడును. స్థాననిర్మాణము కలదగుటవలన అది అచట ప్రతాపము అగును.

**ప్రతాపవర్ధనో జ్ఞేయ ఆభోగేస్థానకాన్వయాత్ ।**

**॥ తారజః ॥**

**తతః ప్రభూతగమకస్తతోఽల్పగమకాభిధః ॥ 111 ॥**

**ప్రతిపదార్థము** : ఆభోగే = ఆభోగమందు; స్థానకాన్వయాత్ = స్థానకాన్వయమువలన; ప్రతాపవర్ధనః జ్ఞేయః = ప్రతాపవర్ధనముగా తెలియదగినది; తతః = తరువాత; ప్రభూతగమకః = అధికగమకము; తతః = తరువాత; ఆగమకాభిదః = అల్పగమకనామము;

**తాత్పర్యము** : ఆభోగమందు స్థానకాన్వయమువలన ప్రతాపవర్ధనముగా తెలియదగినది. తరువాత అధికగమకము తరువాత అల్పగమకనామము;

**త్రిధుతకస్తృతీయ(శ్చ)స్యాదల్పగమకాభిధః ।**
**త్రిధాతుకస్తృతీయః స్యాదతారజాభిధాత్రయమ్ ॥ 112 ॥**

**ప్రతిపదార్థము** : అల్పగమకాభిధః = అల్పగమకము; త్రిధాతుకః = త్రిధాతుకమును; తృతీయశ్చ స్యాత్ =తృతీయమును అగును; అతారజా = అతారజము; అభిధాత్రయం = అభిధాత్రయము; స్యాత్ = అగును; సః = అది; త్రిధాతుకః = త్రిధాతుకము; తృతీయః = తృతీయమును; స్యాత్ = అగును.

**తాత్పర్యము** : అల్పగమకము త్రిధాతుకమును తృతీయమును అగును. అతారజము అభిధాత్రయము అగును. అది త్రిధాతుకము తృతీయము అగును.

**అనేకగమకత్వేన విపులాయాసయోగతః ।**
**ప్రభూతగమకో నామ ఝోంబడో దుష్కరః స్మృతః ॥ 113 ॥**

**ప్రతిపదార్థము** : అనేకగమకత్వేన = బహుళగమకముచేతను; విపులాయాసయోగత= అధికాయాసమువలన; ప్రభూతగమకః నామ ఝోంబడః = ప్రభూతగమకమును ఝోంబడము; దుష్కరః స్మృతః = దుష్కరము అని చెప్పబడినది.

**తాత్పర్యము** : బహుళగమకముచేతను అధికాయాసమువలన ప్రభూతగమకమును ఝోంబడము దుష్కరము అని చెప్పడినది.

**అల్పైస్తు గమకైః క్లుప్తః స్యాదల్పగమకాభిధః ।**

**గమకానామబాహుల్యాదక్లేశేన చ గానతః ॥ 114 ॥**

**ప్రతిపదార్థము :** అల్పైః గమకైః = స్వల్పగమకములచే; క్లుప్తః = సంగ్రహముగా; అల్పగమకాభిధః స్యాత్ = అల్పగమకమను పేరు కలదగును; గమకానాం అబాహుల్యాత్ = గమకము (లు) తక్కువగుటచే; గానతః = గానముచేయుటవలన; అక్లేశేన = సులభముగా; స్యాత్ = ఉండును.

**తాత్పర్యము :** స్వల్పగమకములచే సంగ్రహముగా అల్పగమకమను పేరుకలదగును. గమకము(లు) తక్కువగుటచే గానము చేయువానికి సులభముగా ఉండును.

**త్రిధాతుకః పరిజ్ఞేయో మేలాపేన వివర్జితః ।**
**త్రిధాతుకాల్పగమకౌ సుకరౌ పరికీర్తితౌ ॥ 115 ॥**

**ప్రతిపదార్థము :** మేలాపేన వివర్జితః = మేలాపముచేత విడువబడినది; త్రిధాతుకః పరిజ్ఞేయః = త్రిధాతుకగమకముగా తెలియదగినది; త్రిధాతుకాల్పగమకౌ = త్రిధాతుక అల్పగమకములు రెండును; సుకరౌ పరికీర్తితౌ = తేలికయైనవిగాచెప్పబడినవి.

**తాత్పర్యము :** మేలాపముచేత విడుబడినది త్రిధాతుకగమకముగా తెలియదగినది. త్రిధాతుకఅల్పగమకములు రెండును తేలికయైనవిగా చెప్పబడినవి.

**సప్తైతే కథితాభేదాస్తాలే గారుకినామని ।**
**ఏవం ద్వితీయతాలేఽపి సప్త భేదా భవన్తి యే ॥ 116 ॥**

**ప్రతిపదార్థము :** గారుకినామని తాలే = గారుగితాళమందు; సప్తభేదాః ఏతే = ఏడు(7)విధములైన భేదములు; కథితాః = చెప్పబడినవి; ఏవం = ఇట్లు; ద్వితీయంతాలేఽపి = ద్వితీయ తాళమందు కూడ; సప్తభేదాః భవంతి = ఏడుభేదములున్నవి.

**తాత్పర్యము :** గారుగితాళమందు ఈ ఏడు (7) విధములైన భేదములు చెప్పబడినవి. ఇట్లు ద్వితీయతాళమందు కూడ ఏడు భేదములున్నవి.

ఉద్యత్ప్రతాపః ప్రథమం భవేత్ స ప్రతాపయోగస్తదనంతరం స్యాత్ ।
స్థిరః ప్రతాపశ్చ భవేత్ ప్రతాపః సశేఖరో దుష్కరనామధేయః ॥ 117 ॥

**ప్రతిపదార్థము :** ప్రథమం =మొదట; ఉద్యత్ప్రతాపః = ఉద్యత్ప్రతాపము; భవేత్ = అగును; తదనంతరం = అటుతరువాత; ప్రతాపయోగః = ప్రతాపయోగము; స్యాత్= అగును; స్థిరప్రతాపః = స్థిరప్రతాపము; సశేఖరః ప్రతాపః = ప్రతాపశేఖరము; దుష్కరనామధేయః = దుష్కరము; భవేత్ = అగును అని;

**తాత్పర్యము :** మొదట ఉద్యత్ప్రతాపముఅగును. అటుతరువాత ప్రతాపయోగము అగును. స్థిరప్రతాపము ప్రతాపశేఖరము దుష్కరము అగును అని;

**ఉద్యత్ప్రతాపముద్గ్రాహే స్థానకస్య నివేశనాత్ ।**
**ప్రతాపయోగమేలాపే వదంతి స్థానకస్థితేః ॥ 118 ॥**

**ప్రతిపదార్థము :** ఉద్గ్రాహే = ఉద్గ్రాహమందు; స్థానస్య నివేశనాత్ = స్థానప్రవేశమగుట వలన; ఉద్యత్ప్రతాపః స్యాత్ = ఉద్యత్ప్రతాపమగును; మేలాపే = మేలాపమందు; స్థానస్థితే = స్థానస్థితికలదగుటవలన; ప్రతాపయోగః స్యాత్ = ప్రతాపయోగమగును.

**తాత్పర్యము :** ఉద్గ్రాహమందు స్థానప్రవేశమగుటవలన ఉద్యత్ప్రతాపమగును. మేలాపమందు స్థానస్థితికలదగుటవలన ప్రతాపయోగమగును.

**ధ్రువే స్థిరప్రతాపం చ స్థానకస్య నివేశనాత్ ।**
**ప్రతాపశేఖరం ప్రాహురాభోగే స్థానకాన్వయాత్ ॥ 119 ॥**

**ప్రతిపదార్థము :** ధ్రువే = ధ్రువమందు; స్థానకస్య నివేశనాత్ = స్థానమును ప్రవేశపెట్టుటవలన; స్థిరప్రతాపం స్యాత్ = స్థిరప్రతాపమగును; ఆభోగే = ఆభోగమందు; స్థానకాన్వయాత్ = స్థానస్థితివలన; ప్రతాపశేఖరం ప్రాహుః = ప్రతాపశేఖరమును చెప్పిరి.

**తాత్పర్యము :** ధ్రువమందు స్థానమును ప్రవేశపెట్టుటవలన స్థిరప్రతాపమగును. ఆభోగమందు స్థానస్థితివలన ప్రతాపశేఖరమును చెప్పిరి.

**అన్యోఽపి భూరిగమకో గమకః సూక్ష్మపూర్వకః ।**
**త్రిధాతుకశ్చ విజ్ఞేయా దుష్కరాః సుకరాస్త్రయః ॥ 120 ॥**

**ప్రతిపదార్థము :** అన్యః అపి = మిగిలినదికూడ; భూరిగమకః = భూరి(అధిక) గమకము; సూక్ష్మపూర్వకః గమకః = సూక్ష్మగమకము; త్రిధాతుకశ్చ గమకః ఇతి = త్రిధాతుక గమకమనియు; దుష్కరాః = దుష్కరప్రభేదములు; సుకరాః = సుకరప్రభేదములును; త్రయః = మూడువిధములు.

**తాత్పర్యము :** మిగిలినదికూడ భూరి (అధిక) గమకము సూక్ష్మగమకము త్రిధాతుకగమక మనియు దుష్కరప్రభేదములు సుకరప్రభేదములును మూడు విధములు.

**ప్రభూతగమకాద్యేషు త్రిషు యల్లక్షణం కృతమ్ ।**
**తదేవ భూరిగమకప్రభృతిష్వవగమ్యతామ్ ॥ 121 ॥**

**ప్రతిపదార్థము :** ప్రభూతగమకాద్యేషు త్రిషు = ప్రభూతగమకాదులైన మూడింటి యందు; యల్లక్షణం కృతం = ఏలక్షణముచేయ(చెప్ప)బడినదో; తదేవ = ఆలక్షణమే; భూరిగమక ప్రభృతిషు = భూరిగమకాదులయందు; అవగమ్యతామ్ = తెలియ బడుగాక.

**తాత్పర్యము :** ప్రభూతగమకాదులైన మూడింటియందు ఏ లక్షణముచేయ (చెప్ప)బడినదో ఆలక్షణమే భూరిగమకాదులయందు తెలిబడుగాక.

**కేవలం తాలభేదేన నామభేదః ప్రకీర్తితః ।**
**అన్యేఽపి భేదా విద్యంతే ఝోంబడస్య పునస్త్రయః ॥ 122 ॥**

**ప్రతిపదార్థము :** కేవలం = కేవలముగా; తాలభేదేన = తాళభేదముచేతనే; నామభేద= పేరుయొక్క తేడా; ప్రకీర్తితః = చెప్పబడినది; అన్యే అపి భేదాః విద్యంతే = మిగిలిన భేదములును కలవు; ఝోంబడస్య =ఝోంబడముకు; పునః = మరల; త్రయః = మూడు భేదములున్నవి.

**తాత్పర్యము :** కేవలముగా తాళభేదముచేతనే పేరుయొక్క తేడా చెప్పబడినది. మిగిలిన భేదములును కలవు. ఝోంబడముకు మరల మూడు భేదములున్నవి.

**గద్యజః పద్యజశ్చైవ గద్యపత్యమయస్తథా ।**
**క్రమేణ లక్షణం తేషాం యథావత్ ప్రతిపాద్యతే ॥ 123 ॥**

**ప్రతిపదార్థము :** గద్యజః = గద్యజనితము; పద్యజః = పద్యజనితము; గద్యపద్యమయః ఇతి = చంపూరూపము అని; తేషాం లక్షణం = వాటి లక్షణము; యథావత్ = క్రమముగా; ప్రతిపాద్యతే = నిరూపింపబడుచున్నది.

**తాత్పర్యము :** గద్యజనితము, పద్యజనితము, చంపూరూపము అని వాటిలక్షణము. క్రమముగా నిరూపింపబడుచున్నది.

**సంస్కృతై ర్దేశజైర్వాపి సానుప్రాసైః పదైర్భవేత్ ।**
**గీతవిద్భిః స విజ్ఞేయో ఝోంబడో గద్యజాహ్వయః ॥ 124 ॥**

**ప్రతిపదార్థము** : సంస్కృతైః = సంస్కృతపదములచేతను గాని; దేశజైః పదైర్వా = దేశీయపదములచేతను గాని; సానుప్రాసైః = అనుప్రాసతోకూడిన; పదైః = పదములచే; భవేత్ = అగును; సః =అది; గీతవిద్భిః = గీతజ్ఞులచే; గద్యజాహ్వయః ఝోంబడః విజ్ఞేయః = గద్యజఝోంబడమని తెలియనగును.

**తాత్పర్యము** : సంస్కృతపదముల చేతను గాని దేశీయపదములచేతను గాని అనుప్రాసతో కూడిన పదములచే అగును. అది గీతజ్ఞులచే గద్యజఝోంబడమని తెలియనగును.

**ఛందసా యేన కేనాపి నిబద్ధః పద్యజః స్మృతః ।**
**ఝోంబడో గద్యపద్యాభ్యాం గద్యపద్యమయో భవేత్ ॥ 125 ॥**

**ప్రతిపదార్థము** : యేన కే నాపి ఛందసా = ఏదో ఒక ఛందస్సుతో; నిబద్ధః = నిర్మితమైనది; పద్యజః స్మృతః= పద్యజనిత ఝోంబడమగును; గద్యపద్యాభ్యాం నిబద్ధః = గద్యపద్యములతో నిబద్ధము; గద్యపద్యమయః ఝోంబడః భవేత్ = గద్యపద్యమయ ఝోంబడమగును.

**తాత్పర్యము** : ఏదో ఒకఛందస్సుతో నిర్మితమైనది పద్యజనితఝోంబడమగును. గద్యపద్యములతో నిబద్ధము గద్యపద్యమయఝోంబడమగును.

**ఝోంబడం దుష్కరం త్యక్త్వా ప్రభూతగమకం తథా ।**
**గద్యజం పద్యజం చైవ గద్యపద్యమయం తథా ॥ 126 ॥**

**ప్రతిపదార్థము** : ప్రభూతగమకం = అధికగమకవిశిష్టమైన; దుష్కరం ఝోంబడం త్యక్త్వా = దుష్కర ఝోంబడమును విడిచి; గద్యజం = గద్యజము; పద్యజం = పద్యజము; గద్యపద్యమయం = చంపువును;

**తాత్పర్యము** : అధికగమకవిశిష్టమైన దుష్కరఝోంబడమును విడిచి గద్యజము, పద్యజము చంపువును;

**లఘుశేఖరతాలేస్యురన్యేఽల్పగమకాదయః ।**
**ప్రతిమట్టే తృతీయే చ మట్టే నిస్సారుకే తథా ॥ 127 ॥**

**ప్రతిపదార్థము :** లఘుశేఖరతాలేస్యు: = లఘుశేఖర తాలమందున్నవి; అన్యే అల్పగమ-కాదయః = మిగిలిన అల్పగమకాదులు; తృతీయే = మూడవదగు; ప్రతిమట్టే = ప్రతిమట్టతాళమందును; నిస్సారుకే = నిస్సారుకమందును;

**తాత్పర్యము :** లఘుశేఖర తాలమందున్నవి మిగిలినవి అల్పగమకాదులు మూడవదగు ప్రతిమట్టతాళమందును నిస్సారుకమందును;

**చండనిస్సారుకే చైవ చండపూర్వతృతీయకే ।**
**ఏతేషు ఝొంబడా గేయా + + + లఘుశేఖరే ॥ 128 ॥**

**ప్రతిపదార్థము :** చండనిస్సారుకే = చండనిస్సారుకమందును; చండపూర్వతృతీయకే= చండతృతీయమందును; ఏతేషు = వీటియందు; ఝొంబడా గేయా = ఝొంబడగాన యోగ్యము; లఘుశేఖరే = లఘుశేఖరమందు;

**తాత్పర్యము :** చండనిస్సారుకమందును చండతృతీయమందును వీటియందు ఝొంబడ గానయోగ్యము లఘుశేఖరమందు;

**కుటుక్కాఖ్యేన తాలేన ఝొంబడే గీయతే యదా ।**
**పదైరపి వినా కార్యాతదాఽఽభోగస్య కల్పనా ॥ 129 ॥**

**ప్రతిపదార్థము :** కుటుక్కాఖ్యేన తాలేన = కుటుక్కతాలముచే; యదా = ఎప్పుడు; ఝొంబడః = ఝొంబడము; గీయతే = గానము చేయబడునో; తత్ =అది; ఆభోగస్య కల్పనా =ఆభోగకల్పన; పదైరపి వినా = పదములు లేకనే; కార్యా = చేయదగినది.

**తాత్పర్యము :** కుటుక్కతాలముచే ఎప్పుడు ఝొంబడము గానము చేయబడునో అది ఆభోగ కల్పన పదములు లేకనే చేయదగినది.

**ఏవమష్టాదశ ప్రోక్తా ఝొంబడా గీతవేదిభిః ।**

**॥ ఝొంబడః ॥**

**ప్రతిపదార్థము :** ఏవం = ఈప్రకారముగా; గీతవేదిభిః = గీతజ్ఞులచే; ఝొంబడా = ఝొంబడ; అష్టాదశప్రోక్తా = 18 విధములుగా చెప్పబడినది;

**తాత్పర్యము :** ఈ ప్రకారముగా గీతజ్ఞులచే ఝొంబడ 18 విధములుగా చెప్పబడినది.

**ఉద్గ్రాహేఽంఘ్రిద్వయం ప్రాహైః ప్రతిపాదం గుణాశ్చ షట్ ॥ 130**
**పాదస్యాంతే ప్రయోగః స్యాత్ పల్లవాఖ్యం పదం తతః ।**
**పల్లవాఖ్యే పదే నాస్తి నియమో గీతవర్ణయోః ॥ 131**

**ప్రతిపదార్థము :** ఉద్గ్రాహే = ఉద్గ్రాహమునందు; అంఘ్రిద్వయం = రెండు పాదములు; ప్రాసైః = ప్రాసలచేత; ప్రతిపాదం = అన్ని పాదములందును; షట్ = ఆరు; గుణాశ్చ= గుణములు ఉండును; పాదస్యాన్తే = పాదము యొక్క చివఱ; ప్రయోగః స్యాత్ = ప్రయోగమగును; తతః = తదనంతరము; పల్లవాఖ్యం పదం = పల్లవమనబడు పదము (చెప్పబడుచున్నది); పల్లవాఖ్యే పదే = పల్లవమనబడు పదమునందు; గీత-వర్ణయోః = గీత - వర్ణముల యొక్క; నియమః = నియమము; నాస్తి = లేదు.

**తాత్పర్యము :** ఉద్గ్రాహము నందు రెండు పాదములు, ప్రాసలచేత అన్నిపాదము లందును, ఆరు గుణములుండును. పాదము యొక్క చివఱ ప్రయోగమగును. తదనంతరము పల్లవ మనబడు పదముచెప్పబడుచున్నది. పల్లవమనబడు పదమునందు గీత వర్ణముల యొక్క నియమము లేదు.

**అనేనైవ ప్రకారేణ ద్వితీయాంఘ్రేః ప్రకల్పనా।**
**గీత్వా తతస్తృతీ యాంఘ్రిగేయో మేలాపకో భవేత్ ॥ 132**

**ప్రతిపదార్థము :** అనేనైవ ప్రకారేణ; ఈవిధముగనే; ద్వితీయాంఘ్రే = రెండవ పాదము యొక్క; ప్రకల్పనా = కల్పన; గీత్వా = దీనిని గానము చేసి; తతః = ఆ తరువాత; తృతీయాంఘ్రిగేయః = మూడవ పాదముచే గానము చేయబడునది; మేలాపకః = మేలాపకము; భవేత్ = అగును.

**తాత్పర్యము :** ఈ విధముగనే రెండవ పాదము యొక్క కల్పన. దీనిని గానము చేసిన తరువాత మూడవ పాదముచే గానము చేయబడునది మేలాపకమగును.

**(తథా) పాదత్రయే గీతమేకమేవ విధీయతే ।**
**సప్రాసోఽథ ధ్రువో గేయో వర్ణ్యనామ్నా సమన్వితః ॥ 133**

**ప్రతిపదార్థము :** (తథా = ఆవిధముగ) పాదత్రయే = మూడు పాదములందును; ఏకమేవ గీతం = ఒకే గీతము; విధీయతే = చెప్పబడుచున్నది; అథ = ఆపిమ్మట; వర్ణ్యనామ్నా= వర్ణ్యమను పేరుగలదానితో; సమన్వితః = కూడినదగు; ధ్రువః = ధ్రువము; సప్రాసః = ప్రాసయుతముగ; గేయః = గానము చేయదగినది.

**తాత్పర్యము :** ఆవిధముగ మూడు పాదములందును ఒకే గీతము చెప్పబడుచున్నది. ఆ పిమ్మట వర్ణ్యమను పేరుగల దానితో కూడినదగు ధ్రువము ప్రాసయుతముగ గానము చేయదగినది.

**ఆభోగశ్చ తతో గేయో గాతుర్నామ్నా విరాజితః ।**
**ధ్రువం గీత్వా తతో న్యాసః సర్వైలాసు ప్రశస్యతే ॥ 134**

**ప్రతిపదార్థము** : తతః = ఆతరువాత; గాతుః నామ్నా = గాయకుని యొక్క పేరుచేత; విరాజితః = ప్రసిద్ధి చెందిన; ఆభోగశ్చ = ఆభోగము; గేయః = గానము చేయదగినది; ధ్రువం = ధ్రువమును, గీత్వా = గానముచేసి; తతః = తదనంతరము; న్యాసః = న్యాసము; సర్వైలాను = అన్ని ఏలలయందును; ప్రశస్యతే = కీర్తింపబడుచున్నది.

**తాత్పర్యము** : ఆతరువాత గాయకుని యొక్క పేరుచేత ప్రసిద్ధి చెందిన ఆభోగము గానము చేయదగినది. ధ్రువమును గానముచేసి తదనంతరము న్యాసమును చేయవలయును. ఇది అన్ని ఏలలయందును కీర్తింపబడుచున్నది.

## ఏలా

**స్వరాఖ్యం కరణం పూర్వం పాదాఖ్యం కరణం తథా ।**
**తృతీయం బంధకరణం తుర్యం స్వరపదాత్మకమ్ ॥ 135**

**ప్రతిపదార్థము** : పూర్వం = మొదటగ; స్వరాఖ్యం కరణం = స్వరము అనబడు కరణము; తథా = ఆ పిమ్మట (రెండవది) పాదాఖ్యం కరణం = పాదము అనబడు కరణము; తృతీయం = మూడవది; బంధకరణం = బంధమనబడు కరణము; తుర్యం = నాలుగవది; స్వరపదాత్మకం = స్వరపదమనబడు కరణము.

**తాత్పర్యము** : మొదటగ స్వరము అనబడు కరణము, ఆ పిమ్మట రెండవది పాదము అనబడు కరణము, మూడవది బంధమనబడుకరణము, నాలుగవది స్వరపద మనబడు కరణము.

**పంచమం చిత్రకరణం షష్ఠం తేన్నకపూర్వకమ్ ।**
**సప్తమం మిశ్రకరణం తేషాం లక్షణముచ్యతే ॥ 136**

**ప్రతిపదార్థము** : పంచమం = అయిదవది; చిత్రకరణం = చిత్రమనబడు కరణము; షష్ఠం = ఆరవది; తేన్నకపూర్వకం = తేన్నకమనబడు కరణము; సప్తకం = ఏడవది; మిశ్రకం = మిశ్రకమనబడు కరణము; తేషాం = వానియొక్క; లక్షణం = లక్షణము; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : అయిదవది చిత్రమనబడు కరణము. ఆరవది తేన్నకమనబడు

కరణము. ఏడవది మిశ్రకమనబడు కరణము. వాని యొక్క లక్షణము చెప్పబడుచున్నది.

**ధాతుద్వయం స్వరైరేవ నైరంతర్యేణ గీయతే ।**
**ద్రుతశేఖరతాలేన కరణే స్వరపూర్వకే ॥ 137**

**ప్రతిపదార్థము** : ధాతుద్వయం = రెండు ధాతువులు; స్వరైరేవ = స్వరముల చేతనే; నైరంతర్యేణ = నిరంతరము; గీయతే = గానము చేయబడుచున్నవి; ద్రుతశేఖరతాలేన= ద్రుతశేఖర తాళముచే; స్వరపూర్వకే = స్వరపూర్వకమగు; కరణే = కరణమునందు.

**తాత్పర్యము** : రెండు ధాతువులు స్వరములచేతనే నిరంతరము గానము చేయబడు చున్నవి. ద్రుతశేఖరతాళముచే స్వరపూర్వకమగు కరణమునందు;

**కరణం కరణాఖ్యేన తాలేన కిల గీయతే ।**
**దృశ్యతే తన్న లక్ష్యేషు యుక్తియుక్తా త్రుటిప్పణే (?) ॥ 138**

**ప్రతిపదార్థము** : కరణం = కరణము; కరణాఖ్యేన తాలేన = కరణమనబడుతాళముచేత; గీయతే కిల = గానము చేయబడుచున్నదికదా! లక్ష్యేషు = లక్ష్యములయందు; తత్= అది; నదృశ్యతే = అగుపించుట లేదు; తృటిప్పణే = త్రిటిప్పణమునందు; యుక్తి యుక్తా = యుక్తియుక్తము(?)

**తాత్పర్యము** : కరణము కరణమనబడు తాళముచేత గానము చేయబడుచున్నది కదా! లక్ష్యములయందు అది అగుపించుటలేదు. త్రిటిప్పణమునందు యుక్తి యుక్తము(?).

**ఇష్టస్వరో గ్రహస్తస్మిన్నంశేన న్యాస ఇష్యతే ।**
**ఆభోగే వర్ణనీయస్య నామ గాతుశ్చ నిక్షిపేత్ ॥ 139**

**ప్రతిపదార్థము** : తస్మిన్ = దానియందు; ఇష్టస్వరః = ఇష్టస్వరము; గ్రహః = గ్రహము; అంశేన = అంశముచేత; న్యాసః = న్యాసము; ఇష్యతే = ఇష్టమగుచున్నది; ఆభోగే = ఆభోగమునందు; వర్ణనీయస్య = వర్ణింపబడుదానియొక్క; గాతుశ్చ = గాయకుని యొక్కయు; నామ = పేరును; నిక్షిపేత్ = చేర్చవలయును.

**తాత్పర్యము** : దానియందు ఇష్టస్వరము గ్రహము, అంశముచేత న్యాసము ఇష్టమగు చున్నది. ఆభోగమునందు వర్ణింపబడు దానియొక్క మరియు గాయకుని యొక్క పేరును చేర్చవలయును.

**ద్విర్గాయేదాదిమం త్వంశం సకృదేవ ద్వితీయకమ్ ।**
**తృతీయం తు సకృద్ గీత్వా ధ్రువం గాయేదనంతరమ్ ॥ 140**

**ప్రతిపదార్థము :** ఆదిమం = మొదటిదైన; అంశం = అంశమును; ద్వి = రెండు సార్లు; ద్వితీయకం = రెండవ అంశమును; సకృదేవ = ఒక్కసారియే, గాయేత్ = గానము చేయవలయును; తృతీయంతు = మూడవ అంశమును; సకృత్ = ఒక్కసారి; గీత్వా= గానము చేసి; అనంతరం = ఆతరువాత; ధ్రువం = ధ్రువమును; గాయేత్ = గానము చేయవలయును.

**తాత్పర్యము :** మొదటి అంశమును రెండుసార్లు, రెండవ అంశమును ఒక్కసారి గానము చేయవలయును. మూడవ అంశమును ఒక్కసారి గానము చేసి ఆ తరువాత ధ్రువమును గానము చేయవలయును.

**ఉద్గ్రాహేణ తతో న్యాసః కరణే స్వరపూర్వకే ।**
**గానప్రకారో యస్యైవ మంగళారంభకం హి తత్ ॥ 141**

**ప్రతిపదార్థము :** తతః = ఆ తరువాత; స్వరపూర్వకే = స్వరపూర్వకమగు; కరణే = కరణమునందు; ఉద్గ్రాహేణ = ఉద్గ్రాహముచే; న్యాసః = న్యాసము (చేయదగినది); యస్యైవ = దేనియొక్క; గాన ప్రకారః = గాన విధానము; మంగళారంభకం హి = మంగళారంభము కదా!

**తాత్పర్యము :** ఆ తరువాత స్వరపూర్వకమగు కరణమునందు ఉద్గ్రాహముచేత న్యాసము (చేయదగినది) దేనియొక్క గానవిధానము మంగళారంభకము కదా!

**గీత్వా పూర్వం ద్విరుద్గ్రాహం సకృద్గాయేత్ ధ్రువం తతః ।**
**ఉద్గ్రాహస్యాంతరం భాగం గీత్వా భోగధ్రువం తతః ॥ 142**

**ప్రతిపదార్థము :** పూర్వం = ముందుగ; ద్విః = రెండుసార్లు; ఉద్గ్రాహం = ఉద్గ్రాహమును; గీత్వా = గానముచేసి; తతః = ఆ తరువాత; సకృత్ = ఒక్కసారి; ధ్రువం = ధ్రువమును; గాయేత్ = గానము చేయవలయును; ఉద్గ్రాహస్య = ఉద్గ్రాహము యొక్క; అంతరం భాగం = లోపలి భాగమును; గీత్వా = గానముచేసి; తతః = ఆ తరువాత; ఆభోగ ధ్రువం= ఆభోగధ్రువమును (గానము చేయవలయును).

తాత్పర్యము : ముందుగ రెండుసార్లు ఉద్గ్రాహమును గానముచేసి ఆ తరువాత

ఒక్కసారి ధ్రువమును గానము చేయవలయును. ఉద్గ్రాహముయొక్క లోపలి భాగమును గానముచేసి ఆ తరువాత ఆభోగధ్రువమును (గానము చేయవలయును).

**ఉద్గ్రాహేణ పునర్న్యాసః క్రియతే యత్ర తద్భవేత్ ॥**
**కరణం కీర్తిలహరిసంజ్ఞం శ్రుతిసుఖావహమ్ ॥ 143**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; ఉద్గ్రాహేణ = ఉద్గ్రాహముచేత; పునః = మరల; న్యాసః = న్యాసము; క్రియతే = చేయబడునో; తత్ = అట్టి; కీర్తిలహరిసంజ్ఞం = కీర్తిలహరి యను పేరుగల; కరణం = కరణము; శ్రుతిసుఖావహం = వినుటచే సుఖమును కలిగించును.

**తాత్పర్యము :** ఎక్కడ ఉద్గ్రాహముచేత మరల న్యాసము చేయబడునో, అట్టి కీర్తిలహరియను పేరుగల కరణము వినుటచే సుఖమును కలిగించును.

**ఉద్గ్రాహధ్రువయోర్గానం పూర్వవద్యత్ర దృశ్యతే ।**
**ధ్రువగార్ధం తతో గేయమాభోగాద్యపి పూర్వవత్ ॥ 144**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; పూర్వవత్ = మొదటవలె; ఉద్గ్రాహధ్రువయోః = ఉద్గ్రాహధ్రువములయొక్క; గానం = గానము; దృశ్యతే = అగుపించునో; తతః = ఆ తరువాత; ధ్రువగార్ధం = ధ్రువగార్ధము; గేయం = గానము చేయదగినది; ఆభోగాద్యపి= ఆభోగము మొదలైనది; పూర్వవత్ = మొదటివలె ఉండును.

**తాత్పర్యము :** ఎక్కడ మొదటవలె ఉద్గ్రాహధ్రువముల యొక్క గానము అగుపించునో, ఆ తరువాత ధ్రువగార్ధము గానము చేయదగినది. ఆభోగము మొదలైనది మొదటివలె ఉండును.

**ఆనందవర్ధనం నామ తదేతత్ కరణం మతమ్ ।**
**సంజ్ఞాత్రితయముక్తం యన్మంగళారంభ పూర్వకమ్ ॥ 145**

**ప్రతిపదార్థము :** తదేతత్ కరణం = ప్రసిద్ధమైన ఈ కరణము; ఆనందవర్ధనం నామ= ఆనందవర్ధనము అను పేరుగలదై; మతమ్ = తెలియబడినది; మంగళారంభ పూర్వకం= మంగళారంభము మొదలైన; సంజ్ఞాత్రితయం = మూడు సంజ్ఞలు; ఉక్తం= చెప్పడమైనది.

**తాత్పర్యము :** ప్రసిద్ధమైన ఈ కరణము ఆనందవర్ధనమను పేరుగలదై తెలియబడినది.

మంగళారంభము మొదలైన మూడు సంజ్ఞలు చెప్పడమైనది.

**స్వరాఖ్యే కరణే స్పష్టం తత్ స్యాదన్యేషు షట్స్వపి ।**
**స్వరైః సహస్తపాటైశ్చ వ్యత్యాసరచితైరపి ॥146**

**ప్రతిపదార్థము** : తత్ = అది; స్వరాఖ్యే కరణే = స్వరమను పేరుగల కరణమునందు; స్పష్టం = స్పష్టము; అన్యేషు = ఇతరములగు; షట్సు అపి = ఆరింటియందును; స్పష్టం స్యాత్ = స్పష్టమగును; సహస్తపాటైశ్చ = హస్తపాటములతో కూడినట్టివి; వ్యత్యాసరచితైరపి = వ్యత్యాసముగ రచింపబడినట్టివిని యగు; స్వరైః = స్వరముల చేత;

**తాత్పర్యము** : అది స్వరమను పేరుగల కరణమునందు స్పష్టము. ఇతరములగు ఆరింటియందును స్పష్టమగును. హస్తపాటములతో కూడినట్టియు, వ్యత్యాసముగ రచింపబడినట్టివిని యగు స్వరములచేత.

**ధాతుద్వయే పరిజ్ఞేయం తత్పా(ట?ద) కరణం ద్విధా ।**

**ప్రతిపదార్థము** : ధాతుద్వయే = ధాతుద్వయమందు; తత్పాదకరణం = ఆ పాదము యొక్క కరణము; ద్విధా = రెండు విధములుగ; పరిజ్ఞేయం = తెలియదగినది.

**తాత్పర్యము** : ధాతుద్వయమందు ఆ పాదముయొక్క కరణము రెండు విధములుగ తెలియదగినది.

## పాదకరణమ్

**స్వరా మురజపాటాశ్చ యత్ర స్యుర్ధాతు యుగ్మకే ।**
**తద్ బంధకరణం నామ విజ్ఞేయం గీతకోవిదైః ॥ 147**

**ప్రతిపదార్థము** : యత్ర ధాతుయుగ్మకే = ఏ ధాతుయుగళమునందు; స్వరాః = స్వరములు; చ = మరియు; మురజపాటా = మృదంగ పాటములు; స్యుః = ఉండునో; తత్ = అది; గీతకోవిదైః = సంగీత శాస్త్రజ్ఞులచే; బంధకరణం నామ = బంధకరణమని; విజ్ఞేయం = తెలియదగినది.

**తాత్పర్యము** : ఏ ధాతుయుగళమునందు స్వరములు మరియు మృదంగపాటములు ఉండునో, అది సంగీతశాస్త్రజ్ఞులచే బంధకరణమని తెలియదగినది.

## బంధకరణమ్

**ధాతుద్వయం భవేద్యత్ర స్వరైరథ పదైరపి ॥**
**తదుక్తం గీతతత్త్వజ్ఞైః కరణం పదపూర్వకమ్ ॥ 148**

**ప్రతిపదార్థము :** యత్ర = దేనియందు; స్వరైః = స్వరములచేతను; అథ = మరియు; పదైః అపి = పదములచేతను; ధాతుద్వయం = ధాతుద్వయము; భవేత్ = అగునో; తత్ = అది; గీతతత్త్వజ్ఞైః = సంగీతశాస్త్ర కోవిదులచే; పదపూర్వకం కరణం = స్వరపదకరణముగ; ఉక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము :** దేనియందు స్వరముల చేతను మరియు పదముల చేతను ధాతుద్వయమగునో అది సంగీతశాస్త్ర కోవిదులచే స్వరపదకరణముగ చెప్పబడినది.

## స్వరపదకరణమ్

**స్వరాశ్చ హస్తపాటాశ్చ సమం స్యుర్మురజాక్షరైః ।**
**పాదైర్ధాతుద్వయే యత్ర తచ్చిత్రకరణం మతమ్ ॥ 149**

**ప్రతిపదార్థము :** యత్ర ధాతుద్వయే = ఏ ధాతుద్వయమునందు; స్వరాః = స్వరములు; చ = మరియు; హస్తపాటాః = హస్తపాటములు; మురజాక్షరైః = మురజాక్షరములనబడు; పాదైః సమం = పాదములతో కూడియుండునో; తత్ = అది; చిత్రకరణం = చిత్ర కరణముగ; మతం = తెలియదగినది.

**తాత్పర్యము :** ఏ ధాతుద్వయమునందు స్వరములు మరియు హస్తపాటములు మురజాక్షరములనబడు పాదములతో కూడియుండునో అది చిత్రకరణముగ తెలియదగినది.

## చిత్రకరణమ్

**స్వరాః సతేన్నకా యత్ర దృశ్యంతే ధాతుయుగ్మకే ।**
**తదుక్తం తే (న ? న్న) కరణం చా + + + సుధాభుజా ॥ 150**

**ప్రతిపదార్థము :** యత్ర ధాతుయుగ్మకే = ఏ ధాతుయుగళమునందు; స్వరాః = స్వరములు; సతేన్నకాః = తేన్నకసహితములై; దృశ్యన్తే = అగుపించునో; తత్ = అది; తేన్నకరణం = తేన్నకరణముగ; ఉక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము :** ఏ ధాతుయుగళమునందు స్వరములు తేన్నకసహితములై అగుపించునో అది తేన్నకరణముగ చెప్పబడినది.

**తేన్నకరణమ్**

**స్వరైః పాటైస్తథా తేన్నైర్యత్ర ధాతుద్వయం భవేత్ ।**
**తన్మిశ్రకరణం జ్ఞేయం ప్రాంతే విరుద సంయుతమ్ ॥ 151**

**ప్రతిపదార్థము :** యత్ర = దేనియందు; స్వరైః = స్వరములచేతను; తథా = అట్లే; పాటైశ్చ = పాటములచేతను; ధాతుద్వయం భవేత్ = ధాతుద్వయమగునో; తత్ = అది; ప్రాంతే = ప్రాంతమునందు; విరుదసంయుతం = విరుదముతో కూడిన; మిశ్రకరణం = మిశ్రకరణముగ; జ్ఞేయం = తెలియదగినది.

**తాత్పర్యము :** దేనియందు స్వరములచేతను అట్లే పాటములచేతను ధాతుద్వయ మగునో అది ప్రాంతమునందు విరుదముతో కూడిన మిశ్రకరణముగ తెలియదగినది.

**మిశ్రకరణమ్**

**ఇతి కరణమ్**

**ఇంతటితో కరణము ముగిసినది.**

**గీత్వా ద్విపాదముద్గ్రాహం ధ్రువాభోగావనన్తరమ్ ।**
**ధ్రువకేణ పునర్ముక్తిర్వర్తన్యాం సూత్రయేద్ బుధః ॥ 152**

**ప్రతిపదార్థము :** ఉద్గ్రాహం = ఉద్గ్రాహమును; ద్విపాదం = రెండుపాదములుగ; గీత్వా= గానముచేసి; అనంతరం = ఆ తరువాత; ధ్రువాభోగౌ = ధ్రువాభోగములను; ధ్రువకేణ పునః = ధ్రువకముతో; ముక్తిః = ముక్తిగ; బుధః = పండితుడు; వర్తన్యాం = వర్తనియందు; సూత్రయేత్ = సూత్రీకరించ వలయును.

**తాత్పర్యము :** ప్రతి తాళము, ద్రుతము, మట్టము, కంకాలము మరియు కుటుక్కురము ఇవి వర్తని యందు ఉండవు. ఇతరమైన తాళములు ఉండును.

**ప్రతితాళో ద్రుతో మట్టః కంకాలశ్చ కుటుక్కురః ।**
**వర్తన్యాం న భవంత్యేతే తాళాస్త్వన్యే భవంతి హి ॥ 153**

**ప్రతిపదార్థము :** ప్రతితాళః = ప్రతితాళము; ద్రుతః = ద్రుతము; మట్టః = మట్టము; కంకాలః = కంకాలము; చ = మరియు; కుటుక్కురః = కుటుక్కురము; ఏతే = ఇవి;

వర్తన్యాం = వర్తనియందు; న భవంతి = ఉండవు; అన్యే = ఇతరములైన; తాళాః = తాళములు; భవంతి హి = ఉండును.

**తాత్పర్యము** : ప్రతితాళము, మట్టము, కంకాలము మరియు కుటుక్కురము ఇవి వర్తనియందు ఉండవు. ఇతరములైన తాళములు ఉండును.

**స్వరాఖ్యకరణాద్ భేదో వర్తన్యామయమేవ తత్ ।**
**విలంబితో లయస్తస్యాం కరణే తు ద్రుతోలయః ॥ 154**

**ప్రతిపదార్థము** : వర్తన్యాం = వర్తనియందు; స్వరాఖ్యకరణాత్ = స్వరమనబడు కరణముకంటె; భేదః = భేదము; అయమేవ = ఇదియే; తస్యాం = వర్తనియందు; లయః = లయ; విలంబితః = విలంబితము; కరణేతు = కరణమునందైతే; లయః = లయ; ద్రుతః = ద్రుతము;

**తాత్పర్యము** : వర్తనియందు స్వరమనబడు కరణము కంటె భేదము ఇదియే. వర్తని యందు లయ విలంబితము. కరణమునందైతే ద్రుతము.

## వర్తని

**ప్రతితాళాదయః పంచ వర్తన్యాం యే నివారితాః ।**
**తైరేవ గీయతే యా సా వర్తన్యే(వ) వివర్తనీ ॥ 155**

**ప్రతిపదార్థము** : వర్తన్యాం = వర్తనియందు; ప్రతితాళాదయః = ప్రతితాళము మొదలగు; యే పంచ = ఏ అయిదు తాళములు; నివారితాః = అడ్డుకొనబడినవో; తైః ఏవ = ఆ తాళముల చేతనే; యా వర్తనీ = ఏ వర్తని; గీయతే = గానము చేయబడునో; సా = అదియే; వివర్తనీ = వివర్తని.

**తాత్పర్యము** : వర్తనియందు ప్రతితాళము మొదలగు ఏ అయిదు తాళములు అడ్డుకొన బడినవో, ఆ తాళముల చేతనే ఏ వర్తని గానము చేయబడునో అది వివర్తని.

**ఆదౌ యత్ర స్వరాలాపః క్రియతే తాళవర్జితః ।**
**వర్తన్యాం + + + + + సా స్యాదాలాపపూర్వికా ॥ 156**

**ప్రతిపదార్థము** : ఆదౌ=ముందుగ; యత్ర = ఎక్కడ; తాళవర్జితః = తాళరహితమగు; స్వరాలాపః = స్వరాలాపము; క్రియతే = చేయబడునో; సా = అది; వర్తన్యాం =

వర్తనియందు; ఆలాపపూర్వికా = ఆలాపపూర్వికము; స్యాత్ = అగును.

### వివర్తనీ

స్వరైరభీష్టో యత్రార్థః సప్తభిః ప్రతిపాద్యతే । 157
స్వరార్థోఽసౌ ద్విధాజ్ఞేయః శుద్ధమిశ్రవిభేదతః ।
క్రమేణ వ్యుత్క్రమేణేతి ప్రత్యేకం తౌ ద్విధా మతౌ ॥ 158

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; సప్తభిః స్వరైః = సప్తస్వరములచేత; అభీష్టః అర్థః = కోరుకొన్న అర్థము; ప్రతిపాద్యతే = తెలియజేయబడునో; అసౌ స్వరార్థః = ఆ స్వరార్థము; శుద్ధ - మిశ్రవిభేదతః = శుద్ధము, మిశ్రము అను భేదముచే; ద్విధా = రెండు విధములుగ; జ్ఞేయః = తెలియదగినది; తౌ = ఆ రెండును; ప్రత్యేకం = విడివిడిగా; క్రమేణ = క్రమముచేతను; వ్యుత్క్రమేణ = వ్యత్యాసముచేతను; ద్విధా = రెండువిధములుగ; మతౌ = తెలియదగినవి.

**తాత్పర్యము** : ఎక్కడ సప్తస్వరములచేత కోరుకొన్న అర్థము తెలియజేయబడునో ఆ స్వరార్థము శుద్ధము, మిశ్రము అను భేదముచే రెండు విధములుగ తెలియదగినది, ఆ రెండును విడివిడిగ క్రమముచేతను, వ్యత్యాసము చేతను రెండు విధములుగ తెలియదగినవి.

శుద్ధ్యా చైవ శ్రుతిస్థాన కృతయా తస్య సంభవః ।
శుద్ధః స్వరార్థో విజ్ఞేయః కేవలైః సప్తభిః స్వరైః ॥ 159

**ప్రతిపదార్థము** : శ్రుతిస్థానకృతయా = శ్రుతిస్థానములచే చేయబడిన; శుద్ధ్యా = శుద్ధస్వరార్థముచేత; తస్య = దానికి; సంభవః = ప్రాప్తి కలుగును; కేవలైః = కేవలములగు; సప్తభిః స్వరైః = సప్తస్వరములచే; శుద్ధః స్వరార్థః = శుద్ధస్వరార్థము; విజ్ఞేయః = తెలియదగినది.

**తాత్పర్యము** : శ్రుతి స్థానములచే చేయబడిన శుద్ధస్వరార్థము చేత దానికి ప్రాప్తికలుగును. కేవలమగు సప్తస్వరములచే శుద్ధ స్వరార్థము తెలియదగినది.

[illegible] స్వరాణాం సప్తానామేకైకం ప్రథమాక్షరమ్ ।
అక్షరాంతర సమ్మిశ్రం గీయతే స తు మిశ్రకః ॥ 160

ప్రతిపదార్థము : యత్ర = దేనియందు; సప్తానాం స్వరాణాం = సప్తస్వరములలో;

ఏకైకం = ఒక్కొక్కటిగ; ప్రథమాక్షరం = తొలి అక్షరము; అక్షరాంతర సమ్మిశ్రం = మరియొక అక్షరముతో కూడినదిగ; గీయతే = గానము చేయబడునో; స తు = అది; మిశ్రకః = మిశ్రకమను స్వరార్ధము.

**తాత్పర్యము** : దేనియందు సప్తస్వరములలో ఒక్కొక్కటిగ తొలి అక్షరము మరియొక అక్షరముతో కూడినదిగ గానము చేయబడునో అది మిశ్రకమను స్వరార్ధము.

**శశిస్తనాగ్నివేదేషు రసాశ్చేతి హితాభిధాః ।**

**ఏకాదిస్వరభేదేన స్వరార్థః సప్తధా స్మృతః ॥ 161 ॥**

**ప్రతిపదార్థము** : శశిస్తనాగ్నివేదేషు = చంద్ర, స్తన, అగ్నివేదములందు; హితాభిధాః = హితనామకములైనవి; రసాః ఇతి = రసములని; హితనామకములు; ఏకాదిస్వరభేదేన= ఏకాది స్వరవిభేదముచే; స్వరార్థః = స్వరార్థము; సప్తధా స్మృతః = ఏడువిధములుగా చెప్పబడినది.

**తాత్పర్యము** : చంద్ర, స్తన, అగ్నివేదములందు రసములని హితనామకములు. ఏకాది స్వరవిభేదముచే స్వరార్థము ఏడువిధములుగా చెప్పబడినది.

**ఆభోగోఽన్యపదైశ్చాస్య గ్ర(హ?హే)ణైవ ప్రముచ్యతే ।**

**॥స్వరార్థః ॥**

**అపాదః పదసందోహో గద్యం షోఢాతదిష్యతే ॥ 162 ॥**

**ప్రతిపదార్థము :** ఆభోగః = ఆభోగము; అన్యపదైః = ఇతరపదములచే; అస్య =దీనికి; గ్రహేణైవ = గ్రహముచేతనే; ప్రముచ్యతే = విడువబడును; అపాదః = పాదరహితమైన; పదసందోహః = పదసముదాయము; గద్యం = గద్యము; తత్ =అది; షోఢా = ఆరువిధములుగా; ఇష్యతే = సమ్మతమైనది.

**తాత్పర్యము** : ఆభోగము ఇతరపదములచే దీనికి గ్రహముచేతనే విడువబడును. పాదరహితమైన పదసముదాయము గద్యము అది ఆరువిధములుగా సమ్మతమైనది.

**వృత్తగంధి తథా చూర్ణమన్యదుత్కలికాభిధమ్ ।**
**లలితం చ తథా ఖండం చిత్రం తల్లక్ష్మ కథ్యతే ॥ 163 ॥**

**ప్రతిపదార్థము** : వృత్తగంధి = వృత్తగంధియు; చూర్ణం = చూర్ణమును; అన్యత్ =

మరియొకటి; ఉత్కలికాభిధం = ఉత్కలికయు; లలితం = లలితమును; ఖండం = ఖండమును; చిత్రం = చిత్రమును; తల్లక్ష్మ = వాటిలక్షణము; కథ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** వృత్తగంధియు, చూర్ణమును మరియొకటి ఉత్కలికయు, లలితమును, ఖండమును చిత్రమును వాటిలక్షణము చెప్పబడుచున్నది.

> **పద్యభాగాన్వితం గద్యం వృత్తగంధి నిగద్యతే ।**
> **అసమస్తైః సమస్తైర్వా ద్విత్రైస్తు చతురైః పదైః ॥ 164 ॥**

**ప్రతిపదార్థము :** పద్యభాగాన్వితం గద్యం = పద్యభాగముతో కూడిన గద్యము; వృత్తగంధి నిగద్యతే = వృత్తగంధియని చెప్పబడినది; అసమస్తైః = సమానములు కాని; సమస్తైః వా = సమస్తములైన; ద్విత్రైః = రెండుమూడయిన; చతురైః పదైః = నాలుగు పదములచేతను;

**తాత్పర్యము :** పద్యభాగముతో కూడినగద్యము వృత్తగంధియని చెప్పబడినది. సమానములు కాని సమస్తములైన రెండుమూడయిన నాలుగు పదములచేతను;

> **రచితం చూర్ణమాఖ్యాతం గద్యం గద్యవిశారదైః ।**
> **గౌడరీత్యా యుతం గద్యం ప్రోక్తముత్కలికాభిధమ్ ॥ 165 ॥**

**ప్రతిపదార్థము :** రచితం = రచింపబడినది; చూర్ణం ఆఖ్యాతం = చూర్ణప్రభేదముగా చెప్పబడినది; గౌడరీత్యా యుతం = గౌడరీతియుతమైన; గద్యం = గద్యము; ఉత్కలికాభిధం = ఉత్కలికాప్రభేదము.

**తాత్పర్యము :** రచింపబడినది చూర్ణప్రభేదముగా చెప్పబడినది. గౌడరీతియుతమైన గద్యము ఉత్కలికాప్రభేదము.

> **సమస్తైః పంచషైర్బద్ధం పదైర్లలితమీరితమ్ ।**
> **ప్రాక్రాంతరీతిభంగేన బృహల్లఘుపదైర్యుతమ్ ॥ 166 ॥**

**ప్రతిపదార్థము :** సమస్తైః = సమానములైన; పంచషైః పదైః బద్ధం = ఐదారు పదములతో నిబద్ధమైనది; లలితం ఈరితం = లలితమని చెప్పబడినది; ప్రక్రాంతరీతిభంగేన = ప్రక్రాంతరీతి భంగముచే; బృహల్లఘుపదైః యుతం = అధికాల్పపదములతో కూడిన;

**తాత్పర్యము** : సమాసములైన ఐదారుపదములతో నిబద్ధమైనది లలితమని చెప్పబడినది. ప్రక్రాంతరీతిభంగముచే అధికాల్పపదములతో కూడిన;

> **గద్యం ఖండమితి ప్రాహుర్గద్యభేదవిశారదాః ।**
> **గద్యం చిత్రమితి ప్రోక్తం నానారీతిసమన్వితమ్ ॥ 167 ॥**

**ప్రతిపదార్థము** : గద్యభేదవిశారదాః = గద్యభేదము నెఱిగిన పండితులు; గద్యం = గద్యమును; ఖండమితి ప్రాహుః = ఖండమని చెప్పిరి; నానారీతి సమన్వితం = అనేక రీతులతో కూడినది; చిత్రం ఇతి = చిత్రమని; ప్రోక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము** : గద్యభేదము నెఱిగిన పండితులు గద్యమును ఖండమని చెప్పిరి. అనేకరీతులతో కూడినది చిత్రమని చెప్పబడినది.

> **వృత్తగం(ధీ?ధి)ని పాంచాలీ రీతిః శాంతో రసో భవేత్ ।**
> **వృత్తిశ్చ భారతీ జ్ఞేయా సామవేదసముద్భవే ॥ 168 ॥**

**ప్రతిపదార్థము** : వృత్తగంధిని = వృత్తగంధియందు; పాంచాలీరీతిః = పాంచాలిరీతి; శాంతః రసః భవేత్ = శాంతరసముండును; సామవేద సముద్భవేత్ = సామవేదము నుండి జనితము; వృత్తిశ్చ భారతీ జ్ఞేయా = భారతీయవృత్తియని తెలియదగినది;

**తాత్పర్యము** : వృత్తగంధియందు పాంచాలిరీతి శాంతరసముండెను. సామవేదము నుండి జనితము భారతీయ వృత్తియని తెలియదగినది.

> **చూర్ణేస్యాత్ సాత్త్వతీ వృత్తిర్వైదర్భీ రీతిరుత్తమా ।**
> **శాంతో రసో విజానీయాద్ గద్యవిద్యావిశారదైః ॥ 169 ॥**

**ప్రతిపదార్థము** : గద్యవిద్యావిశారదైః = గద్య విద్యయందు నిష్ణాతులైన వారిచే; చూర్ణే= చూర్ణమందు; సాత్త్వతీ వృత్తిః స్యాత్ = సాత్త్వతీ వృత్తియగును; ఉత్తమావైదర్భీ రీతిః స్యాత్ = ఉత్తమమైన వైదర్భీరీతి యగును; శాంతోరసః విజానీయాత్ = శాంతరసము తెలియనగును.

**తాత్పర్యము** : గద్యవిద్యయందు నిష్ణాతులైన వారిచే చూర్ణమందు సాత్త్వతీ వృత్తియగును. ఉత్తమమైన వైదర్భీరీతి యగును. శాంతరసము తెలియనగును.

> **ఉత్కలికాహ్వయే రీతిర్గౌడీ వీరరసో భవేత్ ।**
> **వృత్తిరారభటీ జ్ఞేయా గీతతత్త్వవిచక్షణైః ॥ 170 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్కలికాహ్వాయే = ఉత్కలిక యందు; గౌడీ వృత్తిః స్యాత్ = గౌడీవృత్తియగును; వీరరసః భవేత్ = వీరరసమగును; ఆరభటీవృత్తిః = ఆరభటీవృత్తి కలదిగ; గీతతత్త్వ విచక్షణైః = సంగీతశాస్త్రమర్మజ్ఞులచే; జ్ఞేయా = తెలియదగినది.

**తాత్పర్యము** : ఉత్కలికయందు గౌడీవృత్తియగును. వీరరసమగును. ఆరభటీవృత్తి కలదిగ సంగీతశాస్త్రమర్మజ్ఞులచే తెలియదగినది.

**లలితే పాంచాలరీతిః స్యాత్ కైశికీ వృత్తిరుత్తమా ।**
**రసః శృంగారనామాయమాదిశాస్త్రార్థ స(ర్వ?మ్మ) తః ॥ 171 ॥**

**ప్రతిపదార్థము** : లలితే = లలితమందు; పాంచాలరీతిః స్యాత్ = పాంచాలరీతియగును; ఉత్తమా కైశికే వృత్తిః స్యాత్ = కైశికి వృత్తియగును; శృంగారనామా రసః = శృంగార రసము; అయం = ఈలలితము; ఆదిశాస్త్రార్థసమ్మతః = ప్రాచీన శాస్త్రసమ్మతము.

తాత్పర్యము : లలితమందు పాంచాలరీతియగును. కైశికి వృత్తియగును. శృంగారరసము ఈలలితము ప్రాచీన శాస్త్రసమ్మతము.

**ఖండగద్యే రసో హాస్యో వైదర్భీ రీతిరిష్యతే ।**
**సాత్త్వతీ వృత్తిరిష్టామే పూర్వశాస్త్రావిరోధతః ॥ 172 ॥**

**ప్రతిపదార్థము** : ఖండగద్యే = ఖండగద్యప్రబేధమందు; హాస్యః రసః = హాస్యరసము; వైదర్భీ రీతిః = వైదర్భీరీతి; సాత్త్వతీ వృత్తిః = సాత్త్వతీవృత్తి; మే =నాకు; పూర్వశాస్త్రా విరోధతః = ప్రాచీనశాస్త్రమునకు విరుద్ధముకానిదిగ; ఇష్టా = ఇష్టమైనది.

**తాత్పర్యము** : ఖండగద్య ప్రభేదమందు హాస్యరసము వైదర్భీరీతి సాత్త్వతీవృత్తి నాకు ప్రాచీన శాస్త్రమునకు విరుద్ధముకానిదిగ ఇష్టమైనది.

**చిత్రగద్యే చ వైదర్భీ రీతిర్వృత్తిశ్చ కైశికీ ।**
**రసః శృంగారసంజ్ఞోఽయం గీతజ్ఞైః సముదాహృతః ॥ 173 ॥**

**ప్రతిపదార్థము** : చిత్రగద్యే = చిత్రగద్యమందు; వైదర్భరీతిః = వైదర్భీరీతి; కైశికీ వృత్తిః = కైశికీవృత్తియు; శృంగారః రసః = శృంగారరసము కలదిగా; గీతజ్ఞైః = సంగీత శాస్త్రజ్ఞులచే; సముదాహృతః = చెప్పబడినది.

**తాత్పర్యము** : చిత్రగద్యమందు వైదర్భీరీతి కైశికీ వృత్తియు శృంగారరసము కలదిగా సంగీతశాస్త్రజ్ఞులచే చెప్పబడినది.

**ప్రణవాద్యం భవేద్యం గేయం తాలవివర్జితమ్ ।**
**మిథః సమయయుకైః షడ్భిరష్టభిర్వా సమన్వితమ్ ॥ 174 ॥**

**ప్రతిపదార్థము** : ప్రణవాద్యం గద్యం = ప్రణవాదిగద్యము; తాలవివర్జితం = తాలరహితమగును; షడ్భిః అష్టభిః వా సమయయుకైః = ఆరుగాని ఎనిమిదిగాని సమయ(క)ములచే; మిథః = అన్యోన్యము; సమన్వితం = కూడినదై; గేయం = గానము చేయదగినది.

**తాత్పర్యము** : ప్రణవాది గద్యము తాలరహితమగును. ఆరుగాని, ఎనిమిదిగాని సమయ(క)ములచే అన్యోన్యము కూడినదై గానము చేయదగినది.

**పదాన్యేతాని మేధావీ గాయేద్గీతానుసారతః ।**
**గద్యేఽను యాయినః కార్యో గీతస్య నియమో బుధైః ॥ 175 ॥**

**ప్రతిపదార్థము** : మేధావీ = పండితుడు; ఏతాని పదాని = ఈ పదములను; గీతానుసారతః = గీతముననుసరించి; గాయేత్ = పాడవలెను; గద్యే = గద్యమందు; అనుయాయినః కార్యః = అనుయాయులు చేయదగినది; గీతస్య నియమః భవేత్ = గీతమునకు నియమముండును.

**తాత్పర్యము** : పండితుడు ఈ పదములను గీతముననుసరించి పాడవలెను. గద్యమందు అనుయాయులు చేయదగినది. గీతమునకు నియమముండును.

**మధ్యే మధ్యేఽత్రగమకాః సర్వే వర్ణాశ్చ యుక్తితః ।**
**గద్యరీత్యా విధాతవ్యావవిలంబవిలంబితౌ ॥ 176 ॥**

**ప్రతిపదార్థము** : అత్ర = ఇందు; మధ్యేమధ్యే = మధ్యమధ్యన; సర్వేవర్ణాః గమకాశ్చ= అన్ని వర్ణములు మరియు గమకములు; యుక్తితః = యోగ్యముగా; గద్యరీత్యా = గద్యపద్ధతిచే; అవిలంబ విలంబితౌచ = అవిలంబ విలంబములును; విధాతవ్యౌ = చేయదగినవి.

**తాత్పర్యము** : ఇందు మధ్యమధ్యన అన్ని వర్ణములు మరియు గమకములు యోగ్యముగా గద్యపద్ధతిచే అవిలంబవిలంబములును చేయదగినవి.

అతాలపదపర్యంతే స్వరా జ్ఞేయా విచక్షణైః ।
మధ్యే మధ్యే తు గద్యస్య స్వరాః ప్రాంతేఽథవా మతాః ॥ **177** ॥

**ప్రతిపదార్థము** : విచక్షణైః = పండితులచే; అతాలపదపర్యంతే = అతాల పద పర్యంతమందు; స్వరాః జ్ఞేయాః = స్వరములు తెలియదగినది; గద్యస్య మధ్యే మధ్యే= గద్యముయొక్క మధ్యమధ్యనగాని; అథవా = లేక; ప్రాంతే = ప్రాంతమందు; స్వరాః = స్వరములు; మతాః = సమ్మతములు.

**తాత్పర్యము** : పండితులచే అతాలపదపర్యంతమందు స్వరములు తెలియదగినవి. గద్యముయొక్క మధ్యమధ్యన గాని లేక ప్రాంతమందు స్వరములు సమ్మతములు.

**తతః ప్రబంధనామాంకం సతాలం పదయుగ్మకమ్ ।**
**గుర్వక్షరాణామల్పత్వే ద్రుతమద్యాప్రకీర్తితా ॥ 178 ॥**

**ప్రతిపదార్థము** : తతః = తరువాత; ప్రబంధనామాంకం = ప్రబంధము; సతాలం = తాళముకలది; పదయుగ్మకం = పదద్వయయుతము; గుర్వక్షరాణాం అల్పత్వే = గర్వక్షరములు తక్కువైనచో; ద్రుతమధ్యా ప్రకీర్తితా = ద్రుతమధ్యమైనదిగా చెప్పబడినది.

**తాత్పర్యము** : తరువాత ప్రబంధము తాళముకలది. పదద్వయయుతము గుర్వక్షరములు తక్కువైనచో ద్రుతమధ్యమైనదిగా చెప్పబడినది.

**గురుభిర్లఘుభిర్మిశ్రైర్జ్ఞేయా మధ్యవిలంబితా ।**
**ప్రత్యేకం షడ్విధే గద్యే షట్ప్రకారగతిర్భవేత్ ॥ 179 ॥**

**ప్రతిపదార్థము** : గురుభిః = గురువులచేతను; లఘుభిః = లఘువులచేతను; మిశ్రైః= మిశ్రమములచేతను; మధ్యవిలంబితా జ్ఞేయా = మధ్యవిలంబితముగా తెలియదగినది; ప్రత్యేకం = ప్రత్యేకముగా; షడ్విధే గద్యే = ఆరువిధములైన గద్యమందును; షట్ప్రకారగతిః భవేత్ = ఆరువిధములైనగతి (గమకము) ఉండును.

**తాత్పర్యము** : గురువులచేతను లఘువులచేతను మిశ్రమములచేతను మధ్య విలంబితముగా తెలియదగినది. ప్రత్యేకముగా ఆరువిధములైన గద్యమందును ఆరువిధములైన గతి (గమకము) ఉండును.

**అతః షట్త్రింశదేవ స్యుర్భేదా గద్యసమాశ్రయాః ।**

**॥ గద్యమ్ ॥**

**లంభకశ్చోపలంభశ్చ విలంభశ్చాథ లక్షణమ్ ॥ 180 ॥**

**ప్రతిపదార్థము :** అతః = అందువలన; గద్యసమాశ్రయాః = గద్యమునాశ్రయించిన; భేదాః = భేదములు; షట్ త్రింశదేవ స్యుః = ముప్పదియారు (36) మాత్రమగును; అథ = తరువాత; లంభకః = లంభకము; ఉపలంభకః= ఉపలంభకము; విలంభశ్చ = విలంభమును; తేషాం లక్షణం తు = వీటి లక్షణము -

**తాత్పర్యము :** అందువలన గద్యమునాశ్రయించిన భేదములు ముప్పదియారు (36) మాత్రమగును. తరువాత లంభకము, ఉపలంభకము, విలంభమును- వీటిలక్షణము;

> **పదమేకం పదే ద్వే వా కించిద్గమకసంయుతే ।**
> **సకృద్ గీత్వా తతో గేయం ద్వౌ వారౌ ధ్రువకాభిధమ్ ॥ 181 ॥**

**ప్రతిపదార్థము :** ఏకపదం = ఒకపదము; ద్వేపదే వా = రెండు పదములుగాని; కించిత్ గమకసంయుతే = కొంచెము గమకముతో కూడినవిగ; గీత్వా = పాడి; తతః = తరువాత; ధ్రువకాభిధం = ధ్రువమును; ద్వౌ వారౌ గేయం = రెండు పర్యాయములు గానముచేయవలెను.

**తాత్పర్యము :** ఒకపదము రెండు పదములుగాని కొంచెము గమకముతో కూడినవిగ పాడి తరువాత ధ్రువమును రెండుపర్యాయములు గానముచేయవలెను.

> **ఆభోగం చ తతో గీత్వా ధ్రువేణ న్యాస ఇష్యతే ।**
> **ఇత్యేష లంభకః ప్రోక్తో భాగైర్ద్విస్త్రిర్విభూషితః ॥ 182 ॥**

**ప్రతిపదార్థము :** తతః = తరువాత; ఆభోగం గీత్వా = ఆభోగమును పాడి; ధ్రువేణ న్యాసః ఇష్యతే ఇతి = ధ్రువముచేతను న్యాసము చేయదగినది అని; ఏష లంబకః = ఈ లంభకము; ద్విఃత్రిః భాగైః = రెండుమూడు భాగములచే; విభూషితః = అలంకృతమైనదిగా; ప్రోక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము :** తరువాత ఆ భోగమును పాడి ధ్రువముచేతను న్యాసము చేయదగినది. ఇట్లు ఈలంభకము రెండు మూడు భాగములచే అలంకృతమైనదిగా చెప్పబడినది.

> **అతాలాపయుక్తః ప్రాగ్ ధ్రువాభోగౌ చ తాలభాక్ ।**
> **విలంభకః పరిజ్ఞేయో ధ్రువన్యాసేన సంయుతః ॥ 183 ॥**

**ప్రతిపదార్థము :** ప్రాక్ = ముందు; అతాలాపయుక్తః = తాలరహిత ఆలాపయుతము; తాలభాక్ = తాలయుతమైన; ధ్రువాభోగౌ = ధ్రువాభోగములును; ధ్రువన్యాసేన

సంయుతః = ధ్రువన్యాసము కలది; విలంభకః పరిజ్ఞేయః = విలంభకముగా తెలియదగినది.

**తాత్పర్యము** : ముందు తాలరహిత ఆలాపయుతము తాలయుతమైన ధ్రువాభోగములును ధ్రువన్యాసముకలది విలంభకముగా తెలియదగినది.

**పదైర్నానావిధైర్యస్మాదేకగీతైః పునః పునః ।**
**ఉద్గ్రాహే వా ధ్రువే వాపి ద్వయోర్వాభోగవర్జితః ॥ 184 ॥**

**ప్రతిపదార్థము** : యస్మాత్ = ఎందువలన; నానావిధైః పదైః = అనేక పదములుగల; ఏకగీతైః = ఏకగీతములచే; పునః పునః = మాటి మాటికి; ఉద్గ్రాహే వా = ఉద్గ్రాహమందుగాని; ధ్రువే వా = ధ్రువమందుగాని; ద్వయోఃవా = రెండింటియందుగాని; ఆ భోగవర్జితః = ఆ భోగత్యక్తమయినది.

**తాత్పర్యము** : ఎందువలన అనేక పదములు కల ఏకగీతములచే మాటిమాటికి ఉద్గ్రాహమందుగాని ధ్రువమందుగాని రెండింటియందుగాని ఆభోగత్యక్తమయినది.

**ఉపలంభ ఇతి ప్రోక్తః స నామ్నా గీతకోవిదైః ।**

**॥ లంభకః ॥**

**ఆదితాలసమాయుక్తే గమకాది వివర్జితే ॥ 185 ॥**

**ప్రతిపదార్థము** : సః = అది; గీతకోవిదైః = సంగీతశాస్త్రజ్ఞులచే; ఆదితాలసమాయుక్తే= ఆదితాలముతో కూడిన; గమకాదివివర్జితే = గమకాదులచే పరిత్యక్తమైన; ఉపలంభః ఇతి = ఉపలంభమని; ప్రోక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము** : అది సంగీతశాస్త్రజ్ఞులచే ఆదితాలముతో కూడిన గమకపరిత్యక్తమైన ఉపలంభమని చెప్పబడినది.

**రాసకే ఝోంబడస్యేవ శేషం లక్షణమీరితమ్ ।**
**అన్యైర్యస్త్రివిధః ప్రోక్తో గణమాత్రాదిభేదతః ॥ 186 ॥**

**ప్రతిపదార్థము** : రాసకే = రాసకమందు; ఝోంబడస్య ఇవ = ఝోంబడమునకు వలె; శేషం = మిగిలినదైన; లక్షణం ఈరితం = లక్షణము చెప్పబడినది; అన్యైః = మిగిలినవాటిచే; యః త్రివిధః = ఏ త్రివిధమైన; రాసకః = రాసకము; గణమాత్రాధిభేదత = గణమాత్రాది భేదమువలన; ప్రోక్తః = చెప్పబడినదో;

**తాత్పర్యము :** రాసకమందు ఝోంబడమునకు వలె మిగిలినదైన లక్షణము చెప్పబడినది. ఏ త్రివిధమైన రాసకము గణమాత్రాదిభేదమువలన చెప్పబడినదో;

**రాసకః కిన్ను కాస్త్యస్య (?) లక్ష్యే కుత్రాపి దర్శనమ్ ।**
**ఆలాపం కేచిదిచ్ఛంతి రాసకే ప్రాజ్ఞమనీషిణః ॥ 187 ॥**

**ప్రతిపదార్థము** : అస్య = దీనికి; లక్ష్యే = లక్ష్యమందు; కుత్రాపి = ఎక్కడైనను; దర్శనం అస్తి? = కనబడనున్నది?; ప్రాజ్ఞమనీషిణః = పూర్వపు పండితులు; కేచిత్ = కొంతమంది; రాసకే = రాసకమందు; అతాలం ఇచ్ఛంతి = తాలరాహిత్యమును కోరుచున్నారు.

**తాత్పార్యము :** దీనికి లక్ష్యమందు ఎక్కడైనను కనబడనున్నది? పూర్వపు పండితులు కొంతమంది రాసకమందు తాలరాహిత్యమును కోరుచున్నారు.

**కేచిదైకపదోద్గ్రాహం రాసకం ప్రతిపేదిరే ।**

**॥ రాసకః ॥**

**ద్విరుద్గ్రాహం ధ్రువం ద్విశ్చ గీత్వాభోగం సకృత్పునః ॥ 188 ॥**

**ప్రతిపదార్థము :** కేచిత్ = కొందరు; ఏకపదోద్గ్రాహం = ఏకపద ఉద్గ్రాహము (కలదానిగ)ను; రాసకం ప్రతిపేదిరే = రాసకముగా నిరూపించిరి; ద్విః = రెండు పర్యాయములు ఉద్గ్రాహమును; ద్విః = రెండు మారులు; ధ్రువం చ = ధ్రువమును; గీత్వా = పాడి; పునః = మరల; సకృత్ = ఒకసారి; ఆభోగం = ఆభోగమును;

**తాత్పర్యము :** కొందరు ఏక పద ఉద్గ్రాహము (కలదానిగ) ను రాసకముగా నిరూపించిరి. రెండు పర్యాయములు, రెండుమారులు ధ్రువమును పాడి మరల ఒకసారి ఆభోగమును;

**ధ్రువం గీత్వా తతః కార్యో న్యాసోగీత విశారదైః ।**
**ఘనద్రుతా ఘనప్రాసా యత్యా చ ఘనయా యుతా ॥ 189 ॥**

**ప్రతిపదార్థము :** ధ్రువం గీత్వా = ధ్రువమును పాడి; తతః = తరువాత; న్యాసః కార్యః = న్యాసము చేయదగినది; ఘనద్రుతా = ఘనద్రుతముచే; ఘనప్రాసా = ఘనప్రాసచేతను; ఘనయా యత్యా యుతా = ఘనయతితోకూడిన;

**తాత్పర్యము** : రెండు పర్యాయములు ఉద్గ్రాహమును రెండుమారులు ధ్రువమును పాడి మరల ఒకసారి ఆభోగమును ధ్రువమును పాడి తరువాత న్యాసము చేయదగినది. ఘనద్రుతముచే ఘనప్రాస చేతను ఘనయతితో కూడిన;

**ఏకతాలాఖ్యతాలేన గేయా స్యాదేకతాలికా ।**
**ఆలాపానిర్మితః కైశ్చిదస్యా ఉద్గ్రాహ ఇష్యతే ॥ 190 ॥**

**ప్రతిపదార్థము** : ఏకతాలాఖ్యతాలేన = ఏకతాళముచే; ఏకతాలికా గేయా స్యాత్ = ఏకతాలిక గానము చేయనగును; కైశ్చిత్ = కొందరిచే; అస్యాః = దీనికి; ఆలాపనిర్మితః ఉద్గ్రాహః = ఆలాప నిర్మితమైన ఉద్గ్రాహము; ఇష్యతే = కోరబడుచున్నది.

**తాత్పర్యము** : ఏకతాళముచే ఏకతాలికగానము చేయనగును. దీనికి కొందరిచే ఆలాపనిర్మితమైన ఉద్గ్రాహము కోరబడుచున్నది.

**॥ ఏకతాలీ ॥**

**॥ ఇతి శుద్ధసూడాః ॥**

అథ సాలసూడక్రమం వక్ష్యే -

**ఆదౌ ధ్రువా తతో మట్టా(ప్రతి)మట్టా చ లంభకః ।**
**అడ్డతాలీ రాసకశ్చ ఏకతాలీవ కీర్తితాః ॥ 191 ॥**

**ప్రతిపదార్థము** : తరువాత సాలసూడ క్రమమును చెప్పుదును. ఆదౌ = మొదట; ధ్రువాః = ధ్రువములు; తతః = తరువాత; మట్టా = మట్టతాళములు; ప్రతిమట్టా చ లంభకః = ప్రతిమట్ట (యుత) లంభకము; అడ్డతాలీ రాసకశ్చ = అడ్డతాలరాసకమును; ఏకతాలీన = ఏకతాలివలె; కీర్తితః = చెప్పబడినది.

**తాత్పర్యము** : తరువాత సాలసూడ క్రమమును చెప్పుదును. మొదట ధ్రువములు తరువాత మట్టతాళములు ప్రతిమట్ట (యుత) లంభకము అడ్డతాలరాసకమును ఏకతాలివలె చెప్పబడినది.

ఆదౌ పాదౌ సమగణయుతౌ ధాతుసామ్యౌ తతస్తత్తుల్యో వాంఘ్రిస్త్వధిక ఇతరో ధాతునాన్యేన యుక్తః ।

స్యాదుద్గ్రాహేऽత్ర పదసహితో గేయ ఏష ద్వివారం

**త్వంఘ్రీ గీత్వా సకృదపి పునర్న్యస్యతే చోద్గ్రహే సః ॥ 192 ॥**

**ప్రతిపదార్థము :** ఆదౌ = ముందు; సమగణయుతౌ = సమగణములతో కూడిన; ధాతుసామ్యౌ = ధాతుతుల్యమైన; పాదౌ = రెండుపాదములును; తతః = తరువాత; తత్తుల్యః = తానికి సమానమైన; అధికః అంఘ్రిర్వా = అధికపాదముగాని; అత్ర ఉద్గ్రాహే = ఇక్కడ ఉద్గ్రాహమందు; స్యాత్ = అగును; ఏషః పదసహితః = ఇది పదసహితమైనదిగ; ద్వివారం = రెండుసార్లు; గేయః = గానము చేయదగినది; సకృత్= ఒకసారి; అంఘ్రీ గీత్వా = రెండు పాదములు పాడి; పునః = మరల; ఉద్గ్రాహే = ఉద్గ్రాహమందు; సః = అది; (ధ్రువము); నస్యతే = ఉంచదగినది.

**తాత్పర్యము :** ముందు సమగణములతో కూడిన ధాతుతుల్యమైన రెండుపాదములును తరువాత దానికి సమానమైన అధికపాదముగాని ఇక్కడ ఉద్గ్రాహమందు అగును. ఇది పదసహితమైనదిగ రెండుసార్లు గానము చేయదగినది. ఒకసారి రెండుపాదములు పాడి మరల ఉద్గ్రాహమందు అది (ధ్రువము) ఉంచదగినది.

స ధ్రువః ఏకాదశధా -

**శశిహాసహంసమాధవనీలోత్పలతాపసప్రజానాథాః ।**
**హరిహరనరపతిశక్రా ఏకాదశ తే క్రమాదుక్తాః ॥ 193 ॥**

**ప్రతిపదార్థము :** ఆ ధ్రువము 11 విధములు. శశి, హాస, హంస, మాధధవ, నీలోత్పలః తాపస, ప్రజానాథ, హరి, హర, నరపతి, శక్ర, ఇతి = అని; తే = ఆధ్రువములు; ఏకాదశ = (11) పదకొండు; క్రమాత్ = క్రమముగా; ఉక్తాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** శశి, హాస, హంస, మాధవ, నీలోల్పల, తాపస, ప్రజానాథ, హరి, హర, నరపతి, శక్ర, అని ఆధ్రువములు (11) పదకొండు క్రమముగా చెప్పబడినవి.

**భవతి శశాంకః క్రమశో మధురతరో మంద్రమధ్యతారాఖ్యే ।**
**తేషామపి విశదానాం వ్యుత్క్రమతో జాయతే భాసః ॥ 194 ॥**
**('హాస' ఇతి లక్ష్యే పఠ్యతే।)**

**ప్రతిపదార్థము :** క్రమశః = క్రమముగా; మంద్రమధ్యతారఖ్యే = మంద్రమధ్య తారములందు; మధురతరః = మిక్కిలి మదురమైనది; శశాంకః భవతి = శశాంకనామక ధ్రువమగును; విశదానాం = స్పష్టములైన; తేషాం = ఆ స్థాయులయొక్క; వ్యుత్క్రమత=

వ్యతిక్రమమువలన; భా(హా)సః జాయతే = (భా) హాసమగుచున్నది.

**తాత్పర్యము** : క్రమముగా మంద్రమధ్యతారములందు మిక్కిలి మధురమైనది శశాంకనామక ధ్రువమగును (10 స్పష్టములైన ఆ స్థాయులయొక్క వ్యతిక్రమమువలన (భా) హాసమగుచున్నది.

> **తేషామపి స్ఫుటానాం మధ్యాదీనామసౌ హంసః ।**
> **సుకుమారాణాం తేషాం మధ్యాంతానాం వసంతాఖ్యః ॥ 195 ॥**

**ప్రతిపదార్థము** : స్ఫుటానాం = స్పష్టములైన; తేషామపి = వాటిలో కూడా; మధ్యాదీనాం= మధ్యాదులలో; అసౌ = ఇది; హంసః = హంసనామక ధ్రువము; సుకుమారాణాం తేషాం = సుకుమారములైన వాటిలో; మధ్యాంతానాం = మధ్యతారములకు; వసంతాఖ్యః = మాధవము అగును.

**తాత్పర్యము** : స్పష్టములైన వాటిలో కూడ మధ్యాదులలో ఇది హంసనామక ధ్రువముసుకుమారములైన వాటిలో మధ్యతారములకు మాధవము అగును.

> **తేషాం వికాసభాజామభిదూర్వాంకో భవేత్ కుముదః ।**
> **తేషాం ప్రసన్నభాజాం లీలానాం తాపసో భవతి ॥ 196 ॥**

**ప్రతిపదార్థము** : వికాసభాజాం తేషాం = వికాసమును పొందినవాటిలో; అభిదూర్వాంక= అంతట వ్యాపించు స్వభావముకలది; కుముదః భవతి = నీలోత్పలమగును; ప్రసన్నభాజాం తేషాం = ప్రసన్నతను పొందినవాటిలో; లీలానాం = లీలలకు; తాపసః భవతి = తాపసనామధ్రువమగును.

**తాత్పర్యము** : వికాసమును పొందినవాటిలో అంతట వ్యాపించుస్వభావముకలది. నీలోత్పలమగును. ప్రసన్నతను పొందినవాటిలో లీలలకు తాపసనామ ధ్రువమగును.

> **ప్రచురస్ఫురితైస్తైరపి సువ్యక్తో భవతి కమలభవః ।**
> **తైరేవ తిరిపుబహులైః (కోమలయతి?కమలాపతి) నామకో భవతి ॥ 197 ॥**

**ప్రతిపదార్థము** : ప్రచురస్ఫురితైః = తరచుగా స్ఫురించు; తైరపి = వాటిచేతను; కమలభవః = ప్రజానాధ(ము); సువ్యక్తోః భవతి = మిక్కిలి స్పష్టమగుచున్నది; తైరేవతి పురుబహులైః = ఆ తిరుపు బహుళముల చేతనే; కమలాపతిః భవతి = హరినామక ధ్రువమగుచున్నది.

**తాత్పర్యము** : తరచుగా స్ఫురించువాటిచేతను ప్రజానాధ(ము) మిక్కిలి స్పష్టమగు చున్నది. ఆ తిరుపుబహుళములచేతనే హరినామకధ్రువమగుచున్నది.

**తైరేవ తిరిపుభిన్నైః శైలాసుతావల్లభో భవతి ।**
**తైరాందోలనబహులైర్జాయేతాసౌ వసుంధరాధీశః ॥ 198 ॥**

**ప్రతిపదార్థము** : తిరుపుభిన్నైః తైరేవ = తిరుపు భిన్నములైన వాటిచేతనే; శైలాసుతావల్లభో భవతి = హరనామక ధ్రువమగును; ఆందోలనబహుళైఃతైః = గమక బహుళములైన వాటిచేతనే; అసౌ వసుంధరాధీశః జాయేత = ఇది నరపతినామక ధ్రువముకావచ్చును.

**తాత్పర్యము** : తిరుపుభిన్నములైన వాటిచేతనే హరనామకధ్రువమగును. గమక బహుళమైన వాటిచేతనే ఇది నరపతినామకధ్రువము కావచ్చును.

**తైరేవ కంపబహులైః సహస్రనాయనాభిధో భవతి ।**
**॥ ఇత్యేకాదశ ధ్రువాః ॥**
**మట్ఠా చ ప్రతిమట్టా చ లంభకశ్చాడ్డతాలికా ॥ 199 ॥**

**ప్రతిపదార్థము** : కంపబహులైః తైరేవ = ప్రకంపాధికమైన వాటిచేతను; సహస్రనయానాభిదః భవతి = శక్రనామక ధ్రువమగుచున్నది; మట్టా = మట్టాతాళము; ప్రతిమట్టా చ = ప్రతిమట్టతాళము; లంభకః = లంభకము; అడ్డతాలికా = అడ్డతాళము.

**తాత్పర్యము** : ప్రకంపాధికమైన వాటిచేతను శక్రనామక ధ్రువమగుచున్నది. మట్టాతాళము ప్రతిమట్టతాళము లంభకము అడ్డతాళము.

**రాసకశ్చైకతాలీ చ ధ్రువకేనాపి గీయతే ।**
**గేయః స్యాత్ సకృదుద్గ్రాహో ద్వివారం ధ్రువకస్తతః ॥ 200 ॥**

**ప్రతిపదార్థము** : రాసకః = రాసకము; ఏకతాలీ చ = ఏకతాలము; ధ్రువకేన అపి గీయతే = ధ్రువముచేతనే గానము చేయదగినది; సకృత్ = ఒకసారి; ఉద్గ్రాహః గేయః స్యాత్ = ఉద్గ్రాహము పాడవలయును; తతః = తరువాత; ద్వివారం ధ్రువకః = రెండుపర్యాయములు ధ్రువమును; ఆభోగం గీత్వా = ఆభోగమునుపాడి;

**తాత్పర్యము** : రాసకము ఏకతాలము, ధ్రువముచేతనే గానముచేయదగినది. ఒకసారి ఉద్గ్రాహు పాడవలయును. తరువాత రెండుపర్యాయములు ధ్రువమును ఆభోగమునుపాడి;

**గీత్వాఽఽభోగం ద్విరుద్గ్రాహో ధ్రువే లంభవజాతికః ।**
**మమాదితాల పఙ్క్న?యదా గాయేత లంభకః ॥ 201 ॥**

**ప్రతిపదార్థము :** ధ్రువే = ధ్రువమందు; లంభకజాతికః = లంభజాత్యమైన; ఉద్గ్రాహః = ఉద్గ్రాహము; ద్విః = రెండుమార్లు; గీత్వా = పాడి; మమాహాదితాలపంక్తినా = మధ్యమ విశిష్టఆదితాళముచే; యధా = ఎప్పుడు; లంబకః గాయేత = పాడబడునో;

**తాత్పర్యము :** ధ్రువమందు లంభజాత్యమైన ఉద్గ్రాహము రెండుమార్లు పాడి మధ్యమవిశిష్ట ఆదితాళముచే ఎప్పుడు పాడబడునో;

**తత్తత్తాలాభిధానేన లంభ (కః?కం) కథయంతి చ ।**
**గండకీ గూర్జరీ చైవ రామక్రీ (వ?ఫ)లమంజరీ ॥ 202 ॥**

**ప్రతిపదార్థము :** తత్తత్తాలాభిధానేన = ఆయాతాళములపేర్లతో; లంభకం కథయంతి= లంభకమును చెప్పుచున్నారు; గండకీ, గూర్జరీ, రామక్రీఫలమంజరీ.

**తాత్పర్యము :** ఆయా తాళముల పేర్లతో లంభకమును చెప్పుచున్నారు. గండకీ, గూర్జరీ, రామక్రీ, ఫలమంజరీ.

**ఛాయాగౌడశ్చ దేశాఖ్యా వరాటీ కథితా తథా ।**
**బుధైఃసాలగనాట్టా చ రాగాః సాలకసంజ్ఞితాః ॥ 203 ॥**

**ప్రతిపదార్థము :** ఛాయాగౌడ దేశీయు, వరాటీ, సాలగనాట్టాయు, రాగాః = రాగములు; సాలక సంజ్ఞితాః కథితాః = సాలకములని చెప్పబడినది.

**తాత్పర్యము :** ఛాయాగౌడ దేశీయు, వరాటీ, సాలగనాట్టాయ రాగములు సాలకములని చెప్పబడినది.

**ఛాయయా అలమత్యర్థం గీయత ఇతి ఛాయాలగః ।**
**అథ గానక్రమః -**
**ఏకైకశోఽపి గాతవ్యః ప్రబంధో వినియోగతః ॥ 204 ॥**

**ప్రతిపదార్థము :** ఛాయయా = ఛాయచేతను; అత్యర్థం = అధికమగును; అలం = చాలినంతగను; గీయతే ఇతి = గానము చేయబడునది; ఛాయాలగః = ఛాయాలగము; వినియోగతః = వినియోగమునననుసరించి; ప్రబంధః = ప్రబంధము; ఏకైకశః = ఒక్కొక్కమారుగా; గాతవ్యః = గానము చేయదగినది.

**తాత్పర్యము** : ఛాయచేతను అధికమగును. చాలినంతగను గానముచేయబడునది. ఛాయాలగము వినియోగమునననుసరించి ప్రబంధము ఒక్కొక్కమారుగా గానము చేయదగినది.

**చమత్కారం జనయితుం వినాదేషు సహోపతేః ।**
**అనుసారః సానుసారస్త (తో?థో) త్తరాభిధః పరః ॥ 205 ॥**

**ప్రతిపదార్థము** : వినోదేషు = వినోదములందు; చమత్కారం జనయితుం = చమత్కారమును కల్గించుటకు; అనుసారః = అనుసారము; సానుసారశ్చ = సానుసారమును; తథా = అట్లే; ఉత్తరాభిధః = ఉత్తరనామకము.

**తాత్పర్యము** : వినోదములందు చమత్కారమును కల్గించుటకు అనుసారము సానుసారమును అట్లే ఉత్తరనామకము.

**ఖలోత్తరం చ కురుపుః పట్టాన్తరన (లా?వా) న్తరౌ ।**
**ఉచ్యతే సమయస్తస్మాద్ విజ్ఞేయం పరివర్తనమ్ ॥ 206 ॥**

**ప్రతిపదార్థము** : ఖలోత్తరం = ఖలోత్తరము; కురుపు = కురుపువు; పటాంతరం = పటాన్తరము; నవాంతరం = నవాంతరము(నవము); తస్మాత్ = తరువాత; సమయ= సమయము; పరివర్తనం చ = పరివర్తనమును; విజ్ఞేయం = తెలియదగినది; ఇతి = ఈవిధముగా;

**తాత్పర్యము** : ఖలోత్తరము కురుపువు పటాన్తరము నవాంతరము (నవము) తరువాత సమయము పరివర్తనమును తెలియదగినది. ఈవిధముగా;

**నవధా రూపకం ప్రోక్తం గీతవిద్యావిచక్షణైః ।**
**క్రమేణ లక్షణం తేషాం వక్ష్యే లక్ష్యానుసారతః ॥ 207 ॥**

**ప్రతిపదార్థము** : రూపకం నవధా ప్రోక్తం = రూపకము తొమ్మిదివిధములుగా చెప్పబడినది; తేషాం లక్షణం = వాటిలక్షణమును; లక్ష్యానుసారతః = లక్ష్యముల ననుసరించి; క్రమేణ = క్రమముగా; వక్ష్యే = చెప్పుచున్నాను;

**తాత్పర్యము** : రూపకము తొమ్మిదివిధములుగా చెప్పబడినది. వాటి లక్షణమును లక్ష్యములననుసరించి క్రమముగా చెప్పుచున్నాను;

**తాలరాగప్రమేయశ్చ సదృశం పూర్వవస్తునః ।**
**నవం వస్త్వనుసారాఖ్యం దర్పణే ప్రతిబింబవత్ ॥ 208 ॥**

**ప్రతిపదార్థము** : దర్పణే ప్రతిబింబవత్ = అద్దమందలి ప్రతిబింబమువలె; పూర్వవస్తునః సదృశం = పూర్వవస్తువుతో తుల్యమైనదియు; తాలరాగ ప్రమేయః = తాలరాగములతో ప్రమేయముకలదియు అయిన; నవం వస్తు = నూతన వస్తువు; అనుసారాఖ్యం స్యాత్= అనుసారనామకమగును.

**తాత్పర్యము** : అద్దమందలి ప్రతిబింబమువలె పూర్వవస్తువుతో తుల్యమైనదియు తాలరాగములతో ప్రమేయముకలదియు అయిన నూతనవస్తువు అనుసార నామకమగును.

**ఇదమేవ గుణైరీషత్ సదృశం పూర్వవస్తునః ।**
**సానుసారాభిదం జ్ఞేయం గీతలక్షణకోవిదైః ॥ 209 ॥**

**ప్రతిపదార్థము** : ఇదమేవ = ఇదియే; గుణైః = గుణములచేత; ఈషత్ = కొంచెము; పూర్వవస్తునః = పూర్వవస్తువునకు; సదృశం=సమానమైన; గీతలక్షణకోవిదైః = సంగీతశాస్త్రజ్ఞులచే; సానుసారాభిదం జ్ఞేయం = సానుసారనామకమగును.

**తాత్పర్యము** : ఇదియే గుణములచేత కొంచెము పూర్వవస్తువునకు సమానమై సంగీత శాస్త్రములచే సానుసారనామకమగును.

**సమమాత్రం విశిష్టార్థం కించిత్ తాలవిలంబితమ్ ।**
**చడాలశృతిసంయుక్తముత్తరం గీతముచ్యతే ॥ 210 ॥**

**ప్రతిపదార్థము** : సమమాత్రం = సమానమైన మాత్రలుకలదియు; విశిష్టార్థం = విశిష్టమైన అర్థముకలదియు; కించిత్ తాలవిలంబితం = కొంచెముతాలము విలంబితమైనదియు; చడాలశ్రుతిసంయుక్తం = చడాలశ్రుతి యుతమును అయినది; ఉత్తరం గీతం ఉచ్యతే = ఉత్తరగీతముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : సమానమైన మాత్రముకలదియు విశిష్టమైన అర్థముకలదియు కొంచెము తాలము విలంబితమైనదియు చడాల శ్రుతియుతమును అయినది ఉత్తరగీతముగాచెప్ప బడుచున్నది.

**స్వస్థానకపరిత్యాగాత్ స్థేయా నైవాదిరూపకే ।**
**నీచోచ్చస్థానకైరన్యగానం ఖలోత్తరం విదుః ॥ 211 ॥**

**ప్రతిపదార్థము** : స్వస్థానకపరిత్యాగాత్ = స్వస్థానమును విడిచిపెట్టుటవలన; ఆదిరూకేన స్థేయా = ఆదిరూపమందుండరానిది; నీచోచ్చస్థానకైః = నీచ ఉచ్చస్థానములచే; అన్యగానం యత్ = ఇతరమైనగానమేదికలదోఅది; ఖలోత్తరం విదుః = ఖలోత్తరముగా తెలియుదురు

**తాత్పర్యము** : స్వస్థానమును విడిచిపెట్టుటవలన ఆదిరూపకమందుండరానిది నీచ ఉచ్చస్థానములచే ఇతరమైన గానమేదికలదో, అది ఖలోత్తరముగా తెలియుదురు.

**ఏకస్యైవ పదార్థస్య బహూనాం వోపమాదిభిః ।**
**స స్యాదిష్టార్థనిర్వాహః కురు (షు?పుః) పరికీర్తితః ॥ 212 ॥**

**ప్రతిపదార్థము** : ఏకస్య పదార్థస్య ఏవ = ఒకపదార్థమునకే; బహూనాంవా = అనేకములకుగాని; ఉపమాధిభిః = ఉపమాదులచే; ఇష్టార్థనిర్వాహఃస్యాత్ = ఇష్టార్థనిర్వహణ అగునో; సః = అది; కురుపుః పరికీర్తితః = కురుపువుగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఒక పదార్థమునకే అనేకములకు గాని ఉపమాదులచే ఇష్టార్థనిర్వహణ అగునో అది కురుపువుగా చెప్పబడినది.

**పరీక్షమాణయోస్తజ్జైరుభయోర్యది వస్తునోః ।**

**గుణాధిక్యమనిశ్చేయం పట్టాంతరమితి స్మృతమ్ ॥ 213 ॥**

**ప్రతిపదార్థము** : తజ్జైః = పండితులచే; పరీక్ష్యమాణయోః ఉభయోః వస్తునోః = పరీక్షింపబడెడి రెండు వస్తువులకు; గుణాధిక్యం= గుణాధిక్యము; అనిశ్చేయం స్యాత్= నిశ్చయము కానియెడల; తత్ =అది; పట్టాంతరం స్మృతం = పట్టాన్తరమని చెప్పనగును.

**తాత్పర్యము** : పండితులచే పరీక్షింపబడెడి రెండు వస్తువులకు గుణాధిక్యము నిశ్చయము కానియెడల అది పట్టాన్తరమని చెప్పనగును.

**అర్థభాష క్రియారాగధాతు మాతులయేషు చ।**
**రసరీత్యోర్నవత్వం యన్నవ ఇత్యభిధీయతే ॥ 214 ॥**

**ప్రతిపదార్థము** : అర్థభాష క్రియారాగధాతుమాతులయేషు చ = అర్థము, భాష, క్రియ, రాగము, ధాతువు, మాతువు, లయలయందు; యత్ = ఏదైతే; రసరీత్యోః = రసము మరియు రీతుల యొక్క; నవత్వం = క్రొత్తదనము (అగుపించునో అది) నవః ఇతి= నవము (నూతనము); ఇతి = అని; అభిధీయతే = పిలవబడుచున్నది.

**తాత్పర్యము** : అర్థము, భాష, క్రియ, రాగము, ధాతువు, మాతువు, లయలయందు ఏదైతే రసము మరియు రీతులయొక్క క్రొత్తదనము (అగుపించునో అది) నవము అని పిలవబడుచున్నది.

గజాద్యారోహణాదౌ తు సమ(యో?యే) నృపవర్ణనమ్ ।
తదానీమేవ రచితం భవేత్ తత్ సమయాభిధమ్ ॥ 215 ॥

**ప్రతిపదార్థము :** గజాద్యారోహణాదౌ సమయే = గజాద్యారోహణాదిసమయమందు; యత్ నృపవర్ణనం స్యాత్ = రాజవర్ణనమేదికలదో; తత్ = అది; సమయాభిదం రచితం భవేత్ = సమయనామకముగ రచింపబడును.

**తాత్పర్యము :** గజాద్యారోహణాదిసమయమందు రాజవర్ణనమేదికలదో అది సమయనామకముగ రచింపబడును.

**రూపకం స్థానకే రాగే తాలే గీయేత గాయకైః ।**
**పరివృత్త్యాన్యథాగీతం తదేవ పరివర్తనమ్ ॥ 216 ॥**

**ప్రతిపదార్థము :** గాయకైః = గాయకులచే; స్థానకే = స్థానమందు; రాగే = రాగమందును; తాలే = తాళమందును; పరవృత్త్యా = పరివృత్తి (మార్పు)చే; రూపకం గాయేత = రూపకము గానము చేయబడునో; తదేవ = అదియే; పరివర్తనం గీతం = పరివర్తనగీతము.

**తాత్పర్యము :** గాయకులచే స్థానమందు రాగమందును తాళమందును పరివృత్తి (మార్పు)చే రూపకము గానము చేయబడునో అదియే పరివర్తనగీతము.

**రీతయః సంతి కథితాః షడేవ కథయామి తే ।**
**చోక్షగాయనరీతిశ్చ యోగిరీతిః క్వచిద్ భవేత్ ॥ 217 ॥**

**ప్రతిపదార్థము :** షడేవ = ఆరు(6)మాత్రమే; కథితా = చెప్పబడిన; రీతయః సంతి = రీతులు గలవు; తే = వాటిని; కథయామి = చెప్పుచున్నాను; చోక్షగాయనరీతిః = చోక్షగాయనరీతి; క్వచిత్ = ఒక్కొక్కచోట; యోగరీతిః భవేత్ = యోగరీతియు ఉండును.

**తాత్పర్యము :** ఆరు (6)మాత్రమే చెప్పబడిన రీతులుగలవు, వాటిని చెప్పుచున్నాను. చోక్షగాయనరీతి ఒక్కొక్కచోట యోగరీతియు ఉండును.

**మలినగాయనరీతిశ్చ గీతిః సా యోషితాం క్వచిత్ ।**
**క్వచిత్ పేచరణరీతిశ్చ రీతిః కథకసంజ్ఞితా ॥ 218 ॥**
**రీతిర్భంగిరితి ప్రోక్తా రీతిలక్షణకోవిదైః ॥ 128 ½ ॥**

**ప్రతిపదార్థము :** మలినగాయనరీతిః = మలినగాయన రీతి; క్వచిత్ = ఒకచోట; యోషితాం = స్త్రీలయొక్క; గీతిః = గీ(రీ)తియు; క్వచిత్ = ఒకచోట; పేరణరీతిః = పే(ప్రే)రణ రీతియు; కథకసంజ్ఞితా రీతిః = కథనరీతియు అని; రీతిలక్షణకోవిదైః = రీతిజ్ఞులచే; రీతిః = రీతి; భంగిరితి = పద్ధతియని, ప్రోక్తా = చెప్పబడినది.

**తాత్పర్యము** : మలినగాయనరీతి ఒకచోట స్త్రీలయొక్క గీ(రీ)తియు ఒకచోట పే(ప్రే)రణరీతియు కథనరీతియు అని రీతిజ్ఞులచే రీతి పద్ధతియని చెప్పబడినది.

**ఇతి సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే సంగీతసమయసారే**

**॥ చతుర్థమధికరణమ్ ॥**

---

## ॥ అథ పంచమమధికరణమ్ ॥

**అథ గీతానుగామిత్వాద్ వాద్యమత్ర ప్రవ(ర్జ్య?ర్ణ్య) తే ।**
**ఉద్దేశక్రమత: కించిత్ సర్వలోకానురంజనమ్ ॥ 1 ॥**

**ప్రతిపదార్థము** : అథ = అనంతరము; గీతానుగామిత్వాత్ = గీతమునసుసరించున దగుట వలన; సర్వలోకానురంజనం = సమస్త ప్రపంచమునకు సంతోషదాయి అయిన; వాద్యం = వాద్యము; ఉద్దేశక్రమత: = ఉద్దేశించిన క్రమముగా; కించిత్ = కొంచెము; అత్ర = ఇక్కడ; ప్రవర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

**తాత్పర్యము** : అనంతరము గీతమునసుసరించున దగుటవలన సమస్త ప్రపంచమునకు సంతోషదాయి అయిన వాద్యము ఉద్దేశించిన క్రమముగా కొంచెము ఇక్కడ వర్ణింపబడు చున్నది.

**తతం తతోకవనద్ధం చ ఘనం చ సుషిరం తథా ।**
**చతుర్విధమిదం ప్రాహురాతోద్యం వాద్యవేదిన: ॥ 2 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యవేదిన: = వాద్యవేత్తలు; తత: = వీణమొదలైన తంత్రీవాద్యము; అవనద్ధం = మద్దెలమొదలగు చర్మవాద్యము; ఘనం = తాళము మొదలగు కంచువాద్యము; సుషిరం ఇతి = పిల్లనగ్రోవి మొదలగు వాద్యము అని; ఇదం చతుర్విధం ఆతోద్యం = ఈ ఆతోద్యము నాల్గువిధములైనది అని; ప్రాహు: = చెప్పిరి.

**తాత్పర్యము** : వాద్యవేత్తలు వీణమొదలైన తంత్రీవాద్యము, మద్దెలమొదలగు చర్మవాద్యము, తాళము మొదలగు కంచువాద్యము, పిల్లనగ్రోవి మొదలగు వాద్యము అని ఈ ఆతోద్యము నాల్గువిధములైనది అని చెప్పిరి.

**తతం తంత్రీగతం జ్ఞేయమవనద్ధం తు పౌష్టరమ్ ।**
**కాంస్యం ఘనమితి ప్రోక్తం సుషిరం సుషిరాత్మకమ్ ॥ 3 ॥**

**ప్రతిపదార్థము** : తతం = తతము; తంత్రీగతం జ్ఞేయం = తంత్రీగతమని తెలియనగును; అవనద్ధం = అవనద్ధము; పౌష్టరం = చర్మసంబంధి; ఘనం = ఘనము; కాంస్యం ప్రోక్తం = కంచుసంబంధమైనది; సుషిరం = సుషిరము; సుషిరాత్మకం = ముఖగతమైనది.

**తాత్పర్యము** : తతము తంత్రీగతమని తెలియనగును. అవనద్ధము చర్మసంబంధి ఘనము కంచుసంబంధమైనది సుషిరము ముఖగతమైనది.

**వీణా చాలావణీ చైవ కిన్నరీ లఘుపూర్వికా ।**
**బృహత్కిన్నరికా చైవ శకనీత్యాదిగంతరమ్ ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : వీణా=వీణ; చాలావణీ=చాలావణి; లఘుపూర్వికా కిన్నరీ = లఘుకిన్నరి; బృహత్కిన్నరీ = బృహత్కిన్నరి; శకనీత్యాది = శకనిమొదలగు; అంతరం= భేదము.

**తాత్పర్యము** : వీణ చాలావణి లఘుకిన్నరి బృహత్కిన్నరి శకనిమొదలగు భేదము.

**పటహశ్చ హుడుక్కా చ ఢక్కా చ తదనంతరమ్ ।**
**మృదంగః కరదేత్యాద్యమవనద్ధముదాహృతమ్ ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : పటహః = పటహము; హుడక్కా = హుడుక్క; ఢక్కా = ఢక్క; తదనంతరం = దానితరువాత; మృదంగః = మృదంగము; కరదా ఇత్యాద్యం = కరద ఈమొదలగునవి; అవనద్ధం ఉదాహృతం = అవనద్ధ (చర్మ)వాద్యము(లు)గా ఉదహరింప బడినది (వి).

**తాత్పర్యము** : పటహము హుడుక్క ఢక్క దాని తరువాత మృదంగము కరద ఈ మొదలగునవి అవనద్ధ (చర్మ) వాద్యము(లు)గా ఉదహరింప బడినది(వి).

**తాలశ్చ కాంస్యతాలశ్చ ఘంటికా క్షుద్రఘంటికా ।**
**పట్టశ్చ శుక్తిరిత్యాద్యం ఘనవాద్యముదాహృతమ్ ॥ 6 ॥**

**ప్రతిపదార్థము** : తాలశ్చ =తాళమును; కాంస్యతాలశ్చ = కాంస్య (కంచు) తాళమును; ఘంటికా = ఘంటిక; క్షుద్రఘంటికా = క్షుద్రఘంటికయు; పట్టశ్చ = పట్ట(ము)ను; శుక్తిః ఇత్యాద్యం = శుక్తి ఈమొదలగునది; ఘనవాద్యం ఉదాహృతం = (లోహ) ఘనవాద్యముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : తాళమును కాంస్య (కంచు) తాళమును ఘంటిక క్షుద్రఘంటికయు పట్ట(ము)ను శుక్తి ఈమొదలగునది (లోహ) ఘనవాద్యముగా చెప్పబడుచున్నది.

**వంశశ్చ మహురీ చైవ శంఖః శృంగం తథైవ చ ।**
**ఇత్యాద్యనేకధా ప్రోక్తం సుషిరం వాద్యవేదిభిః ॥ 7 ॥**

**ప్రతిపదార్థము :** వంశః = వేణువు; మహురీ చ = మహురియు; శంఖః = శంఖము; శృంగం = కొమ్ము, తథా = అట్లే; ఇత్యాది = ఈమొదలగునవి; అనేకధా = అనేకవిధములుగా; సుషిరం = సుషిరము; ప్రోక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము :** వేణువు మహురియు, శంఖము కొమ్ము, శృంగము అట్లే ఈ మొదలగునవి అనేకవిధములుగా సుషిరము చెప్పబడినది.

**ఏకహస్తేన హస్తాభ్యాం కోణేనాంగుళిభిస్తథా ।**
**నానాప్రకారైః ఫూత్కారైః శ్రుతిసౌఖ్యవిధాయిభిః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము :** ఏకహస్తేన = ఒకచేతితోనే; హస్తాభ్యాం = రెండుచేతులతోను; కోణేన= కోణముచేతను; అంగుళిభిః = వ్రేళ్లతోను; శ్రుతిసౌఖ్యవిధాయిభిః = చెవులకింపగు నట్లుగ; నానాప్రకారైః ఫూత్కారైః = అనేక విధములైనఫూత్కారములచే;

**తాత్పర్యము :** ఒకచేతితోనే రెండు చేతులతోను కోణముచేతను వ్రేళ్లతోను చెవులకింపగునట్లుగ అనేక విధములైన ఫూత్కారములచే;

**బహుప్రకారమేవం స్యాద్ వాదనం లోకరంజనమ్ ।**
**తత్సర్వం పంచధా భూయః శుష్కం గీతానుగం తథా ॥ 9 ॥**

**ప్రతిపదార్థము :** బహుప్రకారం=అనేకవిధములుగా; లోకరంజనం = ప్రజారంజకముగా; వాదనం స్యాత్ = వాదనమగును; తత్ సర్వం = అది అంతయు; భూయః = మరల; పంచధా = ఐదువిధములు; శుష్కం = శుష్కము; గీతానుగం = గీతానుగము.

**తాత్పర్యము :** అనేకవిధములుగా ప్రజారంజకముగా వాదనమగును. అదిఅంతయు మరల ఐదువిధములు. శుష్కము గీతానుగము.

**నృత్యస్య చానుయాయి స్యాదుభయానుగమిత్యపి ।**
**తంత్ర్యాశ్చానుగతం ప్రోక్తం వాద్యవిద్యావిచక్షణైః ॥ 10 ॥**

**ప్రతిపదార్థము :** నృత్యస్య అనుయాయి = నృత్యానుయాయి; ఉభయానుగమిత్యపి= ఉభయానుయాయి; తంత్ర్యాశ్చ అనుగతం = తంత్ర్యానుయాయిఅని; వాద్య వబిద్యావిచక్షణైః = వాద్య విద్యనెఱిగినవారిచే; ప్రోక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము** : నృత్యానుయాయి ఉభయాయి తంత్ర్యానుయాయి అనివాద్య విద్యనెఱిగినవారిచే చెప్పబడినది.

**వినా గీతం వినా నృత్తం వాద్యం శుష్కముదాహృతమ్ ।**
**అన్వర్థసంజ్ఞయా జ్ఞేయం శిష్టం వాద్యచతుష్టయమ్ ॥ 11 ॥**

**ప్రతిపదార్థము** : గీతం వినా = గీతములేక; వృత్తం వినా = నృత్యములేకనుఉన్న; వాద్యం = వాద్యము; శుష్కం ఉదాహృతం = శుష్కముగా చెప్పబడినది; శిష్టం = మిగిలిన; వాద్యచతుష్టయం = నాల్గువాద్యవిశేషములును; అన్వర్థసంజ్ఞయా జ్ఞేయం= సార్థకమైన పేరుకలదిగా తెలియదగినవి.

**తాత్పర్యము** : గీతములేక నృత్యములేకను ఉన్న వాద్యము శుష్కముగాచెప్పబడినది. మిగిలిన నాల్గువాద్యవిశేషములును సార్థకమైన పేరుకలదిగా తెలియదగినవి.

**క్రియాభేదాద్ వాద్యభేదాత్ తథైవ వ్యాప్తిభేదతః ।**
**వీణాభేదాద్ భవంత్యన్యే తంత్రీసంఖ్యావశాదపి ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : క్రియాభేదాత్ = క్రియాభేదముచేతను; వాద్యభేదాత్ = వాద్యభేదముచేతను; తథైవ = అట్లే; వ్యాప్తిభేదతః = వ్యాప్తిభేదములవలనను; వీణాభేదాత్ = వీణాభేదమువలనను; తంత్రీసంఖ్యావశాత్ అపి = తీగల లెక్కవలన గాని;

**తాత్పర్యము** : క్రియాభేదముచేతను, వాద్యభేదముచేతను, అట్లే వ్యాప్తిభేదములవలనను, వీణాభేదమువలనను, తీగలలెక్కవలనగాని;

**భజతే సర్వవీణానామేకతంత్రీప్రధానతా ।**
**ఛందోధా(రా)కైకుటీ చ కంకాలో వస్తుపూర్వకః ॥ 13 ॥**

**గజలీలాభిదానం చ తథైవోపరివాదనమ్ ।**
**దండకం చ తథా జ్ఞేయం వాద్యం పక్షిరుతాభిధమ్ ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : సర్వవీణానాం = అన్నివీణలకు; ఏకతంత్రీ ప్రధానతాం భజతే = ఏకతంత్రీప్రధానత్వమును పొందుచున్నవి; (ఛందో ధారా, కైకుటీ చ) (సంయుక్తం) కంకాలో వస్తుపూర్వకః గజలీలాభిధానం చతథైవో పరివాదనమ్ ॥) ఛందః = ఛందము; ధారా = ధార; కైకుటీ = సంయుక్తము; కంకాలః = కంకాలము; వస్తుపూర్వకః = వస్తువు; గజలీలాభిధానంచ = గజలీలము; తథైవ = అట్లే; ఉపరివాదనం = ఉపరివాదనము; దండకం = దండకము; పక్షిరుతాభిధం = పక్షిరుతము.

**తాత్పర్యము :** అన్ని వీణలకు ఏకతంత్రీ ప్రధానత్వమును పొందుచున్నది. (ఛందో) ధారా, కూకుటీ (సంయుక్తం), ఛందము ధార సంయుక్తము కంకాలము వస్తువు గజలీలయు అట్లే ఉపరివాదనము దండకము పక్షిరుతము.

**ఏతద్ దశవిధం నామ్నా వీణావాద్యం సమీరితమ్ ।**
**ఖసితేన సమాయుక్తో బహుధా స్ఫురితః కరః ॥ 15 ॥**

**ప్రతిపదార్థము :** ఏతత్ వీణావాద్యం = ఈవీణా వాద్యము; నామ్నా = పేరుచే; దశవిధం సమీరితం = పదివిధములుగా చెప్పబడినది; ఖసితేన సమాయుక్తః = ఖసితముతో కూడిన; బహుధా = అనేకవిధములుగా; స్ఫురితః కరః = ప్రకాశించినహస్తము.

**తాత్పర్యము :** ఈవీణా వాద్యము పేరుచే పదివిధములుగా చెప్పబడినది. ఖసితముతో కూడిన అనేకవిధములుగా ప్రకాశించిన హస్తము.

**సంస్పృ(ష్ట)తారం ఛందాఖ్యో యత్యా చ సమలంకృతః ।**
**ఉత్క్షేపః పరివర్తశ్చ తాభ్యాం స్యాద్ యత్ర కర్తరీ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము :** సంస్పృష్టతారం = తాకిన తారస్థాయికలదియై; ఛందాఖ్యః యత్యా చ సమలంకృతః = ఛందోనామము కల్గియతితో అలంకృతమైనది; ఉత్క్షేపః = ఉత్క్షేపము; పరివర్తశ్చ = పరివర్తనమును; తాభ్యాం = ఆరెండింటిచేతను; యత్ర = ఎక్కడ; కర్తరీస్యాత్ = కర్తరీ యగునో;

తాత్పర్యము : తాకిన తారస్థాయికలదియై ఛందోనామము కల్గి యతితో అలంకృతమైనది. ఉత్క్షేపము పరివర్తనమును ఆరెండింటిచేతను ఎక్కడ కర్తరీ యగునో;

**రేఫేణ సహితాతద్వదుల్లేఖో రేఫసంయుతః ।**
**ఏవం సముదితం ప్రాహుర్ధారాఖ్యం వాదనం బుధాః ॥ 17 ॥**

**ప్రతిపదార్థము :** రేఫేణ సహితా తద్వత్ = రేఫ కర్తరివలె; రేఫసంయుతః ఉల్లేఖః = రేఫయుతోల్లేఖమును; ఏవం =ఇట్లు; సముదితం = పుట్టినదానిని; ధారాఖ్యం వాదనం ప్రాహుః = ధారావాదనమని పండితులు చెప్పుచున్నారు.

**తాత్పర్యము :** రేఫకర్తరివలె రేఫయుతోల్లేఖమును ఇట్లు పుట్టినదానిని ధారావాదనమని పండితులు చెప్పుచున్నారు.

**సుఖేన స్ఫురితేనాపి నిర్ఘోషేణ చ పాణినా ।**
**సంయుక్తం చార్ధకర్తర్యా సంయుక్తం వాదనం విదుః ॥ 18 ॥**

**ప్రతిపదార్థము :** సుఖేన స్ఫురితేన = సుఖముగా స్ఫురించిన; నిర్ఘోషేణ పాణినా = ధ్వని (నాదములు)కల హస్తముచేతను; అర్ధకర్తర్యా సంయుక్తం = అర్ధకర్తరీయుతమైన దానిని; సంయుక్తం వాదనం విదుః = సంయుక్తవాదనముగా తెలియుదురు.

**తాత్పర్యము :** సుఖముగా స్ఫురించిన ధ్వని (నాదము) కల హస్తము చేతను అర్ధ కర్తరీయుతమైన దానిని సంయుక్త వాదనముగా తెలియుదురు.

**కర్తరీత్రయసంయుక్తం స్ఫురితైర్మూర్ఛితైర్యుతమ్ ।**
**కంకాలనామకం వాద్యం ప్రాహుర్వైణికకోవిదాః ॥ 19 ॥**

**ప్రతిపదార్థము :** కర్తరీత్రయసంయుక్తం = కర్తరీత్రయము కలదియు; స్ఫురితైః = స్ఫురితములచేతను; మూర్ఛితైః యుతం = మూర్ఛనలచేతను కూడినదియు; కంకాల నామకం వాద్యం=కంకాలవాద్యముగా; వైణికకోవిదాః=వీణాపండితులు; ప్రాహుః=చెప్పిరి.

**తాత్పార్యము :** కర్తరీత్రయము కలదియు స్ఫురితములచేతను మూర్ఛనలచేతను కూడినదియ కంకాలవాద్యముగా వీణాపండితులు చెప్పిరి.

**కర్తర్యా ఖసితేనాపి కుహరేణ పరిస్ఫుటమ్ ।**
**తారః సంస్పృశ్యతే యత్ర తద్వాద్యం వస్తుసంజ్ఞకమ్ ॥ 20 ॥**

**ప్రతిపదార్థము :** కర్తర్యా = కర్తరి చేతను; ఖసితేన = ఖసితము చేతను; కుహరేణ = కుహరము (వివరము) చేతను; పరిస్ఫుటం = స్పష్టముగా; యత్ర = ఎక్కడ; తారః సంస్పృశ్యతే = తారముతాకబడునో; తత్ = అది; వస్తుసంజ్ఞకం వాద్యం స్యాత్ = వస్తువాద్యమగును.

**తాత్పర్యము :** కర్తరిచేతను ఖసితము చేతను కుహరము (వివరము)చేతను స్పష్టముగా ఎక్కడ తారము తాకబడునో అది వస్తువాద్యమగును.

**కర్తరీఖసితాభ్యాం యత్ కుహరేణ చ సంగతమ్ ।**
**నిర్ఘోషరేఫభ్రమరైః స్ఫూర్ణం తత్ కరణం విదుః ॥ 21 ॥**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది; కర్తరీఖసితాభ్యాం = కర్తరీఖసితముల చేతను; కుహరేణ చ సంగతం = కుహరము కూడియుండునో; నిర్ఘోషరేఫభ్రమరైః = నిర్ఘోష రేఫ

భ్రమరములతోను కూడియున్నదో; తత్ = అది; తూర్ణం కరణం విదుః = తూర్ణమను కరణముగా తెలియుదురు.

**తాత్పర్యము** : ఏది కర్తరీఖసితములచేతను కుహరముచేతనుకూడి యుండునో నిర్ఘోష రేఫభ్రమరములతోను కూడియున్నదో అది తూర్ణమను కరణముగా తెలియుదురు.

**కర్తర్యా ఖసితేనాపి మూర్ఛితః స్ఫురితైః కరైః ।**
**విరచ్యతే తు(త?య) ద్వాద్యం గజలీలం తదీరితమ్ ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : కర్తర్యా = కర్తరీచేతను; ఖసితేన = ఖసితముచేతను; మూర్ఛితః = మూర్ఛన చేయబడినవియు; స్ఫురితైః కరైః = స్ఫురితములైన కరములచే; యత్ విరచ్యతే = ఏది రచింపబడునో; తత్ వాద్యం = ఆ వాద్యము; గజలీలం ఈరితం = గజలీలగా చెప్పబడినది.

**తాత్పర్యము** : కర్తరీచేతను ఖసితముచేతను మూర్ఛన చేయబడినవియు స్ఫురితములైన కరములచే ఏది రచింపబడునో ఆవాద్యము గజలీలగా చెప్పబడినది.

**అధస్తాదుపరిష్టాచ్చ యావాయత కరౌ క్రమాత్ ।**
**రేఫకర్తరినిష్కోటైస్తలేనోపరివాద్యకమ్ ॥ 23 ॥**

**ప్రతిపదార్థము** : అధస్తాత్ = క్రిందను; ఉపరిష్టాచ్చ = మీదను; యావాయ తౌకరౌ= ఏవిస్తృతమైన కరములు; క్రమాత్ = క్రమముగా; రేఫకర్తరి = రేఫకర్తరియందు; నిష్కోటైః = నిష్కోటములచేతను; తలేన = తలముచేతను; ఉపరివాద్యకం స్యాత్ = ఉపరివాదన మగును.

**తాత్పర్యము** : క్రిందను మీదను కరములు క్రమముగా రేఫకర్తరియందు నిష్కోటముల చేతను తలము చేతను ఉపరివాదనమగును.

**నిక్షిప్య పరివర్తాభ్యాం కర్తర్యా చ సరేఫయా ।**
**మానేన ఖసితేనాపి మండితం దండకం విదుః ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : పరివర్తాభ్యాం = పరివర్తనములచేతను; సరేఫయా కర్తర్యా = రేఫాకర్తరి చేతను; మానేన = మానము (కొలత) చేతను; ఖసితేన = ఖసితము చేతను; నిక్షిప్య= ఉంచి; మండితం = అలంకృతమైనదానిని; దండకం విదుః = దండకముగా తెలియుదురు.

**తాత్పర్యము** : పరివర్తనములచేతను రేఫాకర్తరిచేతను మానము (కొలత) చేతను ఖసితముచేతను ఉంచి అలంకృతమైనదానిని దండకముగా తెలియుదురు.

**సమస్తహస్తసంయోగాద్ వాద్యం పక్షిరుతం మతమ్ ।**
**ఇత్యుక్తం దశధా వాద్యం గీతలక్షణవేదిభిః ॥ 25 ॥**

**ప్రతిపదార్థము** : సమస్తహస్తసంయోగాద్ = అన్ని హస్తముల కలయికవలన; పక్షిరుతం వాద్యం మతం = పక్షిరుతమను వాద్యము సమ్మతము; ఇతి = ఈప్రకారముగా; గీతలక్షణవేదిభిః = సంగీతశాస్త్ర లక్షణములనెఱిగినవారిచే; వాద్యందశధా ఉక్తం = వాద్యము పదివిధములుగ చెప్పబడినది.

**తాత్పర్యము** : అన్ని హస్తముల కలయికవలన పక్షిరుతమను వాద్యము సమ్మతము. ఈ ప్రకారముగా సంగీతశాస్త్ర లక్షణముల నెఱిగిన వారిచే వాద్యము పదివిధములుగ చెప్పబడినది.

**సకలం నిష్కలం చేతి వాద్యమేతద్ ద్విధా భవేత్ ।**
**కథితం శంకరేణేదమేకతంత్రీసమాశ్రయమ్ ॥ 26 ॥**

**ప్రతిపదార్థము** : సకలం = కళాసహితము (సకలము); నిష్కలం = కళారహితము (నిష్కళము); ఇతి = అని; ఏతత్ వాద్యం = ఈవాద్యము; ద్విధా భవేత్ = రెండు విధములు; ఏకతంత్రీసమాశ్రయం = ఏకతంత్రికి ఆశ్రయమైన; ఇదం = ఈవాద్యము; శంకరేణ కథితం = శంకరునిచే చెప్పబడినది.

**తాత్పర్యము** : కళాసహితము (సకలము) కళారహితము (నిష్కలము) అని ఈవాద్యము రెండువిధములు. ఏకతంత్రికి ఆశ్రయమైన ఈవాద్యము శంకరునిచే చెప్పబడినది.

**తథా జీవా విధాతవ్యా లగ్నా నాదే యథా భవేత్ ।**
**యత్ తయా జీ(య?వ్య) తే నాదస్తేన జీవేతి సా మతా ॥ 27 ॥**

**ప్రతిపదార్థము** : నాదే = నాదమందు; యథా = ఏప్రకారముగా; జీవః = జీవము; లగ్నా భవేత్ = లగ్నమగునో; తథా = అట్లు; విధాతవ్యా = చేయతగినది; యత్తయా జీవ్యతే నాదః = దేనిచేతను నాదము జీవము కలదగునో; తేన = అందుచే; జీవా ఇతి= జీవమని; సా = అది; మతా = సమ్మతము.

**తాత్పర్యము** : నాదమందు ఏప్రకారముగా జీవము లగ్నమగునో అట్లు చేయతగినది.

దేనిచేతను నాదము జీవము కలదగునో అందుచే జీవమని అది సమ్మతము.

**తంత్రికా పత్రికాయాం తు క్వచిల్లగతి వాథవా ।**
**లగ్నా సైవ కలా జ్ఞేయా వీణాప్రావీణ్యశాలిభిః ॥ 28 ॥**

**ప్రతిపదార్థము :** తంత్రికా పత్రికాయాం తు = తంత్రికా పత్రికయందు; క్వచిత్ = ఒకచోట; లగతి = లగ్నమగును; సైవ లగ్నాకలా = ఆలగ్నమైనదియే కళగా; వీణాప్రావీణ్యశాలిభిః = వీణయందు ప్రావీణ్యము గలవారిచే; జ్ఞేయా = తెలియదగినది.

**తాత్పర్యము :** తంత్రికా పత్రికయందు ఒకచోట లగ్నమైనదియే కళగా వీణయందు ప్రావీణ్యముగలవారిచే తెలియదగినది.

**తదుక్తం సకలం వాద్యం యతః స్థూలో భవేద్ ధ్వనిః ।**
**అసంస్పర్శేన తర్జన్యా దోరికాపత్రికావధి ॥ 29 ॥**

**ప్రతిపదార్థము :** దోరికాపత్రికావధి = దోరికాపత్రిక వఱకు; అసంస్పర్శేన తర్జన్యా = సంస్పృష్టముకాని తర్జనిచే; యతః స్థూలధ్వనిః భవేత్ = ఏస్థూలమైన ధ్వనియగునో; తత్ = అది; సకలం వాద్యం ఉక్తం = సకలవాద్యముగా చెప్పబడినది

**తాత్పర్యము :** దోరికా పత్రిక వఱకు సంస్పృష్టముకాని తర్జనిచే ఏస్థూలమైన ధ్వనియగునో అది సకల వాద్యముగా చెప్పబడినది.

**సార్యతే తంత్రికా యత్ర సకలం తదపి స్మృతమ్ ।**
**విందోరు యసిద్ధ్యర్థం జీవా హీనా విధీయతే ॥ 30 ॥**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; తంత్రికా సార్యతే = తంత్రి సారణచేయబడునో; తదపి = అదికూడ; సకలం = సకల(ళ)ముగా; స్మృతం = తలవబడినది; విందోరు య సిద్ధ్యర్థం = విందోరుయసిద్ధి కొఱకు; జీవా హీనా విధీయతే = జీవారహితముగా విధింపబడుచున్నది.

**తాత్పర్యము :** ఎక్కడ తంత్రి సారణచేయబడునో అదికూడ సకల(ళ)ముగా తలవబడినది. విందోరుయసిద్ధి కొఱకు జీవారహితముగా విధింపబడుచున్నది.

నిషాదస్వరతోఽధస్తాత్ తంత్రికా నైవ సర్పతి ।
యత్ర స్యాత్ తర్జనీస్పర్శో నిష్కలం తన్నిగద్యతే ॥ 31 ॥

**ప్రతిపదార్థము :** నిషాదస్వరతః = నిషాదస్వరము కంటె; అధస్తాత్ = క్రిందుగా; తంత్రికా నైవ సర్పతి = తంత్రి జరుగదు; యత్ర = ఎక్కడ; తర్జనీస్పర్శః స్యాత్ = తర్జనీ స్పర్శయుండునో; తత్ = అది; నిష్కలం నిగద్యతే = నిష్కలముగా చెప్ప బడుచున్నది.

**తాత్పర్యము :** నిషాదస్వరము కంటె క్రిందుగా తంత్రి జరుగదు. ఎక్కడ తర్జనీ స్పర్శ యుండునో అది నిష్కలముగా చెప్పబడుచున్నది.

**సన్నివిష్టా తథోక్షిప్తా తృతీయా చోభయాత్మికా ।**
**సంగం తంత్ర్యాః పరిత్యజ్య సంసర్పేద్ యత్ర సారణా ॥ 32 ॥**

**ప్రతిపదార్థము :** సన్నివిష్టా = ఉపవిష్టమైనట్టియు; తథా = అట్లే; ఉక్షిప్తా చ = ఉక్షిప్తమైనట్టియు;తృతీయా ఉభయాత్మికా చ సారణా=తృతీయమైన, ఉభయాత్మకమైన సారణ; తంత్ర్యాః సంగం త్యక్త్వా = తంత్రియొక్క కలయికనువదలి; యత్ర సంసర్పేత్ = ఎక్కడ (ముందుకు) జరుగునో;

**తాత్పర్యము :** ఉపవిష్టమైనట్టియు అట్లేఉక్షిప్తమైనట్టియు తృతీయమైన, ఉభయాత్మ కమైన సారణ తంత్రియొక్క కలయికనువదలి ఎక్కడ (ముందుకు) జరుగునో;

**సన్నివిష్టాభిధానా సా సారణా కథితా బుధైః ।**
**స్పర్శం స్పర్శం సముత్సృజ్య తంత్రీముత్ప్లుత్య సారణమ్ ॥ 33 ॥**

**ప్రతిపదార్థము :** సా = అది; సన్నివిష్టా భిధానా సారణా = సన్నివిష్టనామక మైన సారణగా; కథితా = చెప్పబడినది; స్పర్శం స్పర్శం సముత్సృజ్య = ప్రతిస్పర్శను విడిచి, తంత్రీం ఉత్ప్లుత్య = తీగెను దాటి; సారణం = సారణను;

**తాత్పర్యము :** అది సన్నివిష్టనామకమైన సారణగా చెప్పబడినది ప్రతిస్పర్శనువిడిచి తీగెను దాటి సారణను;

**యద్ యా(ది?తి) సోదితోక్షిప్తా నిష్కలే సకలేఽథవా ।**
**భవేత్ కుత్రచిదుక్షిప్తా సంస్పృష్టా కుత్రచిద్ భవేద్ ॥ 34 ॥**

**ప్రతిపదార్థము :** నిష్కలే = నిష్కలమందు; అథవా = లేక; సకలే = సక(ళ)లమందుకాని; యాతి = వెళ్లునో; సా = అది; కుత్రచిత్ = ఒక్కొక్కచోట; ఉక్షిప్తా భవేత్ = ఉక్షిప్తయగును; కుత్రచిత్ = ఒకానొకచోట; సంస్పృష్టా భవేత్ = సంస్పృష్టము అగును.

**తాత్పర్యము :** నిష్కలమందుగాని సక(ళ)లమందుకాని వెళ్లనో అది ఒక్కొక్కచోట ఉత్షిప్తాయగును. ఒకానొకచోట సంస్పృష్టము అగును.

> **ఇతి క్రియాద్వయీయోగాత్ సారణా సోభయాత్మికా ।**
> **సారణా త్రిప్రాకారేయమేకతంత్రీసమాశ్రితా ॥ 35 ॥**

**ప్రతిపదార్థము :** ఇతి = ఈప్రకారమైన; క్రియాద్వయీ యోగాత్ = ఉత్షిప్త - సంస్పృష్ట క్రియా యోగమువలన; సా సారణా = ఆ సారణ; ఉభకయాత్మికా = ఉభయాత్మకము; ఇయం = ఈ; ఏకతంత్రీ సమాశ్రితా సారణా = ఏకతంత్రీసమాశ్రయమైన సారణ; త్రిప్రకారా = మూడువిధములైనది.

**తాత్పర్యము :** ఈ ప్రకారమైన ఉత్షిప్త - సంస్పృష్ట క్రియాయోగమువలన ఆ సారణ ఉభయాత్మకము. ఈ ఏకతంత్రీసమాశ్రయమైన సారణ మూడువిధములైనది.

> **అన్యాసామపి వీణానాం యాథౌచిత్యేన సారణా ।**
> **ఘాతః పాతశ్చ సల్లేఖ ఉల్లేఖశ్చావలేఖకః ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** అన్యాసాం వీణానాం అపి = ఇతరవీణలకు కూడ; యథౌచిత్యేన = తగినవిధముగా; సారణా = సారణ; ఘాతః = ఘాతమని; పాతశ్చ = పాతమును; ఉల్లేఖః = ఉల్లేఖము; అవలేఖకః = అవలేఖము.

**తాత్పర్యము :** ఇతరవీణలకు కూడ తగిన విధముగా సారణ ఘాతమని పాతమును సల్లేఖము ఉల్లేఖము అవలేఖము.

> **ఛిన్నసంధితసంజ్ఞశ్చ భ్రమరశ్చేతి దక్షిణే ।**
> **హస్తే యాపారభేదాః స్యుర్వామే స్ఫురితఘర్షణే ॥ 37 ॥**

**ప్రతిపదార్థము :** చిన్నసంధితసంజ్ఞః = ఛిన్నసంధితనామకము; భ్రమరశ్చ = భ్రమరము అని; దక్షిణే హస్తే = కుడిచేతియందు; యాః అపారభేదాః స్యుః = అనేక భేదములు కలవు; స్ఫురితఘర్షణే వామే = స్ఫురితఘర్షణముగల ఎడమచేతియందలి;

**తాత్పర్యము :** ఛిన్నసంధితనామకము భ్రమరము అని కుడిచేతియందు అనేక భేదములు కలవు. స్ఫురిత ఘర్షణముగల ఎడమచేతియందలి;

> మధ్యమాక్రాంతతర్జన్యా యదా తంత్రీ న హన్యతే ।
> తదా(యా?ఘా)తో భవేత్ పాతస్తర్జన్యైవైకయా పునః ॥ 38 ॥

**ప్రతిపదార్థము** : మధ్యమాక్రాంతతర్జన్యా = మధ్యమముచేతఆక్రమించిన తర్జనితో (మధ్యమాంగుళితో కలసిన తర్జనితో); యదా = ఎప్పుడు; తంత్రీ = తీగ; నిహన్యతే= కొట్టబడునో; తదా=అప్పుడు; ఘాతం భవేత్=ఘాతమగును; ఏకయా తర్జన్యా పునః = ఒక్క చూపుడువ్రేలితోనే తంత్రీనిహనము జరుగునో అది; పాతః స్యాత్ = పాతమగును.

**తాత్పర్యము** : మధ్యమముచేత ఆక్రమించిన తర్జనితో (మధ్యమాంగుళితో కలసినతర్జనితో) ఎప్పుడు తీగ కొట్టబడునో అప్పుడు ఘాతమగును. ఒక్క చూపుడువ్రేలితోనే తంత్రీనిహనము జరుగునో అది పాతమగును.

**తర్జన్యంతరఘాతస్తు సలేఖః సముదాహృతః ।**
**మధ్యమాంతరఘాతస్తు భవేదుల్లేఖసంజ్ఞకః ॥ 39 ॥**

**ప్రతిపదార్థము** : తర్జన్యాంతరఘాతస్తు = తర్జన్యాంతరఘాతము; సల్లేఖః సముదాహృతః = సల్లేఖమగును; మధ్యమాంతరఘాతః = మధ్యమాంతరఘాతముకలది; ఉల్లేఖః భవేత్ = ఉల్లేఖమగును.

**తాత్పర్యము** : తర్జన్యాంతరఘాతము సల్లేఖమగును. మధ్యమాంతరఘాతము కలది ఉల్లేఖమగును.

**మధ్యమాబాహ్యఘాతోఽసావ వలేఖ ఇతి స్మృతః ।**
**తర్జనీపార్శ్వసంలగ్నా హ(త?తా)నామికయా బహిః ॥ 40 ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమాబాహ్యఘాతః = మధ్యమాబాహ్యఘాతముకల; అసౌ = ఈప్రభేదము; అవలేఖః ఇతి స్మృతః = అవలేఖమగును; బహిః తర్జనీ పార్శ్వసంలగ్నా= వెలుపల, తర్జనీపార్శ్వములందు లగ్నమైనది; హతనామికయా సిద్ధః = హతనామము కలదగును.

**తాత్పర్యము** : మధ్యమాబాహ్య ఘాతముకల ఈప్రభేదము అవలేఖమగును. వెలుపల తర్జనీపార్శ్వములందు లగ్నమైనది హతనామము కలదగును.

**తంత్రీ యదా తదా జ్ఞేయా ఘాతశ్ఛిన్నాభిధానవాన్ ।**
**మధ్యమానామికాభ్యాం తు బహిస్తంత్రీ యదా హతా ॥ 41 ॥**

**ప్రతిపదార్థము** : యదా = ఎప్పుడు; తంత్రీ = తీగ; ఘాతా స్యాత్ = ఘాతమగునో;

తదా = అప్పుడు; ఛిన్నాభిదానవాన్ = ఛిన్ననామకప్రభేదమగును; మధ్యమా నామికాభ్యాం = మధ్యవ్రేలు చిటికెనవ్రేలు ఈ రెండింటిచేతను; బహిస్తంత్రీ = (పై) వెలుపలి తీగె ఎప్పుడు కొట్టబడునో;

**తాత్పర్యము** : ఎప్పుడు తీగె ఘాతమగునో అప్పుడు ఛిన్ననామక ప్రభేదమగును. మధ్యవ్రేలు చిటికెన వ్రేలు ఈరెండింటిచేతను (పై) వెలుపలితీగె ఎప్పుడు కొట్టబడునో;

**తదా విచక్షణైరుక్తో ఘాతోఽసౌ సంధితాహ్వయః ।**
**అంగులీభిశ్చతసృభిరంతరాహననం ద్రుతమ్ ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : తదా = అప్పుడు; అసౌ ఘాతః = ఈఘాతము; సంధితాహ్వయః ఉక్తః = సంధితమని చెప్పబడినది; చతసృభిః అంగులీభిః = నాల్గువ్రేళ్లతోను; అంతరాహన నం ద్రుతం = అంతరాహననద్రుతము.

**తాత్పర్యము** : అప్పుడు ఈఘాతము సంధితమని చెప్పబడినది నాల్గువ్రేళ్లతోను అంతరాహననముకల ద్రుతము.

**యదా విరచ్యతే ఘాతస్తదా భ్రమరకో భవేత్ ।**
**తంత్రీపృష్ఠే తు సంలగ్నా వేపతే యత్తు సారణా ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : యదా విరచ్యతే = ఎప్పుడు రచింపబడునో; తదాఘాతః = ఆఘాతము; భ్రమరకః భవేత్ = భ్రమరక మగును; తంత్రీ పృష్ఠే సంలగ్నా = తంత్రికి వెనుకభాగమందు లగ్నమయిన; యత్తు సారణా = ఏసారణ, వేపతే = కంపించునో;

**తాత్పర్యము** : ఎప్పుడు రచింపబడునో ఆఘాతము భ్రమరక మగును తంత్రికి వెనుకభాగమందు లగ్నమయిన ఏసారణ కంపించునో;

**ఖ్యాతః స్ఫురితసంజ్ఞోఽసౌ ఘర్షణాద్ (ఘుసితః?) పునః ।**
**అంగులీభిశ్చతసృభిః ప్రత్యేకం హస్తయోర్ద్వయోః ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : అసౌ = అది; ఘర్షణాత్ పునః = ఘర్షణ (రాపిడి)వలన; స్ఫురితసంజ్ఞః ఖ్యాతః = స్ఫురితమని ప్రసిద్ధము; ద్వయోఃహస్తయోః = రెండుచేతులయొక్క; అంగులీభిః చతసృభిః = నాల్గువేళ్లచేతను; ప్రత్యేకం = ప్రత్యేకముగా;

**తాత్పర్యము** : ఇది ఘర్షణ(రాపిడి) వలన స్ఫురితమని ప్రసిద్ధము. రెండు చేతులయొక్క నాల్గువేళ్లచేతను ప్రత్యేకముగా;

**బహిర్యద్ధ్వన్యతే తంత్రీ ద్రుతం సా కర్తరీ మతా ।**
**చతుర్భిర్నఖరైర్యత్తు దక్షిణేనైవ పాణినా ॥ 45 ॥**

**ప్రతిపదార్థము :** బహిః = వెలుపల; యత్తంత్రీ ధ్వన్యతే = ఏ తీగ ధ్వనించునో; సా కర్తరీ ద్రుతం మతా = ఆ కర్తరి ద్రుతముగా సమ్మతము; దక్షిణేన పాణినా ఏవ = కుడిచేతితోనే; చతుర్భిః నఖరైః = నాల్గునఖముల చేతను;

**తాత్పర్యము :** వెలుపల ఏ తీగ ధ్వనించునో ఆ కర్తరి ద్రుతముగా సమ్మతము. కుడిచేతితోనే నాల్గునఖముల చేతను;

**ఆహతిః క్రియతే యా తు సా జ్ఞేయా నఖకర్తరీ ।**
**కర్తరీసదృశః పాణిర్దృశ్యతే యత్ర దక్షిణః ॥ 46 ॥**

**ప్రతిపదార్థము :** యా ఆహతిః క్రియతే = ఏ ఆహతి చేయబడునో; సా = అది; నఖ కర్తరీ జ్ఞేయా = నఖకర్తరిగా తెలియదగినది; యత్ర = ఎక్కడ; కర్తరీసదృశః = కర్తరీ సమానమైన; దక్షిణః పాణిః దృశ్యతే = దక్షిణహస్తముకనబడునో;

**తాత్పర్యము :** ఏ ఆహతి చేయబడునో అది నఖకర్తరిగా తెలియదగినది ఎక్కడ కర్తరీసమానమైన దక్షిణహస్తము కనబడునో;

**తథా కోణహతిర్వామపాణినా సార్ధకర్తరీ ।**
**సాతోఽనామికయాఽంతః సవ్యమధ్యమయా బహిః ॥ 47 ॥**

**ప్రతిపదార్థము :** తథా = అట్లే; కోణహతిః = కోణహతి; వామపాణినా = ఎడమచేతితో సార్ధకర్తరీ, అర్ధకర్తరీయుతమై; సా =అది; అతః = అందువలన; అనామికయా అంతః = అనామికచే; అంతమునను; సవ్యమధ్యమయా బహిః = వామహస్తమధ్య మాంగుళిచే వెలుపలను; స్యాత్ యది =అయినచో;

**తాత్పర్యము :** అట్లే కోణహతి ఎడమచేతితో సార్ధకర్తరి అది. అందువలన అనామికచే; అంతమునను వామహస్తమధ్యమాంగుళిచే వెలుపలను అయినచో;

**తదాసా రేఫనామా స్యాద్ వీణావాదనకర్మణి ।**
**సారణాయాః పరిత్యాగే తర్జన్యా యది హన్యతే ॥ 48 ॥**

**ప్రతిపదార్థము :** తదా =అప్పుడు; వీణావాదనకర్మణి = వీణావాదనకర్మయందు; రేఫనామా స్యాత్ = రేఫనామకమగును; సారణాయాః పరిత్యాగే = సారణను

పరిత్యజించునపుడు; తర్జన్యా యది హస్యతే = తర్జనిచేతను కొట్టబడినచో;

**తాత్పర్యము :** అప్పుడు వీణావాదనకర్మయందు రేఫనామక మగును. సారణను పరిత్యజించునపుడు తర్జనిచేతను కొట్టబడినచో;

**తంత్రీ నామసముద్భూతో(?) నామ్నా నిష్కోటితస్తదా ।**
**తర్జన్యాద్యం కనిష్ఠాద్యం ద్విరూపం పరివర్తనమ్ ॥ 49 ॥**

**ప్రతిపదార్థము :** తదా = అప్పుడు; తంత్రీ నామ = తంత్రి యనునది; సముద్ఘాతః= జనించును; సః = అది; నామ్నా నిష్కోటితః = నిష్కోటితమగును; తర్జన్యాద్యం = తర్జన్యాద్యమని; కనిష్ఠాద్యం = కనిష్ఠాదమని; పరివర్తనం ద్విరూపం = పరివర్తనము రెండు విధములైనది.

**తాత్పర్యము :** అప్పుడు తంత్రియనునది జనించును. అది నిష్కోటితమగును తర్జన్యాద్యమని, కనిష్ఠాద్యమని పరివర్తనము రెండువిధములైనది.

**తయోః పార్శ్వేన సంస్పర్శాద్ భ్రమణారేచితే కరే ।**
**యదా ద్రుతం స్వరస్థానే క్రమికాభ్యేతి సారితా ॥ 50 ॥**

**ప్రతిపదార్థము :** తయోః పార్శ్వేన = వాటి పార్శ్వముచే; సంస్పర్శాత్ = తాకుటవలన; భ్రమణారేచితే కరే = భ్రమణరేచితకరమందు; యదా = ఎప్పుడు; ద్రుతం = ద్రుతము; స్వరస్థానే = స్వరస్థానమునందు; క్రమికా = ఇంపైన; సారితా అభ్యేతి = ప్రసారితమగునో;

**తాత్పర్యము :** వాటి పార్శ్వముచే తాకుటవలన భ్రమణరేచిత కరమందు ఎప్పుడు ద్రుతము స్వరస్థానమునందు ఇంపైన ప్రసారితమగునో;

**కరసామూర్ఛనాభిఖ్యే(?) వైణికైరభిధీయతే ।**
**సాంగుష్ఠ+ + +క్వచిచ్చతస్రోఽంగులయో యదా ॥ 51 ॥**

**ప్రతిపదార్థము :** సా = అది; కరసామూర్ఛనాభిఖ్యాం = కరసామూర్ఛనయని; వైణికైరభిధీయతే = వైణికులచే చెప్పబడినది; సాంగుష్ఠాః = బ్రొటనవేలితో కూడినవై; క్వచిత్ = ఒకానొకచోట; చతస్రః అంగులయః = నాల్గువ్రేళ్లు; యదా = ఎప్పుడు;

**తాత్పర్యము :** అది కరసామూర్ఛన యని వైణికులచే చెప్పబడినది. బ్రొటనవేలితో కూడినవై ఒకానొక చోట నాల్గువ్రేళ్లు ఎప్పుడు;

**కనిష్ఠాంగుష్ఠయోః స్పర్శాత్ కథితః కుహరః కరః ।**
**అంగుష్ఠపార్శ్వమిలితా కర్తరీ చ ప్రహన్యతే ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : కనిష్ఠాంగుష్ఠయోః స్పర్శాత్ = చిటికెనబ్రొటన వ్రేళ్లతాకిడిచే; కుహరః కరః స్మృతః = కుహరమను కరముగా తలవవలెను; అంగుష్ఠపార్శ్వమిలితా = అంగుష్టపార్శ్వముతో కలసి; కర్తరీ ప్రహన్యతే = కర్తరి హన్యమానమగును.

**తాత్పర్యము** : చిటికెనబ్రొటన వ్రేళ్లతాకిడిచే కుహరమను కరముగా తలవవలెను. అంగుష్టపార్శ్వముతో కలసి కర్తరి హన్యమానమగును.

**కనిష్ఠాసారణాభ్యాం చ తదా నిర్ఘోష ఉచ్యతే ।**
**ఉత్క్షిప్య హన్యతే తంత్రీ శీఘ్రం సారణయా యది ॥ 53 ॥**

**ప్రతిపదార్థము** : కనిష్ఠాసారణాబ్యాం = కనిష్ఠిక- సారణులచే; తదా = అప్పుడు; నిర్ఘోషః ఇష్యతే = నిర్ఘోషము సమ్మతము; సారణయా = సారణిచే; తంత్రీ ఉత్క్షిప్య = తీగ ఎత్తబడి; శీఘ్రం హన్యతే యది = త్వరితముగా కొట్టబడినయెడల;

**తాత్పర్యము** : కనిష్ఠికా సారణులచే అప్పుడు నిర్ఘోషము సమ్మతము సారణిచే తీగ ఎత్తి త్వరితముగా కొట్టబడినయెడల;

**దక్షిణే కర్తరీయుక్తస్తదా స్వసితకో భవేత్ ।**
**తర్జన్యంగుష్ఠయోరగ్రరాగామాత్రేణ (?) ఘర్షణమ్ ॥ 54 ॥**

**ప్రతిపదార్థము** : దక్షిణే = దక్షిణకరమందు; కర్తరీయుక్తః = కర్తరీయుతమైనచో; తదా= అప్పుడు; స్వసితకః భవేత్ = స్వసితకమగును; తర్జన్యంగుష్ఠయోః = తర్జనీ అంగుష్ఠములందు; అగ్రరాగమాత్రేణ = అగ్రరాగమాత్రముచే; ఘర్షణం = ఘర్షణము; యదా స్యాత్ = ఎప్పుడగునో; తదా = అప్పుడు;

**తాత్పర్యము** : దక్షిణకరమందు కర్తరీయుతమైనచో అప్పుడు స్వసితకమగును. తర్జనీ-అంగుష్ఠములందు అగ్రరాగమాత్రముచే ఘర్షణము ఎప్పుడగునో అప్పుడు;

**తంత్ర్యా యదా తదా జ్ఞేయ శుకవక్త్రాభిధః కరః ।**
**తర్జన్యా ధార్యతే నాదో ఘాతోఽనామికయా బహిః ॥ 55 ॥**

**ప్రతిపదార్థము** : శుకవక్త్రాభిధః కరః = శుకవక్త్రహస్తముగా; జ్ఞేయః = తెలియదగినది;

నాదః = నాదము; తర్జన్యా = చూపుడువేలితో; ధార్యతే = ధరింపబడునో; బహిః = వెలుపల; అనామికయా = అనామికతో; ఘాతః = ఘాతము;

**తాత్పర్యము :** శుకవక్త్రహస్తముగా తెలియదగినది. నాదము చూపుడువేలితో ధరింపబడునో, వెలుపల అనామికతో ఘాతము.

**యదా తదా పరిజ్ఞేయో బిందునామ్నా విచక్షణైః ।**
**జితేంద్రియః ప్రగల్భశ్చ స్థిరాసనపరిగ్రహః ॥ 56 ॥**

**ప్రతిపదార్థము :** యదా = ఎప్పుడగునో; తదా = అప్పుడు; విచక్షణైః = పండితులచే; బిందునామ్నా పరిజ్ఞేయః = బిందువుగా గుర్తింపదగినది; జితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడును; ప్రగల్భః = గొప్పవాడును; స్థిరాసనపరిగ్రహః = ఆసనశుద్ధికలవాడును;

**తాత్పర్యము :** ఎప్పుడగునో అప్పుడు పండితులచే బిందువుగా గుర్తింపదగినది. ఇంద్రియములు జయించిన వాడును, గొప్పవాడును, ఆసన శుద్ధికలవాడును;

**శరీరసౌష్ఠవోపేతః కరయోర్విజితశ్రమః ।**
**సుశారీరో భయం త్యక్తో రాగరాగాంగతత్త్వవిత్ ॥ 57 ॥**

**ప్రతిపదార్థము :** శరీరసౌష్ఠవోపేతః = శరీరసౌష్ఠవముకలవాడును; కరయోః విజితశ్రమః = చేతులకు శ్రమ (తెలియని)లేనివాడును; సుశరీరః = ఆరోగ్యమైన శరీరము కలవాడును; భయం త్యక్తః = భయమును విడిచినవాడును; రాగరాగాంగతత్త్వవిత్= రాగములయొక్క రాగాంగములయొక్క స్వరూపమును బాగుగానెఱిగినవాడును;

**తాత్పర్యము :** శరీరసౌష్ఠవముకలవాడును, చేతులకు శ్రమ(తెలియని)లేనివాడును, ఆరోగ్యమైన శరీరముకలవాడును, భయమును విడిచినవాడును, రాగములయొక్క రాగాంగములయొక్క స్వరూపమును బాగుగానెఱిగినవాడును;

**గీతవాదనదక్షశ్చ వైణికః కథితో వరః ।**
**వాద్యలావణికాతజ్ఞైర్నిష్కలక్రమయోగతః(?) ॥ 58 ॥**

**ప్రతిపదార్థము :** గీతవాదనదక్షః = గీతవాద్యసమర్థుడును; వరః వైణికః కథితః = శ్రేష్ఠుడైన వైణికునిగా చెప్పబడెను; వాద్యలావణికాతజ్ఞైః = వాద్యమర్మముల నెఱిగినవారిచే; నిష్కలక్రమ యోగతః = నిష్కలక్రమ సంబంధముగా;

**తాత్పర్యము** : గీతవాద్య సమర్థుడును శ్రేష్ఠుడైన వైణికునిగా చెప్పబడెను. వాద్యమర్మములనెఱిగినవారిచే నిష్కలశ్రమ సంబంధముగా;

> **మంద్రే మధ్యే చ తారే చ బిందుః స్యాత్ స్థానకత్రయే ।**
> **ఆలావణ్యాం విధాతవ్యో ముక్తకో మధ్యమః కరః ॥ 59 ॥**

**ప్రతిపదార్థము** : మంద్రే = మంద్రమందును; మద్యే = మధ్యమందును; తారే చ = తారమందును; స్థానకత్రయే = ఈస్థానముల మూడింటియందు; ఆలావణాం = ఆలావణియందు; మధ్యమః కరః ముక్తకః = మధ్యమకరము ముక్త(క)ము; విధాతస్యః = చేయదగినది.

**తాత్పర్యము** : మంద్రమందును, మధ్యమందును, తారమందును ఈస్థానముల మూడింటియందు ఆలావణియందు మధ్యమకరము ముక్త(క)ము చేయదగినది.

> **గమకస్తస్య తర్జన్యాం జాయతే పంచమః స్వరః ।**
> **ధైవతో మధ్యమాంగుళ్యా నిషాదః స్యాత్ కనిష్ఠయా ॥ 60 ॥**

**ప్రతిపదార్థము** : తస్య గమకః = దాని గమకము; తర్జన్యాం = తర్జనియందు; పంచమః స్వరః జాయతే = పంచమస్వరము జనితమగును; మద్యమాంగుళ్యా = మధ్యమవ్రేలితో; ధైవతః = ధైవతము; కనిష్ఠయా = కనిష్ఠికతో; నిషాదః స్యాత్ = నిషాదమును అగును.

**తాత్పర్యము** : దానిగమకము తర్జనియందు పంచమ స్వరము జనితమగును. మధ్యమవ్రేలితో ధైవతము కనిష్టికతో నిషాదమును అగును.

> **తతస్తు ముక్తకః కార్యః స్వరః షడ్జాభిదానవాన్ ।**
> **ఋషభః పంచమస్థానే తర్జన్యా తదనంతరమ్ ॥ 61 ॥**

**ప్రతిపదార్థము** : తతః ముక్తకః కార్యః = తరువాత ముక్తకము చేయదగినది; షడ్జాభిధానవాన్ స్వరః = షడ్జస్వరము; పంచమస్థానే = పంచమస్థానమందు; ఋషభః = రిషభము; తర్జన్యా = తర్జనిచేతను; తదనంతరం = అటుతరువాత;

**తాత్పర్యము** : తరువాత ముక్తకము చేయదగినది షడ్జస్వరము పంచమస్థానమందు రిషభము. తర్జనిచేతను అటుతరువాత;

**గాంధారో ధైవతస్థానే మద్యమాంగలికో భవేత్ ।**
**అథ దక్షిణహస్తేన సారణామూర్ఛనాక్రమాత్ ॥ 62 ॥**

**ప్రతిపదార్థము** : ధైవతస్థానే గాంధారః = ధైవతస్థానమందు గాంధారము; మధ్యమాంగులికః భవేత్ = మధ్యమాంగుళికమగును; అథ = తరువాత; దక్షిణహస్తేన= కుడిచేతితో; సారణా మూర్ఛనాక్రమాత్ = సారణామూర్ఛన క్రమమువలన;

**తాత్పర్యము** : ధైవతస్థానమందు గాంధారము మధ్యమాంగుళిక మగును. తరువాత కుడిచేతితో సారణామూర్ఛన క్రమమువలన;

**గమ్యతే సప్తకద్వంద్వమారోహిణ్యావరోహిణీ ।**
**స్వరాణాం నియమాద్ రాగేష్వంగుళీనియమేన హి ॥ 63 ॥**

**ప్రతిపదార్థము** : సప్తకద్వంద్వం = నిషాదద్వందము; ఆరోహిణ్యావరోహిణీ = ఆరోహిణీ అవరోహిణులుగా; గమ్యతే = ధ్వనితమగును; స్వరాణాం నియమాత్ = స్వరముల నియమమువలన; రాగేషు = రాగములయందు; అంగుళీనియమేన హి = అంగుళీనియమముచేతను;

**తాత్పర్యము** : నిషాదద్వందము ఆరోహిణీ అవరోహిణులుగా ధ్వనితమగును. స్వరముల నియమమువలన రాగములయందు అంగుళీనియమము చేతను;

**ద్వితుంబా కిన్నరీ లఘ్వీ బృహతీ తు త్రితుంబికా ।**
**కథితా పంచతంత్రీతి (చ్ఛ?శ)కనీ వాద్యవేదిభిః ॥ 64 ॥**

**ప్రతిపదార్థము** : ద్వితుంబికయైన; కిన్నరీ = వీణ; లఘ్వీ = లఘుకిన్నరీ; త్రితుంబికా= త్రితుంబిక; బృహతీ = పెద్దది; పంచతంత్రీ = ఇది పంచతంత్రులు కలదిగాను; శాకినీ = శాకినీ ప్రభేదముగా; కథితా = చెప్పబడినది.

**తాత్పర్యము** : ద్వితుంబికయైన వీణ లఘుకిన్నరి త్రితుంబిక పెద్దది. ఇది పంచతంత్రులు కలదిగాను శాకినీ ప్రభేదముగా చెప్పబడినది.

**తత్తద్యంత్రవశాదాసాం వాద్యభేదస్త్వనేకధా ।**
**తతం వాద్యమితి ప్రోక్తమవనద్ధమథోచ్యతే ॥ 65 ॥**

**ప్రతిపదార్థము** : తత్తద్యంత్రవశాత్ = ఆయాయంత్ర (వశ)మువలన; ఆసాం =

వీటియొక్క; వాద్యభేదః = వాద్యభేదము; అనేకధా = అనేకవిధములైనది; ఇతి = ఈవిధముగా; తతం వాద్యం ప్రోక్తం = తతప్రభేదము చెప్పబడినది; అథ = తరువాత; అవనద్ధం ఉచ్యతే = అవనద్ధవాద్యము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఆయాయంత్ర (వశ)ము వలన వీటియొక్క వాద్యభేదము. అనేక విధములైనది. ఈవిధముగా తతప్రభేదము చెప్పబడినది. తరువాత అవనద్ధవాద్యము చెప్పబడుచున్నది.

**ఝుంకారం మద్దలీజాతం దేంకారం కబలోద్భవమ్ ।**
**ప్రాహురేవం విభాగేన వాద్యవిద్యావిశారదాః ॥ 66 ॥**

**ప్రతిపదార్థము** : ఝుంకారం = ఝుంకారము; మద్దలీ జాతం = మద్దెలనుండి పుట్టినది; దేంకారం = దేంకారము; కబలోద్భవం = కబలజనితము; ఏవం విభాగేన = ఇట్లు విభాగముచే; వాద్యవిద్యావిశారదాః = వాద్య విద్యాపండితులు; ప్రాహుః = చెప్పిరి.

**తాత్పర్యము** : ఝుంకారము మద్దెలనుండి పుట్టినది. దేంకారము కబలజనితము ఇట్లు విభాగముచే వాద్యవిద్యా పండితులు చెప్పిరి.

**కవర్గశ్చ తవర్గశ్చ టవర్గశ్చ ఢవర్జితః ।**
**భవేయుః పటహే వర్ణాః రహాభ్యాం సహ షోడశ ॥ 67 ॥**

**ప్రతిపదార్థము** : కవర్గః = కవర్గయు; తవర్గః = తవర్గయు; ఢవర్జితః = ఢకారమును విడిచి; టవర్గశ్చ = టవర్గయు; రహాభ్యాం సహ = రేఫ హకారములతో కలసి; పటహే= పటహమందు; షోడశ వర్ణాః = పదహారు అక్షరములు.

**తాత్పర్యము** : కవర్గయు, తవర్గయు, ఢకారమును విడిచి టవర్గయు రేఫ- హకారములతో కలిసి పటహమందు పదహారు అక్షరములు.

**వాదనాయ హుడుక్కాయామక్షరాణి ప్రచక్ష్మహే ।**
**తవర్గశ్చ టవర్గశ్చ రహాభ్యాం సహితావుభౌ ॥ 68 ॥**

**ప్రతిపదార్థము** : హుడుక్కాయాం = హుడుక్కయందు; వాదనాయ = వాదించుటకు (మ్రోగించుటకు); అక్షరాణి = అక్షరములను; ప్రచక్ష్మహే = చెప్పుచున్నాము; తవర్గశ్చ= తవర్గయు; టవర్గశ్చ = టవర్గయు, రహాభ్యాం ఉభౌ సహితౌ = రేఫహకారములు రెండును;

**తాత్పర్యము** : హుడుక్కయందు వాదించుటకు (మ్రోగించుటకు) అక్షరములను చెప్పుచున్నాము తవర్గయు టవర్గయు రేఫహకారములు రెండును;

> **కవర్గః పంచమన్యూనః ప్రోక్తాన్యేతాని షోడశ ।**
> **ఝంకారస్య హుడుక్కాయాం సజ్జముఖ్యం (?) ప్రకీర్తితమ్ ॥ 69 ॥**

**ప్రతిపదార్థము** : పంచమన్యూనః = ఙకారము తప్పించి; కవర్గః = కవర్గమును; ఏతాని షోడశః = ఈ పదహారును; ప్రోక్తాని = చెప్పబడినవి; హుడుక్కాయాం = హుడుక్కాయందు; ఝంకారస్య = ఝంకారమునకు; సజ్జముఖ్యం? = షడ్జము ముఖ్యమని; ప్రకీర్తితం = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఙకారము తప్పించి కవర్గమును ఈపదహారును చెప్పబడినవి. హుడుక్కయందు ఝంకారమునకు షడ్జము ముఖ్యమని చెప్పబడినది.

> **ఢక్కావర్ణాదికం సర్వం హుడుక్కాసమమిష్యతే ।**
> **వాదనాయ తతో వాద్యవస్తూనాం కథ్యతేఽధునా ॥ 70 ॥**

**ప్రతిపదార్థము** : ఢక్కావర్ణాదికం సర్వం = ఢక్కావర్ణసమూహమంతయు; హుడుక్కాసమం ఇష్యతే = హుడుక్కముతో సమానము; తతః = తరువాత; వాద్యవస్తూనాం వాదనాయ = వాద్యవస్తువుల వాదనమునకు; అధునా = ఇప్పుడు; కథ్యతే = చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : ఢక్కావర్ణ సమూహమంతయు హుడుక్కముతో సమానము. తరువాత వాద్యవస్తువుల వాదనమునకు  ఇప్పుడు చెప్పబడుచున్నది

> **హస్తలక్షణమేతేషాం వ్యక్తోదాహరణైః సహ ।**
> **ఉత్ఫుల్లశ్చాలకశ్చైవ పాణ్యంతరనికుట్టకః ॥ 71 ॥**

**ప్రతిపదార్థము** : వ్యక్తోదాహరణైః సహ = స్పష్టమైన ఉదాహరణములతో కూడ; ఏతేషాం= వీటికి; లక్షణం ఉచ్యతే = లక్షణము చెప్పబడుచున్నది; ఉత్ఫుల్లః = ఉత్ఫుల్లము; అ(ణ)లకఃశ్చ = అ(ణ)లకమును; పాణ్యంతరనికుట్టకః = పాణ్యంతరనికుట్టకము

**తాత్పర్యము** : స్పష్టమైన ఉదాహరణములతో కూడ వీటికి లక్షణము చెప్పబడినది. ఉత్ఫుల్లము అ(ణ)లకమును పాణ్యంతరనికుట్టకము;

**దండహస్తోఽథ యుగ్మః స్యాత్ తోరహస్తస్తతః పరమ్ ।**
**పిండహస్తః స్మృతశ్చోర్ధ్వహస్త ఇత్యష్టధా బుధైః ॥ 72 ॥**

**ప్రతిపదార్థము** : అథ = అనంతరము; దండహస్తః = దండహస్తము; యుగ్మః = యుగ్మము; (యుగము); తోరహస్తః = తోరహస్తము; తతః పరం = తరువాత; పిండహస్తః = పిండహస్తము; తతః = తరువాత; ఊర్ధ్వహస్తః = ఊర్ధ్వహస్తము; ఇతి = అని; అష్టధా ఉక్తః = ఎనిమిది విధములుగా చెప్పబడినది.

**తాత్పర్యము** : అనంతరము దండహస్తము యుగ్మము (యుగము) తోరహస్తము తరువాత పిండహస్తము తరువాత ఊర్ధ్వహస్తము అని ఎనిమిది విధములుగా చెప్పబడినది.

**అథైతేషాం ప్రవక్ష్యామి లక్షణం చ ప్రయోగతః ।**
**హస్తేభ్యః శబ్దనిష్పత్తిర్జాయతే హి పరిస్ఫుటమ్ ॥ 73 ॥**

**ప్రతిపదార్థము** : అథ = తరువాత; ఏతేషాం లక్షణం = వీటిలక్షణమును; ప్రయోగతః = ప్రయోగమునను సరించి; ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను; పరిస్ఫుటం = స్పష్టముగా; హస్తేభ్యః = చేతులనుండి; శబ్దనిష్పత్తిః జాయతే = ధ్వని జనితమగును.

**తాత్పర్యము** : తరువాత వీటిలక్షణమును ప్రయోగమునను సరించి చెప్పుచున్నాను. స్పష్టముగా చేతులనుండి ధ్వని జనితమగును.

**శబ్దేభ్యః పదనిష్పత్తిః పదేభ్యః పాటసంభవః ।**
**పాటేభ్యో జాయతే వాద్యవస్తువర్గో యథాక్రమమ్ ॥ 74 ॥**

**ప్రతిపదార్థము** : శబ్దేభ్యః = శబ్దములనుండి; పదనిష్పత్తిః = పదముల పుట్టుక; పదేభ్యః = పదములనుండి; పాటసంభవః = పాట(ము)ల జననము; పాటేభ్యః = పాట(ము)లనుండి; యథాక్రమం = వరుసగా; వాద్యవస్తువర్గఃజాయతే = వాద్యవస్తుసముదాయము పుట్టుచున్నది.

**తాత్పర్యము** : శబ్దములనుండి పదములపుట్టుక, పదములనుండి పాట(ము)ల జననము, పాట(ము)లనుండి వరుసగా వాద్యవస్తుసముదాయము పుట్టుచున్నది.

యే పతాకాదయో హస్తా నాట్యశాస్త్రే వ్యవస్థితాః ।
తేషు కేచన కథ్యంతే హస్తవాద్యోపయోగినః ॥ 75 ॥

**ప్రతిపదార్థము** : నాట్యశాస్త్రే వ్యవస్థితాః = నాట్యశాస్త్రమందున్న; యే పతాకాదయః హస్తాః = ఏపతాకాది హస్తములో; తేషు = వాటియందలి; కేచన హస్తవాద్యోపయోగినః = కొన్ని హస్తవాద్యములకుపయోగించునవి; కథ్యంతే = చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : నాట్యశాస్త్రమందున్న ఏ పతాకాది హస్తములో వాటియందలి కొన్ని హస్తవాద్యములకుపయోగించునవి చెప్పబడుచున్నవి.

**అలపద్మాహ్వయో హస్తో యదా వాద్యే నివేశ్యతే ।**
**లఘు పాటే నఖాఘాతాదుత్ఫుల్లోఽసౌ తదా భవేత్ ॥ 76 ॥**

**యథా కగ్రోం కగ్రోమ్ ఉత్ఫుల్లః**

**ప్రతిపదార్థము** : లఘుపాటే = లఘుపాటమందు; నఖాఘాతాత్ = నఖాఘాతమువలన; అలపద్మాహ్వయో హస్తః వాద్యే యదా నివేశ్యతే = అలపద్మహస్తము వాద్యమందు ఎప్పుడు ప్రవేశపెట్టబడునో; తదా = అప్పుడు; అసౌ = అది; ఉత్ఫుల్లః భవేత్ = ఉత్ఫుల్లమగును; యథా- ఉదా :- కగ్రోం కగ్రోం.

**తాత్పర్యము** : లఘుపాటమందు నఖాఘాతమువలన అలపద్మహస్తము వాద్యమందు ఎప్పుడు ప్రవేశపెట్టబడునో అప్పుడు అది ఉత్ఫుల్లమగును. ఉదా : కగ్రోం కగ్రోం.

## ఉత్ఫుల్లః

**యదా ప్రసారితాంగుష్ఠః శుకతుండో విధీయతే ।**
**విరలాంగులిఘాతేన క్రమేణ ఖలకస్తథా ॥ 77 ॥**

## ॥ ఖలకః ॥

**ప్రతిపదార్థము** : యదా = ఎప్పుడు; ప్రసారితాంగుష్ఠః= చాచిన బ్రొటనవ్రేలు కలిగి; శుకతుండః = (చిలుకముక్కు) శుకతుండము; విధీయతే = విధింపబడునో; తదా= అప్పుడు; విరలాంగులిఘాతేన = విశాలమైన (దట్టముకాని) ఘాతముచే; క్రమేణ = క్రమముగా; నలకః = ఖలకము అగును.

**తాత్పర్యము** : ఎప్పుడు చాచిన బ్రొటనవ్రేలు కలిగి (చిలుకముక్కు)శుకతుండము విధింపబడునో అప్పుడు విశాలమైన (దట్టముకాని) ఘాతముచే క్రమముగా ఖలకము అగును, ఉదా :- ధోంకిట - కిటత - కిటామ్.

**వామేన తస్య హస్తస్య తర్జన్యంగుష్ఠఘాతకః ।**
**పరిజ్ఞేయో బుధైర్హస్తః పాణ్యంతరనిగూహకః ॥ 78 ॥**

**యథా : డేంకిటతంకిట ధంకిట తంకిట త్వ**

**ప్రతిపదార్థము** : వామేన తస్య హస్తస్య = వాని ఎడమ చేతియొక్క; తర్జన్యాంగుష్ఠఘాతకః = తర్జన్యాంగుష్ఠఘాతము; పాణ్యంతరనిగూహకః హస్తః బుధైః జ్ఞేయః = పాణ్యంతర నిగూహకముగా పండితులచే తెలియదగినది.

**తాత్పర్యము** : వానిఎడమ చేతియొక్క తర్జన్యాంగుష్ఠఘాతము పాణ్యంతర నిగూహకముగా పండితులచే తెలియదగినది.

## ॥ పాణ్యంతరనిగూహకః ॥

**పతాకాకారహస్తాభ్యాముభాభ్యామూర్ధ్వతాడనాత్ ।**
**దండహస్తాభిధం హస్తం విదుర్వాద్యవిశారదాః ॥ 79 ॥**

**యథా : థా థా థా థా**

**ప్రతిపదార్థము** : ఉభాభ్యాం పతాకాకారహస్తాభ్యాం = పతాకాకారములైన రెండుచేతులతో; ఊర్ధ్వతాడనాత్ = ఊర్ధ్వతాడనమువలన; దండహస్తాభిధం హస్తం విదుః = దండహస్తమను హస్తముగా తెలియుదురు.

**తాత్పర్యము** : పతాకాకారములైన రెండుచేతులతో ఊర్ధ్వతాడమువలన దండహస్తమను హస్తముగా తెలియుదురు.

## ॥ దండహస్తః ॥

**విరలాంగులిఘాతేన పతాకాభ్యాం యదా భవేత్ ।**
**రేఫైరేవోర్ధ్వహస్తాభ్యాం తాడనాద్ యుగహస్తకః ॥ 80 ॥**

**యథా : ర ర ర ర్**

**ప్రతిపదార్థము** : పతాకాభ్యాం = పతాకహస్తములతో, విరలాంగులిఘాతేన = విరలాంగుళి ఘాతముచేత; యదా భవేత్ = ఎప్పుడగునో; రేఫైరేవ = రేఫములతోనే; ఊర్ధ్వహస్తాభ్యాం తాడనాత్ = ఊర్ధ్వహస్తములతో తాడనమువలన; యుగహస్తకః స్యాత్= యుగహస్తకమగును.

**తాత్పర్యము :** పతాకహస్తములతో విరలాంగుళిఘాతముచేత ఎప్పుడగునో రేఫములతోనే ఊర్ధ్వహస్తములతో తాడనమువలన యుగహస్తకమగును.

**॥ యుగహస్తః ॥**

**ఊర్ధ్వపాదద్వయం కృత్వా తలపాతేన హన్యతే ।**
**పటహస్య పద ద్వంద్వం తోరహస్తస్తథా భవేత్ ॥ 81 ॥**

**యథా : దేందేం దోహదేం**

**ప్రతిపదార్థము :** పటహస్య పదద్వంద్వం = పటహముయొక్క పదద్వయమును; ఊర్ధ్వపాదద్వయం కృత్వా = ఊర్ధ్వపాదద్వయమును చేసి; తలపాతేన = తల (అరిచేయి)పాతముతో; హన్యతే = కొట్టబడునో; తదా = అప్పుడు; తోరహస్తఃభవేత్ = తోరహస్తమగును.

**తాత్పర్యము :** పటహముయొక్క పదద్వయమును ఊర్ధ్వపాదద్వయమును చేసి తల(అరిచేయి) పాతముతో కొట్టబడునో అప్పుడు తోరహస్తమగును.

**॥ తోరహస్తః ॥**

**రేఫహ(స్తే?స్త) కృతే పూర్వమూర్ధ్వహస్తే చ కల్పితే ।**
**పిండహస్తాభిధో హస్తః కథితో వాద్యవేదిభిః ॥ 82 ॥**

**యథా : తరకిట తరకిట ఝేం ఝేం**

**ప్రతిపదార్థము :** పూర్వం = మొదట; రేఫహస్తేకృతే = రేఫహస్తముచేయగా; తతః = తరువాత; ఊర్ధ్వహస్తే కల్పితే = ఊర్ధ్వహస్తమును చేయగా; పిండహస్తాభిధః హస్తః కథితః = పిండహస్తముగ చెప్పబడినది.

**తాత్పర్యము :** మొదట రేఫహస్తముచేయగా తరువాత ఊర్ధ్వహస్తమును చేయగా పిండహస్తముగ చెప్పబడినది.

**॥ పిండహస్తః ॥**

ప్రహారే తలహస్తేన దక్షిణేన చ పాణినా ।
దృఢం విరచితే విద్యాదూర్ధ్వహస్తం విచక్షణః ॥ 83 ॥

**యథా : థర్ థర్ తుథర్ థర్ తుథర్ తుథర్ తుథర్ థర్ తుథర్ తుథర్ తుథర్ థర్ థతు ।**

**ప్రతిపదార్థము** : దక్షిణేన పాణినా తలహస్తేన = దక్షిణతలహస్తముచే; ప్రహారే = ప్రహారము; దృఢం = దృఢముగా; విరచితే = రచింపగా; విచక్షణః = పండితుడు; ఊర్ధ్వహస్తం విద్యాత్ = ఊర్ధ్వహస్తముగ తెలిసికొనవలెను.

**తాత్పర్యము** : దక్షిణతలహస్తముచే ప్రహారము దృఢముగా రచింపగా ఊర్ధ్వహస్తమగునని పండితుడు తెలిసికొనవలెను.

**॥ ఊర్ధ్వహస్తః ॥**

**చతుర్భిశ్చాష్టమాత్రాభిః సమపాణిర్విధీయతే ।**

**ప్రతిపదార్థము** : చతుర్భిః అష్టమాత్రాభిశ్చ = 4+8 అనగా 12 మాత్రలచే; సమపాణిః విధీయతే = సమపాణి చెప్పబడుచున్నది;

**తాత్పర్యము** : 12 మాత్రలచే సమపాణి చెప్పబడుచున్నది.

**॥ సమపాణిపాటః ॥**

**విరలాంగులిభిర్యత్ర చరితైః కీర్తిరిత్యపి ॥ 84 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; విరలాంగులిభిః = విరలాంగుళులతో; చరితైః = చరిత్రలచే; కీర్తిరిత్యపి = యశస్సుకూడ;

**తాత్పర్యము** : ఎక్కడ విరలాంగుళులతో చరిత్రలచే యశస్సుకూడ;

యథా : కిట కిట్ట, కిట కిట్ట, కిట కిట్ట, కిట్ట కిట, కట్టకిట, కిట కిట్ట ।

**అభిఘాతః ప్రయుక్తోఽయం పాణిహస్తోఽభిధీయతే ।**
**చతుర్భిశ్చాష్టమాత్రాభిర్యుక్తో వా పాణిహస్తకః ॥ 85 ॥**

యథా : కిట కిట్టకిట కిట్ట, కిట్ట కిర కిర కిట్ట, కిట కిట కిట్ట, కిట్టకిట, కిట కిట కిట కిట్ట.

**ప్రతిపదార్థము** : అభిఘాతః ప్రయుక్తః = అభిఘాతముప్రయోగింప బడునో; అయం= ఇది; పాణిహస్తః అభిధీయతే = పాణిహస్తముగా చెప్పనగును; చతుర్భిః అష్టమాత్రాభిశ్చ = పన్నెండు మాత్రలతో; యుక్తః =కూడియున్నది; పాణిహస్తకః స్యాత్ = పాణిహస్తమగును.

**తాత్పర్యము** : అభిఘాతముప్రయోగింపబడునో ఇది పాణిహస్తముగాచెప్పనగును. పన్నెండు మాత్రలతో కూడియున్నది పాణిహస్తమగును.

**॥ పాణిహస్తపాటః ॥**

యథా - థోం థోం థోం నాకిపిటతక్యా సమన్వితః ।

**ఏకత్ర స్వస్తికాకారకరాభ్యాం స్వస్తికో భవేత్ ।**
**యత్ర షోడశమాత్రాభిర్యుక్తోఽయం స్వస్తికో భవేత్ ॥ 86 ॥**

**ప్రతిపదార్థము** : థోం థోం థోం నాకిపిటతక్యా సమన్వితః = థోం థోం థోంనా, కి, పి, ట, త, క, వీటితోకూడినదియు; ఏకత్ర = ఒకచోట; స్వస్తికా రకరాభ్యాం సమన్వితః = స్వస్తికాకారహస్తములతో కూడినది; స్వస్తికః భవేత్ = స్వస్తిక పాటమగును. యథా - థోం ధాం థోనకిట కిటతకి, థోనకిట తక్కిట థోనకిట కిట తకి, థోనకిట తక్కిట తక్కిట తక్కిట, థోనకిట థోనకిట థోం ధోం కిటత, థోనకిట, కిట కిటతకి, థోం ధోం కిట, తత్థోం ధోం థోం ధోం కిటతకి, థోనకిట, కిటతకి, థోనకిట, కిటతకి, థోనకిట, కిటతకి, థోనకిట । షోడశమాత్రాభిః యుక్తః = (16) పదహారు మాత్రలతో కూడిన; అయం = ఇది; స్వస్తికః భవేత్ = స్వస్తిక పాటమగును.

**తాత్పర్యము** : థోం థోం థోంనా, కి, పి, ట, త, క, వీటిలో కూడినదియు ఒకచోట స్వస్తికాకార హస్తములతో కూడినది స్వస్తిక పాటమగును.

**॥ స్వస్తికపాటః ॥**

**అగ్రాంగులిసమాయోగాద్ వ్యత్యయా(త్)కరయోరిహ ।**
**గిరకిటఝేన్నశబ్దైస్తతో గినకిరాదిభిః ॥ 87 ॥**

**ప్రతిపదార్థము** : ఇహ = ఇందు; అగ్రాంగులిసమాయోగాత్ = అగ్రాంగుళి కలయికవలనను; కరయోః = హస్తములయొక్క; వ్యత్యయాత్ =వ్యత్యస్తమువలనను; గిరకిట ఝేన్నశబ్దైః = గిరకిట ఝేన్నశబ్దములతోను; తతః = తరువాత; గినకిరాదిభిః = గినకిరమొదలగు శబ్దములతోను;

**తాత్పర్యము** : ఇందు అగ్రాంగుళికలయికవలనను హస్తములయొక్క వ్యత్యస్తము వలనను గిరకిటఝేన్నశబ్దములతోను తరువాత గినకిరమొదలగు శబ్దములతోను;

యథా : గిరుకిటదనన గిన కిర్ గిడ్ ర; గిరుకిట్ట, నగిన, గిరుకిట దనగినకిట్ట, ఝేనకిట, గిరుకిట, దనగిన, గిరర్, గిరుకిట, దనఝేనకిట, గిరుకిట, దనఝేనకిటి, నకిటి, గినకిట, ఝేనకిటకిట్ట ।

॥ విషమపాణిపాటః ॥

**కరటైః సంయు(తై?తః) పాటైః పాటోవిషమపాణికః ।**
**ధరికిటైర్గిరికిటైరేభిః శబ్దైస్తదుంధోంకైస్తథా ॥ 88 ॥**

**ప్రతిపదార్థము** : కరటైః పాటైః సంయుతః = కరట మొదలగు పాట(ము)లతో కూడినది; విషమపాణికః స్యాత్ = విషమపాణియగును; ధరికిటైః గిరికిటైః = దరికిట, గిరికిట; తథా = మరియు; దుంధోంకైః = దుంధోం; శబ్దైః = శబ్దములతోను;

**తాత్పర్యము** : కరట మొదలగు పాట(ము)లతో కూడినది విషమపాణియగును. ధరికిట, గిరికిట, దుంధోం శబ్దములతోను;

యథా : ధరకిట ధరకిట తకథో తధిరుకిట, దికిదికి ధరుకిటకిట ధిరుకిట కిట, కిటతకి ధరకిట ధరకిటకిట, తకిధరకిట, ధిరు కిట ధిరుకిట దిరు కిట దికి దికి ।

**భేదేన హస్తయోరేష పాటోవఘుటసంజ్ఞకః ।**
**అవ ఘుటస్త్వష్టమాత్రాభిః షోడశైర్వా యుతో భవేత్ ॥ 89 ॥**

**॥ అవఘుటపాటః ॥**

**ప్రతిపదార్థము** : హస్తయోః భేదేన = హస్తముల భేదముచేతను; ఏష పాటః = ఈపాట(ము); అవఘుటసంజ్ఞకః స్యాత్ = అవఘుటపాటమగును; అష్టమాత్రాభిః = ఎనిమిది మాత్రలచేగాని; షోడశైర్వా = (16) పదహారు మాత్రలతోగాని; యుతః భవేత్= కూడి యుండును.

**తాత్పర్యము** : హస్తములభేదముచేతను ఈపాట(ము) అవఘుటపాటమగును. ఎనిమిదిమాత్రలచేగాని (16) పదహారు మాత్రలతోగాని కలిగియుండును

**ఆసజ్యతే కరౌ యత్ర వ్యత్యయాత్ ఫుటయోర్ద్వయోః ।**
**నాగబంధః స విజ్ఞేయః శబ్దైర్నగిదాదిభిః ॥ 90 ॥**

యథా : ననకిట కిటతకి, కిటతకి, ననగిడ ననగిడ ననగిడ, కిటతకి, ననకిట, కిటతకి, ననకిటకిట, తక్కిట తకిననకిట, కిటతకి ।

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; పుటయోః ద్వయోః = రెండుపుటలయొక్క; వ్యత్యయాత్ = మార్పు(వ్యత్యాసము) వలన; కరౌ = రెండుచేతులు; ఆసజ్యతే = సిద్ధముచేయబడునో; ననగిడాదిభిః శబ్దైః = ననగిడాదిశబ్దములతో; సః = అది; నాగబంధః విజ్ఞేయః = నాగబంధపాటమని తెలియనగును.

**తాత్పర్యము** : ఎక్కడ రెండుపుటలయొక్క మార్పు (వ్యత్యాసము) వలన రెండుచేతులు సిద్ధముచేయబడునో ననగిడాదిశబ్దములతో అది నాగబంధపాటమని తెలియనగును.

**నాగబంధో భవేదష్టమాత్రాభిః సహితః సదా ।**

**॥ నాగబంధపాటః ॥**

**ఆసజ్యతే సమం యస్మాత్ కరయోరుభయోస్తలౌ (?) ॥ 91 ॥**

**ప్రతిపదార్థము** : నాగబంధః = నాగబంధము; సదా = ఎల్లప్పుడు; అష్టమాత్రాభిః సహితః భవేత్ = ఎనిమిది మాత్రలు కల్గియుండును.

**తాత్పర్యము** : నాగబంధము ఎల్లప్పుడు ఎనిమిది మాత్రలు కల్గియుండును.

**సాంగుష్ఠాంగులిభిర్హస్తపాటః స స్యాత్ సమగ్రహః ।**
**పాటోఽసావష్టమాత్రాభిః శబ్దైర్దహతనిత్యపి ॥ 92 ॥**

దహతరిరకిర్క్కరర్, తకుతరి, కిరకిట్టి, దహదహ తకతక తకరరికికిట్ట, దహతరి కిత్తకిత్త, కితట్టి, దహ, దహ, తర్క, తర్కతరికికిట్టి ।

**ప్రతిపదార్థము** : యస్మాత్ = ఎందువలన; ఉభయోః కరయోః తలౌ = రెండుచేతుల తలములు; సమం ఆసజ్యతే = సమముగా కూడునో; సాంగష్ఠాంగులిభిః = అంగుష్ఠముతో కూడిన వ్రేళ్లతో; సమగ్రహః = సమగ్రహమైనది; హస్తపాటః = సమానపాటము; సః = అది; స్యాత్ = అగును; అసౌ పాటః = ఈపాటము; అష్టమాత్రాభిః = ఎనిమిది మాత్రలతోను; దహతనిత్యపి = దహత(ని); పునః = మరల;

**తాత్పర్యము** : ఎందువలన రెండుచేతుల తలములు సమముగా కూడునో అంగుష్ఠముతో కూడినవ్రేళ్లతో సమగ్రహమైనది. సమానపాటము అది అగును. ఈపాటము ఎనిమిది మాత్రలతోను దహత(ని) మరల;

**పునస్తకుకురిక్యా చ సంయుతోఽసౌ సమగ్రహః ।**

**॥ సమగ్రహపాటః ॥**

**॥ హస్తపాటాః ॥**

**బోల్లావణీ (చలావణీ) చారుశ్రవణికా పరమ్ ॥ 93 ॥**

**ప్రతిపదార్థము** : తకుతరిత్యాచ = తకుతరి (మొదలగు); శబ్దైః = ధ్వనులతోను; సంయుతః = కూడియుండి; సమగ్రహః స్యాత్ = సమగ్రహమగును; బోల్లావణీ, చలావణీ, పరం = తరువాత; చారుశ్రవణిక, పరిశ్రవణిక;

**తాత్పర్యము** : తకుతరి (మొదలగు) ధ్వనులతోను కూడియుండి సమగ్రహమగును. బోల్లావణీ, చలావణీ, తరువాత చారుశ్రవణిక, పరిశ్రవణిక;

**పరిశ్రవణికాలగ్నౌ దండహస్తౌ ధుచావపి ।**
**సమప్రహారసంజ్ఞశ్చ తతః కుడుబచారుణా ॥ 94 ॥**

**కలచారణాపి తద్వత్ స్యాత్ తథాన్యాపి కుడుల్లిణీ (?) ।**
**భవేద్ ఘనరవశ్చైవం వాద్యోద్దేశః ప్రదర్శితః ॥ 95 ॥**

**ప్రతిపదార్థము** : దండహస్తః సమప్రహారః, కుడుబచారణా కలచారణా; కుడుల్లిణీ, ఘనరవః, ఏవం = ఇట్లు; వాద్యోద్దేశః ప్రదర్శితః = వాద్యములస్థానము నిర్దేశింపబడినది. చూపబడినది.

**తాత్పర్యము** : దండహస్త, కుడుబచారణా, కుడుల్లిణీ, ఘనరవః, ఇట్లు వాద్యములస్థానము నిర్దేశింపబడినది. చూపబడినది.

**క్రమేణ కథయామ్యేషామిదానీం లక్షణాన్యహమ్ ।**
**పాటాదౌ పాటమధ్యే చ పాటాంతే టేంకృతిర్భవేత్ ॥ 96 ॥**

**ప్రతిపదార్థము** : ఇదానీం = ఇప్పుడు; ఏషాం = వీటికి; క్రమేణ = క్రమముగా; లక్షణం = లక్షణమును; కథయామి = చెప్పుచున్నాను; పాటాదౌ = పాటాదియందు; పాటమధ్యేచ = పాటమధ్యమున; పాటాంతే చ = పాటాంతమందును; టేంకృతిః = టేంకారము; భవేత్ = అగును.

**తాత్పర్యము** : ఇప్పుడు వీటికి క్రమముగా లక్షణమును చెప్పుచున్నాను. పాటాదియందు పాటమధ్యమున పాటాంతరమందును. టేంకారము అగును.

**ఇత్యేకకరసంపన్నా ప్రోక్తా బోల్లావణీ బుధైః ।**
**థోంతత్తకిటశబ్దేన ముద్దలీచాలనా స్ఫుటమ్ ॥ 97 ॥**

(యథా : దేం దేం గితకతకథట్టికా, థంధటికతథటి+ + + తక దేం దేం గి దేంగి ।)

**ప్రతిపదార్థము** : ఇతి = ఇట్లు; ఏకకరసంపన్నా = ఒకహస్తముతోకూడినది; బోల్లావణీ ప్రోక్తా = బోల్లావణీగా చెప్పబడినది; థోంతత్తకిటశబ్దేన = థోంతత్తకిటశబ్దముచే; మర్దలీచాలనా = మద్దెలవాదనము (విశేషము); స్ఫుటం = స్పష్టము.

**తాత్పర్యము** : ఇట్లు ఒకహస్తముతో కూడినది. బోల్లావణీగా చెప్పుచున్నది. థోంతత్తకిట శబ్దముచే మద్దెలవాదనము (విశేషము) స్పష్టము.

**బోల్లావణీసమం శేషం సా మతేహ చలావణీ ।**
**ఝేంకారసహితం హస్తపాటమూలాక్షరైర్యుతమ్ ॥ 98 ॥**

(యథా : థోం థోం కిట, థోం థో థో కిట థోకిట, తకి థోం తోతో కిట, థోంకి థోంకిట తోతో కిట, థోకిట, థోం థోం కిట దంతోం కిటథో ।)

**॥ చలావణీ ॥**

**ప్రతిపదార్థము** : శేషం = మిగిలినది; బోల్లావణీ సమం = బోల్లావణితో సమానము; సా = అది; ఇహ = ఇక్కడ; చలవణీ మతా = చలావణిగా సమ్మతము; ఝేంకార సహితం = ఝేంకారముతో కూడినది; హస్తపాటమూలాక్షరైర్యుతమ్ = హస్తపాటముయొక్క మూలాక్షరములతో కూడినది.

**తాత్పర్యము** : మిగిలినది బోల్లావణితో సమానము. అది ఇక్కడ చలావణిగా సమ్మతము. ఝేంకారముతో కూడినది, హస్తపాటము యొక్క మూలాక్షరములతో కూడినది.

**క్రమేణ యుగపద్వాపి వాద్యం హస్తద్వయేన తు ।**
**యుక్తాష్టాదశమాత్రాభిఃస్త్ర్యశ్రభేదేన సంయుతా ॥ 99 ॥**

**ప్రతిపదార్థము** : క్రమేణ = క్రమముగా; యుగపత్ వా అపి = ఒకేసారిగాని; హస్తద్వయేన = కరద్వయముతోను; అష్టాదశమాత్రాభిః యుక్తా = పదునెనిమిది మాత్రలు కలదియు; త్ర్యశ్రభేదేన సంయుతా = త్రిశ్రుతులయొక్క భేదము కలదియు అయిన;

**తాత్పర్యము** : హస్తపాటమూలాక్షరములు కలదియు క్రమముగా ఒకేసారిగాని

కరద్వయముతోను పదునెనిమిది మాత్రులు కలదియు త్రిశ్రుతులయొక్క భేదము కలదియు అయిన;

**చారుశ్రవణికా సేయం ప్రాహుర్వాద్యవిశారదాః ।**

**॥ చారుశ్రవణికా ॥**

**(క)ర్తర్యవఘటాభ్యాం యా మిశ్రా చ సమపాణినా ॥ 100 ॥**

**ప్రతిపదార్థము** : సేయం వాద్యం = ఆయీ వాద్యమును; చారుశ్రవణికా ప్రాహుః = చారుశ్రవణికగా చెప్పుదురు; కర్తర్యవఘటాభ్యాం = కర్తరీయవఘటములతో; మిశ్రా= మిశ్రమైనదియు; సమపాణినా = సమపాణిచేతను;

**తాత్పర్యము** : ఆ యీ వాద్యమును చారుశ్రవణికగా చెప్పుదురు. కర్తరీయవ ఘటములతో మిశ్రమైనదియు, సమపాణిచేతను.

**చతుర్వింశతిమాత్రాభిః పరిశ్రవణికా మతా ।**

**॥ పరిశ్రవణికా ॥**

**కర్తరీపాణిహస్తాభ్యాం కుడుచేనైవ వాద్యతే ॥ 101 ॥**

యథా : థర్ థర్ థర్, రిరి, థట్టికుదరగిడ, దరుగిడ, తకడోక ఇత్యాదిశ్చతుర్వింశ (తి)మాత్రా।

**ప్రతిపదార్థము** : చతుర్వింశతిమాత్రాభిః = ఇరువది నాల్గు మాత్రలతో; పరిశ్రమణికామతా = పరిశ్రమణిక సమ్మతము; కర్తరీపాణిహస్తాభ్యాం = కర్తరీపాణిహస్తములతో; కుడుచేనైవ వాద్యతే = కుడుబముతో వాదింపబడుచున్నది.

**తాత్పర్యము** : ఇరువది నాల్గుమాత్రలతో పరిశ్రమణిక సమ్మతము, కర్తరీపాణి హస్తములతో కుడుబముతో వాదింపబడుచున్నది.

**॥ దండహస్తః ॥**

**ఉత్సృజ్య కుండలీస్పర్శమలగ్నః సంప్రకీర్తితః ।**
**వామదక్షిణహస్తాభ్యాం శబ్దైర్విషమపాణిజైః ॥ 102 ॥**

యథా : కిరర్ థరకిర్, కిట్టహే కుథకుథ టికు, కిటకిక్కిట కిట కుట కుథ టిక, కిట్టకిట తకుథటి, తకతట్టికు, తతతటికు, తత్తటికు, థక థటికు థర్ థర్, తుథటకుత్తకుత, కుతకుథ కుత కుథట్టిత;

**ప్రతిపదార్థము** : కుండలీస్పర్శం ఉత్సృజ్య = కుండలీస్పర్శమును విడిచి; అలగ్నః = అసంయుక్తముగా; సంప్రకీర్తితః = చెప్పబడినది; యత్ర = ఎక్కడ; వామదక్షిణహస్తాభ్యాం = ఎడమ, కుడిచేతులతో; విషమపాణిజైః శబ్దైః = విషమహస్తజములైన శబ్దములతో;

**తాత్పర్యము** : కుండలీస్పర్శమును విడిచి అసంయుక్తముగా చెప్పబడినది. ఎక్కడ ఎడమ, కుడిచేతులతో విషమహస్తజములైన శబ్దములతో;

**క్రియతే యత్రవాద్యజ్ఞైర్వాద్యం తదుడుచం విదుః ।**

**ప్రతిపదార్థము** : వాద్యం క్రియతే = వాద్యము ప్రయోగించబడునో; తత్ = అది; ఉడుచంవిదుః = ఉడుచముగాతెలియుదురు.

యథా : గిరికిట, ననగిన, గిణికిరర్, కిటధటి కిటదటి, తుక్కిట ధటికి తుక్కిట గిరుగిడ ఝుంతటి గిరుకిట, ననగినగిరుకిట, తకుఝు ।

**తాత్పర్యము** : వాద్యము ప్రయోగించబడునో అది ఉడుచముగా తెలియుదురు.

**ఉడుచః సంప్రహారేణ వాద్యం సమగ్రహైర్యుతమ్ ॥ 103 ॥**

**మాత్రా(పి?భి) షోడశైర్వాపి వాద్యః సమప్రహారజః ।**
**నానాపాటాక్షరోదూర్భతైః శబ్దైః కుడుబతాడితైః ॥ 104 ॥**

**ప్రతిపదార్థము** : యుతం = సమగ్రహములతో కూడినదియు; షోడశైః మాత్రాభిర్వా= పదహారు మాత్రలతోగాని; వాద్యః = వాద్యము; సమప్రహారజః = సమప్రహారజనితము; నానాపాటాక్షరోద్భూతైః = అనేక పాటాక్షరములనుండి పుట్టిన; కుడుబతాడితైః = కుడుబముచే తాడనము చేయబడిన; శబ్దైః = శబ్దములచే;

**తాత్పర్యము** : సమగ్రహములతో కూడినదియు పదహారు మాత్రలతోగాని వాద్యము సమప్రహారజనితము అనేక పాటాక్షరములనుండి పుట్టిన కుడుబముచే తాడనము చేయబడిన శబ్దములచే;

యథా : తథ హథ, రికిథరి, థర్ థర్ తు ఇత్యాది షోడశమాత్రః ।

**॥ సమప్రహారః ॥**

కృతాఽఽవృత్త్యాతు గారుభ్యాం స్మృతా కుడుబచారుణా ।
కేవలైర్హస్తపాటానాం నాదానం చ చతుశ్శృతు (?) ॥ 105 ॥

**ప్రతిపదార్థము :** కృతాऽऽవృత్త్యా = చేయబడిన ఆవృత్తిగల; గారుభ్యాం = గారువులచే; కుడుబచారుణా స్మృతా = కుడుబచారుణ చెప్పబడినది; కేవలైః = కేవలములైన; హస్తపాటానం = హస్తపాట(ము)లయొక్కయు; నాదానంచ = నాదములయొక్కయు;

**తాత్పర్యము :** చేయబడిన ఆవృత్తికల గారువులచే కుడుబచారుణగా చెప్పబడినది. కేవలములైన హస్తపాట(ము)లయొక్కయు, నాదములయొక్కయు;

యథా : ఝేంనం కిరర్, థరిగిన, గిరికట; తకినన, గినగిన ఇత్యాది ।

**మాత్రాభిశ్చ కృతా శేషా స్మర్యతే కలచారణా ।**
**థర్ థర్ థర్ థర్, గిరిరర్ థరీరరరీ ఇత్యాదిః ॥ 106 ॥**

**ప్రతిపదార్థము :** చతుశ్శతు (?)మాత్రాభిః = మాత్రలచే; కృతా = చేయబడినది; శేషా = మిగిలినదియు;కలచారణా స్మర్యతే = కలచారణగా గుర్తింపబడినది.

**తాత్పర్యము :** మాత్రలచే చేయబడినది. మిగిలినదియు కలచారణగా గుర్తింపబడినది.

**కాలకాఖ్యేన హస్తేన కుకారప్రచురేణ యత్ ।**
**మాత్రాభిః షోడశైర్వాపి ద్వాత్రింశద్భిః సుకుంభినీ ॥ 107 ॥**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది; కాలకాఖ్యేన హస్తేన = కాలకహస్తములచేతను; కుకారప్రచురేణ = కుకారాధిక్యముచేతను; షోడశైః = పదహారుగాని; ద్వాంత్రింశద్భిః వా = ముప్పదిరెండుగాని; మాత్రాభిః = మాత్రలతో కూడినదియగునో; తత్ = అది; సుకుంభినీ స్యాత్ = సుకుంభినియగును.

**తాత్పర్యము :** ఏది కాలకహస్తముచేతను కుకారాధిక్యముచేతను, పదహారుగాని ముప్పదిరెండుగాని మాత్రలతో కూడినదియగునో అది సుకుంభినియగును.

**ద్వివిధా సా చ విజ్ఞేయా శుద్ధా మిశ్రేతి సూరిభిః ।**
**శుద్ధా షోడశమాత్రాభిరన్యాభిరితరా యుతా ॥ 108 ॥**

యథా : కుకుంత కుంత కుకుంత, కుంత కుకుకుకు ఇత్యాది ।

**ప్రతిపదార్థము :** సా = ఆ సుకుంభిని; శుద్ధామిశ్రా ఇతి = శుద్ధఅనియు మిశ్రఅనియు; ద్వివిధా జ్ఞేయా = రెండువిధములని తెలియవలెను; శుద్ధా = శుద్ధసుకుంభిని; షోడశమాత్రాభిః యుతా = పదహారు మాత్రలుకలది; అన్యాభిః = ఇతరములచే; ఇతరా = రెండవదైన మిశ్రసుకుంభిని; యుతా = కూడియున్నది.

**తాత్పర్యము** : ఆ సుకుంభిని శుద్ధఅనియు, మిశ్రఅనియు రెండు విధములని తెలియవలెను. శుద్ధసుకుంభిని పదహారు మాత్రలుకలది. ఇతరములచే రెండవదైన మిశ్రసుకుంభిని కూడియున్నది.

**అచ్ఛిన్నపాటః పా(టి?ణి) భ్యాం మాత్రాభిః షోడశైః క్రమాత్ ।**
**ఉక్తో ఘనర(వే?వో) జ్ఞేయో వాద్యవిద్యావిశారదైః ॥ 109 ॥**

యథా : తకతో హోం, తోకిటతకిథో హోంతో, కిటతకి, థోహోంతో, దరగిడ ఇతి షోడశమాత్రా । ఘనరవః ।

**ప్రతిపదార్థము** : క్రమాత్ = క్రమముగా; షోడశైః మాత్రాభిః = పదహారు మాత్రలతో కూడినదియు; పాణిభ్యాం = హస్తద్వయముచేతను; అచ్ఛిన్నపాటః = అభేద్యమైన పాట(ము)కలది; ఘనరవః జ్ఞేయః = ఘనరవమగును.

**తాత్పర్యము** : క్రమముగా పదహారు మాత్రలతో కూడినదియు హస్తద్వయముచేతను అభేద్యమైన పాట(ము)కలది ఘనరవమగును.

**ఇతి ద్వాదశ వాద్యాని పటహే కథితాని చ ।**
**తకారశ్చ ధికారశ్చ థోంకారష్టేంకృతిస్తథా ॥ 110 ॥**

**ప్రతిపదార్థము** : ఇతి = ఈ విధముగా; ద్వాదశ వాద్యాని = పన్నెండు వాద్యములు; పటహే కథితాని = పటహమందు చెప్పబడినవి; తకారశ్చ = తకారమును; ధికారశ్చ= ధికారమును; థోంకారః = థోంకారమును; టేంకృతిః = టేంకారమును;

**తాత్పర్యము** : ఈవిధముగా పన్నెండు వాద్యములు పటహమందు చెప్పబడినవి. వకారమును, ధికారమును, థోంకారమును, టేంకారమును;

**ఝోంకారశ్చ నదేంకారః పాటవర్ణా మృదంగజాః ।**
**మసృణే వాదనే ప్రౌఢా గీతవాద్యవిశార(దా?దైః) ॥ 111 ॥**

**ప్రతిపదార్థము** : ఝోంకారశ్చ = ఝోంకారమును; నదేంకారః = నదేంకారమును; మృదంగజాః పాటవర్ణాః ఇతి = మృదంగజనితపాటవర్ణము అని; మసృణే = అందమైన; వాదనే = వాద్యమందు; ప్రౌఢాః = చతురులైన; వాద్యవిశారదాః కథయంతి = విద్వాంసులు చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : ఝోంకారమును, నదేంకారమును, మృదంగజనితపాటవర్ణములని అందమైన వాద్యమందు చతురులైన విద్వాంసులు చెప్పుచున్నారు.

**వాద్యనుయాయినః సమ్యక్ ప్రోక్తా మార్దలికా వరాః ।**
**సరలశ్చౌ పటశ్చైవ కిరివిలశ్చ ఘణాయిలః ॥ 112 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యానుయాయినః = వాద్యానుయాయులు అయిన; వరాః = శ్రేష్ఠులయిన; మద్దాలికాః = మార్దంగికులు; ప్రోక్తా = చెప్పిరి; సరలః = సరళుడు; చౌపటః = చౌపటుడు; కిరివిలః = కిరివిలుడు; ఘణాయిలః = ఘణాయిలుడు.

**తాత్పర్యము** : వాద్యానుయాయులు అయిన శ్రేష్ఠులైన మార్దంగికులు చెప్పిరి. సరళుడు, చౌపటుడు, కిరివిలుడు, ఘణాయిలుడును.

**గతిస్థశ్చేతి పంచైవ మృదంగే వాదకోత్తమాః ।**
**యో వాదయతి మధురం కోమలం ప్రాంజలం ఋజుః ॥ 113 ॥**

**ప్రతిపదార్థము** : గతిస్థః ఇతి = గతిస్థముఅని; మృదంగే = మృదంగమందు; పంచైవ= ఐదుగురే; వాదకోత్తమాః = ఉత్తమవాదకులు; యః = ఎవడు; మదురం = మధురముగా; కోమలం = మృదువుగా; ప్రాంజలం = అంజలిబద్ధముగను; ఋజుః = తిన్నగను, వాదయతి = వాదనముచేయునో;

**తాత్పర్యము** : గతిస్థముఅని మృదంగమందు ఐదుగురే ఉత్తమవాదకులు ఎవడు మధురముగా మృదువుగా అంజలి బద్ధముగను తిన్నగను, వాదనముచేయునో;

**తమాహుర్భరతాభిజ్ఞాః సరలం విరలం జనమ్ ।**
**వినావయయవహీనత్వాచ్ఛబ్దేల్పే అల్పవాదకః ॥ 114 ॥**

**ప్రతిపదార్థము** : భరతాభిజ్ఞాః = భరతశాస్త్రముతెలిసినవారు అయిన; విరలం జనం= తక్కువగనున్నట్టి; తం = అట్టి వానిని; సరలం ఆహుః = సరళుడుగా చెప్పుచున్నారు; అవయవహీనత్వాత్ వినా = అవయవరాహిత్యములేకనే; అల్పే శబ్దే = స్వల్పమైన శబ్దమందు; అల్పవాదకః = తక్కువవాదకత్వమును కలిగినవాడు;

**తాత్పర్యము** : భరతశాస్త్రముతెలిసినవారు అయిన తక్కువగ నున్నట్టి అట్టివానిని సరళుడుగా చెప్పుచున్నారు. అవయవ రాహిత్యములేకనే స్వల్పమైన శబ్దమందు తక్కువవాదకత్వమును కలిగినవాడు;

**విబంధగిసువ్యక్తః సువాహే కిరివిలపటుః (?) ।**
**విషమం ప్రాంజలం చైవ గుంధాగుంధి సమాయుతమ్ ॥ 115 ॥**

**ప్రతిపదార్థము** : విబంధగతి సువ్యక్తః = విబంధగతి స్పష్టమగునదియు; సువాహే = సువాహమందు; విషమం = విషమమును; ప్రాంజలం = ప్రాంజలమును; గుంధాగుంధి సమాయుతం = గుంధాగుంధితో కూడియున్న;

**తాత్పర్యము** : విబంధగతి స్పష్టమగునదియు సువాహమందు విషమమును ప్రాంజలమును గుంధాగుందితో కూడియున్న;

**వాదయేట్ఠవణాదీనాం కుశలశ్చౌపటః స్మృతః ।**
**సరలఘణాయిల చౌపటాకిరివిలఘటితాని శబ్దవృందాని ।**
**మసృణాని సన్నివేశైర్నిరవధికం వాదయేద్ గతిస్థః సః ॥ 116 ॥**

**ప్రతిపదార్థము** : ఠవాణాదీనాం = ఠవణాదులలో; కుశలః = నిపుణుడు; వాదయేత్= వాదించును; సః = అతడు; చౌపటః స్మృతః = చౌపటుడుగా చెప్పబడుచున్నాడు; సరలఘణాయిల చౌపట కిరివిలఘటితాని = సరల, ఘణాయిల, చౌపట కిరివిలులందు సంబంధించిన; శబ్దవృంధాని = శబ్దసముదాయములను; మసృణాని = ఈ అందములుగా; సన్నివేశైః = సన్నివేశములచే; నిరవధికం = ఎల్లపుడు; వాదయేత్= వాదించువాడు; గతిస్థః = గతిస్థుడు.

**తాత్పర్యము** : ఠవణాదులలో నిపుణుడు వాదించును. అతడు చౌపటుడుగా చెప్పబడుచున్నాడు. సరల, ఘణాయిల, చౌపట కిరివిలులందు సంబంధించిన శబ్దసముదాయములను ఈ అందములుగా సన్నివేశములచే ఎల్లపుడు వాదించువాడు గతిస్థుడు.

**వాదే నిబద్ధశబ్దానాం కరలీభేదనం వినా ॥ 117 ॥**

**ప్రతిపదార్థము** : వాదే = వాదనమందు; కరళీభేదనంవినా = కరలీభేదనముతప్ప; నిబద్ధశబ్దానాం = నిబద్ధమైన శబ్దములను;

**తాత్పర్యము** : వాదనమందు కరలీభేదనముతప్ప నిబద్ధమైన శబ్దములను;

యో వాదయతి నిరతః కథ్యతేఽసౌ ఘణాయి(లా?లః) ।
అంగం చైవాశ్రయాంగం చ ద్వివిధం గీతవాదనమ్ ॥ 118 ॥

**ప్రతిపదార్థము** : యః = ఎవడు; వాదయతి నిరతః = ఎల్లప్పుడు వాదించునో; సః = అతడు; ఘణాయిలః కథ్యతే = ఘణాయిలుడుగా చెప్పబడుచున్నాడు; గీతవాదనం= గీతవాదనము; అంగం = అంగము; ఆశ్రయంగం చ = ఆశ్రయాంగము అని; ద్వివిధం= రెండువిదములు.

**తాత్పర్యము** : ఎవడు ఎల్లప్పుడు వాదించునో అతడు ఘనాయిలుడుగా చెప్పబడు చున్నాడు. గీతవాదనము అంగము ఆశ్రయాంగము అని రెండువిధములు.

> **అంగం తత్ పంచధాజ్ఞేయమాశ్రయాంగం చ పంచధా ।**
> **తాలధాతుపదావృత్తిగతిరా(గా?గై)శ్చ పంచధా ॥ 119 ॥**

**ప్రతిపదార్థము** : తత్ అంగం = ఆయంగము; పంచధా జ్ఞేయం = ఐదువిధములుగా తెలియదగినది; ఆశ్రయాంగం చ = ఆశ్రయాంగముకూడ; తాలధాతుపదావృత్తిరాగైః = తాలము, ధాతువు, పదావృత్తి, గతి, రాగములచే; పంచధా = ఐదువిధములు.

**తాత్పర్యము** : ఆయంగము ఐదు విధములుగాతెలియదగినది. ఆశ్రయాంగము కూడ తాలము, ధాతువు, పదావృత్తి, గతి, రాగములచే ఐదువిధములు.

> **శుద్ధమిశ్రవిభేదేన గీతాంగం వాద్యతే బుధైః ।**
> **జతిర్ధ్రువకురేఖశబ్దః కాకుః పహరణాభిధః ॥ 120 ॥**

**ప్రతిపదార్థము** : శుద్ధమిశ్రవిభేదేన = శుద్ధమిశ్రభేదముచే; గీతాంగం = గీతాంగము; బుధైః వాద్యతే = పండితులచే వాదింపబడును; జతి ర్ధ్రువకురేఖశబ్దః = జతిర్ధ్రువకు రేఖశబ్దము; కాకుః = కాకువు; పహరణాభిధః = పహరణము; ఇతి = ఈవిధముగా;

**తాత్పర్యము** : శుద్ధమిశ్రభేదముచే గీతాంగము పండితులచే వాదింపబడును. జతిర్ధ్రువకు రేఖశబ్దము కాకువు, పహరణము, ఈవిధముగా;

> **ఇతి పంచవిధం ప్రాహురాశ్రయాంగం విచక్షణాః ।**
> **కరటాః పాటవర్ణా స్యుః కరటేతి పునః పునః ॥ 121 ॥**

**ప్రతిపదార్థము** : ఇతి = ఈ విధముగ; విచక్షణాః = పండితులు; ఆశ్రయాంగం= ఆశ్రయాంగమును; పంచవిధం ప్రాహుః = ఐదువిధములుగా చెప్పిరి; కరటాః = కరటములు; పాటవర్ణాః స్యుః = పాటవర్ణములగును; కరటాఇతి = కరట అని; పునః పునః = మాటిమాటికి;

**తాత్పర్యము :** ఈవిధముగ పండితులు ఆశ్రయాంగమును ఐదువిధములుగా చెప్పిరి. కరటములు పాటవర్ణములగును. కరట అని మాటిమాటికి;

**॥ అవనద్ధమ్ ॥**

**సులక్షౌ (?) సుస్వరౌ తాలౌ తజ్ఞైః శక్తిశివౌ స్మృతౌ ।**
**ఆకారాదేశవశతో బిందునాదసముద్భవౌ ॥ 122 ॥**

**ప్రతిపదార్థము :** ఆకారాదేశవశతః = ఆకారాదేశవశమువలన; బిందునాదసముద్భవౌ= బిందునాదములనుండి పుట్టినటువంటిన్ని; సులక్షౌ= మంచిలక్షణముకల్గినట్టియు; సుస్వరౌ = మంచిస్వరములుకల; తాలః = తాళములు; తజ్ఞైః = తాళము తెలిసిన పండితులచే; శక్తి శివౌ స్మృతౌ = (శివపార్వతులు) శక్తిశివములుగాచెప్పబడినవి.

**తాత్పర్యము :** ఆకారాదేశవశమువలన బిందునాదములనుండిపుట్టినటువంటిన్ని మంచిలక్షణకల్గినట్టియు మంచిస్వరములుకల తాళములు. తాళముతెలిసిన పండితులచే (శివపార్వతులు) శక్తిశివములుగా చెప్పబడినవి.

**లఘుగుర్వాదిభిర్మానైర్వాదయేద్ బహుభంగిభిః ।**
**వర్ణా ఝేనగిటాస్తజ్ఞైః కథతాః కాంస్యతాలయోః ॥ 123 ॥**

**ప్రతిపదార్థము :** లఘుగుర్వాధిభిః = లఘువు గురువుమొదలగు; బహుభంగిభిః = అనేకవిధములైన; మానైః = మానములచే (ప్రమాణము); వాదయేత్ = వాదించవలెను; ఝేనగిటాః వర్ణాః = ఝేనగిటవర్ణములు; కాంస్యతాలయోః = కాంస్యతాళములయొక్క; వర్ణములుగా; కథితాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** లఘువు గురువుమొదలగు అనేకవిధములైన మానములచే (ప్రమాణము) వాదించవలెను. ఝేనగిటవర్ణములు కాంస్యతాళములయొక్క వర్ణములుగా చెప్పబడినవి.

**మనోహరాశ్చ సూక్ష్మాశ్చ సుస్వరాః క్షుద్రఘంటికాః ।**
**తాస్తు ఘర్ఘరికా లోకే ప్రసిద్ధా రజ్జుసంయుతాః ॥ 124 ॥**

**ప్రతిపదార్థము :** మనోహరాః = అందములైనవి; సూక్ష్మాః = సూక్ష్మములైనవి; సుస్వరాః = మంచిస్వరములు కలవి; క్షుద్రఘంటికాః = క్షుద్రఘంటికలు; రజ్జుసంయుతాః = త్రాడుతో కూడియున్నవి; లోకే = లోకమునందు; ఘర్ఘరికాః ప్రసిద్ధాః = ఘర్ఘరిక(ము)లుగా ప్రసిద్ధములు.

**తాత్పర్యము :** అందములైనవి, సూక్ష్మములైనవి మంచిస్వరములుకలవి క్షుద్రఘంటికలు త్రాడుతో కూడియున్నవి లోకమునందు ఘర్ఘరిక(ము)లుగా ప్రసిద్ధములు.

**ఘనవాద్యమితి ప్రోక్తం సుషిరం వాద్యముచ్యతే ।**

**॥ సుఘనం వాద్యమ్ ॥**

**జయశ్చ విజయో నందో మహానందో యథాక్రమమ్ ॥ 125 ॥**

**ప్రతిపదార్థము :** ఘనవాద్యం ఇతిప్రోక్తం = ఘనవాద్యముగాచెప్పబడినది; సుషిరం వాద్యం ఉచ్యతే = సుషిరవాద్యము చెప్పబడుచున్నది; జయః = జయము; విజయః= విజయము; నందః = నందము; మహానందశ్చ = మహానందము; యథాక్రమం = క్రమముననుసరించి;

**తాత్పర్యము :** ఘనవాద్యముగా చెప్పబడినది. సుషిరవాద్యము చెప్పబడుచున్నది. జయము, విజయము, నందము, మహానందము క్రమముననుసరించి;

**వంశాశ్చతుర్దశద్వాదశైకాదశదశాంగులాః ।**

**ద్వికత్రికచతుష్కాస్తు జ్ఞేయా వంశగతాః స్వరాః ॥ 126 ॥**

**ప్రతిపదార్థము :** వంశాః = వంశములు; చతుర్దశ = 14; ద్వాదశ = 12; ఏకాదశ = 11; దశాంగులా = 10 అంగుళములు; వంశగతాః స్వరాః = వంశగతస్వరములు; ద్వికత్రిక చతుష్కాః = 2,3,4గా; జ్ఞేయాః = తెలియదగినవి.

**తాత్పర్యము :** వంశములు 14, 12, 11, 10 అంగుళములు వంశగతస్వరములు 2,3,4గా తెలియదగినవి.

**కంపమానార్ధముక్తా చ వ్యక్తముక్తాంగులీవహాః ।**

**అంగులీచారణాః సమ్యక్ గమకేషు చ సప్తసు ॥ 127 ॥**

**ప్రతిపదార్థము :** కంపమానార్ధముక్తా = కంపమానార్ధములను విడిచినదియు; సమ్యక్= బాగుగా; సప్తషుగమకేషు = ఏడు గమకములందు; వ్యక్తముక్తాంగులీవహాః = స్పష్టములైన ముక్తాంగుళిలను వహించునవియు; అంగులీచారణాః = అంగుళులందు చరించునట్టి;

**తాత్పర్యము :** కంపమానార్ధములను విడిచినదియు బాగుగా ఏడు గమకములందు స్పష్టములైన ముక్తాంగుళిలను వహించునదియు అంగుళులందు చరించునట్టి;

**తామ్రేణ కలధౌతేన కర్తవ్యా కనకేన వా ।**
**ధుర్ధూరకుసుమాకారవసనా సుషిరాంతరా ॥ 128 ॥**

**హస్తత్రయకృతాయామా హోహోవర్ణా చ కాహలా ।**
**బిరుదాన్యపి వాద్యన్తే వీరాణాం పురతస్తయా ॥ 129 ॥**

**॥ ఇతి చతుర్విధవాద్యాని ॥**

**ప్రతిపదార్థము** : హలా = కాహలము;తామ్రేణ = తామ్రముచేతను; కలధౌతేన = వెండితో గాని; కనకేన = బంగారముతోగాని, దుర్ధూరకుసుమాకార వసనా = దుర్ధూరకుసుమమువంటి ఆకారముగల వస్త్రముకలదియు; సుషిరాంతరా = సుషిరాంతరమైనదియు; హస్తత్రయకృతాయామా = మూడుజానెలపొడవు కల్గునట్లుగా; హోహో వర్ణా = హోహో వర్ణములుకల్గునట్లుగా; కర్తవ్యా = చేయదగినది; తయా = ఆకాహళముతో; వీరాణాం పురతః = వీరుల ఎదుట; బిరుదాన్యపి = బిరుదములు కూడ; వాద్యంతే = వాదించబడును.

**తాత్పర్యము** : కాహలము తామ్రముచేతను,వెండితోగాని, బంగారముతోగాని, దుర్ధూరకుసుమమువంటి ఆకారముగల వస్త్రము కలదియు సుషిరాంతరమైనదియు మూడు జానెల పొడవు కల్గునట్లుగా హోహోవర్ణములు కల్గునట్లుగా చేయదగినది. ఆ కాహళముతో వీరుల ఎదుట బిరుదములు కూడ వాదించబడును.

**యత్యాదీనాం ప్రబంధానామధునా లక్ష్మ కథ్యతే ।**
**యతిరోతో ప్యవచ్ఛేదో జోడణీ చండణీ పదమ్ ॥ 130 ॥**

**ప్రతిపదార్థము** : యత్యాదీనాం ప్రబంధానాం = యత్యాదిప్రబంధములకు; అధునా= ఇప్పుడు; లక్ష్మ కథ్యతే = లక్షణము చెప్పబడుచున్నది; యతి: = యతి; ఓతః = ఓత(స్సు)ము; అవచ్ఛేదః = అవచ్ఛేదము; జోడణీ = జోడణి; చండణీ = చండణి; పదం = పదము.

**తాత్పర్యము** : యత్యాదిప్రబంధములకు ఇప్పుడు లక్షణము చెప్పబడుచున్నది. యతి ఓత(సు)ము అవచ్ఛేదము, జోడణి, చండణి, పదము.

సమహస్తోఽపి పైరాససస్తుదుకుస్తు తథా పరః ।
ఓత్వరోఽపి చ ఝోంకారో దేంకారో మదపస్తథా ॥ 131 ॥

**ప్రతిపదార్థము** : సమహస్తః = సమహస్తము; పైసారః = పైసారము; తుడుకుః = తుడుకు(వు); తథా = అట్లే; ఓత్వరః = ఓత్వరము; ఝోంకారః = ఝోంకారము; దేంకారః =దేంకారము; మలపః = మలపము;

**తాత్పర్యము** : సమహస్తము పైసారము తుడుకు(వు) అట్లే ఓత్వరము ఝోంకారము దేంకారము మలపము;

> **మలపాంగం ప్రహరణా చాంతరీ చ దువక్కరః ।**
> **జవణికా పుష్పాంజలిరిఘువణీ (?) చ నిగద్యతే ॥ 132 ॥**

**ప్రతిపదార్థము** : మలపాంగం = మలపాంగము; ప్రహరణా = ప్రహరణము; అంతరీ = అంతరి; దువక్కరః = దువక్కర(రి)యు; జవణికా = జవణిక; పుష్పాంజలి = పుష్పాంజలి; ఘువణీచ = ఘువణియని; నిగద్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : మలపాంగము ప్రహరణము అంతరి దువక్కర(రి)యు జవణిక పుష్పాంజలి ఘువణియని చెప్పబడుచున్నది.

> **ప్రబంధా వింశతిః ప్రోక్తా వాద్యవిద్యా విశారదైః ।**
> **క్రమేణ తేషాం లక్ష్మైతదిదానీం ప్రతిపాద్యతే ॥ 133 ॥**

**ప్రతిపదార్థము** : వింశతిః ప్రబంధాః ప్రోక్తాః = ఇరువది (20)ప్రబంధములు చెప్పబడినవి; క్రమేణ = క్రమముగా; తేషాం లక్ష్మ = వాటి లక్షణము; ఇదానీం = ఇప్పుడు; ప్రతిపాద్యతే = నిరూపింపబడుచున్నది.

**తాత్పర్యము** : ఇరువది (20) ప్రబంధములు చెప్పబడినవి. క్రమముగా వాటి లక్షణము ఇప్పుడు నిరూపింపబడుచున్నది.

> **తాలచ్ఛందోవగత్యర్థవిరామో యః శ్రుతిప్రియః ।**
> **వాద్యతే వాద్యహీనం సా యతిరిత్యభిధీయతే ॥ 134 ॥**

**॥ (జ?య)తిః ॥**

**ప్రతిపదార్థము** : శ్రుతిప్రియః = చెవులకింపయిన; యః = ఏ; తాలచ్ఛంద అవగత్యర్థవిరామః = తాలము ఛందస్సు తెలియుటకైన విరామము; వాద్యహీనం = వాద్యహీనముగా; వాద్యతే = వాదించబడునో; సా = అది; యతిరితి అభిధీయతే = యతియనబడుచున్నది.

**తాత్పర్యము** : చెవులకింపయిన తాలము ఛందస్సు తెలియుటకైన విరామము వాద్యహీనముగావాదించబడునో అది యతియనబడుచున్నది.

**తాలః శతసమైర్వర్ణైః క్రియతే పాటసంభవైః ।**
**ఓతాఖ్యోఽసౌ ప్రబంధఃస్యాత్ కేదార ఇతి చోచ్యతే ॥ 135 ॥**
**॥ ఓ (తా?తః) ॥**

**ప్రతిపదార్థము** : పాటసంభవైః = పాటజనితములైన; శతసమైః వర్ణైః = శతసమ వర్ణములతో; తాలః క్రియతే = తాలముచేయబడిన యెడల; అసౌ = ఇది; ఓతాఖ్యః = ఓతమనియు; కేదారః ఇతి చ = కేదారమనియు; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము : పాటజనితములైన శతసము వర్ణములతో తాళము చేయబడిన యెడల ఇది ఓతమనియు కేదారమనియు చెప్పబడుచున్నది.

**ఇచ్ఛయా క్లుప్తదేంకారైర్మధ్యగై ర్వ్యాపకాక్షరైః ।**
**(వి?ద్వి)రుద్గ్రాహో భవేద్యత్తు సవిలంబలయం చ యః ॥ 136 ॥**

**ప్రతిపదార్థము** : ఇచ్ఛయా = క్లుప్తముగా; క్లుప్తదేంకారైః = క్లుప్తములైన దేంకారములచేతను; మధ్యగైః = మధ్యమును పొందిన; వ్యాపకాక్షరైః = వ్యాపకాక్షరములచే; యత్ = ఏది; దిరుద్గ్రాహః భవేత్ = రెండుపర్యాయములు ద్గ్రాహమగునో; విలంబిత లయంచ = విలంబితమైన లయకలదియుఅగునో;

**తాత్పర్యము** : క్లుప్తముగా క్లుప్తములైన దేంకారములచేతను మధ్యమును పొందిన వ్యాపకాక్షరములచే ఏది రెండు పర్యాయములుద్గ్రాహమగునో విలంబితమైన లయ కలదియు అగునో;

**ఓతానాం కర్మయంత్యన్యే దేంకార ఇతి మృత్తికమ్ ।**
**ఏషా దోణ్ఠవణీనామ్నా కైశ్చిదప్యభిధీయతే ॥ 137 ॥**
**॥ (ఓ?దోం) ణ్ఠవణీ ॥**

**ప్రతిపదార్థము** : అన్యే = ఇతరములు; దేంకార ఇతి మృత్తికం = దేంకారమను మృత్తిక (ప్రాథమిక ప్రధానత)ను; ఓతానాం కర్మయంతి = ఓతముల కర్మ(కలవి)గా చేయుచున్నవి; ఏషా = ఇది; దోణ్ఠవణీనామ్నా = (ఓ)దోణ్ఠవణిపేరుచేతను; కైశ్చిదపి= కొందరిచేత; అభిధీయతే = పిలువబడుచున్నది.

**తాత్పర్యము** : ఇతరములు దేంకారమను మృత్తిక (ప్రాథమికప్రధానత)ను ఓతముల కర్మ (కలవి)గా చేయుచున్నవి. ఇది (ఓ) దోణ్ణవణి పేరుచేతను కొందరిచేత పిలువబడుచున్నది.

**ఉద్గ్రాహయుగలం యత్ర వారమేకం ధ్రువస్తథా ।**
**ఉద్గ్రాహేణ పునర్మోక్షాదవచ్ఛేదోఽభిధీయతే ॥ 138 ॥**

**॥ అవచ్ఛేదః ॥**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; ఉద్గ్రాహయుగలం = ఉద్గ్రాహద్వయమును; ఏకవారం = ఏకపర్యాయము; ధ్రువం = ధ్రువమును; తథా = అట్లే; ఉద్గ్రాహేణ = ఉద్గ్రాహముచేత; పునః = మరల; మోక్షాత్ = మోక్షమువలన; అవచ్ఛేదః అభిధీయతే = అవచ్ఛేదమనబడుచున్నది.

**తాత్పర్యము** : ఎక్కడ ఉద్గ్రాహద్వయమును ఏకపర్యాయము ధ్రువమును అట్లే ఉద్గ్రాహముచేత మరల మోక్షమువలన అవచ్ఛేదనమనబడుచున్నది.

**వదంతి కేచిదస్యైవ కంపితేత్యభిధాం పునః (కవితే?) ।**
**పాటానాం పృథగుక్తానాం యత్రైకత్ర విమిశ్రణమ్ ॥ 139 ॥**

**॥ జోడణీ ॥**

**జోడణీ సంపరిజ్ఞేయా సంజ్ఞయా వాద్యవేదిభిః ॥**
**వాద్యం విముచ్యతే యేన చణ్డణః స నిగద్యతే ॥ 140 ॥**

**॥ చండణీ ॥**

**ప్రతిపదార్థము :** కేచిత్ అస్య ఏవ = దీనికే; కంపితా ఇతి అభిధాం = కంపితమనిపేరును; ప్రాహుః =చెప్పిరి; పృథగుక్తానాం = వేరుగా చెప్పబడిన; పాటానాం = పాట(ము)లకు; యత్ర = ఎక్కడ; ఏకత్ర = ఒకచోట; విమిశ్రణం = కలయికయో; సా =అది; సంజ్ఞయా= పేరుచే; జోడణీ పరిజ్ఞేయా = జోడణియని తెలియదగినది.

**తాత్పర్యము** : దీనికే కంపితమని పేరునుచెప్పిరి. వేరుగాచెప్పబడిన పాట(ము)లు ఎక్కడ ఒకచోట కలయికయో అది పేరుచే జోడణియని తెలియదగినది.

**గీతానుగస్య వాద్యస్య చండణః స చతుర్విధః ।**
**సుక్తాసుక్తిస్తు తత్ ప్రోక్తా మో(డ?ఢా) మోడిస్తథైవ చ ॥ 141 ॥**

**ప్రతిపదార్థము** : గీతానుగస్య వాద్యస్య = గీతానుగమైన వాద్యమునకు; చూడణః = చండణమనిపేరు (అది); చతుర్విధః = నాల్గు(4)విధములు; సుక్తానుక్తిః = సుక్తా సుక్తియని; మోడామోడి ఇతి = మోడామోడి యనియు; తథా = అట్లే;

**తాత్పర్యము** : గీతానుగమైన వాద్యమునకు చండణమని పేరు (అది) నాల్గు(4) విధములు సుక్తా సుక్తియని మోడామోడి యనియు అట్లే;

**అర్థస్థితిస్తతస్తస్మాత్ స్వరపూర్వశ్చ చండణః ।**
**స్తోకస్తోకేన కార్యం స్యాత్ వాదనం లఘుపాణినా ॥ 142 ॥**

**ప్రతిపదార్థము** : అర్థస్థితి = అర్థస్థితియు; స్వరపూర్వః చండణః = స్వరచండణము అని; స్తోకస్తోకేన = కొంచెము కొంచెముగా; లఘుపాణినా = లఘుహస్తముచే; వాదనం కార్యం = వాదనము చేయదగినది.

**తాత్పర్యము** : అర్థస్థితియు స్వరచండణము అని కొంచెము కొంచెముగా లఘుహస్తముచే వాదనముచేయదగినది.

**గీతావసానే న్యాసః స్యాత్ సుక్తాసుక్తీతి నామతః ।**
**గీతమానాధికం వాద్యం గీతమానేన చండణమ్ ॥ 143 ॥**

**ప్రతిపదార్థము** : గీతావసానే = గీతముచివర; న్యాసః స్యాత్ = న్యాసముండవలెను; సా = అది; నామతః సుక్తాసుక్తీతి స్యాత్ = సుక్తాసుక్తియనబడును; గీతమానాధికం వాద్యం = గీతమానఅధికమైన వాద్యమును; గీతమానేన = గీతమానముచేత; న్యాసః = న్యాసముకల్గియును;

**తాత్పర్యము** : గీతముచివర న్యాసముండవలెను. అది సుక్తాసుక్తియనబడును. గీతమాన అధికమైన వాద్యమును గీతమానముచేత న్యాసము కల్గియును;

**మోడామోడీతి విజ్ఞేయా న్యాసో వాద్యవిశారదైః ।**
**మానేన గాయకో గాయన్ యత్ర మానం విముంచతి ॥ 144 ॥**

**ప్రతిపదార్థము** : వాద్య విశారదైః = వాద్యవిద్యాంసులచేత; న్యాసః = న్యాసము; మోడామోడీతి = (చండణం) మోడామోడీ ప్రభేదముగా; విజ్ఞేయా = తెలియదగినది; యత్ర = ఎక్కడ; గాయకః = గాయకుడు; మానేన = ప్రమాణముతో; గాయన్ = గానముచేయుచు; మానం విముంచతి = ప్రమాణమును విడుచునో;

**తాత్పర్యము** : (చండణం) మోడామోడీ ప్రభేదముగా తెలియదగినది. ఎక్కడ గాయకుడు ప్రమాణముతో గానముచేయుచు ప్రమాణమును విడుచునో;

**వాదకేన కృతో న్యాసస్తదర్ధస్థితిరీరితః ।**
**గీతం వాద్యం చ యుగపన్న్యస్యతే యది మానతః ॥ 145 ॥**

**ప్రతిపదార్థము** : వాదకేన = వాదకునిచే; న్యాసః కృత = న్యాసముచేయబడునో; తత్ = అది; అర్ధస్థితిః ఈరితః = అర్ధస్థితియనబడును; గీతం వాద్యం చ = గీతవాద్యములు; యది = ఒకప్పుడు; యుగపత్ = ఒకేసారి; మానతః = ప్రమాణమువలన; న్యస్యతే = న్యాసముచేయబడునో;

**తాత్పర్యము** : వాదకునిచే న్యాసముచేయబడునో అది అర్ధస్థితి యనబడును. గీతవాద్యములు ఒకప్పుడు ఒకేసారి ప్రమాణమువలన న్యాసము చేయబడునో;

**శుభావగతిసంయుక్తో విజ్ఞేయః స్వరచండణః ।**
**ప్రథమం వాదయిత్వా తు యతిః పాదేన ముచ్యతే ॥ 146 ॥**

**ప్రతిపదార్థము** : శుభావగతిసంయుక్తా = శుభావగతియుతమును అగునది; స్వరచండణః విజ్ఞేయః = స్వరచండణమగును; ప్రథమం = మొదట; యతిః వాదయిత్వా = యతినివాదనము చేయబడి; పాదేన ముచ్యతే = పాదముచే విడవబడునో;

**తాత్పర్యము** : శుభావగతి యుతమును అగునది. స్వరచండణమగును. మొదట యతిని వాదనము చేయబడి పాదముచే విడవబడునో;

**మధ్యే వాద్యప్రబంధస్య పదం తత్ పరికీర్తితమ్ ।**

**॥ పదమ్ ॥**

**తకారః ప్రచురం దోర్భ్యాం యథౌచిత్యేన మానతః ॥ 147 ॥**

**ప్రతిపదార్థము** : తత్ = అది; మధ్యే = మధ్యన; వాద్యప్రబంధస్య = వాద్యప్రబంధముయొక్క; ఆతోద్యాః = ఆతోద్యములు; పదం = పదముగా; పరికీర్తితం= చెప్పబడినది; దోర్భ్య = రెండు చేతులతో; మానతః = మానముప్రకారము; యథౌచిత్యేన = తగినరీతిగా; తకారః ప్రచురం = తకారము ప్రచురముగ;

**తాత్పర్యము** : అది మధ్యన వాద్యప్రబంధముయొక్క అది పదముగా చెప్పబడినది. రెండుచేతులతో మానముప్రకారము తగినరీతిగా తకారము ప్రచురముగ;

**వాద్యతే యత్ త్రిరావృత్త్యా సమహస్తః స్మృతో బుధైః ।**

**॥ సమహస్తః ॥**

**యత్రాతోద్యపి వాద్యంతే సమగ్రాణి నిజైర్నిజైః ॥ 148 ॥**

**ప్రతిపదార్థము** : త్రిరావృత్త్యా = మూడుమార్లు ఆవృత్తిచే; వాద్యతే = వాదించబడునో; తత్ = అది; బుధైః = పండితులచే; సమహస్తః స్మృతః = సమహస్తమని చెప్పబడినది; యత్ర = ఎక్కడ; సమగ్రాణి = సంపూర్ణములైన; నిజైః నిజైః = తమతమ; ఆతోద్యాః = ఆతోద్యములు;

**తాత్పర్యము** : మూడుమార్లు ఆవృత్తిచే వాదించబడునో అదిపండితులచే సమహస్తమనిచెప్పబడినది. ఎక్కడ సంపూర్ణములైన తమతమ ఆతోద్యములు;

**పాదైశ్చసముదాయైశ్చ పైసార ఇతి కథ్యతే ।**

**॥ పైసారః ॥**

**ఉద్గ్రాహధ్రువకాభోగేష్వేకదేశస్య వాదనమ్ ॥ 149 ॥**

**ప్రతిపదార్థము** : పాదైః = పాదములచేతను, సముదాయైః = సముదాయములచేతను; వాద్యంతే = వాదించబడునో; సః = అది; పైసారః ఇతి = పైసారమని; కథ్యతే = చెప్పబడును; ఉద్గ్రాహధ్రువకాభోగేషు = ఉద్గ్రాహధ్రువఆభోగములలో; ఏకదేశస్య వాదనం యత్ = ఒకదానియొక్క వాదనమేది జరుగునో;

**తాత్పర్యము** : పాదములచేతను, సముదాయములచేతను వాదింపబడునో అది పైసారమని చెప్పబడును. ఉద్గ్రాహధ్రువ ఆభోగములలో ఒకదానియొక్క వాదనమేది జరుగునో;

**హస్తలాఘవతో యత్ స్యాత్ తుటుక్కా సా నిగద్యతే ।**

**॥ తుటుకుః ॥**

**ఈషద్విలంబమానేన గంభీరమధురం యథా ॥ 150 ॥**

**ప్రతిపదార్థము** : హస్తలాఘవతః = హస్తలాఘవమువలన; సా=అది; తుటుక్కా నిగద్యతే= తుటుక్కయగును; ఈషత్ విలంబమానేన = కొంచెము విలంబమానముచే; గంభీరమధురం యథా = గంభీరమును మధురమును అగురీతిని;

**తాత్పర్యము** : హస్తలాఘవమువలన అది తుటుక్కయగును. కొంచెము విలంబమానమచే గంభీరమును మధురమును అగురీతిని;

**మృదంగవాదనం యద్వదోత్వరం త్వష్టమాత్రకమ్ ।**

**॥ ఓత్వరమ్ ॥**

**ఆదౌ ఝేంకారముల్లాసం విధాయాచ్ఛ(?) సమన్వితమ్ ॥ 151 ॥**

**ప్రతిపదార్థము** : అష్టమాత్రకం = ఎనిమిది మాత్రలు కల్గునట్లుగా; యత్ మృదంగవాదనం = ఏమృదంగవాదనము జరుగునో; తత్ ఓత్వరం స్యాత్ = అది ఓత్వరమగును; ఆదౌ = మొదట ఝేంకారమును; ఉల్లాసం విధాయ = ఉల్లాసమును చేసి; చ? సమన్వితం = కూడినదియు;

**తాత్పర్యము** : ఎనిమిది మాత్రలు కల్గునట్లుగా ఏ మృదంగవాదనము జరుగునో అది ఓత్వరమగును. మొదటఝేంకారమును ఉల్లాసముచేసి కూడినదియు;

**అథవాచ్ఛ(?) విహీనం చ ద్విధా ఝేంకార ఉచ్యతే ।**

**॥ ఝేంకారః ॥**

**స్తోకసోక్తస్య శబ్దస్య యోఽవసానే స దేంకృతిః ॥ 152 ॥**

**ప్రతిపదార్థము** : అథవా = లేక; చ?విహీనంచ = విహీనమనియు; ద్విధా = రెండువిధములుగా; ఝేంకారః ఉచ్యతే = ఝేంకారము చెప్పబడుచున్నది; స్తోకస్తోకస్య శబ్దస్య = చిన్న చిన్న శబ్దముయొక్క న్యాసము; అవసానే = అవసానమందయినచో; సః = అది; దేంకృతిః = దేంకారము.

**తాత్పర్యము** : లేక విహీనమనియు రెండువిధములుగా ఝేంకారముచెప్పబడుచున్నది. చిన్న చిన్న శబ్దముయొక్క న్యాసము అవసానమందయినచో అది దేంకారము.

**సయావనియామేనాపి దేంకారో వాద్యతే బుధైః ।**

**॥ దేంకారః ॥**

**యత్రోద్గ్రాహః సకృద్ ద్విర్వా ధ్రువకో వివిధస్తథా ॥ 153 ॥**

**ప్రతిపదార్థము** : సయావనియామేన అపి = సయావనియమముచేత కూడ; దేంకారః వాద్యతే = దేంకారము వాదనము చేయబడును; యత్ర = ఎక్కడ; సకృత్ ఉద్గ్రాహః = ఒకసారి ఉద్గ్రాహము; ద్విర్వా = రెండుమార్లు; వివిధఃధ్రువకః = అనేకవిధములుగా ధ్రువము(ను);

**తాత్పర్యము :** సయావనియమముచేత కూడ దేంకారము వాదనము చేయబడును. ఎక్కడ ఒకసారి ఉద్గ్రాహము రెండుమార్లు అనేకవిధములుగా ధ్రువము (ను);

**స్యాదేవ తద్ ద్విదేంకారవ్యాపకాక్షరసంగతమ్ ।**
**నిరంతరంయతిప్రాయం మలపం కథయంతి తత్ ॥ 154 ॥**

**॥ మలపః ॥**

**ప్రతిపదార్థము :** స్యాదేవ = అగునో; ద్విదేంకారవ్యాపకాక్షరసంగతం = రెండుపర్యాయములు దేంకారమును, వ్యాపకాక్షరయుతమును అగునో; నిరంతరయతి ప్రాయం = సర్వదా యతిప్రాయమగునో; తత్ = దానిని; మలపం కథయంతి = మలపముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము :** అగునో, రెండుపర్యాయములు దేంకారమును, వ్యాపకాక్షరయుతమును అగునో, సర్వదా యతిప్రాయమగునో దానిని మలపముగా చెప్పుచున్నారు.

**వాదయితుం మలపాంగం కథాంగం వాద్యతే పునః ।**
**నతో (?) మలపవాద్యం యన్మలపాంగం తదుచ్యతే ॥ 155 ॥**

**॥ మలపాంగము ॥**

**ప్రతిపదార్థము :** మలపాంగం వాదయితుం = మలపాంగమును వాదించుటకు; కథాంగం వాద్యతే = కథాంగము వాదింపబడును; పునః = మరల; నతః తతః = తరువాత; మలపవాద్యం వాద్యతే = మలపవాద్యమును వాదించబడును; తత్ = అది; మలపాంగం ఉచ్యతే = మలపాంగముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** మలపాంగమును వాదించుటకు కథాంగము వాదింపబడును. మరల తరువాత మలపవాద్యమును వాదించబడును. అది మలపాంగముగాచెప్పబడుచున్నది.

**యేన కేనాపి వాదేన మాత్రాద్వాదశషోడశ ।**
**వాదయేత్ పల్లవద్వంద్వం సోఽయం పహరణాభిధః ॥ 156 ॥**

**॥ పహరణమ్ ॥**

**ప్రతిపదార్థము :** యేన కేనాపి వాదేన = ఏవాదముచేతనైనను; పల్లవద్వంద్వం వాదయేత్ = పల్లవద్వయమును వాదించవలెను; మాత్రాః = మాత్రలు; ద్వాదశ షోడశ = పన్నెండు, పదహారు; సోఽయం = ఆవాద్యము; పహరణాభిదః = పహరణనామకమగును;

**తాత్పర్యము** : ఏవాదము చేతనైనను పల్లవ ద్వయమును వాదించవలెను. మాత్రలు పన్నెండు పదహారు ఆ వాద్యము పహరణనామకమగును.

**ఆరబ్ధం సానుసారేణ యచ్ఛందో గీతవాద్యయోః ।**
**నిబద్ధమంతరా వాద్యం క్రియతే సాంతరా స్మృతా ॥ 157 ॥**

**॥ అంతరీ ॥**

**ప్రతిపదార్థము** : యత్ ఛందః = ఏ ఛందస్సు; సానుసారేణ = అనుసారయుతముగా; గీవాద్యయోః ఆరబ్ధం = గీతవాద్యములందారంభింపబడునో; వాద్యం = వాద్యము; అంతరానిబద్ధం = అంతముచేతను నిబద్ధమైనదో; సా =అది; సాంతరా స్మృతా = సాంతరమగును;

**తాత్పర్యము** : ఏ ఛందస్సు అనుసారయుతముగా గీతవాద్యములందారంభింపబడునో వాద్యము అంతముచేతను నిబద్ధమైనదో అది సాంతరమగును.

**యతిరేవాక్షరద్వంద్వా వాద్యతే స దువక్కురః ।**

**॥ దువక్కరీ ॥**

**స్థిరమానేన సోల్లాసం చతుర్మా(త్రా?త్రాం) చ దేంకృతి(తిః?తిమ్) ॥ 158 ॥**

**ప్రతిపదార్థము** : అక్షరద్వంద్వా = అక్షరద్వయముగల; యతిరేవ = యతియే; వాద్యతే= వాదింపబడినది; సః = అదిః; దువక్కురః = అది దువక్కరి; చతుర్మాంత్రాం దేంకృతిం = నాల్గుమాత్రలు గల దేంకృతిని; సోల్లాసం = సంతోషముగా; స్థిరమానేన = స్థిర ప్రమాణముచే;

**తాత్పర్యము** : అక్షరద్వయముగల యతియే వాదింపబడునది దువక్కరి. నాల్గుమాత్రలు గల దేంకృతిని సంతోషముగా స్థిరప్రమాణముచే;

**వారద్వయం వాదయిత్వా తతః కుర్యాచ్చ జోడణమ్ ।**
**తతో మాత్రాష్టకచ్ఛేదో మద్దలాశబ్దవాదనే ॥ 159 ॥**

**ప్రతిపదార్థము** : వారద్వయం వాదయిత్వా = రెండుపర్యాయములు వాదించి; తతః= తరువాత; జోడణం కుర్యాత్ = జోడణి చేయవలెను; తతః = తరువాత; మద్దలాశబ్దవాదనే = మద్దలను వాదించునపుడు; అష్టమత్రాచ్ఛేదః కుర్యాత్ = అష్టమాత్రాచ్ఛేదము చేయవలెను.

**తాత్పర్యము** : రెండు పర్యాయములు వాదించి తరువాత జోడణీచేయవలెను. తరువాత మద్దలను వాదించునపుడు అష్టమాత్రాచేదము చేయవలెను.

**పునర్మాత్రాష్టకం శబ్దం కరటాయాశ్చ వాదనే ।**
**త్రిరావృత్యా వాదితస్య శబ్దః స్యాత్ సావసానతః ॥ 160 ॥**

**ప్రతిపదార్థము** : పునః = మరల; కరటాయాశ్చ వాదనే = కరటా వాదనమందు, మాత్రాష్టకం శబ్దం = ఎనిమిదిమాత్రలధ్వని; త్రిరావృత్యా = ముమ్మారావృత్తిచే; వాదితస్య = వాదింపబడుదానియొక్క; శబ్దః = శబ్దము; సావసానతః = అవసానయుతముగా; స్యాత్ = అగును.

**తాత్పర్యము** : మరల కరటా వాదనమందు ఎనిమిది మాత్రల ధ్వని ముమ్మారావృత్తిచే వాదింపబడు దానియొక్క శబ్దము అవసానయుతముగా అగును.

**సమా యవనికాపాతాచ్ఛబ్దో యవనికా(న్వ?హ్వా) యః ।**
**॥ జవనికా ॥**
**ఆదౌ స్యాదష్టమాత్రో వాథవా ద్వాదశమాత్రికమ్ ॥ 161 ॥**

**ప్రతిపదార్థము** : సమా యవనికాపాతాత్ = సమానమైన విధముగా యవనికాపాతమువలన; యవనికాహ్వాయః స్యాత్ = యవనికయగుచున్నది; ఆదౌ = మొదట; అష్టమాత్రః వా= ఎనిమిది మాత్రలుగాని; అథవా = లేక; ద్వాదశమాత్రికం = (12) పన్నెండు మాత్రలుకాని;

**తాత్పర్యము** : సమానమైనవిధముగా యవనికా పాతమువలన యవనికయగుచున్నది. మొదట ఎనిమిది మాత్రలు గాని లేక (12) పన్నెండు మాత్రలుకాని;

**అంతరీద్వితయే చైవ ప్రత్యేకం చాష్టమాత్రకమ్ ।**
**చతుర్మాత్రం చాష్టమాత్రం తకాకే వాదనం భవేత్ ॥ 162 ॥**

**ప్రతిపదార్థము** : అంతరీద్వితయే చైవ = అంతరీద్వయమందును; ప్రత్యేకం = ప్రత్యేకముగా; అష్టమాత్రకం = ఎనిమిది మాత్రలు; తకాకే = తకాకమందు; చతుర్మాత్రం అష్టమాత్రంచ = పన్నెండు మాత్రలును; వాదనం భవేత్ = వాదనమగును.

**తాత్పర్యము** : అంతరీద్వయమందును ప్రత్యేకముగా ఎనివిదిమాత్రలు తకాకమందు పన్నెండుమాత్రలును వాదనమగును.

**మృదంగదేశీపటహాకరటామద్దలేషు చ ।**
**వేవర్తమానుగం వాద్యపరివృత్తిర్మృదంగజా ॥ 163 ॥**

**ప్రతిపదార్థము :** మృదంగదేవీపటహాకరటామద్దలేషు = మృదంగ, దేశీపటహాకరట మద్దెలలందు; మృదంగజా = మృదంగజనితమైన; వేవర్తమానుగం వాద్యపరివృత్తి: = వేవర్తమానముననుసరించిన వాద్యపరివృత్తి;

**తాత్పర్యము :** మృదంగ, దేశీపటహాకరట మద్దెలలందు మృదంగజనితమైన వేవర్తమానముననుసరించిన వాద్యపరివృత్తి;

**ద్వివారం పరివృత్య స్యాదంతరీద్వయశబ్దయోః ।**
**తకారాదౌ చతుర్మాత్రే ద్వివారం పరివర్తనమ్ ॥ 164 ॥**

**ఏకవారం త్వష్టమాత్రం వాదయిత్వా సదేంకృతిః ।**
**శబ్దపుష్పాంజలాయుక్తో హుడుక్కా కరటాన్తరీ ॥ 165 ॥**

**ప్రతిపదార్థము :** ద్వివారం పరివృత్య = రెండుమారులు పరివృత్తినిచెంది; అంతరీద్వయశబ్దయోః = అంతరీద్వయశబ్దములందు; తకారాదౌ చతుర్మాత్రే = చతుర్మాత్రాకములైన తకారాదులందు; ద్వివారం = రెండుసార్లు; పరివర్తనం = పరివర్తనము; ఏకవారం = ఒకసారి; అష్టమాత్రం వాదయిత్వా = అష్టమాత్రాకముగా వాదించి; సదేంకృతిః= దేంకృతి సహితమైన; శబ్దః = శబ్దము; హుడుక్కాకరటాంతరీ= హుడుక్కాకరటాంతరీగా; పుష్పాంజలౌ = పుష్పాంజలియందు; యుక్తా = కలిసి యున్నది.

**తాత్పర్యము :** రెండుమారులు పరివృత్తిని చెంది అంతరీద్వయ శబ్దములందు చతుర్మాత్రాకములైన తకారాదులందు రెండుసార్లు పరివర్తనము, ఒకసారి అష్ట మాత్రాకముగా వాదించి దేంకృతి సహితమైన శబ్దము హుడుక్కాకరటాంతరీగా పుష్పాంజలియందు కలిసియున్నది.

**ఇతరే చాంతరీ శబ్దా నైవ తాః సమ్మతా మమ ।**
**అనేకవాద్యమేలనం పైసారాదిషు దృశ్యతే ॥ 166 ॥**

**ప్రతిపదార్థము :** ఇతరే అంతరీశబ్దాః = మిగిలిన అంతరీశబ్దములు; మమ నైవ సమ్మతాః = నాకు అంగీకృతములుకావు; అనేకవాద్యమిలనం = అనేకములైన

వాద్యములకలయిక; పైసారదిషు దృశ్యతే = పైసారాదులందు కనబడుచున్నది.

**తాత్పర్యము** : మిగిలిన అంతరీశబ్దములు నాకు అంగీకృతములుకావు. అనేకములైన వాద్యముల కలయిక పైసారాదులందు కనబడుచున్నది.

**పుష్పాంజలిరయం శబ్దః కించిద్ భేదవశాదిహ ।**
**॥ పుష్పాంజలిః ॥**
**సైవ ప్రోక్తా కించవణీ (?) వాద్యవిద్యావిశారదైః ॥ 167 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యవిద్యావిశారదైః = వాద్యవిద్యయందు నిష్ణాతులైన వారిచే; అయం పుష్పాంజలిశబ్దః = ఈ పుష్పాంజలి శబ్దము; ఇహ = ఇక్కడ; కించిత్ భేదవసాత్ = కొంచెము భేదమువలన; సైవ = అదియే; కించవణీ ప్రోక్తా = కించవణిగా చెప్పబడినది.

**తాత్పర్యము** : వాద్యవిద్యయందు నిష్ణాతులైన వారిచే ఈ పుష్పాంజలిశబ్దము ఇక్కడ కొంచెము భేదమువలన అదియే కించవణిగా చెప్పబడినది.

**పునః పునర్యతిర్వాద్యే ఖండదశో యత్ర వాద్యతే ।**
**సఖండయతిరాఖ్యాతా పదావాద్యాంతరాశ్రయాత్ ॥ 168 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; పునఃపునః = మాటిమాటికి; వాద్యే =వాద్యమందు; యతిః = యతి; ఖండశః = ఖండములుగా; వాద్యతే = వాదింపబడినయెడల; పదవాద్యాంతరాశ్రయయాత్ = పదవాద్యాంతరశ్రయమువలన; సఖండయతిః ఆఖ్యాతా = సఖండయతిగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఎక్కడ మాటిమాటికి వాద్యమందు యతి ఖండములుగా వాదింపబడిన యెడల పదవాద్యాంతరాశ్రయమువలన సఖండయతిగా చెప్పబడినది.

**హుడుక్కా చ మృదంగశ్చ కరటా కాహలాస్తథా ।**
**కాంస్యతాలశ్చ (పంచై) తే గుణలోప్రతినిర్మితాః ॥ 169 ॥**

**ప్రతిపదార్థము** : హుడుక్కా, మృదంగ, కరటా, కాహలా, కాంశ్యతాలాశ్చ, ఏతే పంచ= ఈఐదును; గుణలోప్రతినిర్మితాః = గుణగ్రహణార్థము నిర్మింపబడినవి.

**తాత్పర్యము** : హుడుక్క, మృదంగ, కరట, కాహలా, కాంశ్యతాలములు ఈఐదును గుణగ్రహణార్థము నిర్మింపబడినవి.

**అనిబద్ధం నిబద్ధం చ వాద్యజం ద్వివిధం మతమ్ ।**
**నియమాదప్యనియమాదనిబ్ధం ద్విధా భవేత్ ॥ 170 ॥**

**ప్రతిపదార్థము** : అనిబద్ధం = అనిబద్ధమని; నిబద్ధంచ = నిబద్ధమనియు; వాద్యజం= వాద్యజము; ద్వివిధం మతం = రెండువిధములు; నియమాత్ = నియమమువలనను; అనిబద్ధం ద్విధా భవేత్ = అనిబద్ధము రెండువిధములగును.

**తాత్పర్యము** : అనిబద్ధమని నిబద్ధమనియు వాద్యజము రెండువిధములు. నియమము వలనను అనిబద్ధము రెండువిధములగును.

**జోడణీ చ ప్రబంధశ్చ నిబద్ధమపి తద్ద్విధా ।**
**అనుజాయియుతః శబ్దో వాద్యతే యః పునః పునః ॥ 171 ॥**

**ప్రతిపదార్థము** : జోడణీప్రబంధః = జోడణీ ప్రబంధము; నిబద్ధమపి = నిబద్ధమును; తత్ =అది; ద్విధా = రెండువిధములు; యః అనుజాయియుతః శబ్దః = ఏ అనుజాయి శబ్దము; పునః పునః = మాటిమాటికి;

**తాత్పర్యము** : జోడణీ ప్రబంధము నిబద్ధమును అది రెండువిధములు. ఏ అనుజాయి శబ్దము మాటిమాటికి;

**యేన కేనాపి తాలేన సోఽయం నియమశబ్దకః ।**
**శ్రుతౌ ఘనధ్వనేర్వాద్యశబ్దన్యాసస్తు యో భవేత్ ॥ 172 ॥**

**తజ్జైః సరవణేత్యుక్తా ప్రయోగా వలయాన్వితా ।**
**శబ్దానందనకశ్రుత్యా రవణా మ(ర్త?ట్ట) సంభవా ॥ 173 ॥**

**ప్రతిపదార్థము** : యేన కేనాపి తాలేన = ఏతాళముచేతనైనను; వాద్యతే = వాదింపబడునో; సోఽయం = ఆ ఈ ప్రభేదము; నియమశబ్దకః = నియమశబ్దము; శ్రుతౌ = శ్రుతియందు; ఘనధ్వనేః = ఘనధ్వనియొక్క; వాద్యశబ్దన్యాసః = వాద్యశబ్దన్యాసము; యః భవేత్ = ఏదియగునో; సః = అది; వలయాన్వితా ప్రయోగా= వలయయుతమైన; రవణా ఇతి ఉక్తా = రవణయని చెప్పబడినది; శబ్దానందనక శ్రుత్యా = శబ్దానందక శ్రుతిచే; రవణామట్టసంభవా = రవణమట్టజనితము.

**తాత్పర్యము** : ఏతాళముచేతనైనను వాదింపబడునో, ఆ ఈ ప్రభేదము నియమశబ్దము శ్రుతియందు ఘనధ్వనియొక్క వాద్యశబ్దన్యాసము ఏదియగునో అది వలయయుతమైన

రవణయని చెప్పబడినది. శబ్దానందక శ్రుతిచే రవణమట్టజనితము.

**మ(ఠ్ఠ?ట్ట) తాలే ప్రయోక్తవ్యా గీతేన త్రిలయైస్తథా ।**
**ముకుందానందనశ్రుత్యారవణా గారుగీభవా ॥ 174 ॥**

**ప్రతిపదార్థము :** గారుగీభవా = గారుగిజనితమైన; రవణా = రవణి; ముకుందానందన శ్రుత్యా = ముకుందానందనశ్రుతితో; త్రిలయైః = మూడులయలు (చేతను)గల; గీతేన = గీతముచే; మట్టతాలే ప్రయోక్తవ్యా = మట్టతాలమందు ప్రయోగింపదగినది.

**తాత్పర్యము :** గారుగి జనితమైన రవణి ముకుందానందన శ్రుతితో మూడులయలు (చేతను) కల గీతముచే మట్టతాలమందు ప్రయోగింపదగినది.

**గారుకా విషమేణైవ సంయోజ్యా త్రిలయైరపి ।**
**ఈశ్వరానందనశ్రుత్యా ఝంపాతాలసముద్భవా ॥ 175 ॥**

**ప్రతిపదార్థము :** ఝంపాతాలసముద్భవా = ఝంపాతాళమునుండి పుట్టిన; గారుగి= గారుగి; ఈశ్వరానందనశ్రుత్యా = ఈశ్వరానందనశ్రుతిచే; త్రిలయః అపి = మూడులయలచేతను, విషమేణ ఏవ సంయోజ్యా = విషమముగనే సంబంధింప జేయబడునది.

**తాత్పర్యము :** ఝంపాతాళమునుండి పుట్టిన గారుగి, ఈశ్వరానందనశ్రుతిచే మూడులయలచేతను విషయముగనే సంబంధింపజేయబడునది.

**రవణాస్మిన్ భవేత్ తాలత్రితయైః సా సమగ్రహా ।**
**భాస్కరానందనశ్రుత్యా క్రీడాతా(లే?ల)సముద్భవా ॥ 176 ॥**

**ప్రతిపదార్థము :** క్రీడతలసముద్భవా = క్రీడతాల జనితమైన; రవణా = రవణ; భాస్కరానందన శ్రుత్యా = భాస్కరానందన శ్రుతితో; తాలత్రితయైః = మూడు తాళములచే; సమగ్రహా = సమగ్రహము; భవేత్ = అగును.

**తాత్పర్యము :** క్రీడతాల జనితమైన రవణ భాస్కరా నందన శ్రుతితో మూడు తాళములచే సమగ్రహ యగును.

**రవణాస్మిన్ ప్రయోక్తవ్యా గీతేనైవ త్రిభిర్లయైః ।**
శశాంక నందన శ్రుత్యా ఏకతాల సముద్భవా ॥ 177

**ప్రతిపదార్థము** : ఏకతాలసముద్భవా = ఏకతాళజనితమైన; రవణా = రవణ; శశాంక నందన శ్రుత్యా = శశాంక నందన శ్రుతితో; త్రిభిః = మూడు; లయైః = లయలచే; గీతేనైవ = గీతముచేతనే; అస్మిన్ = ఇందు; ప్రయోక్తవ్యా = ప్రయోగింపదగినది.

**తాత్పర్యము** : ఏకతాళజనితమైన రవణ శశాంకనందన శ్రుతితో మూడు లయలచే గీతముచేతనే ఇందు ప్రయోగింపదగినది.

**రవణా చైకతాలే తు ప్రయోక్తవ్యా త్రిభిర్లయైః ।**
**ఆహత్యాలోకనే యోజ్యా రవణా సానుసారిభిః ॥ 178 ॥**

**ప్రతిపదార్థము** : త్రిభిర్లయైః = మూడులయలచేతను; రవణా ఏకతాలే ప్రయోక్తవ్యా= రవణ ఏకతాలమందు ప్రయోగింపదగినది; సానుసారిభిః ఆహత్య = సానుసారులతో కలిసి; రవణా = రవణ; ఆలోకనే యోజ్యా = ఆలోకనమందు సంబంధింపజేయదగినది.

**తాత్పర్యము** : మూడులయలచేతను రవణ ఏకతాలమందు ప్రయోగింపదగినది. సానుసారులతో కలసి రవణ ఆలోకనమందు సంబంధింపజేయదగినది.

**వివిధైర్వ్యాప్తిశబ్దైశ్చ వాద్యవిద్యావిశారదైః ।**
**నియ(మ?మా) ద్రవణాస్త్యక్త్వా సతాలమనుయాయిభి ॥ 179 ॥**

**ప్రతిపదార్థము** : వివిధైః వ్యాప్తిశబ్దైః = అనేకములైన వ్యాప్తిశబ్దములచే; నియమాత్ రవణాత్ = నియమ రవణమునుండి; అనుయాయిభిః = అనుయాయులైన; వాద్యవిద్యావిశారదైః = వాద్యపండితులచే; సతాలం త్యక్త్వా = తాలసహితముగా విడిచి;

**తాత్పర్యము** : అనేకములైన వ్యాప్తిశబ్దములచే నియమరవణమునుండి అనుయాయులైన వాద్యపండితులచే తాలసహితముగా విడిచి;

**వర్తతే చేదనియమాన్నిబంధం తత్ ప్రకీర్తితమ్ ।**
**క్రమేణ వ్యుత్క్రమేణార్థ తదర్థా దర్థభేదతః ॥ 180 ॥**

**ప్రతిపదార్థము** : వర్తతే చేత్ = ఉన్నయెడల; అనియమాత్ = నియమములేక పోవుట వలన; తత్ నిబంధం ప్రకీర్తితం = అది నిబంధమని చెప్పబడినది; క్రమేణ = క్రమముచేతను; వ్యుత్క్రమేణ = వ్యతిక్రమముచేతను; అర్థాత్ = అర్థమువలన; అర్థభేదతః = అర్థభేదమువలన;

**తాత్పర్యము** : ఉన్నయెడల నియమములేక పోవుటవలన అది నిబంధమని చెప్పబడినది. క్రమముచేతను వ్యతిక్రమముచేతను అర్థములన అర్థభేదమువలన;

**చతురశ్రాదితాలేన వాద్యతే జోవణీ స్ఫుటమ్ ।**
**ఉచుపలాఖ్యతక్కణ్యాం విద్యతే జోవణీక్రియా ॥ 181 ॥**

**మాత్రాణామసమర్థేన నైవ సా జోడణీ మతా ।**
**ఉద్గ్రాహో ద్యన్వితం వాద్యం ప్రబంధాఖ్యం ప్రబంధవత్ ॥ 182 ॥**

**ప్రతిపదార్థము** : చతురశ్రాదితాలేన = చతురస్రాదితాలముచే; స్ఫుటం = స్పష్టముగా; జోవణీ వాద్యతే = జోవణివాదింపబడుచున్నది; ఉచుపలాఖ్యతక్కణ్యాం = ఉచుపలతక్కణియందు; జోవణీ క్రియా విద్యతే = జోవణిక్రియ కలదు; మాత్రాణాం అసమర్ధేన = మాత్రల అసమర్థతచే; సా = అది; జోడణీ నైవ మతా = జోడణిగా అసమ్మతము; ఉద్గ్రాహోద్యన్వితం = ఉద్గ్రాహయుతమైనట్టి; వాద్యం =వాద్యము; ప్రబంధవత్ = ప్రబంధమువలె; ప్రబంధాఖ్యం = ప్రబంధనామముకలది; తాలవాద్యం = తాళవాద్యము; చంద్రకళాపటహాది సమాశ్రయం = చంద్రకళాపటహాదుల నాశ్రయించి యుండునది;

**తాత్పర్యము** : చతురస్రాదితాలముచే స్పష్టముగా జోవణి వాదింపబడుచున్నది. ఉచుపలతక్కణియందు జోవణిక్రియ కలదు. మాత్రల అసమర్థతచే అది జోడణిగా అసమ్మతము. ఉద్గ్రాహయుతమైనట్టి వాద్యము ప్రబంధమువలె ప్రబంధనామముగలది. తాళవాద్యము చంద్రకళాపటహాదులనాశ్రయించియుండునది.

ఇతి సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే

సంగీతసమయసారే పంచమమధికరణమ్ ॥

## ॥ అథషష్ఠం అధికరణమ్ ॥

**నృత్తముక్తం పురానేకశాస్త్రైర్యద్ బహువిస్తరైః ।**
**సంక్షిప్య తాన్యతివ్యక్తం నృత్తసారం నిరూప్యతే ॥ 1 ॥**

**ప్రతిపదార్థము** : పురా = పూర్వం; బహువిస్తరైః = మిక్కిలి విస్తరములైన; శాస్త్రైః = శాస్త్రములచే; యత్ నృత్తం ఉక్తం = ఏ నృత్తము చెప్పబడినదో; తత్ నృత్తసారం = ఆ నృత్తఫలితాంశమును; తాని = ఆ శాస్త్రములను; సంక్షిప్య = సంగ్రహించి; అతివ్యక్తం = మిక్కిలి స్పష్టముగా; నిరూప్యతే = నిరూపించబడుచున్నది.

**తాత్పర్యము** : పూర్వం మిక్కిలి విస్తరములైన శాస్త్రములచే ఏ నృత్తముచెప్పబడినదో ఆనృత్తఫలితాంశమును ఆ శాస్త్రములను సంగ్రహించి మిక్కిలి స్పష్టముగా నిరూపించ బడుచున్నది.

**నృత్తం స్యాద్ గాత్రవిక్షేపోఽవస్థానుకృతిలక్షణః ।**
**తాలభావలయాయత్తో వాగంగాహార్యసత్త్వజః ॥ 2 ॥**

**ప్రతిపదార్థము** : తాలభావలయాయత్తః = తాళ, భావ, లయలతో కూడిన; వాగంగాహార్యసత్త్వజః = వాక్కు, అంగ ఆహార్యసత్త్వములనుండి పుట్టినట్టి; అవస్థానుకృతిలక్షణః = అవస్థను అనుకరించు లక్షణముగల; గాత్రవిక్షేపః = శరీరవిన్యాసము; నృత్తం స్యాత్ = నృత్తమగును.

**తాత్పర్యము** : తాళ, భావ, లయలతో కూడిన వాక్కు, అంగ ఆహార్య సత్త్వములనుండి పుట్టినట్టి అవస్థను అనుకరించు లక్షణముగల శరీరవిన్యాసము నృత్తమగును.

**నాట్యస్యాభినయాన్స్తత్ర వాచికాహార్యసాత్త్వికాన్ ।**
**త్యక్త్వా నృత్తాదియోగ్యం తం వక్ష్యే త్రివిధమాంగికమ్ ॥ 3 ॥**

**ప్రతిపదార్థము** : తత్ర = అందు; నాట్యస్య అభినయమ్ = నాట్యాభినయములైన; వాచికాహార్యసాత్త్వికాన్ = వాచిక ఆహార్యసాత్త్వికములను; త్యక్త్వా = విడిచి; నృత్తాది యోగ్యం = నృత్తాదులకు తగినట్టి; తంత్రివిధం అంగికం అభినయం వక్ష్యే = ఆ ముఃవిధములైన అభినయములను చెప్పుచున్నాను.

**తాత్పర్యము** : అందు నాట్యాభినయములైన వాచిక ఆహార్యసాత్త్వికములను విడిచి

నృత్తాదులకు తగినట్టి ఆ ముప్విధములైన అభినయములను చెప్పుచున్నాను.

**ణీ ఞ్ధాతురభిపూర్వో యత్ స్వేష్టార్థప్రతిపాదకః ।**
**తత్ప్రయోగానభీష్టార్థాన్ నయతీత్యభినయః స్మృతః ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : యత్ = ఏ కారణమువలన; అభిపూర్వః ణీఞ్ ధాతుః = అభిపూర్వకణీఞ్ధాతువు; స్వేష్టార్థప్రతిపాదికః = ఇష్టార్థమును ప్రతిపాదించునో; తత్ = అందువలన; ప్రయోగాన్ = ప్రయోగములను; అభీష్టార్థాన్ నయతి ఇతి = తానాశించు ప్రయోజనములను ప్రాప్తింపజేయునదిగాన; అభినయః స్మృతః = అభినయమని చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏకారణమువలన అభిపూర్వకణీఞ్ధాతువు ఇష్టార్థమును ప్రతిపాదించునో అందువలన ప్రయోగములను తానాశించు ప్రయోజనములను ప్రాప్తింపజేయునదిగాన అభినయమని చెప్పబడినది.

**నృత్తం శాఖాంకురం చేతి త్రిధాసౌ కరాదిభిః ।**
**నృత్తం స్యాదాంగికం కర్మ శాఖాపాంగజనమంకురమ్ ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : నృత్తం శాఖ, అంకురం చ ఇతి అసౌ త్రిధా = నృత్తము, శాఖ, అంకురము అని ఇది మూడువిధములు; కరాదిభిః = కరాదులచే; నృత్తం = నృత్తమును; శాఖా = శాఖ; ఆంగికం కర్మ = శారీరకమును; అపాంగజం = నేత్రాంతములనుండి పుట్టినది (ఉపాంగజనితము); అంకురం = అంకురము; స్యాత్ = అగును.

**తాత్పర్యము** : నృత్తము, శాఖ, అంకురము అని ఇదిమూడువిధములు. కరాదులచే నృత్తమును, శాఖ శారీరకమును, నేత్రాంతములనుండి పుట్టినది (ఉపాంగజనితము) అంకురము అగును.

**శిరో వక్షః కరః పార్శ్వః కటిశ్చరణ ఇత్యపి ।**
**అంగాన్యేతాని నృత్తజ్ఞైః షడేవ కథితాని హి ॥ 6 ॥**

**ప్రతిపదార్థము** : శిరః = శిరస్సు; వక్షః = ఉరస్సు; కరః = హస్తము; పార్శ్వః = పార్శ్వము; కటిః = నితంబము (నడుము); చరణః =పాదము; ఇతి = అని; ఏతాని అంగాని = ఈ అంగములు; షట్ ఏవ = ఆరు (6); కథితాని = చెప్పబడినవి.

**తాత్పర్యము** : శిరస్సు, ఉరస్సు, హస్తము, పార్శ్వము, నితంబము (నడుము), పాదము అని అంగములు ఆరు (6) చెప్పబడినవి.

**తత్ర త్రయోదశవిధం శిరో వక్షస్తు పంచధా ।**
**హస్తభేదాశ్చతుష్షష్టిర్హస్తచారా త్రిధా మతా ॥ 7 ॥**

**ప్రతిపదార్థము :** తత్ర = అందు; శిరః = శిరస్సు; త్రయోదశవిధం = పదమూడు విధములు; వక్షం = ఉరస్సు; పంచధా = ఐదువిధములు; హస్తభేదాః = హస్తభేదములు; చతుఃషష్టిః = అరువది నాల్గు; హస్తచారాః = హస్తప్రచారములు; త్రిధా = మూడువిధములు.

**తాత్పర్యము :** అందు శిరస్సు పదమూడు విధములు, ఉరస్సు ఐదువిధములు, హస్తభేదములు అరువది నాలుగు, హస్తప్రచారములు మూడువిధములు.

**చతుర్ధాహస్తకరణం హస్తకర్మాణి వింశతిః ।**
**పా(ర్శ్వే?ర్శ్వం) తు పంచధా తద్వత్ కటిః పాదస్తు షడ్విధః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము :** హస్తకరణం = హస్తకరణము; చతుర్ధా = నాల్గువిధములు; హస్తకర్మాణి = హస్తకర్మలు; వింశతిః = ఇరువది; పార్శ్వం = పార్శ్వము; పంచధా = ఐదువిధములు; తద్వత్ = అట్లే; కటిః = కటిప్రదేశము (నితంబము) (నడుము); షడ్విధః = ఆరువిధములు.

**తాత్పర్యము :** హస్తకరణము నాల్గువిధములు, హస్తకర్మలు ఇరువది, పార్శ్వము ఐదువిధములు అట్లే కటిప్రదేశము (నితంబము) (నడుము) ఆరువిధములు.

**ఉపాంగాని భ్రువౌ నేత్రే నాసాగండస్థలా(ధరాః) ।**
**చిబుకం చేతి షట్ ప్రాహుర్నృత్తవిద్యావిశారదాః ॥ 9 ॥**

**ప్రతిపదార్థము :** భ్రువౌ = కనుబొమలు; నేత్రే = నేత్రములు; నాసా = ముక్కు; గండస్థలాధరా = కపోలము(లు) అధరములు; చిబుకంచ = చిబుకమును; షట్ ఉపాంగాని ప్రాహుః = ఆరు ఉపాంగములుగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము :** కనుబొమలు, నేత్రములు, ముక్కు, గండస్థల కపోలము (లు) అధరములు, చిబుకమును ఆరు ఉపాంగములుగా చెప్పుచున్నారు.

భ్రూకర్మ సప్తధా తత్ర షట్త్రింశద్ దృష్టయః స్మృతాః ।
తారా నవవిధా తద్వత్ పుటకర్మ సమీరితమ్ ॥ 10 ॥

**ప్రతిపదార్థము :** భ్రూకర్మ = కనుబొమల క్రియ; సప్తదా = ఏడువిధములు; దృష్టయః

= దృష్టులు; షట్త్రింశత్ = (36) ముప్పదిఆరు భేదములుగా; స్మృతాః = చెప్పబడినవి; తారా నవవిధాః = తారకలు తొమ్మిదివిధములు; తద్వత్ = అట్లే; పుటకర్మ = కనురెప్పలు; క్రియ; నవవిధాః = తొమ్మిదివిధములు; సమీరితమ్ = చెప్పబడినవి.

**తాత్పర్యము** : కనుబొమల క్రియ ఏడువిధములు, దృష్టులు (36) ముప్పదిఆరు భేదములుగా చెప్పబడినవి. తారకలు తొమ్మిదివిధములు. అట్లే కనురెప్పలక్రియ తొమ్మిదివిధములు చెప్పబడినవి.

**భవంతి దర్శనాన్యష్టౌ నాసాగండస్థలాధరాః ।**
**ప్రత్యేకం షడ్విధా జ్ఞేయాశ్చి(న్ధు?బు)కం సప్తధా మతమ్ ॥ 11 ॥**

**ప్రతిపదార్థము** : దర్శనాని = దర్శనములు; అష్టౌ = ఎనిమిది విధములు; నాసాగండస్థలాధరా = నాసిక గండస్థలములు, అధరములు; ప్రత్యేకం = ఒక్కొక్కటిగా; షడ్విధా = ఆరేసి విధములు; చిబుకం సప్తధామతమ్ = చిబుకము ఏడు విధములుగా సమ్మతము.

**తాత్పర్యము** : దర్శనములు ఎనిమిదివిధములు. నాసిక, గండస్థలములు, అధరములు ఒక్కొక్కటిగా ఆరేసి విధములు. చిబుకము ఏడు విధములుగా సమ్మతము.

**ప్రత్యంగాని పునర్గ్రీవా బాహూపృష్ఠం తథోదరమ్ ।**
**ఊరూ జంఘాయుగం చేతి షడుక్తాని మనీషిభిః ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : గ్రీవా = మెడ; బాహూ = బాహువులు; పృష్ఠం = పృష్ఠము; ఉదరం = ఉదరము; ఊరూ = తొడలు; జంఘా యుగం = జంఘులు (పిక్కలు); ఏతాని షట్= ఈఆరును; ప్రత్యంగాని ఉక్తాని = ప్రత్యంగములుగా చెప్పబడినవి.

**తాత్పర్యము** : మెడ, బాహువులు, పృష్ఠము, ఉదరము, తొడలు, జంఘులు (పిక్కలు) ఈఆరును ప్రత్యంగములుగా చెప్పబడినవి.

**తతో గ్రీవా నవవిధా బాహవో దశ పంచ చ ।**
**పృష్ఠం త్రిధోదరం పంచ ఊరూ జంఘే చ పంచధా ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : గ్రీవా = మెడ; నవవిధా = తొమ్మిది విధములు; బాహవః = బాహువులు; దశ పంచచ = పదిహేనువిధములు; పృష్ఠం త్రిధా = పృష్ఠము మూడువిధములు; ఊరూ జంఘేచ = ఊరువులు, జంఘములును; పంచధా = ఐదేసి విధములు.

**తాత్పర్యము** : మెడ తొమ్మిదివిధములు. బాహువులు పదిహేను విధములు. పృష్ఠము మూడు విధములు. ఊరువులు, జంఘములును ఐదేసి విధములు.

**స్థానాని నవధా చార్యో ద్వాత్రింశన్మండలాని తు ।**
**వింశతీ రేచకాశ్చైవ చత్వారః కరణాని తు ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : నవధా స్థానాని = స్థానములు తొమ్మిది విధములు; మండలాని ద్వాత్రింశత్ = మండలములు ముప్పదిరెండు విధములు; రేచకాః వింశతిః = రేచకములు ఇరువది; చత్వారః =నాలుగు; రేచకాశ్చైవ = రేచకములు ఇరువదినాల్గు.

**తాత్పర్యము** : స్థానములు తొమ్మిదివిధములు, మండలములు ముప్పదిరెండు విధములు, రేచకములు ఇరువది నాలుగు.

**శతమష్టోత్తరం త్వంగహారా ద్వాత్రింశదీరితాః ।**
**నా(న్యే?ట్యే) నృత్యే చ నృత్తే చ నియుద్ధే చ యథోచితమ్ ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : కరణాని = కరణములు; శతం అష్టోత్తరం = నూట ఎనిమిది; అంగహారాః = అగహారములు; ద్వాత్రింశత్ = ముప్పదిరెండును; నాట్యే = నాట్యమందు; నృత్యే = నృత్యమందు; నియుర్ధేచ = నియుద్ధమందును; యథోచితం = యథార్థముగా; ఈరితాః = చెప్పబడినవి.

**తాత్పర్యము** : కరణములు నూటయెనిమిది. అంగహారములు ముప్పదిరెండును, నాట్యమందు నృత్యమందు నియుద్ధమందును యథార్థముగా చెప్పబడినవి.

**ఇత్యాంగాభినయాః సర్వే ప్రయోజ్యాస్తు విచక్షణైః ।**
**అంగం విక్షేపమాత్రం చ యత్ తాలలయసంశ్రయమ్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : ఇతి = ఈప్రకారమైన; సర్వే అంగాభినయాః = అంగాభినయములన్నియు; ప్రయోజ్యాః = ప్రయోగింపదగినవి; యత్ తాలలయసంశ్రయం = తాల లయములనాశ్రయించిన; అంగవిక్షేపమాత్రం = అంగవిక్షేపమాత్రమైన; నృత్యం = నృత్యమేదికలదో;

**తాత్పర్యము** : ఈ ప్రకారమైన అంగాభినయములన్నియు ప్రయోగింపదగినవి. తాల లయములనాశ్రయించిన అంగవిక్షేపమాత్రమైన నృత్యమేదికలదో;

**నృత్యం దేశాశ్రయత్వేన బహుధా తత్ ప్రకీర్తితమ్ ।**
**శిరాంసి నవ వక్షాంసి చత్వారి కథితాని చ ॥ 17 ॥**

**ప్రతిపదార్థము :** తత్ = అది; దేశాశ్రయత్వేన = దేశాశ్రయము(గా)చేత; బహుదాపరికీర్తితం = అనేక విధములుగా చెప్పబడినది; శిరాంసి = శిరస్సులు; నవ= తొమ్మిది; వక్షాంసి = ఉరములు; చత్వారి కథితాని = నాలుగును చెప్పబడినవి.

**తాత్పర్యము :** అది దేశాశ్రయము(గా) చేత అనేక విధములుగా చెప్పబడినది. శిరస్సులుతొమ్మిది, ఉరములు నాలుగును చెప్పబడినవి.

**చతుష్షష్టిః కరాః ప్రోక్తాః పా(ద్యం?ర్శ్యం) తచ్చ చతుర్విధమ్ ।**
**కటిః పంచవిధా తద్వత్ పాదః పంచవిధః స్మృతః ॥ 18 ॥**

**ప్రతిపదార్థము :** కరాః = హస్తములు; చతుష్షష్టిః ప్రోక్తాః = అరువది నాల్గు చెప్పబడినవి; పార్శ్వం చతుర్విధం = పార్శ్వములు నాల్గువిధములు; కటిః పంచవిధా = కటి ఐదువిధములు; తద్వత్ = అట్లే; పాదః = పాదము; పంచవిధః = ఐదువిధములు.

**తాత్పర్యము :** హస్తములు అరువది నాల్గు చెప్పబడినవి. పార్శ్వమునాల్గువిధములు. కటి ఐదు విధములు. అట్లే పాదము ఐదువిధములు.

**ఆకంపితం కంపితం చ ధుతమాధుతమేవచ ।**
**అవధూతం చాంచితం చ నిహంచితమతాపరమ్ ॥ 19 ॥**

**ప్రతిపదార్థము :** ఆకంపితం = ఆ కంపితము; కంపితం చ = కంపితమును; ధుతం= ధుతమును; ఆధూతం = ఆధూతము; అవధూతం = అవధూతమును; అంచితం= అంచితము; నిహంచితం = నిహంచితము; అథ = తరువాత; అపరం = మరియొకటి.

**తాత్పర్యము :** ఆకంపితము, కంపితమును, దుతమును, ఆధూతము, అవధూతమును అంచితము, నిహంచితము తరువాత మరియొకటి.

**ఉత్క్షిప్తాధోగతం చేతి శిరాంస్యాహుర్మనీషిణః ।**
**సకృదూర్ధ్వాధోనయనాచ్ఛనైరాకంపితం ఋజు ॥ 20 ॥**

**ప్రతిపదార్థము :** ఉత్క్షిప్తా = ఉత్క్షిప్త; అధోగతంచ = అధోగతమును అని; శిరాంసి = శిరోభేదములను; ఆహుః = చెప్పుచున్నారు.

**తాత్పర్యము :** ఉత్క్షిప్త అధోగతమును అని శిరోభేదములను చెప్పుచున్నారు.

పృచ్ఛాసంజ్ఞాస్వభావోక్తినిర్దేశావహనాదిషు ।
ద్రుతం తదేవ బహుశః కృతం స్యాత్ కంపితం శిరః ॥ 21 ॥

**ప్రతిపదార్థము** : పృచ్ఛాసంజ్ఞాస్వభావోక్తినిర్దేశావహనాదిషు = ప్రశ్నసంజ్ఞచేయుట, సహజభాషణము, నిర్దేశము, ఆవాహనములందు; తదేవ = ఆశిరమునే; ద్రుతం = త్వరితముగా; బహుశః = అనేకపర్యాయములు; కృతం స్యాత్ = చేసినయెడల; కంపితం శిరఃస్యాత్ = కంపితమగును.

**తాత్పర్యము** : ప్రశ్నసంజ్ఞచేయుట, సహజభాషణము, నిర్దేశము ఆవాహనములందు ఆ శిరమునే త్వరితముగ అనేక పర్యాయములు చేసిన యెడల కంపతిశిరమగును.

**వితర్కరోషవిజ్ఞానప్రతిజ్ఞాతర్జనాదిషు ।**
**ధుతం శిరః శనైతిర్యక్ శిరసో రేచనం సకృత్ ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : వితర్కరోషవిజ్ఞాన ప్రతిజ్ఞాతర్జనాదిషు= వితర్కము, రోషము, విజ్ఞానము, ప్రతిజ్ఞ, భయపెట్టుట మొదలగు వాటియందు; సకృత్=ఒకసారి; శనైః= మెల్లగ; తిర్యక్=అడ్డముగ; శిరసః రేచనం=తలనాడించుట; ధుతం స్యాత్=ధుతమగును.

**తాత్పర్యము** : వితర్కము, రోషము, ప్రతిజ్ఞ, భయపెట్టుట మొదలగు వాటియందు విజ్ఞానము, ఒకసారి మెల్లగ అడ్డముగ తలనాడించుట ధుతమగును.

**పార్శ్వావలోకనే ఖేదే నిషేధే విస్మయాదిషు ।**
**సకృత్ తిర్యక్ సముత్క్షిప్తమాధూతం మస్తకం మతమ్ ॥ 23 ॥**

**ప్రతిపదార్థము** : సకృత్ = ఒకసారి; పార్శ్వావలోకనే = ప్రక్కకు చూచుటయందు; ఖేదే = దుఃఖమందు; నిషేధే = నిషేధమందు; విస్మయాదిషు = ఆశ్చర్యము మొదలగు వాటియందు; శనైః = మెల్లగా; తిర్యక్ = అడ్డుగా; సముత్క్షిప్తం = ఎత్తబడినయెడల; ఆధూతం మతం = ఆధూతముగా సమ్మతము.

**తాత్పర్యము** : ఒకసారి ప్రక్కకుచూచుటయందు దుఃఖమందు నిషేధమందు, ఆశ్చర్యము మొదలగు వాటియందు మెల్లగా అడ్డుగా శిరస్సు ఎత్తబడిన యెడల ఆధూతముగ సమ్మతము.

**పార్శ్వస్థితోర్ధ్వ సంప్రేక్షణాత్మసంభావనాదిషు ।**
**ఏకదాధోగ (సం?తిం) ప్రాప్తమవధూతం విచింతనే ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : పార్శ్వస్థితమును, ఊర్ధ్వసంప్రేక్షణము, ఆత్మసంభావనము, మొదలగువాని యందు; మస్తకం = శిరస్సు; విచింతనే = ఆలోచించుటయందును; అధః = క్రిందుగను; తిర్యక్ = అడ్డుగను; ఏకదా = ఒకప్పుడు; అధోగతిం ప్రాప్తం =

అధోగమనమును పొందిన క్రిందకు వంచిన; శిరః = శిరస్సును; అవధూతం విదుః= అవదూతముగా తెలియుదురు.

**తాత్పర్యము** : పార్శ్వస్థితము, ఊర్ధ్వసంప్రేక్షణము, ఆత్మసంభావనము మొదలగువాని యందు ఒకప్పుడు అధోగమనము పొందిన శిరస్సును అవధూతముగ తెలియదురు.

**అధస్తిర్యక్‌బిలస్థాదిప్రేక్ష్యాతాదిషు(?) లక్ష్యతే ।**
**అచింతం గ్రీవముత్క్షిప్తం (?) బాహుశీర్షం నిహంచితం ॥ 25 ॥**

**ప్రతిపదార్థము** : విచింతనే = ఆలోచించుటయందు; అధః = క్రిందుగను; తిర్యక్ = అడ్డముగను; బిలస్థాది = బిలమందున్నట్టియు; ప్రేక్ష్యతాదిషు = చూడదగినవి మొదలైన వాటియందు; గ్రీవం = మెడను; ఉత్క్షిప్తం = ఎత్తినయెడల; అంచితం స్యాత్ = అంచితశిరమగును; బాహుశీర్షం = అంసమును (కలిగియున్నట్లుగ); ఉత్క్షిప్తం = ఒకవైపునకెత్తిన; నిహంచితం భవేత్ = నిహంచితమగును.

**తాత్పర్యము** : ఆలోచించుటయందు క్రిందుగను, అడ్డముగను బిలమందున్నట్టియు చూడదగినవి మొదలైన వాటియందు మెడను ఎత్తినయెడల అంచితశిరమగును... అంసమును (కలిగియున్నట్లుగ) ఒకవైపునకెత్తినచో నిహంచితమగును.

**గర్వే స్తంభే చ కాంతానాం నానా శృంగారవృత్తిషు ।**
**సమ్యగున్ముఖముత్క్షిప్తం ఊర్ధ్వసంప్రేక్షణాదిషు ॥ 26 ॥**

**ప్రతిపదార్థము** : గర్వే = గర్వమందును; స్తంభే చ = స్తంభమందును; కాంతానాం = స్త్రీలయొక్క; నానాశృంగారవృత్తిషు = అనేక శృంగార వ్యాపారములయందు; ఊర్ధ్వసంప్రేక్షణాదిషు = ఊర్ధ్వమునకు చూచుట మొదలగువానియందు; సమ్యక్ = బాగుగా; ఉన్ముఖం = ఎదురుగా; ఉత్క్షిప్తం = ఎత్తబడిన శిరమును; ఉత్క్షిప్తంస్యాత్= ఉత్క్షిప్తశిరమగును.

**తాత్పర్యము** : గర్వమందును, స్తంభమందును స్త్రీలయొక్క అనేక శృంగార వ్యాపారములందు ఊర్ధ్వమునకు చూచుట మొదలగువానియందు బాగుగా ఎదురుగా ఎత్తబడిన శిరమును ఉత్క్షిప్తశిరమగును.

అధోగతమధోవక్త్రం లజ్జాధః ప్రేక్షణాదిషు ।

॥ ఇతి శిరాంసి నవ ॥

సమముద్వాహితం చైవ నిర్మగ్నం చ ప్రకంపితమ్ ॥ 27 ॥

**ప్రతిపదార్థము** : లజ్జాధః ప్రేక్షణాదిషు = సిగ్గు, క్రిందికి చూచుట మొదలగువానియందు; అధోవక్త్రం = ముఖమును (శిరస్సు)క్రిందుగా వంచినచో; అధోగతం స్యాత్ = అధోగతశిరమగును; సమం = సమము; ఉద్వహితం = ఉద్వహితము; నిర్మగ్నం = నిర్మగ్నము; ప్రకంపితం = ప్రకంపితము; ఇతి = అని;

**తాత్పర్యము** : సిగ్గు, క్రిందికిచూచుట మొదలగువానియందు ముఖమును (శిరస్సు)క్రిందుగా వంచినచో అధోగతశిరమగును. సమము ఉద్వహితము నిర్మగ్నము ప్రకంపితము అని;

> **వక్షశ్చతుర్విధం ప్రోక్తం నాట్యవిద్యావిశారదైః ।**
> **సమలైరంగవిన్యాసైః (?)సమైః సౌష్ఠవసంయుతైః ॥ 28 ॥**

**ప్రతిపదార్థము** : నాట్యవిద్యావిశారదైః = నాట్యవిద్యనెఱిగిన పండితులచే; వక్షః = ఉరము; చతుర్విధం ప్రోక్తం = నాల్గువిధముగా చెప్పబడినది; సమలైః = సమములైన (యోగ్యమైన); సౌష్ఠవసంయుతైః = సౌష్ఠవములతోను కూడినట్టి; అంగవిన్యాసైః = అంగవిన్యాసములతో;

**తాత్పర్యము** : ఉరము నాల్గువిధములుగా చెప్పబడినది. సమములైన (యోగ్యమైన) సౌష్టవముతోను కూడినట్టి అంగవిన్యాసములతో;

> **స్వభావస్థితం వక్షః సమనామ్నా ప్రకీర్తితమ్ ।**
> **ఉద్వాహితం స్యాదుద్గతం జృంభమాణోచ్ఛ్వసనాదిషు ॥ 29 ॥**

**ప్రతిపదార్థము** : స్వభావస్థితం స్వతః సిద్ద = (ఎట్టి వికృతిని పొందనివిధముగా) స్వతసిద్ధ ముగనున్న; వక్షః = ఉరస్సు; సమనామ్నా ప్రకీర్తితం = సమహృదయమనబడును; జృంభమాణోచ్ఛ్వసనాదిషు = ఆవలింత, ఉచ్ఛ్వాసములందు; ఉద్గతం = ఊర్ధ్వగతమైన యెడల; ఉద్వాహితం స్యాత్ = ఉద్వాహితహృదయప్రభేదమగును.

**తాత్పర్యము** : స్వతః సిద్ధముగనున్న (ఎట్టివికృతిని పొందనివిధముగా) ఉరస్సు సమహృదయమనబడును. ఆవలింత, ఉచ్ఛ్వాసములందు ఊర్ధ్వగతమైనయెడల, ఉద్వాహితహృదయప్రభేదమగును.

> ప్రోన్నతం ప్రోన్నతాంగం చ నిర్భుగ్నం గర్వితాదిషు ।
> నిరంతరోర్ధ్వవిక్షేపైః ప్రకంపం హసితాదిషు ॥ 30 ॥

**ప్రతిపదార్థము** : ప్రోన్నతాంగం = ప్రోన్నతమైన అవయవములు గలదియు; గర్వితాదిషు = గర్వము మొదలగు గుణములందు; ప్రోన్నతం = ఉన్నతమైనదియు; నిర్భుగ్నం స్యాత్ = నిర్భుగ్నహృదయమగును; హసితాదిషు = నవ్వు మొదలగు వాటియందు; నిరంతర ఊర్ధ్వవిక్షేపైః = అధికముగా పైకదలికలచే; ప్రకంపం స్యాత్ = ప్రకంప ప్రభేదమగును.

**తాత్పర్యము** : ప్రోన్నతమైన అవయవములుకలదియు గర్వము మొదలగు గుణము లందు ఉన్నతమైనదియు నిర్భుగ్నహృదయమగును. నవ్వుమొదలగు వాటియందు అధికముగా పైకి కదలికలచే ప్రకంపప్రభేదమగును.

**॥ వక్షాంసి చత్వారి ॥**

**జ్యేష్ఠాంగుష్ఠాభిధానాద్యా తర్జనీ స్యాత్ ప్రదేశినీ ।**
**మధ్యమా మధ్యమా తుర్యానామికాంత్యా కనీయసీ ॥ 31 ॥**

**ప్రతిపదార్థము** : ఆద్యా = మొదటిదైన; జ్యేష్ఠా = పెద్దదియగువ్రేలు; అంగుష్ఠాభిధానా= అంగుష్టమను పేరుకలది; తర్జనీ ప్రదేశినీ స్యాత్ = చూపుడు వ్రేలు ప్రదేశినియగును; మధ్యమా = మధ్యనుండునది; మధ్యమా స్యాత్ = మధ్యమమగును; తుర్యా = నాల్గవది; అనామికా = అనామికయు; అంత్యా = చివరిది; కనీయసి స్యాత్ = కనీయసి యును అగును.

**తాత్పర్యము** : మొదటిదైన పెద్దదియగు వ్రేలు అంగుష్ఠమును పేరుకలది. చూపుడువ్రేలు ప్రదేశియగును. మధ్యనుండినది మధ్యమమగును. నాల్గవది అనామికయు చివరిది కనీయసియును అగును.

**మణిబంధాహ్వయః పాణిమూలం కూర్పరముచ్యతే ।**
**బాహుమధ్యం తయోర్మధ్యం ప్రకోష్ఠోఽసౌ భుజాశిరః ॥ 32 ॥**

**ప్రతిపదార్థము** : పాణిమూలం మణిబంధాహ్వయః = హస్తమూలము మణిబంధము; బాహుమధ్యం కూర్పరం = బాహుమధ్యము కూర్పరము; తయోః మధ్యం = మణిబంధ - కూర్పరములమధ్య భాగము; ప్రకోష్ఠః = ప్రకోష్టము; అసౌ = ఇది; భుజాంశిరః = భుజము, శిరస్సు.

**తాత్పర్యము** : హస్తమూలము మణిబంధము బాహుమధ్యము కూర్పరము. మణిబంధ

కూర్పరముల మధ్యభాగము ప్రకోష్ఠము. ఇది భుజము శిరస్సు.

**అంసకూర్పరయోర్మధ్యం ప్రకాండం పండితా విదుః ।**
**అవతానము (ఛో?ధో) వక్త్రం తలముత్తానమత్తలమ్ ॥ 33 ॥**

**ప్రతిపదార్థము** : అంసకూర్పరయోః మధ్యం = అంస- కూర్పురములమధ్యభాగము; ప్రకాండం విధుః = ప్రకాండముగా తెలియుదురు; అధోవక్త్రం = క్రిందికి ముఖమువంచిన; అవతానం = అవతానమును; ఉత్తానమత్ = ఊర్ధ్వమును కల్గియుండుట; తలం = తలము.

**తాత్పర్యము** : అంస -కూర్పరముల మధ్యభాగము ప్రకాండముగా తెలియుదురు. క్రిందికి- ముఖమువంచిన అవతానమును, ఊర్ధ్వమును కల్గియుండుట తలము.

**అంచితం స్యాత్ ప్రసారితం కుంచితం తూపసంహృతమ్ ।**
**ఆవిద్ధమంతః సంభ్రాంతమపవిద్ధో విపర్యయాత్ ॥ 34 ॥**
**॥ ఇతి పరిభాషా ॥**

**ప్రతిపదార్థము** : ప్రసారితం = ప్రసారితమైన దానిని (వ్యాపించిన); అంచితం = అంచితమనియు; ఉపసంహృతం = ముడవబడినదానిని; కుంచితం = కుంచితమనియు అందురు; అంతః సంభ్రాతం ఆవిద్ధంస్యాత్ = అంతసంభ్రామైనది (లోపలతొట్రుపాటు కలది) ఆవిద్ధము; విపర్యయాత్ = దానికి విపరీతమైన యెడల; అపవిద్ధం = అపవిద్ధమగును.

**తాత్పర్యము** : ప్రసారితమైన దానిని (వ్యాపించిన) అంచితమనియు ముడవబడిన దానిని కుంచితమనియు అందురు.అంతసంభ్రాతమైనది (లోపలతొట్రుపాటుకలది) అవిద్ధము దానికి విపరీతమైన యెడల అపవిద్ధమగును.

**పతాకస్త్రిపతాకశ్చ కర్తరీ చతురస్తథా ।**
**హంసపక్ష్యోఽర్ధచంద్రశ్చ సర్పాస్యో మృగశీర్షకః ॥ 35 ॥**

**ప్రతిపదార్థము** : పతాకః = పతాకహస్తము; త్రిపతాకః = త్రిపతాకము; చతురః = చతురము; హంసపక్షః = హంసపక్షము; అర్ధచంద్రః = అర్ధచంద్రము; సర్పాస్యః = సర్పముఖము;మృగశీర్షకః = మృగశీర్షము గలది;

**తాత్పర్యము** : పతాకహస్తము త్రిపతాకము చతురము హంసపక్షము అర్ధచంద్రము

సర్పముఖము మృగశీర్షము గలది;

**అరాలఃశుకతుండశ్చ సందంశో భ్రమరః కరః ।**
**పద్మకోశస్తూర్ణనాభోఽలపద్మో ముకులః కరః ॥ 36 ॥**

**ప్రతిపదార్థము :** అరాలః = అరాలహస్తము; శుకతుండః = శుకతుండము; సందంశః = సందంశము; తూర్ణనాభః = తూర్ణనాభము; అలపద్మః = అలపద్మము; ముకులః కరః = ముకులహస్తము

**తాత్పర్యము :** అరాలహస్తము, శుకతుండము, సందంశము, తూర్ణనాభము, అలపద్మము, ముకులహస్తము.

**హంసాస్యహస్తః కాంశూలః స్యాన్ముష్టిః శిఖరః కరః ।**
**కపిత్థః కటకాస్యశ్చ సూచ్యాస్యస్తాచూడకః ॥ 37 ॥**

**ప్రతిపదార్థము :** హంసాస్యహస్తః = హంసాస్యహస్తము; కాంశూలః = కాంశూలము; ముష్టిః = ముష్టికరము; శిఖరః కరః = శిఖరహస్తము; కపిత్థః = కపిత్థము; కటకాస్యః= కటకాస్యము; సూచ్యాస్యః = సూచీముఖహస్తము; తామ్రచూడకః = తామ్రచూడము.

**తాత్పర్యము :** హంసాస్యహస్తము, కాంశూలమ, ముష్టికరము; శిఖరహస్తము, కపిత్థము, కటకాస్యము, సూచీముఖహస్తము, తామ్రచూడము.

**చతుర్వింశతిరిత్యేవమసంయుతకరా యుతః ।**
**ప్రత్యేకం నాట్యలోకే చ వర్తతేఽభినయాశ్రయః ॥ 38 ॥**

**ప్రతిపదార్థము :** ఇతి =అని; ఏవం = ఈవిధముగా; అసంయుతకరాః చతుర్వింశతిః = అసంయుతకరములు ఇరువది నాల్గు; ప్రత్యేకం = ప్రత్యేకముగా; నాట్యలోకే = నాట్యలోకమునందు; అభినయాశ్రయః వర్తతే = అభినయాశ్రయత్వమగుచున్నవి.

**తాత్పర్యము :** అని ఈవిధముగా అసంయుతకరములు ఇరువదినాల్గు. ప్రత్యేకముగా నాట్యలోకమునందు అభినయాశ్రయత్వమగుచున్నవి.

**ఆద్యాఖ్యా కుంచితా కించిత్ తర్జన్యాద్యాః ప్రసారితాః ।**
**పతాకః పాతసంక్షోభవారణే వాదనాదిషు ॥ 39 ॥**

**ప్రతిపదార్థము :** ఆద్యాఖ్యా = అంగుష్టము, కించిత్ కుంచితా = కొంచెము

కుంచితమగును; తర్జన్యాద్యాః = తర్జనిమొదలగునవి; ప్రసారితాః = ప్రసారితమగును; పాతనసంక్షోభవారణే = నిపతన సంక్షోభవారణములందు; వాదనాదిషు = వాదనాదులందు; పతాకః = పతాక హస్తమగును.

**తాత్పర్యము** : అంగుష్టము కొంచెము కుంచితమగును. తర్జనిమొదలగునవి ప్రసారితమగును. నిపతన సంక్షోభవారణములందు వాదనాదులందు పతాకహస్త మగును.

**పతాకేఽనామికా వక్రా త్రిపతాకోఽశ్రుమార్జనే ।**
**లలాటరచనాద్రవ్యసంస్పర్శనాచమనాదిషు ॥ 40 ॥**

**ప్రతిపదార్థము** : పతాకే = పతాకహస్తమందు; అనామికా = అనామిక; (ఉంగరపువ్రేలు); వక్రా = వక్రమైనయెడల; త్రిపతాకః = త్రిపతాకహస్తమగును; అశ్రుమార్జనే = కన్నీటిని తుడుచుటయందును; లలాటరచనా ద్రవ్యసంస్పర్శనాచమనాదిషు = లలాటరచన ద్రవ్యసంస్పర్శనము ఆచమనము మొదలగువాటియందు ప్రయోగింపదగినది.

**తాత్పర్యము** : పతాకహస్తమందు అనామిక (ఉంగరపువ్రేలు) వక్రమైనయెడల త్రిపతాక హస్తమగును. కన్నీటిని తుడుచుటయందును లలాటరచన, ద్రవ్యసంస్పర్శనము ఆచమనము మొదలగువాటియందు ప్రయోగింపదగినది.

**యద్యత్ర తర్జనీ మధ్యాపరభాగావలోకినీ ।**
**కర్తర్యా(ద్యో?ఖ్యో) వితర్కే స్యాద్ దంష్ట్రయోర్దర్శనాదిషు ॥ 41 ॥**

**ప్రతిపదార్థము** : అత్ర = ఈ త్రిపతాకహస్తమందలి; తర్జనీ = చూపుడువ్రేలు; మధ్యాపరభాగావలోకినీ యది = మధ్యవ్రేలివెనుకభాగమును చూచిన (త్రిప్పి)నట్లున్నచో; కర్తర్యాఖ్యః స్యాత్ = కర్తరీహస్తమగును; వితర్కే = తర్కమందు; దంష్ట్రయోః దర్శనాదిషు = కోరలను చూపుటమొదలగు వానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ఈ త్రిపతాకహస్తమందలి చూపుడువ్రేలుమధ్యవ్రేలి వెనుకభాగమును చూచిన (తిప్పి)నట్లున్నచో కర్తరీహస్తమగును. తర్కమందు కోరలను చూపుట మొదలగు వానియందు ప్రయోజ్యము.

**పతాకేఽనామికామూలస్థాగ్రోఽంగుష్ఠః కనీయసీ ।**
**పృష్ఠభాగాచ్చతురస్త్యల్పేనోకేతా నయనాదిషు ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : పతాకే = పతాకమందు; అనామికామూలస్థాగ్రాంగుష్ఠః = ఉంగరపు వ్రేలి మొదటినున్నట్లుగ అగ్రాంగుష్ఠము కనీయసీ పృష్ఠభాగా = చిటికెనవ్రేలునకు

వెనుక యగునట్లుఉన్నచో; చతురః = చతురహస్తమగును; అల్పేనోకేతౌ = స్వల్పమందును; నయనాదిషు = నేత్రాదులందును ప్రయోజ్యము.

**తాత్పర్యము** : పతాకమందలి ఉంగరపు వ్రేలిమొదటినున్నట్లుగ చిటికెనవ్రేలునకు వెనుకయగునట్లు ఉన్నచో చతురహస్తమగును. స్వల్పమందును నేత్రాదులందును ప్రయోజ్యము.

> **హంసపక్షః పతాకే చేత్ పృష్ఠగా స్యాత్ కనీయసీ ।**
> **భోజనే స్పర్శనే లేపే దూరసందేశనాదిషు ॥ 43**

**ప్రతిపదార్థము** : పతాకే = పతాకమందు; హంసపక్షః చేత్ = హంసపక్షమున్నయెడల; కనీయసీ = చిటికెనవేలు; పృష్ఠగా స్యాత్ = వెనుకనుండును; భోజనే = భోజనమందు; స్పర్శనే = స్పర్శయందు; లేపే = లేపనమందు; దూరసందేశనాదిషు = దూరసందేశము మొదలగువాని యందు;

**తాత్పర్యము** : పతాకమందు హంసపక్షమున్నయెడల చిటికెనవేలు వెనుకనుండును. భోజనమందు, స్పర్శయందు, లేపనమందు, దూరసందేశము మొదలగు వానియందు;

> **ఆద్యాపసృత్య వక్రాద్యాశ్చాపవత్ కుంచితా యుతాః (?) ।**
> **స ఉక్త(అ?స్త్య)ర్ధచంద్రాఖ్యశ్చంద్రలేఖాదిదర్శనే ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : ఆద్యాపసృత్య = బొటనవ్రేలు ప్రక్కకు (వెనుకకు)త్రిప్పి; వక్రాద్యాః = మిగిలివ్రేళ్లు; చాపవత్ = ధనస్సువలె; కుంచితాయుతాః = కుంచించబడునో; సః= అది; అర్ధచంద్రాస్యః ఉక్తః = అర్ధచంద్రహస్తముగా చెప్పబడినది; చంద్రలేఖాదిదర్శనే= చంద్రలేఖ మొదలగువాటియందు ప్రయోజ్యము

**తాత్పర్యము** : బొటనవ్రేలుప్రక్కకు (వెనుకకు)త్రిప్పి మిగిలినవ్రేళ్లు ధనస్సువలె కుంచించబడునో అది అర్ధచంద్రహస్తముగా చెప్పబడును. చంద్రలేఖమొదలగు వాటి యందు ప్రయోజ్యము.

> **యద్యర్ధేందౌ యుతాః సర్వా అంగుళ్యః సర్పశీర్షకః ।**
> **భుజంగమగతౌ తోయసేచనాలాలనాదిషు ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : అర్థేందౌ = అర్ధేందుహస్తమందు; సర్వా అంగుళ్యః యుతా యది = అన్నివ్రేళ్లుకలిసి యున్నచో; సర్పశీర్షకః = సర్పశిరోహస్తమగును; భుజంగమగతౌ = పామునడకయందు; తోయసేచనాలాలనాదిషు = జలసేచనము, లాలనచేయుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అర్ధేందుహస్తమందు అన్నివ్రేళ్లు కలిసి యున్నచో సర్పశిరోహస్తమగును. పామునడకయందు జలసేచనము, లాలన చేయుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**జ్యేష్ఠాకనిష్ఠే ప్రోక్షిప్తే యద్యస్మిన్ మృగశీర్షకః ।**
**స్యోల్లాసనాక్షవిక్షేపస్వేదాపనయనాదిషు ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : అస్మిన్ = ఈసర్పశిరోహస్తమందు; జ్యేష్ఠాకనిష్ఠే = బ్రొటనవ్రేలుచిటికెన వ్రేలు; ప్రోక్షిప్తే = పైకిఎత్తగా; మృగశీర్షః స్యాత్ = మృగశీర్షకమగును; స్వఉల్లాసన = (తన) ఉల్లాసమందు; అక్షవిక్షేప = పాచికలాడుటయందు; స్వేదఅపనయనాదిషు = చెమట తుడుచుకొనుట మొదలగువాటియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ఈసర్పశిరోహస్తమందు బ్రొటనవ్రేలు చిటికెనవ్రేలు పైకి ఎత్తగా మృగ శీర్షకమగును.(తన) ఉల్లాసమందు పాచికలాడుటయందు చెమటతుడుచు కొనుట మొదలగు వాటియందు ప్రయోజ్యము.

**సర్పాస్యే తర్జనీ వక్రా యద్యరాలో హితోక్తిషు ।**
**(హ్యా?స్యా) దాశీర్వాదనే ధైర్యవీర్యసంకీర్తనాదిషు ॥ 47 ॥**

**ప్రతిపదార్థము** : సర్పాస్యే = సర్పముఖమందు; తర్జనీ = చూపుడువ్రేలు; వక్రా యది= వక్రమైనచో; అరాలః స్యాత్ = అరాలహస్తమగును; హితోక్తిషు = హితవాక్యములయందు; ఆశీర్వాదనే = దీవెనయందు; ధైర్యవీర్యసంకీర్తనాదిషు = ధైర్యము, వీర్యము, కొనియాడుట మొదలగువానియందిది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : సర్పముఖమందు చూపుడువ్రేలు వక్రమైనచో అరాలహస్తమగును. హితవాక్యములయందు, దీవెనయందు, ధైర్యము, వీర్యము, కొనియాడుట మొదలగు వానియందిది ప్రయోజ్యము.

**చేద్ వక్రానామికారాలే శుకతుండో విసర్జనే ।**
**న త్వం నాహం న కర్తవ్యం ధిగిత్యాదిషు లక్ష్యతే ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : అరాలే = అరాలహస్తమందు; అనామికా = ఉంగరపు వ్రేలు; వక్రాచేత్= వక్రమైనచో; శుకతుండః = శుకతుండహస్తము; విసర్జనే = విడుచుటయందు; నత్వం = నీవుకావు; అహం న = నేను కాను; న కర్తవ్యం = చేయరాదు; ధిక్ = నింద్యము (తిరస్కారము); ఇత్యాదిషు = ఈమొదలైనవానియందు; లక్ష్యతే = ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అరాలహస్తమందు ఉంగరపు(వేలు వ(క్రమైనచో, శుకతుండహస్తము విడుచుటయందు  నీవుకాదు, నేనుకాదు, చేయరాదు, నింద్యము (తిరస్కారము) ఈమొదలైనవానియందు (ప్రయోజ్యము.

**సందంశస్తర్జనీజ్యేష్ఠాయోగోఽరాలకరే యది ।**
**ధ్యానే పుష్పాపచాయే చ స్తోకే నిష్పీడనాదిషు ॥ 49 ॥**

**(ప్రతిపదార్థము** : అరాలకరే = అరాలహస్తమందు; తర్జనీజ్యేష్ఠాయోగః యది = చూపుడు (వేలును అంగుష్ఠమును కలిసినయెడల; సందంశః = సంధంశహస్తమగును; ధ్యానే = ధ్యానమందు; పుష్పాపచయే = పూవులను కోయుట; స్తోకే = అల్పమందును; నిష్పీడనాదిషు = పిండుటమొదలగువానియందిది (ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అరాలహస్తమందు చూపుడు(వేలును అంగుష్ఠమును కలసిన యెడల సందంశహస్తమగును. ధ్యానమందు, పూవులను కోయుట, అల్పమందును, పిండుట మొదలగు వానియందిది (ప్రయోజ్యము.

**సందంశస్త్రి(ప్రకారః స్యాత్ పార్శ్వజో మునజోఽ(గజః ।**
**ఇత్యనేక(ప్రయోగేషు దిగంబ(ర)మతోదితః ॥ 50 ॥**

**(ప్రతిపదార్థము** : పార్శ్వజః = పార్శ్వగతము; ముఖజః = ముఖగతము; అ(గజః = ముందుండుట; ఇతి = ఈ విధముగా; సందంశః (త్రి(ప్రకారః = సందంశము మూడు విధములైనవి; అనేక(ప్రయోగేషు దిగ్బరమతా ఉదితః = అనేక (ప్రయోగములందు సవిశేషముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : పార్శ్వగతము ముఖగతము ముందుండుట ఈ విధముగా సందంశము మూడు విధములైనది. అనేక(ప్రయోగములందు సవిశేషముగా చెప్పబడినది.

**మధ్యమాద్యా(గయోగశ్చేదరాలే (భమరః కరః ।**
**కర్ణపూరా యదాబ్జాది(గహేదౌ(?) చి(త్రకర్మణి ॥ 51 ॥**

**(ప్రతిపదార్థము** : అరాలే = అరాలహస్తమందు; మధ్యమాద్యా(గయోగశ్చేత్ = మధ్యమ అంగుష్ఠములకలయిక జరిగినచో; (భమరః కరః = (భమరహస్తమగును; కర్ణపూరా = కర్ణపూరము; అబ్జాది(గహేదౌ = పద్మము మొదలగు వాటిని పట్టుకొనుటయందు; చి(త్ర కర్మణి = చి(త్రకర్మయందును (ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అరాళహస్తమందు మధ్యమఅంగుష్ఠముల కలయిక జరిగినచో భ్రమరహస్తమగును. కర్ణపూరము పద్మముమొదలగు వాటిని పట్టుకొనుటయందు చిత్రకర్మయందును ప్రయోజ్యము.

**ఊర్ధ్వాస్యాః కుంచితాః సర్వాః అంగుళ్యో విరలా యది ।**
**పద్మకోశః కపిత్థస్తనోత్ఫుల్లాంబుజాదిషు ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : సర్వాఃఅంగుళ్య = అన్నివ్రేళ్లు; విరలాః = విడివిడిగా; ఊర్ధ్వాస్యాః = పైకిముఖములు కల్గునట్లుగ; కుంచితాః యది = వంచబడిన యెడల; పద్మకోశః = పద్మకోశహస్తమగును; కపిత్థ = వెలగ; స్త్రీస్తన = స్త్రీల యొక్కస్తనములు; ఉత్ఫుల్ల అంబుజాదిషు = వికసించిన పద్మములు మొదలగువానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అన్నివ్రేళ్లు విడివిడిగ పైకిముఖములు కల్గునట్లుగ వంచబడిన యెడల పద్మకోశహస్తమగును. వెలగ స్త్రీలయొక్కస్తనములు వికసించిన పద్మములు మొదలగు వానియందు ప్రయోజ్యము.

**పద్మకోశే కరాంగుళ్యో వక్రాశ్చేదూర్ణనాభకః ।**
**కుష్ఠరోగిణి శార్దూలే శిరఃకండూయనాదిషు ॥ 53 ॥**

**ప్రతిపదార్థము** : పద్మకోశే = పద్మకోశహస్తమందు; కరాంగుళ్యః = చేతినున్న వ్రేళ్లన్నియు; వక్రాశ్చేత్ = వక్రములైనయెడల; ఊర్ణనాభకః = ఊర్ణనాభహస్తమగును; కుష్ఠరోగిణి = కుష్ఠువ్యాధియందు; శార్దూలే = పెద్దపులి మొదలగు క్రూరజంతువు(ల) నందు; శిరః కండూయనాదిషు = తలగోకికొనుట మొదలగు వానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : పద్మకోశహస్తమందు చేతినున్న వ్రేళ్లన్నియు వక్రములైనయెడల ఊర్ణనాభహస్తమగును. కుష్ఠువ్యాధి యందు పెద్దపులి మొదలగు క్రూరజంతువు (ల)నందు తలగోకికొనుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**ఆవర్తిన్యోంతరంగుళ్యః పద్మకోశే భవంతి చేత్ ।**
**అలపద్మస్తు శూన్యోక్తౌ శూన్యే +++కీర్తనే ॥ 54 ॥**

**ప్రతిపదార్థము** : పద్మకోశే = పద్మకోశమందు; అంతరంగుళ్యః = లోపలివ్రేళ్లు; ఆవర్తిన్యః చేత్ = లోపలికి వంగియున్నయెడల; అలపద్మః = అలపద్మహస్తము; శూన్యోక్తౌ =

శూన్యవచనమందు; కీర్తనే = కీర్తనమందును ప్రయోజ్యము.

**తాత్పర్యము** : పద్మకోశమందు లోపలివ్రేళ్లు లోపలికి వంగియున్నయెడల అలపద్మ హస్తము శూన్యవచనమందు కీర్తనమందును ప్రయోజ్యము.

> **పద్మకోశే యుతాగ్రాశ్చేదంగుళ్యో ముకుల: కర: ।**
> **పూజాభోజనసంకోచపద్మాదిముకులాదిషు ॥ 55 ॥**

**ప్రతిపదార్థము** : పద్మకోశే = పద్మకోశహస్తమందు; అంగుళ్య: = వ్రేళ్లు; యుతాగ్రాశ్చేత్= చివరిభాగములు కలసినయెడల; ముకుల: కర: = ముకులహస్తమగును; పూజాభోజన సంకోచ పద్మాదిముకులాదిషు = పూజ, భోజనము, సంకోచము, పద్మము మొదలగునవి ముడుచుకొనుటయందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : పద్మకోశహస్తమందు వ్రేళ్లు చివరిభాగములు కలసినయెడల ముకులహస్తమగును. పూజ, భోజనము, సంకోచము, పద్మము మొదలగునవి ముడుచు కొనుటయందు ప్రయోజ్యము.

> **హంసాస్యో ముకులాంత్యే చేదంగుళ్యౌ సంప్రసారితే ।**
> **తప్తమాష గ్రహాసారనిగ్దసమ్మర్దనాదిషు ॥ 56 ॥**

**ప్రతిపదార్థము** : ముకులాంత్యే అంగుళ్యౌ = ముకులహస్తమందు చూపుడువ్రేలు మరియు చిటికెనవ్రేలు; సంప్రసారితే చేత్ = చాచబడగా; హంసాస్య: = హంసాస్యమగును; తప్తమాషాగ్రహ = భోజనఆభరణాదులను గ్రహించుట; సారనిగ్దసమ్మర్తనాదిషు = సారమును లెక్క, మొగ్గలను, సమ్మర్దనాదులను గుర్తించుట యందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ముకులహస్తమందు, చూపుడువ్రేలు మరియు చిటికెనవ్రేలు, చాచబడగా హంసాస్యమగును. భోజన ఆభరణాదులను గ్రహించుట సారమును లెక్క, మొగ్గలను, సమ్మర్దనాదులను గుర్తించుటయందు ప్రయోజ్యము.

> **చుల్లీచిలాకం(?) జ్యేష్ఠాదిత్రయమంత్యా ప్రసారితా ।**
> **కాంశూలోఽ నామికా వక్రా స్తోకే బాలాస్తనాదిషు ॥ 57 ॥**

**ప్రతిపదార్థము** : జ్యేష్ఠాదిత్రయం = అంగుష్ఠతర్జనీమధ్యాంగుళాలును; అంత్యా = కనిష్ఠికయును; ప్రసారితా చేత్ = చాపబడగా; అనామికా = ఉంగరపువ్రేలు; వక్రా

చేత్ = వక్రముకాగా; కాంశూలః = కాంశూలహస్తమగును; స్తోకే = స్వల్పవస్తువునందును; బాలాస్తనాదిషు = బాలాస్తనాదులయందును ప్రయోజ్యము.

**తాత్పర్యము** : అంగుష్ఠతర్జనీమధ్యాంగుళాలును, కనిష్ఠికయును చాపబడగా ఉంగరపు వ్రేలు వక్రముకాగా కాంశూలహస్తమగును. స్వల్పవస్తువునందును బాలాస్తనాదుల యందును ప్రయోజ్యము.

**తర్జన్యాదాస్తలస్థాగ్రా ఉపర్యంగుష్ఠపీడితాః ।**
**యది ముష్టిః ప్రహారాసిగ్రహనిష్పీడనాదిషు ॥ 58 ॥**

**ప్రతిపదార్థము** : తర్జన్యాద్యాః = చూపుడువ్రేలుమొదలగు నాల్గువ్రేళ్లను; తలస్థాగ్రాః = అరచేతిమొదటికి (వంచి)ఉంచి; ఉపరి = వాటిపై; అంగుష్ఠపీడితా = బ్రొటనవ్రేలితో రాపిడిచేయబడినవైయున్నచో; (నొక్కిపెట్టియున్నచో); ముష్టిఃస్యాత్ = ముష్టిహస్త మగును; ప్రహార = దెబ్బ; అసిగ్రహ = కత్తిపట్టు; నిష్పీడనాదిషు = పిండుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : చూపుడువ్రేలుమొదలగు నాల్గువ్రేళ్లను అరచేతిమొదటికి (వంచి)ఉంచి వాటిపై బ్రొటనవ్రేలితో రాపిడిచేయబడినవైనచో (నొక్కిపెట్టియున్నచో) ముష్టిహస్త మగును. దెబ్బ, కత్తిపట్టు, పిండుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**ఊర్ధ్వం ప్రసారితోఽంగుష్ఠో ముష్టౌ చేచ్ఛిఖరః కరః ।**
**స్యాదధరరంజనాదౌ ధనుర్దండగ్రహాదిషు ॥ 59 ॥**

**ప్రతిపదార్థము** : ముష్టౌ = ముష్టిహస్తమందు; ఊర్ధ్వం = పైకి; ప్రసారితోంగుష్ఠః = బ్రొటనవ్రేలు చాచగా; శిఖరః కరః = శిఖరహస్తమగును; అధరరంజనాదౌ = అధరమునకు రంగువేయుటయందు; ధనుర్దండగ్రహాదిషు = దనుస్సు, దండముమొదలగునవి పట్టుట యందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ముష్టిహస్తమందు పైకిబ్రొటనవ్రేలు చాచగా శిఖరహస్తమగును. అధరమునకు రంగువేయుటయందు, ధనుస్సు, దండము మొదలగునవి పట్టుట యందు ప్రయోజ్యము.

**తర్జన్యుత్క్షిప్య వక్రా చేచ్ఛిఖరేఽంగుష్ఠపీడితా ।**
**కపిత్థః స్మరణే చక్రగూహే నిష్పీడనాదిషు ॥ 60 ॥**

**ప్రతిపదార్థము** : శిఖరే = శిఖరిహస్తమందలి; తర్జనీ = చూపుడువ్రేలు; ఉత్క్షిప్య =

ఎత్తి; వక్రా = వక్రమై; అంగుష్ఠపీడితా చేత్ = బ్రొటనవ్రేలితో నొక్కబడినయెడల; కపిత్థః స్యాత్ = కపిత్థహస్తమగును; స్మరణే = స్మరణమందును; చక్రగుహే = అసి చక్రాదిశస్త్రనిరూపణమందు; నిష్పీడనాదిషు = పీడనాదులయందును ప్రయోజ్యము.

**తాత్పర్యము :** శిఖరిహస్తమందలి చూపుడువ్రేలు ఎత్తి వక్రమై బ్రొటనవ్రేలితో నొక్కబడిన యెడల కపిత్థహస్తమగును. స్మరణమందును అసిచక్రాదిశస్త్రనిరూపణమందు పీడనాదు లయందును ప్రయోజ్యము.

**కపిత్థే (న్త్రే?న్త్యే) సముత్క్షిప్య వక్రే చేత్ కటకాముఖః ।**
**ప్రగ్రహాకర్షణాదర్శధారణాదిషు లభ్యతే ॥ 61 ॥**

**ప్రతిపదార్థము :** కపిత్థే = కపిత్థహస్తమందు; అంత్యే = చివరిరెండువ్రేళ్లు; సముత్క్షిప్య వక్రేచేత్ = పైకెత్తి వంచబడినచో; కటకాముఖః = కటకాముఖహస్తము; ప్రగ్రహార్షణ = త్రాడులాగుట; ఆదర్శధారణ = అద్దమును పట్టుకొనుట; ఆదిషు = మొదలగు వానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము :** కపిత్థహస్తమందు చివరిరెండువ్రేళ్లు పైకెత్తి వంచబడినవో కటకాముఖ హస్తము. త్రాడులాగుట, అద్దమును పట్టుకొనుట మొదలగువానియందు ప్రయోజ్యము.

**సూచ్యాస్యః కటకాస్యేస్యాత్ తర్జనీ చేత్ ప్రసారితా ।**
**సాధువాదే ప్రదర్శనే ప్రయోజ్యస్తర్జనాదిషు ॥ 62 ॥**

**ప్రతిపదార్థము :** కటకాస్యే = కటకాముఖమందలి; తర్జనీ = చూపుడువ్రేలు; ప్రసారితా చేత్ = బాగుగా చాచబడినచో; సూచ్యాస్యః = సూచీముఖమగును; సాధువాదే = సాదువాదమందును; ప్రదర్శనే = ప్రదర్శనమందును; తర్జనాదిషు = భయపెట్టుట మొదలగు వాటియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము :** కటకాముఖమందలి చూపుడువ్రేలు బాగుగా చాచబడినచో సూచీముఖమగును. సాదువాదమందును, ప్రదర్శనమందును, భయపెట్టుటమొదలగు వాటియందు ప్రయోజ్యము.

భ్రమరేఽంత్యే తలస్థాగ్రే స్యాతాం చేత్ తామ్రచూడకః ।
స శీఘ్రతాలపాతాదౌ బుద్ధై(ర్య?ర్ధ)స్తః ప్రయుజ్యతే ॥ 63 ॥
॥ ఇతి (అ)సంయుక్తహస్తాశ్చతుర్వింశతిః ॥

**ప్రతిపదార్థము** : భ్రమరే = భ్రమరహస్తమందును; అంత్యే = చివరి రెండువ్రేళ్లు; తలస్థాగ్రేస్యాత్యాం చేత్ = అరచేతిచివరిభాగమందున్న (తాకిన) యెడల; తామ్రచూడకః = తామ్రచూడహస్తమగును (ప్రదేశిని కొంచెము పైకిలేపవలెను); సః = అది; శీఘ్రతాలపాతాదౌ = తొందర, తాలము, పతనము మొదలగువాటియందు; బుధైః ప్రయుజ్యతే = పండితులచే ప్రయోగింపబడును.

**తాత్పర్యము** : భ్రమరహస్తమందును చివరిరెండువ్రేళ్లు అరచేతిచివరిభాగమందున్న (తాకిన)యెడల తామ్రచూడహస్తమగును. (ప్రదేశినికొంచెము పైకిలేపవలెను)అది తొందర, తాలము, పతనము మొదలగువాటియందుపండితులచే ప్రయోగింపబడును.

**హస్తోఽంజలిః కపోతశ్చ కర్కటో వర్ధమానకః ।**
**కటకావర్ధమానశ్చ స్వస్తికో గజదంతకః ॥ 64 ॥**

**ప్రతిపదార్థము** : అంజలిఃహస్తః = అంజలిహస్తము; కపోతః = కపోతము; కర్కటః = కర్కటము; వర్ధమానకః = వర్ధమానకము; కటకావర్ధమానశ్చ = కటకావర్ధమానమును; స్వస్తికః = స్వస్తికము; గజదంతకః = గజదంతము.

**తాత్పర్యము** : అంజలిహస్తము కపోతము, కర్కటము, వర్ధమానకము, కటకావర్ధ మానమును, స్వస్తికము, గజదంతము.

**దోలోపవహిత్థోశ్చోత్సంగో నిషధః పుష్పపుటః కరః ।**
**మకరశ్చేతి సంయుక్తాః హస్తాస్తే చ త్రయోదశ ॥ 65 ॥**

**ప్రతిపదార్థము** : దోలః = దోల; అవహిత్థః = అవహిత్థము; ఉత్సంగః = ఉత్సంగము; నిషధః = నిషధము; పుష్పపుటఃకరః= పుష్పపుటకరము; మకరశ్చ ఇతి = మకరమునుఅని; హస్తాః సంయుక్తాః త్రయోదశ = సంయుతహస్తములు పదమూడు.

**తాత్పర్యము** : దోల, అవహిత్థము, ఉత్సంగము, నిషధము, పుష్పకరము, మకరమును అని సంయుతహస్తములు పదమూడు.

**పతాకస్థలయోః (?) శ్లేషాదంజలిః క్షాలనాదిషు ।**
**మహేశగురుపూజ్యానామయం స్యాదభివాదనే ॥ 66 ॥**

**ప్రతిపదార్థము** : పతాకః = పతాకహస్తములయొక్క; తలయోః = రెండుఅరచేతుల యొక్క; శ్లేషాత్ = కలయికవలన; అంజలి = అంజలిహస్తమగును; క్షాలనాదిషు = క్షాలనాదులందు; మహేగురుపూజ్యానాం = దేవగురుపూజ్యులయొక్క; అబివాదనే =

నమస్కారమందు; అయం స్యాత్ = ఈ హస్తము ప్రయోజ్యమగును.

**తాత్పర్యము** : పతాకహస్తములయొక్క రెండుఅరచేతులయొక్క కలయికవలన అంజలిహస్తమగును. క్షాలనాదులందు దేవగురుపూజ్యులయొక్క నమస్కారమందు ఈ హస్తము ప్రయోజ్యమగును.

**సర్పశీర్షద్వయశ్లేషాత్ కపోతోఽంగులిఘర్షణే ।**
**ప్రణామాభయశీతార్తే గురుసంభావనాదిషు ॥ 67 ॥**

**ప్రతిపదార్థము** : సర్పశీర్షద్వయశ్లేషాత్ = సర్పశీర్షహస్తద్వయముయొక్క కలయికవలన; అంగులిఘర్షణే = వ్రేళ్లతాకిడియందు; కపోతః స్యాత్ = కపోతహస్తమగును; ప్రణామా భయశీతార్తే = నమస్కారము, అభయము, శీతార్తునియందు; గురుసంభావనాదిషు = గురువు (పెద్ద)లనుగౌరవించుట మొదలగువానియందు ఇది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : సర్పశీర్ష హస్తద్వయముయొక్కకలయిక వలన వ్రేళ్ళతాకిడి యందు కపోతహస్తమగును. నమస్కారము, అభయము, శీతార్తునియందు, గురువు (పెద్ద), లనుగౌరవించుట మొదలగు వానియందు ఇది ప్రయోజ్యము.

**పద్మకోశయుగాంగుల్యస్త (అ?స్య) న్యోంతరనిర్గతాః ।**
**చేత్ కర్కటోఽంగ స (ర్బద్దలహ?మ్మర్దగల) శంఖగ్రహాదిషు ॥ 68 ॥**

**ప్రతిపదార్థము** : పద్మకోశయుంగాగుళ్యః = పద్మకోశహస్తద్వయము యొక్కవ్రేళ్లు; అన్యోన్యాంతరనిర్గతా చేత్ =ఒకదానిలోనికి ఒకటి చొచ్చుకొని పోయినచో; కర్కటః స్యాత్ = కర్కటహస్తమగును; అంగసమ్మర్దగలశంఖగ్రహాదిషు = అంగమర్దనముచే, కంఠము, శంఖము మొదలగు వాటిని పట్టుకొనుటయందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : పద్మకోశహస్తద్వయముయొక్కవ్రేళ్లు, ఒకదానిలోనికి ఒకటి చొచ్చుకొనిపోయినచో కర్కటహస్తమగును. అంగమర్దనముచే కంఠము, శంఖము మొదలగువాటిని పట్టుకొనుటయందు ప్రయోజ్యము.

**వర్ధమానః కపిత్థేన వేష్టితో ముకులో యది ।**
**సర్వసంగ్రహ(సం)క్షిప్తసత్యవాక్యాదిషు స్మృతః ॥ 69 ॥**

**ప్రతిపదార్థము** : కపిత్థేన = కపిత్థహస్తముతో; ముకులః = ముకులహస్తము; వేష్టితః యది = పరివేష్టించి ఉన్నయెడల; వర్ధమానః = వర్ధమానహస్తమగును; సర్వసంగ్రహ= సర్వసంగ్రహము; సంక్షిప్త = సంగ్రహణము; సత్యవ్యాక్యాదిషు = సత్యవాక్యము మొదలగు

వానియందు ప్రయోజ్యముగా చెప్పబడినది.

**తాత్పర్యము :** కపిత్థహస్తముతో ముకులహస్తము పరివేష్టించి ఉన్నయెడల, వర్ధమానహస్త మగును. సర్వసంగ్రహము, సంగ్రహణము, సత్యవాక్యము మొదలగు వానియందు ప్రయోజ్యముగా చెప్పబడినది.

**కటకే న్యస్తకటకః కటకావర్ధమానకః ।**
**కుంతాద్యాయుధ సంగ్రాహకాహలా వాదనాదిషు ॥ 70**

**ప్రతిపదార్థము :** కటకే = కటక హస్తమునందు; న్యస్తకటకః = ఉంచబడిన కటకము; కటకావర్ధమానకః = కటకావర్ధమానకమగును; కుంతాద్యాయుధ సంగ్రాహకాహలా వాదనాదిషు = బల్లెము మొదలగు ఆయుధములు మరియు ముష్టి, కాహళము మొదలగు వాదనములందు (ఇది ప్రయోగింపదగినది)

**తాత్పర్యము :** కటకహస్తమునందు ఉంచబడిన కటకము కటకావర్ధమానకమగును. బల్లెము మొదలగు ఆయుధములు మరియు ముష్టి కాహళము మొదలగు వాదనము లందు (ఇది ప్రయోగింపదగినది).

**యుతమణి బంధోత్తానారాలావన్యోన్య పార్శ్వగౌ ।**
**స్వస్తికః సర్వసంకీర్ణబంధనానయనాదిషు ॥ 71**

**ప్రతిపదార్థము :** యుతమణిబంధోత్తానారాలౌ = కూడిన మణిబంధము యొక్క తలక్రిందులైన అభినయహస్తద్వ యము; అన్యోన్య పార్శ్వగౌ = ఒకదాని ప్రక్కన మరి యొకటి ఉన్నవైనచో; స్వస్తికః = స్వస్తికమగును; సర్వసంకీర్ణ బంధనానయనాదిషు = సకలవిధమిశ్రిత బంధనములయందు మరియు తెచ్చుటయందు (ఇది ప్రయోగింప దగినది).

**తాత్పర్యము :** కూడిన మణి బంధముయొక్క తలక్రిందులైన అభినయహస్త ద్వయము ఒక దానికి ప్రక్కన మరియొకటి ఉన్నవైనచో స్వస్తికమగును. సకల విధ మిశ్రిత బంధనములయందు మరియు తెచ్చుటయందు (ఇది ప్రయోగింపదగినది).

**పురః ప్రసారితౌ కించిదుత్తానౌ సర్పశీర్షకౌ ।**
**గజదంతః శిలావత్స(ము?గు)రుభారగ్రహాదిషు ॥ 72 ॥**

**ప్రతిపదార్థము :** పురః = ముందునకు; ప్రసారితౌ = చాచబడినవియు; కించిత్ ఉత్తానౌ = కొంచెము ఉత్తానములును అయిన; సర్పశీర్షకౌ = సర్పశీర్షకహస్తములు;

గజదంతః = గజదంతహస్తమగును; శిలావత్సగురుభారగ్రహాదిషు = శిలలు పెద్దబరువులు గ్రహించుట మొదలగు వానియందిది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ముందునకు చాచబడినవియు, కొంచెము ఉత్తానములును అయిన సర్పశీర్షకహస్తములు గజదంత హస్తమగును. శిలలు పెద్దబరువులు గ్రహించుట మొదలగు వానియందిది ప్రయోజ్యము.

**దోలహస్తః పతాకౌ ద్వౌ ప్రలంబితభుజౌ యది ।**
**విషాదసంభ్రమవ్యాధిలీలామూర్ఛామదాదిషు ॥ 73 ॥**

**ప్రతిపదార్థము** : ద్వౌ పతాకౌ = రెండుపతాక హస్తములు; ప్రలంబితభుజౌ యది = వ్రేలాడబడిన భుజములు కలవైనచో; దోలాహస్తః = దోలాహస్తమగును; విషాదసంభ్రమ వ్యాధి లీలామూర్ఛామదాదిషు = దుఃఖము, సంభ్రమము, వ్యాధి, లీల, మూర్ఛమదము మొదలగు వానియందు ప్రయోజ్యము.

**తాత్పర్యము** : రెండుపతాకహస్తములు వ్రేలాడబడిన భుజములు కలవైనచో దోలాహస్తమగును. దుఃఖము, సంభ్రమము, వ్యాధి, లీల, మూర్ఛమదము మొదలగు వానియందు ప్రయోజ్యము.

**అవహి(త్యః?త్థః) శుకతుండౌ (దౌ)వక్షసోఽభిముఖౌయుతౌ ।**
**శనైరధోముఖావిద్ధౌ దౌర్బల్యాత్ ఖండితాదిషు ॥ 74 ॥**

**ప్రతిపదార్థము** : ద్వౌ శుకతుండౌ = రెండు శుకతుండహస్తములు; వక్షసః అభిముఖౌ యుతౌ = వక్షఃస్థలమునకు ఎదురుగా కలసి; శనైః = మెల్లగా; ఆవిద్ధౌ = త్రిప్పబడినవియు; అదోముఖాః = క్రిందముఖములైనవియు అయినయెడల; అవహిత్థః = అవహిత్థహస్తమగును; దౌర్బల్యాత్ = దుర్బలత వలన; ఖండితాదిషు = ఖండితాదు లయందిది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : రెండు శుకతుండహస్తములు వక్షఃస్థలమునకు ఎదురుగా కలసి మెల్లగా త్రిప్పబడినవియు క్రిందముఖములైనవియు అయినయెడల అవహిత్థహస్తమగును. దుర్బలత వలన ఖండితాదులయందిది ప్రయోజ్యము.

**పరాఙ్ముఖావరావరాలౌ ద్వావూర్ధ్వాస్యౌ సంగతౌ యది ।**
**ఉత్సంగః స్యాత్ (ప్రియాత్?) ప్రియాశ్లేషకందుకాదినివారణే ॥ 75 ॥**

**ప్రతిపదార్థము** : పరాఙ్ముఖా = ఎదురైన; అరాలౌ = రెండుఅరాలహస్తములు; ఊర్ధ్వాస్యౌ= ఊర్ధ్వముఖములుగా; సంగతౌ యది = కలసిఉన్నయెడల; ఉత్సంగఃస్యాత్ = ఉత్సంగహస్తమగును; ప్రియాత్ = ప్రియునినుండి; ప్రియాశ్లేష = ప్రియాలింగన; కందుకాది నివారణే = బంతిమొదలగునవి వారించుట యందును ప్రయోజ్యము.

**తాత్పర్యము** : ఎదురైన రెండుఅరాలహస్తములు ఊర్ధ్వముఖములుగా కలసిఉన్నయెడల ఉత్సంగహస్తమగును. ప్రియునినుండి ప్రియాలింగన బంతిమొదలగునవి వారించుట యందును ప్రయోజ్యము.

**నిషధోదక్షిణోముష్టిర్వామకూర్పరమధ్యగః ।**
**ప్రకాండో దక్షిణో వా+ ద్ధృతౌ గర్వాదిదర్శనే ॥ 76 ॥**

**ప్రతిపదార్థము** : దక్షిణఃముష్టిః = కుడిదైన ముష్టిహస్తము; వామకూర్పర మధ్యగః = ఎడమకూర్పరమధ్యమును పొందినదియు; దక్షిణః ప్రకాండః = కుడిదైన అంసకూర్పుర మధ్యము; వాద్ధృతౌ = వామభుజమును పట్టుకొనుటవలన; నిషధః స్యాత్ = నిషధహస్తమగును; గర్వాదిదర్శనే = గర్వము మొదలగువానిని చూపుటయందు ఈహస్తము ప్రయోజ్యము.

**తాత్పర్యము** : కుడిదైన ముష్టిహస్తము ఎడమ కూర్పరమధ్యమును పొందినదియు కుడిదైన అంసకూర్పరమధ్యము వామభుజమును పట్టుకొనుటవలన నిషధహస్తమగును. గర్వము మొదలగువానిని చూపుటయందు ఈహస్తము ప్రయోజ్యము.

**కనిష్ఠాపార్శ్వసంశ్లిష్టా (దు?వు)త్తలౌ సర్పశీర్షకౌ ।**
**పుష్పపుటః పుష్పాంజలిజలదానాదికర్మసు ॥ 77 ॥**

**ప్రతిపదార్థము** : కనిష్ఠాపార్శ్వసంశ్లిష్టౌ = చిటికెనవ్రేలిప్రక్కకు కలిసినవియు; ఉత్తలౌ= ఉత్తలములైనవియు అయిన, సర్పశీర్షకౌ = సర్పశిరోహస్తములు; పుష్పపుటః = పుష్పపుటహస్తమగును; పుష్పాంజలిజలదానాదికర్మసు = పూలదోసిలి, జలమును విడచుట మొదలగువాని యందిది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : చిటికెనవ్రేలిప్రక్కకు కలిసినవియు ఉత్తలములైనవియు అయిన సర్పశిరోహస్తమలు పుష్పపుటహస్తమగును. పూలదోసిలి, జలమును విడుచుట మొదలగువానియందిది ప్రయోజ్యము.

**మణిబంధేయుతావుత్తానావతానౌ పతాకకౌ ।**
**మకరఃసింహశార్దూలమకరాభినయాదిషు ॥ 78 ॥**
**॥ ఇతి సంయుతహస్తాస్త్రయోదశ ॥**

**ప్రతిపదార్థము** : మణిబంధే = మణిబంధమందు; యుతౌ = కలసినవియు; ఉత్తానావతానౌ = ఉత్తాన, అవతానములైన; పతాకౌ = రెండు పతాకహస్తములైనచో; మకరః = మకరహ్తామగును; సింహశార్దూలమకరాభినయాదిషు = సింహము, వ్యాఘ్రము, మకరము మొదలగు వానినభినయించుటయందు ఇది ప్రయోజ్యము.

**తాత్పర్యము** : మణిబంధమందు కలసినవియు ఉత్తాన, అవతానములైన రెండుపతాక హస్తములైనచో మకరహస్తమగును. సింహము, వ్యాఘ్రము, మకరము మొదలగు వానినభినయించుట యందు ఇది ప్రయోజ్యము.

**చతురశ్రావుద్వృత్తౌ చ కరౌ స్వస్తిక (వి?వ)ద్ యుతౌ ।**
**సూచీముఖౌ తలాస్యౌ చ రేచితావర్ధరేచితౌ ॥ 79 ॥**

**ప్రతిపదార్థము** : చతురాశ్రౌ = చతురశ్రములు; ఉద్వృత్తౌ = ఉద్వృత్తములు; స్వస్తిక వద్యుతౌ = స్వస్తికములు; సూచీముఖౌ = సూచీముఖములు; తలాస్యౌ = క్రిందిముఖములు; రేచితౌ = రేచితములు; అర్ధరేచితౌ = అర్ధరేచితములు.

**తాత్పర్యము** : చతురశ్రములు, ఉద్వృత్తములు, స్వస్తికములు, సూచీముఖములు క్రిందిముఖములు రేచితములు అర్ధరేచితములు.

**ఆవిద్ధవక్రౌ పల్లవావరాలకటకాముఖౌ ।**
**నితంబౌ కేశబంధౌ చ హస్తావుత్తానవంచితౌ ॥ 80 ॥**

**ప్రతిపదార్థము** : ఆవిద్ధవక్రౌ = ఆవిద్ధవక్రములు, పల్లవౌ = పల్లవములు; అరాలకటకాముఖౌ = అరాలకటకాముకములు; నితంబౌ = నితంబములు; కేశబంధౌ= కేశబంధములు; ఉత్తానవంచితౌ = ఉత్తానవంచితములు.

**తాత్పర్యము** : ఆవిద్ధవక్రములు పల్లవములు అరాలకటకాముకములు నితంబములు కేశబంధములు ఉత్తానవంచితములు.

లతాఖ్యౌ కరిహస్తౌ చ పక్షవంచితకౌ కరౌ ।
పక్షప్రద్యోతకౌ దండపక్షౌ గరుడపక్షకౌ ॥ 81 ॥

**ప్రతిపదార్థము :** లతాఖ్యౌ = లతాహస్తములు; కరిహస్తౌ = కరిహస్తములు; పక్షవంచితకౌ కరౌ = పక్షవంచితకహస్తములు; పక్షప్రద్యోతకౌ = పక్షప్రద్యోతకములు, దండపక్షౌ = దండపక్షములు, గరుడపక్షకౌ = గరుడపక్షములు.

**తాత్పర్యము :** లతాహస్తములు, కరిహస్తములు, పక్షవంచితకహస్తములు, పక్షప్రద్యోతకములు, దండపక్షములు, గరుడపక్షములు.

**ముష్టికస్వస్తికాదూర్ధ్వపార్శ్వమండితకౌ కరౌ ।**
**ఉరోమండలినౌ హస్తావురఃపార్శ్వార్ధమండలౌ ॥ 82 ॥**

**ప్రతిపదార్థము :** ముష్టికస్వస్తికాత్ = ముష్టికస్వస్తికముల తరువాత; ఊర్ధ్వపార్శ్వమండితకౌకరౌ = ఊర్ధ్వమండలులు, పార్శ్వమండలులు; ఊరోమండలినౌ = ఉరోమండలులు; ఉరః పార్శ్వార్ధమండలౌ = ఉరః పార్శ్వార్ధమండలులు.

**తాత్పర్యము :** ముష్టికస్వస్తికములతరువాత ఊర్ధ్వమండలులు పార్శ్వమండలులు, ఉరోమండలులు, ఉరః పార్శ్వార్ధమండలులు.

**నలినీపద్మకోశాఖ్యావుల్బణౌ లలితౌ కరౌ ।**
**వలితావితి హస్తాః స్యుర్నృత్యగాః సప్తవింశతిః ॥ 83 ॥**

**ప్రతిపదార్థము :** నలినీ పద్మకోశాఖ్యౌ = నలినీపద్మకోశములు; ఉల్బణౌ = ఉల్బణములు; లలాతౌ కరౌ = లలితము హస్తములు; వలితౌ = వలితములు; ఇతి = ఈవిధముగా; నృత్యగా = నృత్యగములైన (నాట్యాశ్రయములైన); హస్తాః = హస్తములు; సప్తవింశతిః స్యుః = ఇరువదియేడు అయినవి.

**తాత్పర్యము :** నలినీపద్మకోశములు, ఉల్బణములు లలితహస్తములు, వలితములు ఈవిధముగా నృత్యగములైన (నాట్యాశ్రయములైన) హస్తములు ఇరువదియేడు అయినవి.

**కటకాస్యావభిముఖౌ సూచీముఖకరౌ వరౌ ।**
**చతురశ్రకరౌ హంసపక్షావన్యోన్యసమ్ముఖౌ ॥ 84 ॥**

**ప్రతిపదార్థము :** కటకాస్యౌ = కటకాముఖ హస్తములు; అబిముఖౌ = ఎదురుగానున్నవి కాగా; వరౌ = శ్రేష్ఠములైన; సూచీముకరౌ = సూచీముఖహస్తములు (సమానముకాగా); చతురశ్రకరౌ = చతురస్రకరములగును; హంసపక్షౌ = హంసపక్షహస్తములు; అన్యోన్యసమ్ముఖౌ = పరస్పరము ఎదురెదురుగా (నుంచగా);

**తాత్పర్యము** : కటకాముఖహస్తములు ఎదురుగా నున్నవి కాగా శ్రేష్ఠములైన సూచీముఖహస్తములు (సమానముకాగా) చతురస్రకరములగును. హంసపక్షహస్తములు పరస్పరము ఎదురెదురుగా (నుంచగా);

**తిర్యగ్వక్షఃస్థలస్థౌతు కరౌ తలముఖౌ మతౌ ।**
**ప్రసారితోత్తానాతలౌ ద్రుతద్రుమౌ రేచితౌ ॥ 85 ॥**

**ప్రతిపదార్థము :** వక్షఃస్థలస్థౌ తు = చతురస్రకరములను; వక్షమునందుంచగా; తలముఖౌ కరౌ మతౌ = తలముఖకరములుగా సమ్మతము; ప్రసారితోత్తానతలౌ = చాచబడిన ఉత్తానమైన తలములు; ద్రుతద్రుమౌ = ద్రుతభ్రమణముకలవైనచో; రేచితౌ = రేచితకరములు.

**తాత్పర్యము** : చతురస్రకరములను వక్షమునందుంచగా తలమున కరములుగా సమ్మతము. చాచబడిన ఉత్తానమైన తలములు ద్రుతభ్రమణముకలవైనచో రేచిత కరములు.

**చతురశ్రచేదశ్రైకస్త్వర్ధరేచితౌ ।**
**ప్రకాండకుటిలావిద్ధౌ కరావావిద్ధవక్రకౌ ॥ 86 ॥**

**ప్రతిపదార్థము :** చతురశ్రరేచితౌ = చతురస్రరేచితకరములు; క్రమేణ = క్రమముగా; వామదక్షిణః స్యాత్ చేత్ = ఎడమ-కుడిచేతులు కాగా; అత్ర = ఇక్కడ; అర్ధరేచితౌ = అర్ధరేచితములగును; ప్రకాండకుటిలౌఆవిద్ధౌ = అంసకూర్పరమధ్యప్రదేశములు ఆవిద్ధములుకాగా; ఆవిద్ధవక్రాకరౌ = ఆవిద్ధవక్రకరములగును.

**తాత్పర్యము** : చతురస్రరేచితకరములు క్రమముగా ఎడమ- కుడిచేతులు కాగా ఇక్కడ అర్ధరేచితములగును. అంసకూర్పురమధ్యప్రదేశములు ఆవిద్ధములు కాగా ఆవిద్ధవక్రకర ములగును.

**మణిబంధనముక్తౌ ద్వౌ పతాకౌ పల్లవౌ స్మృతౌ ।**
**అరాలకటకౌ హస్తావరాలకటకాముఖౌ ॥ 87 ॥**

**ప్రతిపదార్థము :** మణిబంధనముక్తా = మణిబంధముక్తములైన; ద్వౌ పతాకౌ = రెండు పతాకహస్తములు; పల్లవౌ స్మృతౌ = పల్లవహస్తములుగా చెప్పబడుచున్నవి; అరాలకటకౌ హస్తౌ = అరాలకటకహస్తములు; అరాలకటాకముఖౌ = అరాలకటకా ముఖములగును.

**తాత్పర్యము** : మణిబంధముక్తములైన రెండు పతాకహస్తములు పల్లవహస్తములుగా చెప్పబడుచున్నవి. అరాలకటకాహస్తములు అరాలకటకాముఖములగును.

**నితంబౌ పార్శ్వయో రుద్ధౌ బాహుశీర్షాద్ వినిర్గతౌ ।**
**కేశదేశాద్ వినిష్క్రాంతౌ పార్శ్వద్వయసముద్గతౌ ॥ 88 ॥**

**ప్రతిపదార్థము** : బాహుశీర్షాత్ = భుజము మరియు శిరస్సునుండి; వినిర్గతౌ = బయలుదేరిన; పతాకహస్తములు రెండును; పార్శ్వయోః రుద్ధౌ = ప్రక్కలందు రుద్ధములైనచో; నితంబౌ = నితంబహస్తములగును; పార్శ్వద్వయసముద్గతౌ = ప్రక్కల నుండి బయలుదేరిన పతాకహస్తములు; కేశదేశాత్ వినిష్క్రాంతౌ = శిరస్సు నుండి బయటకు వచ్చినచో;

**తాత్పర్యము** : భుజము మరియు శిరస్సునుండి బయలుదేరిన పతాకహస్తములు రెండును, ప్రక్కలందు రుద్ధములైనచో నితంబహస్తములగును. ప్రక్కలనుండి బయలుదేరిన పతాకహస్తములు శిరస్సునుండి బయటకు వచ్చినచో;

**కేశబంధౌ కరౌ ప్రోక్తౌ తౌ దిగంబరసూరిణా ।**
**ఉత్తానవంచితౌ కించిత్ పార్శ్వగౌ త్రిపతాకరౌ ॥ 89 ॥**

**ప్రసారితౌ లతాఖ్యౌ చ సమ్యక్ తిర్యక్ ప్రసారితౌ ।**
**విలోలితౌ (తం పాశ్చాత్) పార్శ్వం లతాహస్తః సమున్నతః ॥ 90 ॥**

**ప్రతిపదార్థము** : తౌ = ఆరెండును; దిగంబర సూరిణా = దిగంబరసూరిచేత; కేశబంధ కరౌప్రోక్తౌ = కేశబంధకరములుగ చెప్పబడినవి; త్రిపతాకరౌ = పతాకహస్తములరెండు; ఉత్తానవంచితౌ = ఉత్తానవంచితములును; కించిత్ = కొంచెము; పార్శ్వగౌ తిర్యక్ = అడ్డుగా; ప్రసారితౌ యది = చాచబడినచో; లతాఖ్యౌ = లతాహస్తములగును; సమున్నతః లతాహస్తః = ఉన్నతమైన లతాహస్తము; పార్శ్వాత్ పార్శ్వం = ప్రక్కనుండి ప్రక్కకు; విలోలితౌ = ఆడింపబడినచో;

**తాత్పర్యము** : ఆరెండును దిగంబరసూరిచేత కేశబంధకరములుగ చెప్పబడినవి. పతాకహస్తములు రెండు ఉత్తానవంచితములును కొంచెము అడ్డుగా చాచబడినచో లతాహస్తములగును. ఉన్నతమైన లతాహస్తము ప్రక్కనుండి ప్రక్కకు ఆడింపబడినచో;

**కర్మస్త్రిపతాకోऽన్యః కరిహస్తః ప్రకీర్తితః ।**
**కని+ + నివిష్టాగ్రౌ పతాకౌ పక్షవంచితౌ ॥ 91 ॥**

**ప్రతిపదార్థము :** అన్యః = మరియొక హస్తము; త్రిపతాకః = త్రిపతాకము; కరిహస్తః ప్రకీర్తితః = కరిహస్తముగా చెప్పబడుచున్నది; కనినివిష్టాగ్రౌ = క్రిందుమీదలైన (కటిపైనొకటి శిరసుపైనొకటి); పతాకౌ = రెండుపతాకహస్తములు; పక్షవంచితౌ = పక్షవంచితకరములగును.

**తాత్పర్యము :** ఉన్నతమైన లతాహస్తము ప్రక్కనుండి ప్రక్కకుఆడింపగా మరియొక హస్తము కరిహస్తముగా చెప్పబడుచున్నది. క్రిందుమీదలైన (కటిపైనొకటి, శిరసుపైనొకటి) రెండు పతాకహస్తములు పక్షవంచితకరములగును.

**పరావృత్తౌ పునస్తౌ ద్వౌ పక్షప్రద్యోతకౌ కరౌ ।**
**తిర్యక్ప్రసారితభుజౌ వ్యావర్తపరివర్తితౌ ॥ 92 ॥**

**ప్రతిపదార్థము :** పునః తౌద్వౌ = ఆరెండు పతాకహస్తములు మరల; పరావృత్తౌ = విపర్యయములైన యెడల; పక్షప్రద్యోతకౌ కరౌ = పక్షప్రద్యోతకకరములగును; తిర్యక్ ప్రసారితభుజౌ = అడ్డుగా చాచబడిన భుజములు కలవియు; వ్యావర్తపరివర్తితౌ = వ్యావర్తపరివర్తితములైన;

**తాత్పర్యము :** ఆ రెండు పతాకహస్తములు మరల విపర్యయములైన యెడల పక్షప్రద్యోతకకరములగును. అడ్డుగా చాచబడిన భుజములు కలవియు వ్యావర్తపరివర్తితములైన;

**హంసపక్షకరౌ దండపక్షావుక్తౌ దిగంబరైః ।**
**అధోముఖతలావిద్ధౌ కించిత్ తిర్యక్ప్రసారితౌ ॥ 93 ॥**

**ప్రతిపదార్థము :** హంసపక్షకరౌ = హంసపక్షహస్తములు; దండపక్షౌ ఉగ్మ = దండపక్షములు; దిగంబరైః ఉక్తౌ = దిగంబరులచే చెప్పబడినవి; అధోముఖ తలావిద్ధౌ= అధోముఖముగా హస్తముచే ఆవిద్ధములైనట్టియు; కించిత్ తిర్యక్ప్రసారితౌ = కొంచెమడ్డుగా చాచబడినట్టి;

**తాత్పర్యము :** హంసపక్షహస్తములు దండపక్షములు దిగంబరులచే చెప్పబడినవి. అధోముఖముగా హస్తముచే ఆవిద్ధములైనట్టియు కొంచెమడ్డుగా చాచబడినట్టి;

**హంసపక్షకరౌ స్యాతాం తౌ ద్వౌ గరుడపక్షకౌ ।**
**స్వస్తికాకటకాస్యౌద్వౌ కుంచితావంచితౌ (కరౌ) ॥ 94 ॥**

**ప్రతిపదార్థము :** తౌ హంసపక్షకరౌ = ఆ హంసపక్షకరములు; గరుడపక్షకౌ స్యాతాం= గరుడపక్షకహస్తములగును; స్వస్తికాకటకాస్యౌ ద్వౌ = స్వస్తికకటకాముఖహస్తములు రెండును;

**తాత్పర్యము :** ఆ హంసపక్షకరములు గరుడపక్షకహస్తములగును. స్వస్తికకటకాముఖ హస్తములు రెండును;

**ఏకధా బహుశో వాథ ముష్టికస్వస్తికౌ మతౌ ।**
**మూర్ధ్ని పార్శ్వద్వయే చైవ మండలావృత్తివర్తనాత్ ॥ 95 ॥**

**ప్రతిపదార్థము :** ఏకధా = ఒకసారిగాని; బహుశః = అనేకసార్లుగాని; కుంచితావంచితౌ= కుంచితములును, అంచితములును అయినచో; ముష్టికస్వస్తికౌ మతౌ = ముష్టికస్వస్తిక హస్తములగును; మూర్ధ్ని = శిరస్సునందు; పార్శ్వద్వయే చ = రెండుప్రక్కలయందు; మండలావృత్తివర్తనాత్ = మండలాకారముగా ఆవర్తనమైనయెడల;

**తాత్పర్యము :** ఒకసారిగాని అనేకసార్లుగాని, కుంచితములును, అంచితములును అయినచో ముష్టికస్వస్తికహస్తములగును. శిరస్సునందు, రెండుప్రక్కలయందు మండలాకారముగా ఆవర్తనమైనయెడల;

**ఆ శాంబరమతాదూర్ధ్వపార్శ్వమండలినౌ కరౌ ।**
**బహుశో వక్షసోతన్యో వేష్టనోద్వేష్టనక్రమాత్ ॥ 96 ॥**

**ప్రతిపదార్థము :** ఊర్ధ్వపార్శ్వమండలినౌ మతౌ = ఊర్ధ్వపార్శ్వమండల హస్తములగుచున్నవి; ఆ శాంబరమతాత్ = దిగంబరమతమువలన; బహుశః = అనేకపర్యాయములు; వక్షసః = వక్షమునకు; (పురః = ఎదురుగా); అన్యోన్యౌ = పరస్పరముగా హస్తములు; వేష్టనోద్వేష్టనక్రమాత్ = వేష్టన; ఉద్వేష్టనక్రమముగా;

**తాత్పర్యము :** ఊర్ధ్వపార్శ్వమండల హస్తములగుచున్నవి. దిగంబరమతమువలన అనేక పర్యాయములు వక్షమునకు (ఎదురుగా) పరస్పరముగా హస్తములు వేష్టన, ఉద్వేష్టన క్రమముగా;

భుమిను(ండి?డలి)నౌ హస్తౌ పురోమం(డి?డలి) నౌ మతౌ ।
శ్లథమణిబంధరాలావురః పార్శ్వార్ధదేశయోః ॥ 97 ॥

**ప్రతిపదార్థము :** భూమిమండలినౌ = క్రిందుగా త్రిప్పబడినయెడల; ఉరోమండలినౌ మతౌ = ఉరోమండలములగును; ఉరః పార్శ్వార్ధదేశాయోః = వక్షఃస్థలమును పార్శ్వార్ధ ప్రదేశములందు; శ్లథమణిబంధారాలౌ = విడివడని మణిబంధములు గల అరాలములు.

**తాత్పర్యము :** క్రిందుగా త్రిప్పబడినయెడల ఉరో మండలములగును. వక్షఃస్థలమును పార్శ్వార్ధ ప్రదేశములందు విడివడని మణిబంధములుగలఅరాలములు.

**భ్రాన్తౌ మం(డి?డలి) పునౌ హస్తౌపురః పార్శ్వార్ధమండలౌ ।**
**వ్యావర్తపరివర్తౌ చ పద్మకోశాభిధౌ కరౌ ॥ 98 ॥**

**ప్రతిపదార్థము :** మండలినౌ భ్రాంతౌ = మండలాకారముగా తిరిగినయెడల; ఉరః పార్శ్వార్ధమండలౌ హస్తౌస్యాతాం = ఉరః పార్శ్వార్ధమండలహస్తములగును; పద్మకోశాభిధౌకరౌ = పద్మకోశకరములు; వ్యావర్తపరివర్తౌ = క్రింది మీదులుగా ఆడింపబడుచు;

**తాత్పర్యము :** మండలాకారముగా తిరిగినయెడల ఉరఃపార్శ్వార్ధమండలహస్తములగును. పద్మకోశకరములు క్రిందుమీదులుగా ఆడింపబడుచు;

**స్యాతాం జానుసమీపస్థౌ నలినీపద్మకోశకౌ ।**
**ఉల్బణాదూర్ధ్వగావిష్టోద్వేష్టితాగ్రౌ తు పల్లవౌ ॥ 99 ॥**

**ప్రతిపదార్థము :** జానుసమీపస్థౌ = ఔనువులకు దగ్గఱగ ఉన్నయెడల; నలినీ పద్మకోశకౌ= నలినీ పద్మహస్తములగును; ఊర్ధ్వగౌ = పైకెత్తబడిన హస్తములు; ఉద్వేష్టితాగ్రౌపల్లవౌ = ఆడించబడిన పల్లవహస్తములు; ఉల్బణౌ = ఉల్బణహస్తములు.

**తాత్పర్యము :** ఔనువులకు దగ్గఱగ ఉన్నయెడల నలినీ పద్మహస్తములగును. పైకెత్తబడిన హస్తములు ఆడించబడిన పల్లవహస్తములు ఉల్బణహస్తములు.

**మస్తకౌ దేశసంప్రాప్తౌ పల్లవౌ లలితౌ మతౌ ।**
**కూర్పరస్వస్తికగతౌ లతాఖ్యౌ లలితావితి ॥ 100 ॥**

**ప్రతిపదార్థము :** మస్తకౌ దేశసంప్రాప్తౌ = శిరః ప్రదేశమును పొందిన; పల్లవౌ = పల్లవహస్తములు; లలితౌ మతౌ = లలితహస్తములగును; కూర్పరస్వస్తికగతౌ = పాణిమూల స్వస్తికగతమైన; లతాఖ్యౌ = లతాహస్తములు; లలితౌ = లలిత హస్తములు.

**తాత్పర్యము** : శిరఃప్రదేశమును పొందిన పల్లవహస్తములు లలితహస్తములగును. పాణిమూల స్వస్తికగతమైన లతాహస్తములు లలితహస్తములు.

> **లోకవ్యవహృతౌ యుద్ధే నియుద్ధే నర్తనాదిషు ।**
> **నానాప్రయోగదర్శనాదిహస్తో నాస్తి కశ్చన ॥ 101 ॥**

**ప్రతిపదార్థము** : లోకవ్యవహృతౌ = లోకవ్యవహారమందు; యుద్ధే = రణమందు; నియుద్ధే = నిర్బంధమందు; నర్తనాదిషు = నర్తనాదులయందు; నానాప్రయోగదర్శనాదిహస్తః = అనేక ప్రయోగాదులను చూపు హస్తము; కశ్చన నాస్తి= ఒక్కటియును లేదు.

**తాత్పర్యము** : లోకవ్యవహారమందు, రణమందు, నిర్బంధమందు, నర్తనాదులయందు, అనేక ప్రయోగాదులను చూపు హస్తము ఒక్కటియును లేదు.

> **కుర్వన్నావేష్టితోద్వేష్టితాన్యంగీకర్మణా గతౌ ।**
> **రణాదావర్తితం హస్తే లభతే పరివర్తితమ్ ॥ 102 ॥**

**ప్రతిపదార్థము** : ఆవేష్టితోద్వేష్టితాని = ఆవేష్టిత, ఉద్వేష్టితములు; అంగీకర్మణా = అంగీకర్మచే (అంగీకరింపబడుటచే); గతౌ = పొందినవియు; రణాత్ = రణమువలన; హస్తే = హస్తమందు; ఆవర్తితం = ఆవర్తితమును; పరివర్తితం (చ) = పరివర్తితమును; లభతే = పొందుచున్నవి; హస్తకరణచతుష్టయమిది.

**తాత్పర్యము** : ఆవేష్టిత, ఉద్వేష్టితములు అంగీకర్మచే (అంగీకరింపబడుటచే) పొందినవియు, రణమువలన హస్తమందు ఆవర్తితమును పరివర్తితమును పొందుచున్నవి.

> **ఆవేష్ట్యంతేవంతరాంగుళ్యస్తర్జన్యాద్యా యది క్రమాత్ ।**
> **ఆవేష్టితం యథోద్వేష్టితాఖ్యముద్వేష్టనాద్ బహిః ॥ 103 ॥**

**ప్రతిపదార్థము** : క్రమాత్ = క్రమముగా; తర్జన్యాద్యాః అంతరాంగుళ్యః = తర్జనీమొదలగునవి అంతరాంగుళులై; వేష్ట్యంతే యది = పరివేష్టించి యుండునో (వక్షము వైపు తిరిగియుండుట); ఆవేష్టితం = అది ఆవేష్టితకరణమగును; బహిః = వెలుపలకు; ఉద్వేష్టనాత్ = తర్జన్యాదులు వక్షమునకు వెలుపలకు తిరిగియుండుటవలన; ఉద్వేష్టితాన్యం = ఉద్వేష్టితమనుకరణమగును.

**తాత్పర్యము** : క్రమముగా తర్జనీమొదలగునవి అంతరాంగుళులై పరివేష్టించియుండునో (వక్షమువైపు తిరిగియుండుట) అది ఆవేష్టితకరణమగును. వెలుపలకు తర్జన్యాదులు వక్షమునకు వెలుపలకు తిరిగియుండుట వలన ఉద్వేష్టితమనుకరణమగును.

**ఆవర్త్యంతేవంతరంగుళ్యః కనిష్ఠాద్యా యది క్రమాత్ ।**
**వ్యావర్తితం బహిర్వృత్తేస్తథాసౌ పరివర్తితః ॥ 104 ॥**

**॥ చతుర్విధం హస్తకరణమ్ ॥**

**ప్రతిపదార్థము** : క్రమాత్ = క్రమముగా; కనిష్ఠాద్యాః అంతరంగుళ్యః = కనిష్ఠిక మొదలగు వ్రేళ్లు; ఆవర్త్యంతే యది = ఆవర్తితములయినచో; వ్యావర్తితం = వ్యావర్తితకరణము; బహిః వృత్తేః = వెలుపలకు ఉద్వర్తితము (త్రిప్పబడుట)లైనచో; అసౌ = అది; పరివర్తితః = పరివర్తితకరణమగును.

**తాత్పర్యము** : క్రమముగా కనిష్ఠిక మొదలగు వ్రేళ్లు ఆవర్తితములయినచో వ్యావర్తికరణము, వెలుపలకు ఉద్వర్దితము (త్రిప్పబడుట)లైనచో అది పరివర్తిత కరణమగును.

**బాహవస్తిర్యగూర్ధ్వాధః పృష్ఠగాః కుంచితోంచితః ।**
**స్యుర్మండలస్వస్తికా + + + విద్ధా దశేతి తే ॥ 105 ॥**

**॥ హస్తలక్షణమ్ ॥**

**ప్రతిపదార్థము** : బాహవః = కరణబాహువులు; తిర్యక్ = అడ్డము; ఊర్ధ్వ = పైకి; అధః = క్రిందుగ; పృష్ఠగాః = వెనుకకు చేరుట; కుంచిత = ముడుచుకొనుట; అంచిత= వక్షమునుండి నిష్క్రమించితలమీదకు వచ్చుట; మండల = అంతటనుభ్రమించుట; స్వస్తిక = ఒకదానిపై నొకటి అడ్డముగానుండుట; విద్ధాః = అపవిద్ధ; ఉద్వేష్టిత = మణికట్టునొద్ద త్రిప్పుట అను గతులచే; తే =అవి; దశ = పదివిధములు ఇట్లు;

**తాత్పర్యము** : కరణబాహువులు అడ్డముపైకి క్రిందుగ వెనుకకు చేరుట, ముడుచుకొనుట, వక్షమునుండి నిష్క్రమించి తలమీదకు వచ్చుట, అంతటనుభ్రమించుట, ఒకదానిపై నొకటి అడ్డముగా నుండుట, అపవిద్ధ మణికట్టునొద్ద త్రిప్పుట అనుగతులచే అవి పదివిధములు. ఇట్లు;

**హస్తసంఖ్యా ప్రసిద్ధాహం హస్తలక్షణమబ్రువమ్ ।**
**దేశీనృత్తే తు నాన్వేష్యాః సర్వహస్తా జగజ్జనైః ॥ 106 ॥**

**ప్రతిపదార్థము** : హస్తసంఖ్యాప్రసిద్ధా = హస్తసంఖ్యప్రసిద్ధమైనది; అహం = నేను; హస్తలక్షణమబ్రువం = హస్తలక్షణమును చెప్పితిని; జగజ్జనైః = లోకులచే; దేశీనృత్తే తు = దేశినృత్తమందు మాత్రము; సర్వహస్తాః న అన్వేష్యాః = సమస్తహస్తములు అన్వేష్యములు కావు.

**తాత్పర్యము** : హస్తసంఖ్య ప్రసిద్ధమైనది. నేను హస్తలక్షణమును చెప్పితిని. లోకులచే దేశినృత్తమందు మాత్రము సమస్త హస్తములు అన్వేష్యములు కావు.

**సమున్నతం నతం చైవ ప్రసారితమథాపరమ్ ।**
**(హా?వ్యా)వృత్తం చేతి పార్శ్వస్య చతుర్ధా బేద ఈరితః ॥ 107 ॥**

**ప్రతిపదార్థము** : సమున్నతం = సమున్నతము; నతం = నతము; ప్రసారితం = ప్రసారితము; వ్యావృత్తం = వ్యావృత్తము; ఇతి =అని; పార్శ్వస్య = పార్శ్వమునకు; చతుర్ధా = నాల్గువిధములుగా; భేదః ఈరితః = భేదము చెప్పబడినది.

**తాత్పర్యము** : సమున్నతము, నతము, ప్రసారితము, వ్యావృత్తముఅని పార్శ్వమునకు నాల్గువిధములుగా భేదము చెప్పబడినది.

**సమున్నతైః కటిపార్శ్వభుజాంశైరున్నతం భవేత్ ।**
**నతాభిధానం తత్ పార్శ్వం కథితం నాట్యవేదిభిః ॥ 108 ॥**

**ప్రతిపదార్థము** : సమున్నతైః = సమున్నతములైన; కటిపార్శ్వభుజాంశైః = కటిపార్శ్వభుజాంశములచేతను; ఉన్నతం భవేత్=ఉన్నతప్రభేదమగును; తత్ = (అది) కటిపార్శ్వభుజాంగములు; నతం = వంగినచో; నతం ఇతి = నతపార్శ్వవిశేషమని; నాట్యవేదిభిః కథితం = నాట్యశాస్త్ర విదులచే చెప్పబడినది.

**తాత్పర్యము** : సమున్నతములైన కటిపార్శ్వభుజాంశములచేతను ఉన్నతప్రభేదమగును. (అది) కటిపార్శ్వభుజాంశములు వంగినచో నతపార్శ్వవిశేషమని నాట్యశాస్త్రవిదులచే చెప్పబడినది.

ఆయామనాత్ ప్రసారీతి పార్శ్వాభ్యాం తు ప్రసారితమ్ ।
త్రికస్య పరివర్తస్య స్యాద్ వ్యావృత్తమపోహనాత్ ॥ 109 ॥
॥ ఇతి చతుర్విధః పార్శ్వః ॥

**ప్రతిపదార్థము** : పార్శ్వాభ్యామాయామనాత్ = పార్శ్వములచే సాగుటవలన; ప్రసారీతి= పొడవుగలది గాన; ప్రసారితం స్యాత్ = ప్రసారిత పార్శ్వమగును; పరివృత్తస్య = ఇంకొకవైపునకు తిరిగియున్న; త్రికస్య = వెన్నముక క్రిందిభాగముయొక్క (నడుము); అపోహనాత్ = మరియొక వైపునకు త్రిప్పుటవలన; వ్యావృత్తం స్యాత్ = వ్యావృత్తపార్శ్వమగును.

**తాత్పర్యము** : ఇంకొకవైపునకు తిరిగియున్న వెన్నెముకక్రిందిభాగముయొక్క (నడుము) మరియొకవైపునకు త్రిప్పుటవలన వ్యావృత్తపార్శ్వమగును.

> **నివృత్తా రేచితా ఛిన్నా కంపితోద్వాహితా తథా ।**
> **ఇతి పంచవిధా ప్రోక్తా కటిర్నాట్యవిశారదైః ॥ 110 ॥**

**ప్రతిపదార్థము** : నివృత్తా = నివృత్తము; రేచితా = రేచితము; ఛిన్నా = ఛిన్న; కంపితా= కంపితము; తథా = మరియు; ఉద్వాహితా = ఉద్వాహితము; ఇతి = ఈప్రకారముగా; నాట్యవిశారదైః = నాట్యశాస్త్రజ్ఞులచే; కటిః = కటి (నడుము); పంచవిధా ప్రోక్తా = ఐదువిధములుగా చెప్పబడినది.

**తాత్పర్యము** : నివృత్తము, రేచితము, ఛిన్న, కంపితము మరియు ఉద్వాహితము ఈ ప్రకారముగా నాట్యశాస్త్రజ్ఞులచే కటి (నడుము) ఐదువిధములుగా చెప్పబడినది.

> **నివృత్తా సా కటీ జ్ఞేయా సమ్ముఖీ వా పరాఙ్ముఖీ ।**
> **పరితో భ్రమణాద్ జ్ఞేయా సంజ్ఞేయా రేచితా కటిః ॥ 111 ॥**

**ప్రతిపదార్థము** : సంముఖీవా = సంముఖము అయినది (ఎదుట)గాని; పరాఙ్ముఖీ వా = పరాఙ్ముఖమైనదిగాని(వెనుకకుతిరిగిన) అయినచో (ఎదుటనుండి వెనుకకు తిరిగినచో లేదా వెనకనుండి ముందునకు తిరిగినచో); నివృత్తా కటీ జ్ఞేయా = నివృత్తకటిగా తెలియదగినది; పరితః = అంతట (చుట్టును); భ్రమణాత్ = తిరుగుటవలన; రేచితా కటిః సంజ్ఞేయా = రేచితమను కటిగా గుర్తింపదగినది.

**తాత్పర్యము** : సంముఖము అయినది (ఎదుట) గాని పరాఙ్ముఖమైనదిగాని, (వెనుకకు తిరిగినది)అయినచో, (ఎదుటనుండి వెనుకకు తిరిగినచో వెనుకనుండి ముందునకు తిరిగినచో) నివృత్తకటిగా తెలియదగినది. అంతట (చుట్టును) తిరుగుటవలన రేచితమను కటిగా గుర్తింపదగినది.

**తిర్యఙ్మధ్యస్థవలనాచ్ఛిన్నా నామ్నా కటిర్భవేత్ ।**
**క్షిప్రం గతాగతైస్తిర్యక్ కంపితా కథితా గతౌ ॥ 112 ॥**

**ప్రతిపదార్థము :** తిర్యక్ = అడ్డుగా; మధ్యస్థవలనాత్ = (కటి)మధ్యముత్రిప్పబడిన యెడల; ఛిన్నా నామ్నా కటిః = ఛిన్నకటియగును; క్షిప్తం = త్వరితముగను; తిర్యక్ = అడ్డుగను; గతాగతైః = గమనాగమనములచే; గతౌ = నడక (త్రిప్పుట) కలదయినయెడల; కంపితా కథితా = కంపితకటియగును.

**తాత్పర్యము :** అడ్డుగా (కటి)మధ్యముత్రిప్పబడిన యెడల ఛిన్నకటియగును. త్వరితముగను అడ్డుగను, గమనాగమనములచే నడక(త్రిప్పుట) కలదయినయెడల కంపితకటియగును.

**ఉద్వాహితా శనైః పార్శ్వనితంబోద్వాహనాత్ కటిః ।**
**॥ కటిలక్షణమ్ ॥**
**సమశ్చోద్ఘట్టితః కుంచితోఽంచితోఽగ్రతలక్రమః ॥ 113 ॥**

**ప్రతిపదార్థము :** పార్శ్వనితంబోద్వాహనాత్ = పార్శ్వనితంబములను ఉన్నతము చేసినచో (కటితోపాటు); ఉద్వాహితా కటిః స్యాత్ = ఉద్వాహితకటియగును; సమః = సమము; ఉద్ఘట్టితః = ఉద్ఘట్టితము; కుంచితః = కుంచితము; అంచితః = అంచితము; అగ్రతలక్రమః = అగ్రతలక్రమము.

**తాత్పర్యము :** పార్శ్వనితంబములఉన్నతముచేసినచో (కటితోపాటు) ఉద్వాహితకటి యగును. సమము, ఉద్ఘట్టితము, కుంచితము, అంచితము అగ్రతలక్రమము.

**ఇతి పంచవిధః పాదః సమః స్వాభావికః క్రమః ।**
**పాదాగ్రస్థేన చేత్ పార్ష్ణిః సకృద్ భూమౌ నిపాత్యతే ॥ 114 ॥**

**ప్రతిపదార్థము :** ఇతి = ఈవిధముగా; పాదః =పాదము; పంచవిధః = ఐదువిధములు; స్వాభావికః క్రమః = సహజమైన క్రమము; సమః = సమః ప్రభేదము; పాదాగ్రస్థేన = పాదాగ్రముల(వ్రేళ్లతో) నిలుచుట చేతను; పార్ష్ణిః = మడమ; సకృత్ = ఒకసారి; భూమౌ = నేలపై; నిపాత్యతే = ఘట్టనచేయబడునో (అదుమబడునో);

**తాత్పర్యము :** ఈవిధముగా పాదము ఐదువిధములు. సహజమైన క్రమము సమప్రభేదము. పాదాగ్రముల (వ్రేళ్లతో) నిలుచుట చేతను, మడమ ఒకసారి నేలపై ఘట్టన చేయబడునో (అదుమబడునో);

**ప్రయోగేణ సకృద్ ద్వాభ్యాముద్ఘట్టితపదం సమే ।**
**కుంచితా(గ్రే?గ్ర)తలం భూస్థా సమే చేత్ పార్ష్ణి(ము?రు)చ్యతే ॥ 115 ॥**

**ప్రతిపదార్థము** : ప్రయోగేణ = ప్రయోగముచే; అసకృత్ = మాటిమాటికి; ద్వాభ్యాం = రెండు (మడమల)పాదములచేతను; సమే = సమమందు ఘట్టనచేయబడినచో; తత్= అది; ఉద్ఘట్టితం స్యాత్ = ఉద్ఘట్టితమగును; సమే = సమపాదమందు; పార్ష్ణిః = మడమ; కుంచితాగ్రతలం = వంచబడినవ్రేళ్ళుకలదై; భూస్థాచేత్ = నేలపై నుంచబడినయెడల; కుంచితం స్యాత్ = కుంచితపాదమగును.

**తాత్పర్యము** : ప్రయోగముచే మాటిమాటికి రెండు (మడమల)పాదములచేతను సమమందు ఘట్టనచేయబడినచో అది ఉద్ఘట్టితమగును. సమపాదమందు మడమ వంచబడినవ్రేళ్ళుకలదై నేలపై నుంచబడినయెడల కుంచితపాదమగును.

**కుంచి(తా?తో) భినయాయత్తే(పూ?షూ) దాత్తమగనాదిషు ।**
**అంచితాంగులిపాదాగ్రముత్క్షి(ప్తం?ప్తా)చేత్ సమేంచితః ॥ 116 ॥**

**ప్రతిపదార్థము** : ఉదాత్తగమనాదిషు = ఉదాత్తగమనము మొదలగు; కుంచితాభినయాయత్తేషు = కుంచితాభినాయాయత్తములందు; సమే = సమమందు; అంచితాంగులిపాదాగ్రం = విడదీసిన (విప్పబడిన) అంగుళులు గలపాదముయొక్క చివరి భాగము; ఉత్క్షిప్తం చేత్ = పైకి ఎత్తబడినచో; అంచితః స్యాత్ = అంచితపాదమగును.

**తాత్పర్యము** : ఉదాత్తగమనము మొదలగునవి కుంచితాభినయాయత్తములగుచున్నవి. సమమందు విడదీసిన (విప్పబడిన)అంగుళులుకలపాదముయొక్క చివరిభాగము పైకి ఎత్తబడినచో అంచితపాదమగును.

**పదాగ్రక్షితిసంచారభ్రమర్యుద్వర్తనాదిషు ।**
**సమే చేత్ పార్ష్ణిరుత్క్షిప్తా స్యాదగ్రతలసంచరః ॥ 117 ॥**

**ప్రతిపదార్థము** : పదాగ్రక్షితిసంచార = పాదాగ్రముతో నేలపై తిరుగుటయందు; భ్రమరి= మొత్తము శరీరముయొక్కభంగిమయందు; ఉద్వర్తనాదిషు = ఉద్వర్తనముమొదలగు వానియందీపాదము ప్రయోజ్యము; సమే = సమమందు; పార్ష్ణిః = మడమ; ఉత్క్షిప్తా చేత్ = ఎత్తబడినయెడల; అగ్రతలసంచరః స్యాత్ = అగ్రతలసంచారపాదమగును.

**తాత్పర్యము** : పాదాగ్రముతో నేలపై తిరుగుటయందు మొత్తము శరీరముయొక్క భంగిమయందు ఉద్వర్తనము మొదలగు వానియందీపాదము ప్రయోజ్యము.సమమందు మడమ ఎత్తబడినయెడల అగ్రతలసంచారపాదమగును.

**పార్ష్ణి క్షతగతిభ్రాంతిక్షోణీసంఘట్టనాదిషు ।**

**॥ ఇతి పంచవిధపాదతలలక్షణమ్ ॥**

**అథాపాంగదర్శనాన్యేవ సాదరం నిరూపయామః తత్రముఖ్యత్వాత్ -**

**ప్రతిపదార్థము** : పార్ష్ణిక్షతగతి = మడమకు దెబ్బతగులుట వలనైన గమనము; భ్రాంతి = భ్రాంతి; క్షోణీసంఘట్టనాదిషు = భూమిపై కొట్టుటమొదలగు వానియందీపాదము ప్రయోజ్యము; అథ = తరువాత; అపాంగదర్శనాన్యేన = కడగంటిచూపులను; సాదరం నిరూపయామః = ఆదరణగా నిరూపించుచున్నాము; తత్ర = అందు; ముఖ్యత్వాత్ = ముఖ్యముగా;

**తాత్పర్యము** : మడమకు దెబ్బతగులుటవల్లనైన గమనము భ్రాంతి, భూమిపై కొట్టుటమొదలగు వానియందీపాదము ప్రయోజ్యము. తరువాత కడగంటిచూపులను ఆదరణగా నిరూపించుచున్నాము. అందు ముఖ్యముగా;

**సమం సా(స్య?చ్య)నువృత్తం చ ఆలోకితవిలోకితే ॥ 118 ॥**

**ప్రతిలోకితముల్లోకితం చావలోకితమష్టధా ।**

**(భ)వంతిదర్శనాన్యేవం పృథక్ నోక్తాని లక్షణైః ॥ 119 ॥**

**ప్రతిపదార్థము** : సమం = సమము; అనువృత్తం = అనువృత్తము, ఆలోకితవిలోకితే= ఆలోకిత విలోకితములు; ప్రతిలోకితం = ప్రతిలోకితము; ఉల్లోకితం = ఉల్లోకితము; అవలోకితమితి = అవలోకితమని; ఏవం = ఈప్రకారముగా; దర్శనాని = చూపులు; అష్టధా భవంతి = ఎనిమిది విధములగుచున్నవి; పృథక్ = వేరుగా; లక్షణాని ఉక్తాని = లక్షణములుచెప్పబడలేదు.

**తాత్పర్యము** : సమము, అనువృత్తము, ఆలోకిత, విలోకితములు, ప్రతిలోకితము, ఉల్లోకితము అవలోకితమని ఈప్రకారముగా చూపులు ఎనిమిదివిధములగుచున్నవి. వేరుగా లక్షణములు చెప్పబడలేదు.

**పుటపక్ష్మాగ్రకర్మాణి లోచనానుగతాన్యతః ।**
**సమం(సంత్ర్యత్ర వ్యసాపి?సవ్యాశకం సాచి)రూపనిర్వర్ణ(తా?నా)యతమ్ ॥ 120 ॥**

**ప్రతిపదార్థము :** పుట=కనురెప్పలు; పక్ష్మాగ్రకర్మాణి = పక్ష్మాగ్రకర్మలు; లోచనానుగతాని= నేత్రానుగతములు; యతః రూపనిర్వర్తనాయతం=రూపమును సౌమ్యముగా చూచుటకు తగినట్టి; సవ్యాశకం = సహజత్వమునాశ్రయించినది; సమం = సమదర్శనము అగును.

**తాత్పర్యము :** కనురెప్పలు పక్ష్మాగ్రకర్మలు నేత్రానుగతములు రూపమును సౌమ్యముగా చూచుటకు తగినట్టి సహజత్వము నాశ్రయించినది సమదర్శనమగును.

**అనువృత్తం స్యాద్ దర్శనం సహసాలోకితం మతమ్ ।**
**+ + + + + + + +పృష్ఠతః స్యాద్ విలోకితమ్ ॥ 121 ॥**

**ప్రతిపదార్థము :** అనువృత్తం = పరిశీలనాత్మక దర్శనము; అనువృత్తం దర్శనం = అనువృత్తదర్శనము; సహసా ఆలోకితం = తొందరగా (హఠాత్తుగా)చూచుట; ఆలోకితం మతం = ఆలోకితదర్శనముగా సమ్మతము; పృష్ఠతః = వెనుకకు చూచుట; విలోకితం = విలోకితము.

**తాత్పర్యము :** పరిశీలనాత్మక దర్శనము అనువృత్త దర్శనముతొందరగా (హఠాత్తుగా) చూచుట ఆలోకిత దర్శనముగా సమ్మతము. వెనుకకు చూచుట విలోకితము.

**ఊర్ధ్వే(ల?)క్షణముల్లోకితమధః ప్రేక్షావలోకితమ్ ।**
**॥ ఇత్యష్టదర్శనలక్షణమ్ ॥**
**పదజంఘోరుకరణం సమం కా(ర్య?ర్యం) ప్రయోక్తృభిః ॥ 122 ॥**

**ప్రతిపదార్థము :** ఊర్ధ్వే = పైకిచూచుట; ఉల్లోకితం = ఉల్లోకితము; అధః ప్రేక్షా = క్రిందుగా చూచుట; అవలోకితం = అవలోకితదర్శనము; పార్శ్వతః = ప్రక్కలకు చూచుట; ప్రతిలోకితం = ప్రతిలోకితము;పదం =పాదము; జంఘా = పిక్కలు, ఊరుకరణం = ఊరువులు అనెడి కరణసముదాయము; సమం = సమముగా; ప్రయోక్తృభిః = నాటకకళాకారులచే; కార్యం = చేయదగినది(ప్రయోగింపదగినది).

**తాత్పర్యము :** పైకిచూచుట ఉల్లోకితము, క్రిందుగాచూచుట అవలోకితదర్శనము, ప్రక్కలకు చూచుట ప్రతిలోకితము, పాదము, పిక్కలు,ఊరువులు అనెడి కరణ సముదాయము సమముగా నాటకకళాకారులచే చేయదగినది (ప్రయోగింపదగినది).

**పాదస్యకరణం సర్వం జంఘోరుకృతమిష్యతే ।**
**యథా (పాదః?పదం) ప్రసర్పితం తథైవోరు ప్రవర్తతే ॥ 123 ॥**

**ప్రతిపదార్థము** : పాదస్య కరణం సర్వం = పాదకరణమంతయు; జంఘోరుకృతం ఇష్యతే = జంఘా ఊరుకృతములుగా సమ్మతము; యథా = ఎట్లు; పదం = పాదము(అడుగు); ప్రసర్పితం = ప్రవర్తింపబడునో (ముందువెనుకలకు నడచునో); తథైవ = అట్లే; ఊరు ప్రవర్తతే = ఊరువును ప్రవర్తించును.

**తాత్పర్యము** : పాదకరణమంతయు, జంఘా, ఊరుకృతములుగా సమ్మతము. ఎట్లు పాదము (అడుగు) ప్రవర్తింపబడునో (ముందువెనుకలకు నడచునో)అట్లే ఊరువును ప్రవర్తించును.

**అనయోః సమానకరణాత్ పాదచారీ ప్రయోజయేత్ ।**
**యతః పాదస్తతో హస్తో యతో హస్తస్తతస్త్రికమ్ ॥ 124 ॥**

**ప్రతిపదార్థము** : అనయోః = పాదము మరియు ఊరువులయొక్క; సమానకరణాత్= సమానప్రయోగమువలన; పాదచారీ ప్రవర్తతే = పాదచారి ప్రవర్తించుచున్నది; యత= ఎక్కడ; పాదః = పాదకరణము ప్రవర్తితమో; తతః = తరువాత; అట్లే(వెంటనే); హస్తః = హస్తకరణము; యతః = దేనికంటెను; ఏవిధముగా(ఎక్కడ); హస్తః = హస్తమో; తతః = తరువాత;త్రికం = నడుమును ప్రవర్తితమగును.

**తాత్పర్యము** : పాదము మరియు ఊరువులయొక్క సమాన ప్రయోగము వలన పాదచారి ప్రవర్తించు చున్నది. ఏక్కడ పాదకరణము ప్రవర్తితమో తరువాత అట్లే (వెంటనే) హస్తకరణము దేనికంటెను ఏవిధముగా (ఎక్కడ) హస్తమో తరువాత నడుమును ప్రవర్తితమగును.

**పాదస్య నిర్గమం జ్ఞాత్వా తత్యోపాం (గాని?గం)నియోజయేత్ ।**
**పాదచార్యా యథా పాదో ధరణీమేవ గచ్ఛతి ॥ 125 ॥**

**ప్రతిపదార్థము** : పాదస్య నిర్గమం జ్ఞాత్వా = పాదగమనముతెలిసి; తతః = తరువాత; అపాంగం నియోజయేత్ = అపాంగమును కూర్చవలెను; పాదచార్యా = పాదచారిచే; యథా = ఏవిధముగా; పాదః = పాదము; ధరణీమేవ గచ్ఛతి = నేలనే పొందునో;

**తాత్పర్యము** : పాదగమనమును తెలిసి తరువాత అపాంగమును కూర్చవలెను. పాదచారిచే ఏవిధముగా పాదము నేలనే పొందునో;

**ఏవం హస్తశ్చరిత్వాతు కటీదే(శే?శం) సమాశ్రయేత్ ।**
**అంగికాభినాయాః సర్వే సార్థాః సర్వత్ర జాగ్రతి ॥ 126 ॥**

**ప్రతిపదార్థము** : ఏవం = ఈప్రకారముగా; హస్తః = వలెను; చరిత్వా = హస్తము ప్రవర్తించి; కటిదేశం సమాశ్రయేత్ = కటిప్రదేశమునాశ్రయించు; అంగికాభినయాః సర్వే = అంగికాభినయములన్నియు; సార్థాః = అర్థవంతములై, సప్రయోజనములై; జాగ్రతి = ఉత్తేజకరములై ప్రవర్తించుచున్నవి.

**తాత్పర్యము** : ఈ ప్రకారముగా హస్తము ప్రవర్తించి కటిప్రదేశమునాశ్రయించవలెను. అంగికాభినయములన్నియు అర్థవంతములై సప్రయోజనములై ఉత్తేజకరములై ప్రవర్తించుచున్నవి.

**దేశినృత్యే తు సార్థత్వం నో విచార్యం విపశ్చితా ।**
**ప్రాయో లోకప్రసిద్ధాని కథ్యన్తే తేషు కానిచిత్ ॥ 127 ॥**

**ప్రతిపదార్థము** : దేశినృత్యే = దేశినృత్యమందు; సార్థత్వం = సప్రయోజనత్వము; విపశ్చితా = పండితునిచే; విచార్య = ఆలోచింపబడి; ప్రాయః = తరచుగా; లోకప్రసిద్ధాని= లోకప్రసిద్ధములైనవి; కథ్యంతే = చెప్పబడుచున్నవి; తేషు = వాటిలో; కానిచ్ఛిత్ = కొన్ని;

**తాత్పర్యము** : దేశినృత్యమందు సప్రయోజనత్వమును పండితునిచే ఆలోచింపబడి తరచుగా లోకప్రసిద్ధములైనవి, చెప్పబడుచున్నవి. వాటిలో కొన్ని;

**పేరణం పేక్షణం చైవ గుండిలీ దండరాసకః ।**
**అథైతాని సమాశ్రిత్య వక్ష్యంతే స్థానకాదయః ॥ 128 ॥**

**ప్రతిపదార్థము** : పేరణం = పేరణము; పేక్షణం = పేక్షణము; గుండిలీ = గుండిలి; దండరాసకః ఇతి = దండరాసకము అని; అథ = తరువాత; ఏతాని సమాశ్రిత్య = వీటినాశ్రయించి; స్థానకాదయః వక్ష్యంతే = స్థానకాదులు చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : పేరణము, పేక్షణము, గుండిలి, దండరాసకము అని తరువాత వీటినాశ్రయించి స్థానకాదులు చెప్పబడుచున్నవి.

నంద్యావర్త(మ?క)వర్ధమానసమపాత్ తత్ స్వస్తికం వైష్ణవమ్ ।
పార్ష్ణ్యావిద్ధకపార్ష్ణిపార్శ్వకపరావృత్తాని తద్ గారుడమ్ ।

**సూచీఖండ(ప?పా)దోత్తరా సమయితా సూచీ త్రిభంగీయుతమ్ ।**
**పార్ష్ణి చైకపదోత్తరా (చ)చతురశ్రం సూచికం వైషమమ్ ॥ 129 ॥**

**ప్రతిపదార్థము :** నంద్యావర్తక వర్ధమాన సమపాత్ = నంద్యావర్తకము, వర్ధమాన (క)ము, సమపాదమును; స్వస్తికం = స్వస్తికము; వైష్ణవం = వైష్ణవము; పార్శ్వావిద్ధక పార్ష్ణి పార్శ్వకపరావృత్తాని= పార్శ్వావిద్ధకము పార్ష్ణిపార్శ్వకము పరావృత్తము(లు); గారుడం= గారుడము; సూచీఖండ పదోత్తరా = ఖండసూచకము; సమాయుతాసూచీ = సమసూచియు; త్రిభంగీయుతం = త్రిభంగియు; ఏకపదోత్తరపార్ష్ణి = ఏక పార్శ్వ ఏకపదములును; చతురశ్రం = చతురశ్రము; వైషమం సూచికం = విషమసూచియు;

**తాత్పర్యము :** నంద్యావర్తకము, వర్ధమాన(క)ము, సమపాదమును స్వస్తికము వైష్ణవము పార్శ్వావిద్ధకము పార్ష్ణిపార్శ్వకము పరావృత్తము(లు), గారుడము, ఖండసూచికము సమసూచియు త్రిభంగియు ఏకపార్శ్వఏక పదములును చతురశ్రము విషమసూచియు

**పద్మాసనం నాగబంధో విషమాంతరపూర్వకే ।**
**పద్మాసనం తదా ప్రోక్తం కూర్మాసనమథామపరమ్ ॥ 130 ॥**

**ప్రతిపదార్థము :** పద్మాసనం = పద్మాసనము; నాగబంధః = నాగబంధము; విషమార్తన పూర్వకే పద్మాసనం = విషమపద్మాసనము; అంతరపద్మాసనమును; తదా అపరం = అప్పుడు మరియొక; కూర్మాసనం ప్రోక్తం = కూర్మాసనమును చెప్పబడినది.

**తాత్పర్యము :** పద్మాసనము నాగబంధము విషమపద్మాసనము, అంతర పద్మాసనమును అపుడు మరియొక కూర్మాసనమును చెప్పబడినది.

**వర్ధమానం యది స్థానం షడంగులికృతాంతరమ్ ।**
**నంద్యావర్తం తదేవ స్యాన్నృత్యభేదవిశారదైః ॥ 131 ॥**

**ప్రతిపదార్థము :** వర్ధమానం స్థానం = వర్ధమానస్థానము; షడంగులికృతాన్తరం యది= ఆరు అంగుళులభేదముకలదైనచో; తదేవ = అదియే;నంద్యావర్తంస్యాత్ = నంద్యావర్తకస్థానమగునని; నృత్యభేదవిశారదైః = నృత్యభేదముల నెఱిగిన పండితులచే (చెప్పబడినది).

**తాత్పర్యము :** వర్ధమాన స్థానము ఆరుఅంగుళుల భేదముకలదైనచో అదియే నంద్యావర్తక స్థానమగునని నృత్యభేదములనెఱిగిన పండితులచే (చెప్పబడినది).

**తిరశ్చీనముఖౌ పాదౌ పార్ష్ణిభ్యాం యత్ర సంగతౌ ।**
**స్థానకం వర్ధమానాఖ్యం తత్తదున్నృత్యకోవిదైః ॥ 132 ॥**

**ప్రతిపదార్థము :** తిరశ్చీనముఖౌ పాదౌ = అడ్డుగానున్న ముఖముల పాదములు; పార్ష్ణిభ్యాం=మడమలచే; యత్ర=ఎచ్చట; సంగతౌ=కలియునో; తత్=అది; నృత్యకోవిదైః = నాట్యపండితులచే; వర్ధమానాఖ్యం స్థానకం కథ్యతే = వర్ధమానస్థానకముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అడ్డుగానున్న ముఖముల పాదములు మడమలచే ఎచ్చట కలియునో అది నాట్యపండితులచే వర్ధమానస్థానకముగా చెప్పబడుచున్నది.

**పార్ష్ణ్యంగుష్ఠయుగాంతరాలమితినా జ్ఞేయాశ్చతుష్షట్చ తా ।**
**అంగుళ్యోర్యుగం వి(?)బాహుయుగలం స్వాభావికం సౌష్ఠవమ్ ॥**
**కర్ణాగ్రాత్ కటిగుల్ఫదేశసమతా నాట్యేంకురః కీదృశః ।**
**స్థానం తత్ సముదాహృతం సమపదం పుష్పాంజలిక్షేపణే ॥ 133 ॥**

**ప్రతిపదార్థము :** పార్ష్ణ్యంగుష్ఠ యుతాంతరాలమితినా = మడమ, అంగుష్ఠయుగము యొక్క మధ్యభాగము హద్దుగా; జ్ఞేయా = తెలియదగినది; తాః = అవి; చతుఃషట్ చ= 4+6. (10)గాతెలియదగినది; అంగుళ్యోయుగం = రెండువ్రేళ్లు; బాహుయుగలం= బాహుద్వంద్వము; సౌష్ఠవం స్వాభావికం = సౌష్ఠవము సహజమైనది; కర్ణాగ్రాత్ = కర్ణాగ్రమునుండి; అంకురః = అంకురము; నాట్యే కీదృశః = నాట్యమందెట్టిది?; తత్= అది; పుష్పాంజలి క్షేపణే = పుష్పాంజలిక్షేపణమందు; సమపదం స్థానం సముదాహృతం = సమపదస్థానముగా చెప్పబడినది.

**తాత్పర్యము :** మడమ, అంగుష్ఠయుగముయొక్క మధ్యభాగము హద్దుగా, తెలియదగినది. అవి 4+6 (10)గా తెలియదగినది. రెండువ్రేళ్లు, బాహుద్వంద్వము సౌష్ఠవముసహజమైనది కర్ణాగ్రమునుండి అంకురము నాట్యమందెట్టిది? అదిపుష్పాంజలి క్షేపణమందు సమపదస్థానముగా చెప్పబడినది.

**మంజీరస్థానసంలగ్నే మిథః శ్లిష్టకినష్ఠకౌ ।**
**కుంచితౌ చరణౌ యత్ర స్థానం తత్ స్వస్తి(కర్మకం? కం మతమ్) ॥ 134 ॥**

**ప్రతిపదార్థము :** మంజీరస్థానసంలగ్నే = నూపురస్థానమందు కలసినట్టియు; మిథః= పరస్పరము; శ్లిష్టకనిష్ఠకౌ = కలసిన చిటికెనవ్రేళ్ళుకలదియు; కుంచితౌ చరణౌ =

కుంచించబడిన పాదములు కలది; స్వస్తికం స్థానం మతం = స్వస్తికస్థానమగును.

**తాత్పర్యము** : నూపురస్థానమందు కలసినట్టియు పరస్పరము కలసిన చిటికెనవ్రేళ్లు కలదియు కుంచించబడిన పాదములు కలది స్వస్తికస్థానమగును.

**సమమేకపదం భుమావన్యత్ కించిచ్చ కుంచితమ్ ।**
**పురః ప్రసారితస్తిర్యక్స్థానకం వైష్ణవం విదుః ॥ 135 ॥**

**ప్రతిపదార్థము** : ఏకపదం సమం = ఒకపాదము సమానముగాను; అన్యత్ = మరియొకటి; కించిత్ కుంచితం = కొంచెము కుంచించబడినదై; పురః = ముందునకు; తిర్యక్ = అడ్డుగను; ప్రసారితః యది = ప్రసారితమైనయెడల; వైష్ణవం స్థానం విదుః= వైష్ణవస్థానమగును.

**తాత్పర్యము** : ఒకపాదము సమానముగాను, మరియొకటి కొంచెము కుంచించబడినదై ముందునకు అడ్డుగను ప్రసారితమైనయెడల వైష్ణవస్థానమగును.

**పార్ష్ణ్యంగుష్ఠసమాయోగాత్ స్థానకం పార్ష్ణివిద్ధకమ్ ।**
**పార్శ్వస్యాంతర్గతా పార్ష్ణిః కీర్తితం పార్ష్ణిపార్శ్వకమ్ ॥ 136 ॥**

**ప్రతిపదార్థము** : పార్ష్యంగుష్ఠసమాయోగాత్ = పార్ష్ణి అంగుష్ఠముల కలయికవలన; పార్ష్ణివిద్ధకం స్థానకం స్యాత్ = పార్ష్ణివిద్ధస్థానమగును; పార్శ్వస్య = పార్శ్వమునకు; అంతర్గతా = అంతర్గతమైన; పార్ష్ణిః యది = పార్ష్ణిభాగమున్నయెడల; పార్ష్ణిపార్శ్వకంస్యాత్= పార్ష్ణిపార్శ్వస్థానము.

**తాత్పర్యము** : పార్ష్ణి అంగుష్ఠముల కలయికవలన పార్ష్ణివిద్ధస్థానమగును. పార్శ్వమునకు అంతర్గతమైన పార్ష్ణి భాగమున్నయెడల పార్ష్ణిపార్శ్వస్థానము.

**పార్ష్ణ్యంగుష్ఠః సమో యత్ర తథా పార్ష్ణ్యకనిష్ఠకమ్ (?) ।**
**పరావృత్తం పరిజ్ఞేయం స్థానం స్థానకకోవిదైః ॥ 137 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర, పార్ష్ణ్యంగుష్ఠః = ఎక్కడ పార్ష్ణ్యంగుష్ఠము; సమః = సమమగునో; తథా = అట్లే; పార్ష్ణ కనిష్ఠకం = పార్ష్ణికనిష్ఠము సమమగునో; తత్ = అది; పరావృత్తం స్థానకం పరిజ్ఞేయం = పరావృత్తస్థానకమగును.

**తాత్పర్యము** : ఎక్కడ పార్ష్ణ్యంగుష్ఠములు సమమగునో అట్లే పార్ష్ణికనిష్ఠము సమమగునో అది పరావృత్తస్థానకమగును.

**ఆకుంచితోఽంఘ్రిర్వా మశ్చేత్ తదన్యో జానునా భువి ।**
**పశ్చాన్న్యస్తదాఖ్యాతం స్థానకం గారుడం బుధైః ॥ 138 ॥**

**ప్రతిపదార్థము** : వామః అంఘ్రిః = ఎడమపాదము; ఆకుంచితఃచేత్ = ఆకుంచితమైన యెడల; అన్యః = మరియొకటి; జానువా = జానువుచే; భువి = భూమియందు; పశ్చాత్ న్యస్తః చేత్ = వెనుకకు ఉంచినయెడల; తత్ = అది; బుధైః = పండితులచే; గారుడం స్థానకం ఆఖ్యాతం = గారుడస్థానముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఎడమపాదము ఆకుంచితమైన యెడల మరియొకటి జానువుచే భూమియందు వెనుకకు ఉంచినయెడల అది గారుడస్థానముగా చెప్పబడినది.

**చరణః కుంచితస్త్వేకస్తిర్యగన్యః ప్రసారితః ।**

**ఊరుపార్ష్ణిస్థితో భూమౌ (కథితే?కథితం) ఖండసూచికమ్ ॥ 139 ॥**

**ప్రతిపదార్థము** : ఏకః చరణః = ఒకపాదము; కుంచితః = కుంచితము; అన్యః = మరియొకపాదము; తిర్యక్ ప్రసారితః = అడ్డుగా చాచబడును; భూమౌ = భూమియందు; ఊరుపార్ష్ణిస్థితిః యది = ఊరుపార్ష్ణిస్థితమైన యెడల; ఖండసూచికం కథితం = ఖండసూచీస్థానముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఒకపాదము కుంచితము మరియొక పాదము అడ్డుగా చాచబడును. భూమియందు ఊరుపార్ష్ణిస్థితమైనయెడల ఖండసూచీస్థానముగా చెప్పబడినది.

**భూలగ్నం పార్ష్ణిజంఘోరు తిర్యక్ పాదౌ ప్రసారితౌ ।**
**యత్ర తత్ స్థానకం ప్రాహుః సమసూచీతినామతః ॥ 140 ॥**

**ప్రతిపదార్థము** : పార్ష్ణిజంఘోరు = పార్ష్ణిజంఘ- ఊరువులు; భూలగ్నం = భూసంల్లగ్నమును; తిర్యక్ = తిరశ్చీనముగా; పాదౌ = పాదములు; ప్రసారితౌ = ప్రసారితములగునో; తత్ = దానిని; నామతః = పేరువలన; సమసూచీ ఇతి ప్రాహుః= సమసూచియని చెప్పిరి.

**తాత్పర్యము** : పార్ష్ణిజంఘ- ఊరువులు- భూసంల్లగ్నమును తిరశ్చీనముగా పాదములు ప్రసారితములగునో దానిని పేరువలన సమసూచియనిచెప్పిరి.

న్య(స్త?శ్చ) ద్వామకపోలకం సమపదం వా(మ?మా)కటీనిర్గతా ।
కించిత్ తిర్యగిలి స్థిత్యోన్యచరణో వామాంగలంబాన్వితః ॥

**యద్వక్త్రం కటిపాదమస్తకతలం నారీలసన్నర్తనే ।**
**విజ్ఞేయం లలితం త్రిభంగికమితి స్థానం చ తత్కోవిదైః ॥ 141 ॥**

**ప్రతిపదార్థము** : న్యంచద్వామకపోలకం = కొంచెము వంచబడిన కపోలములుకలదియు; సమపదం = సమపదము(కలదియు); వామాకటీనిర్గతా = వామకటిని (నుండి)నిర్గమించినదై; కించిత్ = కొంచెము; తిర్యక్ ఇతి స్థితః = తిరశ్చీనమువలె నున్నట్టియు; అన్యః చరణః = మరియొకపాదము; వామాంగలంబాన్వితః = వామాంగలంబమైనదియును; యత్ వక్త్రం = ఏముఖము; కటిపాదమస్తకతలం = కటి పాద, శిరోభాగములు (కలది)(నాక్రమించియుండునో); నర్తనే = నర్తనమందు; నారీ = స్త్రీ; లలితం = లలితముగా(మృదువుగా ); లసన్ = ప్రకాశించునో; తత్ = అది; త్రిభంగికంస్థానం ఇతి = త్రిభంగిస్థానమని; తత్కోవిదైః = నాట్యశాస్త్రపండితులచే; విజ్ఞేయం = తెలియదగినది.

**తాత్పర్యము** : కొంచెము వంచబడిన కపోలములుకలదియు, సమపదము (కలదియు) వామకటినుండి నిర్గమించినది, కొంచెము తిరశ్చీనమువలె నున్నట్టియు మరియొకపాదము వామాంగలంబమైనదియును ఏముఖము కటి, పాద, శిరోభాగములు (కలదినాక్రమించియుండునో) నర్తనమందు స్త్రీ లలితముగా (మృదువు)ప్రకాశించునో అది త్రిభంగిస్థానమని నాట్యశాస్త్రపండితులచే తెలియదగినది.

**ఏకపాదః సమో యత్ర బహిస్తిర్యఙ్ముఖోఽపరః ।**
**స్థానకం తత్ సముద్దిష్టమేకపార్ష్ణిబిధం బుధైః ॥ 142 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; ఏకపాదః = (ఒక)ఏకపాదము; సమః = సమముగను; అపరః = మరియొకటి; బహిః = వెలుపలకు; తిర్యఙ్ముఖః = తిర్యక్ముఖమైనదియు అగునో; తత్ = అది; బుధైః = పండితులచే; ఏకపార్ష్ణిభిధంస్థానకం సముద్దిష్టం = ఏకపార్ష్ణికస్థానముగ చెప్పబడినది.

**తాత్పర్యము** : ఎక్కడ (ఒక)ఏకపాదము సమముగను మరియొకటి వెలుపలకు తిర్యక్ముఖమైనదియు అగునో అది పండితులచే ఏకపార్ష్ణికస్థానముగ చెప్పబడినది.

**ఏకఃసమోంఽవఘ్రిర్యస్య చేత్తజ్జానుకమస్తకః ।**
**బాహ్యాపార్శ్వకృతాశ్లేషమేకపాదాభిధం బుధైః ॥ 143 ॥**

**ప్రతిపదార్థము** : యస్య = దేనికి; ఏకః అంఘ్రిః సమః = ఒకపాదము సమమగునో; తత్ = అది; జానుక మస్తకః = జానుమస్తమ(పర్యంతమగునో) ము(లు); బాహ్యాపార్శ్వకృతాశ్లేషం = బాహ్యాపార్శ్వములచే చేయబడిన కలయిక కలదియగునో; తత్ = అది; బుధైః = పండితులచే; ఏకపాదాభిధం స్థానకం = ఏకపాదస్థానకముగ చెప్పబడినది.

**తాత్పర్యము** : దేనికి ఒకపాదము నమమగునో అది జానుమన్తక (పర్యంతమగునో)ము(లు) బాహ్యాపార్శ్వములచే చేయబడిన కలయిక కలదియగునో అది పండితులచే ఏకపాదస్థానముగ చెపన్పబడినది.

**నంద్యావర్తం యదా సార్థం తాలం చరణయోర్భవేత్ ।**
**స్థానకం చతురశ్రం తత్ కథయంతి విచక్షణాః ॥ 144 ॥**

**ప్రతిపదార్థము** : యదా = ఎప్పుడు; నంద్యావర్తం =నంద్యావర్తము; సార్థం = అర్థవంతమగునో; తాలం = తాళము; చరణయోఃభవేత్ = పాదములయందగునో; తత్ = దానిని; విచక్షణాః = పండితులు; చతురశ్రం కథయంతి =చతురశ్రముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : ఎప్పుడు నంద్యావర్తము అర్థవంతమగునో తాళము పాదముల యందగునో దానిని పండితులు చతురశ్రముగా చెప్పుచున్నారు.

**పురః పశ్చాచ్చ చరణౌ సూచిలక్షణలక్షితౌ ।**
**తదా విషమసూచీతి స్థానకం కథితం బుధైః ॥ 145 ॥**

**ప్రతిపదార్థము** : యదా = ఎప్పుడు; సూచిలక్షణలక్షితౌ = సూచీలక్షణచిహ్నితములైన; చరణౌ = పాదములు; పురః = ముందునకు; పశ్చాచ్చ = వెనుకకును అగునో; తదా = అవ్పుడు; బుధైః = వండితులచే; విషమనూచీస్థానకం కథితం = విషమసూచీస్థానకముగ చెప్పబడినది.

**తాత్పర్యము** : ఎప్పుడు సూచీలక్షణచిహ్నితములైన పాదములు ముందునకు వెనుకకును అగునో అప్పుడు పండితులచే విషమసూచీస్థానము చెప్పబడినది.

**సమసూచీస్థితౌః నృత్తైః పాదయోర్బంధ నం యదా ।**
**క(రే?రో)తి నర్తకస్తచ్చ పద్మాసనమితి స్మృతమ్ ॥ 146 ॥**

**ప్రతిపదార్థము** : సమసూచి స్థితౌ = సమసూచిస్థితియందు; యధా = ఎప్పుడు; నర్తకః= నర్తకుడు; పాదదయోః బంధనం కరోతి = పాదములకు బంధనమును చేయునో; తత్ = అది; పద్మాసనమితి స్మృతమ్ = పద్మాసనమని చెప్పబడినది

**తాత్పర్యము** : సమసూచిస్థితియందు ఎప్పుడు నర్తకుడు పాదములకు బంధనమును చేయునో అది పద్మాసనమని చెప్పబడినది.

> **ఉపవిష్టేస్య వామోరుః పృష్ఠే స్యాద్దక్షిణో యదా ।**
> **జంఘాస్థానం సమేత్తస్యాం నాగబంధాభిధం తదా ॥ 147 ॥**

**ప్రతిపదార్థము** : యదా = ఎప్పుడు; అస్య = నర్తకునియొక్క; వామోరుః పృష్ఠే ఉపవిష్టే= వామోరు పృష్ఠమందు ఉపనిష్టముకాగా; దక్షిణజంఘాస్థానం = దక్షిణజంఘాస్థానము; తస్యాం = దానియందు; సమేత్ = కలయునో; తదా = అప్పుడు; నాగబంధాభిధం స్యాత్ = నాగబంధమును స్థానమగును.

**తాత్పర్యము** : నర్తకునియొక్క ఎప్పుడు వామోరుపృష్ఠమందు ఉపనిష్టముకాగా దక్షిణజంఘాస్థానము దానియందు కలయునో అప్పుడు నాగబంధమును స్థానమగును.

> **తదేవాంతరపద్మాసనమాభాతి విషమం యది ।**
> **పాదయోర్విషమం తచ్చ పద్మాసనముదీరితమ్ ॥ 148 ॥**

**ప్రతిపదార్థము** : తదేవ = అదియే; అంతర విషమం ఆభాతి పద్మాసనం = అంతరపద్మాసనముగా విషమము చేయబఢగా; పాదయోః = పాదములయొక్క; విషమం పద్మాసనం ఉదీరితం = విషమపద్మాసనముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : అదియే అంతర పద్మాసనముగా విషమము చేయబడగా పాదములయొక్క విషమపద్మాసనముగా చెప్పబడినది.

> **ఉత్ప్లుత్యాపి ప్రసార్యాంఘ్రీ యస్తయోర్బంధ అంతరే ।**
> **పద్మాసనం తదేవ స్యాదంతరం కథితం బుధైః ॥ 149 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్ప్లుత్యాపి = గెంతికూడ; అంఘ్రీ ప్రసార్య = పాదములను చాపి; తయోంతరే =వాటి(మధ్యన)అంతరమందు; బంధః స్యాత్చేత్ = బంధమున్నయెడల; తదేవ = అదియే; అంతరం పద్మాసనం కథితం = అంతరపద్మాసనస్థానముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : గెంతికూడ పాదములనుచాపి వాటి(మధ్యన)అంతరమందు బంధమున్నయెడల అదియే అంతరపద్మాసనస్థానముగా చెప్పబడినది.

**దక్షిణో జానుగుల్ఫేన పాదస్పృష్టమహీతలః ।**
**వామపాదశ్చ యత్ర స్యాత్ స్థానం కూర్మాసనం స్మృతమ్ ॥ 150 ॥**
**॥ ఇతి దేశిస్థానలక్షణమ్ ॥**

**ప్రతిపదార్థము** : దక్షిణః జానుగుల్ఫేన = దక్షిణజానుగుల్ఫముచే; పాదస్పృష్టమహీతలః= పాదముచే తాకబడిన భూమికలదియు; యత్ర = ఎక్కడ; వామపాదశ్చ = వామపాదముకూడ; స్యాత్ = అగునో; తత్ = అది; కూర్మాసనం స్థానం స్మృతం = కూర్మాసనస్థానముగా నిగదితము.

**తాత్పర్యము** : దక్షిణజానుగుల్ఫముచే పాదముచే తాకబడిన భూమికలదియు ఎక్కడ వామపాదముకూడ అగునో అది కూర్మాసనస్థానముగా నిగదితము.

**సరికార్థపురాడీ చ స్వస్తికః స్ఫురికస్తథా ।**
**నికుట్టకస్తలోత్క్షేపః పృష్ఠోత్క్షేపశ్చ వేష్టనమ్ ॥ 151 ॥**

**ప్రతిపదార్థము** : సరికా, అర్థపురాడి, (టికా) స్వస్తిక, స్ఫురిక, నికుట్టక, తలోత్క్షేపః, పృష్ఠోత్క్షేప, వేష్టనం.

**తాత్పర్యము** : సరికా, అర్థపురాడి, (టికా), స్వస్తిక, స్ఫురిక, నికుట్టక, తలోత్క్షేపః, పృష్ఠోత్క్షేప, వేష్టనం.

**అర్థస్థలనికా లుత్తా వరాటీ ప్రావృతం తథా ।**
**ఉద్వేష్టనం తతోల్లాలః సమస్థలతికా తథా ॥ 152 ॥**

**ప్రతిపదార్థము** : అర్థస్థలనికా, లుత్తా, వరాటీ (పురాటికా) ప్రావృతం, ఉద్వేష్టనం, ఉల్లాల, (ఉలలు), సమస్థలతికా.

**తాత్పర్యము** : అర్థస్థలనికా, లుత్తా, వరాటీ (పురాటికా) ప్రావృతం, ఉద్వేష్టనం, ఉల్లాల, (ఉలలు), సమస్థలతికా.

**లతాక్షేపో డమరుకో విక్షేపః కర్తరీ తథా ।**
**తథలో (?)గారుడః పక్షో లలాటతిలకస్తథా ॥ 153 ॥**

**ప్రతిపదార్థము :** లతాక్షేపము, డమరుకము; విక్షేపము, కర్తరి, తథల(తట్టల)ము, గరుడ పక్షము, లలాటతిలకము.

**తాత్పర్యము :** లతాక్షేపము, డమరుకము; విక్షేపము, కర్తరి, తథల(తట్టల)ము, గరుడ పక్షము, లలాటతిలకము.

> **ఫేల్లణాలగుపాలౌ చ పాలో నిస్సరసస్తతః ।**
> **పంచవింశతిపాలాః స్యుః కథితా లక్షణాన్వితాః ॥ 154 ॥**

**ప్రతిపదార్థము :** ఫేల్లణాపాలము, లగుపాలకము, (వింధవణపాలము), నిస్సరడపాలము (పాదము)అని, లక్షణాన్వితాః = లక్షణయుతములైన; పంచవింశతిపాలాః = 25పాల(ద)ములు; కథితాః స్యుః = చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము :** ఫేల్లణపాలము, లగుపాలకము (వింధవణపాలము) నిస్సరడపాలము (పాదము) అని లక్షణయుతములైన 25 పాల(ద)ములు చెప్పబడుచున్నవి.

> **భూచరాః ఖేచరాశ్చేతి భేదస్తత్ర సమీరితః ।**
> **పాలా ఉప్పరపాలాశ్చ నామ తేషాముదాహృతమ్ ॥ 155 ॥**

**ప్రతిపదార్థము :** భూచరాః = భూచరములని; ఖేచరాః ఇతిచ = ఆకాశచరములనియు; తత్ర = అందు; భేదః సమీరితః = భేదముచెప్పబడినది; పాలాః = పాలులనియు; ఉప్పరపాలాశ్చ = ఉప్పరపాలులనియు; తేషాం = వాటికి; నామ ఉదాహృతం = పేరుచెప్పబడినది.

**తాత్పర్యము :** భూచరములని ఆకాశచరములనియు అందు భేదముచెప్పబడినది. పాలులనియు ఉప్పరపాలులనియు వాటికి పేరు చెప్పబడినది.

> **కేనాప్యేకేన పాదేన సరసం సరికా భవేత్ ।**
> **స్థితోద్వృత్తనికుట్టేన పాదేనాభ్యేవ కుట్టనమ్ ॥ 156 ॥**

> **యదుత్రత్తస్య పాదస్య సా జ్ఞేయార్ధ పురాటికా ।**
> **స్వస్తికాకారఘటనా పాదయోః స్వస్తికా భవేత్ ॥ 157 ॥**

**ప్రతివదార్థము :** కేనాపిఏకేన పాదేన = ఏదేని ఒకపాదముతో; సరసం = హృదయరంజకమైనచో; సరికా భవేత్ = సరికాప్రభేదమగును; ఉత్ప్రవృత్తస్య పాదస్య=

ఉ(త్ప)వృత్తపాదము(నకు)యొక్క; స్థితోద్వృత్తనికుట్టేన పాదేన = ఉన్న ఉద్వృత్తిని కుట్టపాదముతో; అభ్యవకుట్టనంయత్ = అవకుట్టన మేదికలదో; సా= అది; అర్ధపురాటికా జ్ఞేయా = అర్ధపురాటిక యనితెలియదగినది; పాదయోః = పాదములయొక్క; స్వస్తికాకారఘటనా = స్వస్తికాకార సంయోజనము; స్వస్తికా భవేత్= స్వస్తికయగును.

**తాత్పర్యము** : ఏదేని ఒక పాదముతో హృదయరంజకమైనచో సరికాప్రభేదమగును. ఉ(త్ప)వృత్తపాదము (నకు)యొక్క ఉన్న ఉద్వృత్తనికుట్టపాదముతో అవకుట్టన మేదికలదో అది అర్ధపురాటిక యని తెలియదగినది. పాదములయొక్క స్వస్తికాకారసంయోజనము స్వస్తియగును.

**అంగులీపృష్ఠభాగేన పాదాభ్యాం గమనం తు యత్ ।**
**పురతః పృష్ఠతో వాపి పార్శ్వతః స్ఫురికా భవేత్ ॥ 158 ॥**

**ప్రతిపదార్థము** : పురతః = ఎదురుగను; పృష్ఠతః = వెనుకకు; పార్శ్వతః వా = ప్రక్కగాని; అంగళీపృష్ఠభాగేన = వ్రేళ్ల వెనుకభాగముతో; పాదాభ్యాం యద్గయనం = పాదములచే యే నడక గలదో; సా = అది; స్ఫురికా భవేత్ = స్ఫురికయగును; సా పురితి ప్రసిద్ధా = అది పురియని ప్రసిద్ధమైనది

**తాత్పర్యము** : ఎదురుగను, వెనుకకు ప్రక్కగాని వ్రేళ్ల వెనుకభాగముతో పాదములచే యే నడకగలదోఅది స్ఫురికయగును. అది పురియని ప్రసిద్ధమైనది.

**సమ(రు?కు)శ్చి(త)పాదాగ్రే స్థితిర్జ్ఞేయా నికుట్టనీ ।**
**పృష్ఠతః పురతో వాపి కుంచితేనాంఘ్రిణా యది ॥ 159 ॥**

**ప్రతిపదార్థము** : సమకుంచితపాదాగ్రే = సమకుంచిత పాదాగ్రమందు; స్థితిః = స్థితి; నికుట్టనీ జ్ఞేయా = నికుట్టనిగా తెలియదగినది; పృష్ఠతః = వెనుకకు; పురతః వాఅపి= ముందునకుగాని; కుంచితేన అంఘ్రిణా = కుంచితమైన పాదముతో (యది);

**తాత్పర్యము** : సమకుంచితపాదాగ్రమందు స్థితి నికుట్టనిగా తెలియదగినది. వెనుకకు ముందునకుగాని, కుంచితమైన పాదముతో;

జానమాత్రసముత్క్షేపాత్ తలోత్క్షేపః స కథ్యతే ।
పృష్ఠతోంఘ్రే సముత్క్షేపాత్ పృష్ఠోత్క్షేపశ్చ కథ్యతే ॥ 160 ॥

**ప్రతిపదార్థము** : జానుమాత్రసముత్క్షేపాత్ = జానుమాత్రఉత్క్షేపమువలన; తలోత్క్షేపః కథ్యతేః తలోత్క్షేపః = తలోత్క్షేపము(గా) చెప్పబడుచున్నది; పృష్ఠత అంఘ్రేః = వెనుక పాదముయొక్క; సముత్క్షేపాత్ = పైకెత్తుటవలన; పృష్ఠోత్క్షేపః = పృష్ఠోత్క్షేపము; కథ్యతే= చెప్పబడుచున్నది; సః భరణీపుట ఇతి ప్రసిద్ధః = అది భరణీపుటమని ప్రసిద్ధము.

**తాత్పర్యము** : జానుమాత్ర ఉత్క్షేపమువలన తలోత్క్షేపము(గా) చెప్పబడుచున్నది. వెనుక పాదముయొక్క పైకెత్తుటవలన పృష్ఠోత్క్షేపము చెప్పబడుచున్నది. అది భరణీపుటమని ప్రసిద్ధము.

**ఏకాంఘ్రిణా యదన్యస్య వేష్టనాదేవ వేష్టనః ।**
**స్ఖలనాత్ తిర్యగేకాంఘ్రేరర్ధస్ఖలనికా భవేత్ ॥ 161 ॥**

**ప్రతిపదార్థము** : ఏకాంఘ్రిణా = ఒకకాలితో; అన్యస్యవేష్టనాత్ ఏవ = మరియొకపాదమును చుట్టుటవలననే; వేష్టనః = వేష్టనప్రబేదమగును; ఏకాంఘ్రేః = ఒకపాదముయొక్క; తిర్యక్ స్ఖలనాత్ = అడ్డైన స్ఖలనమువలన; అర్ధ స్ఖలనికా భవేత్= అర్ధస్థలనికయగును.

**తాత్పర్యము** : ఒకకాలితో మరియొకపాదమును చుట్టుటవలననే వేష్టనప్రభేదమగును. ఒకపాదముయొక్క అడ్డైన స్థలనమువలన అర్ధస్ఖలనికయగును.

**పదాగ్రేణాహతిర్భూమే(?) ఖుత్తా నామ ప్రకీర్తితా ।**
**తద్వృత్తాం వినికుట్టేన మిథః ప్రోక్తా పురాటికా ॥ 162 ॥**

**ప్రతిపదార్థము** : పదాగ్రేణ = పదాగ్రముచే; భూమేః ఆహతిః యది = భూమికి ఆహతి(దెబ్బ)కల్గినయెడల; ఖుత్తానామప్రకీర్తితా = ఖుత్తానామకప్రభేదముగా చెప్పబడుచున్నది; తద్వృత్తాం = దానినిచుట్టబడియుండి (అది జరిగిన తరువాత); మిథః = అన్యోన్యము; వినికుట్టేన = నికుట్టనముచే; పురాటికా ప్రోక్తా = పురాటిక యగును.

**తాత్పర్యము** : పదాగ్రముచే భూమికి ఆహతి(దెబ్బ)కల్గినయెడల ఖుత్తానామక ప్రభేదముగా చెప్పబడుచున్నది. దానిని చుట్టబడియుండి (అది జరిగిన తరువాత) అన్యోన్యము నికుట్టనముచే పురాటికయగును.

ఉద్వృత్తో యస్య పాదః స్యాత్ సలీలం లలితం విదుః ।
ప్రావృతం నామ విజ్ఞేయం క్రీడాస్థానం మనోభువః ॥ 163 ॥

**ప్రతిపదార్థము** : యస్య పాదః = ఏ నర్తకుని పాదము; సలీలం = హేలగా; లలితం = మృదువుగా; ఉద్వృత్తఃస్యాత్ = ఉద్వృత్తమగునో; సః = అది; మనోభువః క్రీడాస్థానం= మన్మథునకు క్రీడాస్థానమైన; ప్రావృతంనామ విజ్ఞేయం = ప్రావృతమనునదిగా తెలియదగినది.

**తాత్పర్యము** : ఏ నర్తకుని పాదము హేలగా, మృదువుగా ఉద్వృత్తమగునో అది మన్మథునకు క్రీడాస్థానమైన ప్రావృతమనునదిగా తెలియదగినది.

**పశ్చాత్ ప్రాపణమంఘ్రేర్యదుద్వేష్టనముదీరితమ్ ।**
**ఉల్లోలాంఘ్రిక్రమేణాంఘ్రియుగ్మం సోలుల ఇష్యతే ॥ 164 ॥**

**ప్రతిపదార్థము** : అంఘ్రేః పశ్చాత్ప్రాపణం యత్ = పాదమును వెనుకకు పంపుట ఏది కలదో (అది); ఉద్వేష్టనం ఉదాహృతమ్ = ఉద్వేష్టనముగ నిరూపింపబడినది; ఉల్లోలాంఘ్రిక్రమేణ = ఉల్లోలపాదక్రమముచేత; అంఘ్రియుగ్మం = పాదయుగళము; సోలులః ఇష్యతే = సోలులము (ఉల్లాసము)గ సమ్మతము.

**తాత్పర్యము** : పాదమును వెనుకకు పంపుట ఏదికలదో (అది) ఉద్వేష్టనముగ నిరూపింపబడినది. ఉల్లోలపాదక్రమముచేత పాదయుగళము సోలులము (ఉల్లాసము)గ సమ్మతము.

**పురతః పృష్ఠస్తిర్యక్ పాదయోః స్ఖలనం సమమ్ ।**
**సమ స్ఖలతికా నామ పాదః ప్రోక్తో విచక్షణైః ॥ 165 ॥**

**ప్రతిపదార్థము** : పురతః = ముందు; పృష్ఠతః = వెనుక; తిర్యక్ = అడ్డముగ; పాదయోః స్ఖలనం = పాదముల స్ఖలనము; యది సమమ్ = సమానమైన యెడల; విచక్షణైః = విద్వాంసులచే; సమస్ఖలనికా నామ = సమస్ఖలనమను; పాదః ప్రోక్తః = పాదముగ చెప్పబడినది.

**తాత్పర్యము** : ముందు, వెనుక, అడ్డముగ పాదముల స్ఖలనము సమానమైనయెడల విద్వాంసులచే సమస్ఖలనమను పాదముగ చెప్పబడినది.

**ఏకస్య పృష్ఠతః కృత్వా పురతోంఘ్రిం ప్రసార్య చ ।**
**నికుట్టనే కృతే తేన లతాక్షేపః స కథ్యతే ॥ 166 ॥**

**ప్రతిపదార్థము** : ఏకస్య పృష్ఠతః కృత్వా = ఒకపాదమును వెనుకకు ఉంచి; పురతః =

ముందునకు; అంఘ్రిం ప్రసార్య = పాదమును చాచి; నికుట్టనే కృతే = నికుట్టనముచేయగా; సః = అది; లతాక్షేపః కథ్యతే = లతాక్షేపముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఒకపాదమును వెనుకకు ఉంచి ముందునకు పాదమును చాచి నికుట్టనము చేయగా అది లతాక్షేపముగా చెప్పబడినది.

> **ఏకస్య పృష్ఠతః కృత్వా పురతోఽంఘ్రిం ప్రసార్య చ ।**
> **నికుట్టనే కృతే తేన లతాక్షేపః స కథ్యతే ॥ 166 ॥**

> **ఏకాంఘ్రిణా క్షితౌ స్థిత్వా భ్రామయిత్వేతరం పదమ్ ।**
> **స్థాపనే తస్యజా+తు ఇతరేణోరుతా ++ ॥ 167 ॥**

**ప్రతిపదార్థము** : ఏకంఘ్రిణా = ఒకపాదముతో; క్షితౌ స్థిత్వా = భూమియందుండి; ఇతరం పదం = మరియొకపాదమును; భ్రామయిత్వా = చుట్టును త్రిప్పించి; స్థాపనే= ఉంచగా; తస్య = దానికి; ఇతరేణ ఊరుతాడితా = మరియొక ఊరువుచే తాడితమైన; పాదః = పాదము.

**తాత్పర్యము** : ఒకపాదముతో భూమియందుండి మరియొకపాదమును చుట్టును త్రిప్పించి ఉంచగా దానికి మరియొక ఊరువుచే తాడితమైన పాదము.

> **+ణ్డికా భాషాకుశలైః పాదో డమరుకః స్మృతః ।**
> **పార్ష్ణి తాలాంతరం పార్శ్వం పురోదేశం స్థితే పదే ॥ 168 ॥**

**ప్రతిపదార్థము** : భాషాకుశలైః = భాషనెఱిగిన వారలచే; డమరుకః స్మృతః = డమరుకముగ చెప్పబడినది; పార్ష్ణి తాలాంతరం = మడమ తాలాంతరముగా; పార్శ్వం= పార్శ్వము; పురోదేశం = పురోభాగమున; పదేస్థితే = పాదముండగా;

**తాత్పర్యము** : భాషనెఱిగిన వారలచే డమరుకముగ చెప్పబడినది. మడమ తాలాంతరముగా పార్శ్వము పురోభాగమున పాదముండగా;

> **పాదాంతరాంగులీసంగమూరోర్విక్షేప ఈరితః ।**
> **విధాయ చరణావేతౌ కర్తరీయత్పురస్థితౌ ॥ 169 ॥**

**ప్రతిపదార్థము** : ఊరోః = ఊరువుయొక్క; పాదాంతరంగులీసంగం = పాదాంతరమందలి అంగుళుల సంయోగము; విక్షేపఃఈరితః = విక్షేపముగా

చెప్పబడినది; యత్ కర్తరీపురస్థితౌ = కర్తరీ (ముఖముగా) ముందున్నట్లుగా; ఏతౌ చరణౌ విధాయ = ఈపాదములనుంచి;

**తాత్పర్యము :** ఊరువుయొక్క పదాంతరమందలి అంగుళుల సంయోగము విక్షేపముగా చెప్పబడినది. కర్తరీ(ముఖముగా) ముందున్నట్లుగా ఈపాదములనుంచి;

**పాదః కర్తరిసంజ్ఞేయో నృత్యశాస్త్రవిశారదైః ।**
**నృత్తే చ కరణే కార్యా తదూరోరన్యపాదతః ॥ 170 ॥**

**ప్రతిపదార్థము :** (న)సః = అది; (నృత్యశాస్త్రవిశారదైః = నాట్యశాస్త్ర పండితులచే); కర్తరీసంజ్ఞేయః = కర్తరియని తెలియదగినది; నృత్తే = నృత్తమందు; కరణే చ = కరణమందును; అన్యపాదతః = మరియొకపాదమునుండి; ఊరోః = ఊరువునకు; కార్యా = చేయదగినది.

**తాత్పర్యము :** అది కర్తరియని తెలియదగినది. నృత్తమందు కరణమందును మరియొక పాదమునుండి ఊరువునకు చేయదగినది.

**ప్రధార్యతాసనం తజ్జైస్తట్టాల ఇతి కథ్యతే ।**
**కథ్యతే గారుడః పక్షః సమసూచీ పురీయుతా ॥ 171 ॥**

**ప్రతిపదార్థము :** ఆసనం ప్రధార్యతా = ఆసనము ధరించుట జరుగగా; తట్టాల ఇతికథ్యతే = తట్టాలమని చెప్పబడినది; సమసూచీ పురీయుతా గారుడః పక్షఃకథ్యతే= సమసూచిపూరీయుత గారుడపక్షముగా చెప్పబడినది.

**తాత్పర్యము :** ఆసనము ధరించుట జరుగగా తట్టాలమని చెప్పబడినది. సమసూచీ పురీయుత గారుడపక్షముగా చెప్పబడినది.

**భ్రామయిత్వైకచరణం స్థాపనే తస్య లాఘవాత్ ।**
**పాదావానీయ నర్తక్యా పృష్ఠతోऽంగుష్ఠసంగమమ్ ॥ 172 ॥**

**ప్రతిపదార్థము :** ఏకచరణం = ఒకపాదము; భ్రామయిత్వా = త్రిప్పి; తస్య లాఘవాత్= దాని లాఘవమువలన; పాదౌ ఆనీయ = పాదములను తెచ్చి; నర్తక్యా = నర్తకిచే; పృష్ఠతః = వెనుకనుండి; అంగుష్ఠసంగమం = బ్రొటనవ్రేలితో కలసి;

**తాత్పర్యము :** ఒకపాదము త్రిప్పి దానిలాఘవమువలన పాదములనుతెచ్చి నర్తకిచే వెనుకనుండి బ్రొటనవ్రేలితో కలసి;

**లలాటే అభిముఖం యాతే లలాటతతిలకః స్మృతః ।**
**గతిః కురులయర్ధేన చరణాభ్యాం మనోహరా (?) ॥ 173 ॥**

**ప్రతిపదార్థము** : లలాటే = పాలమందు, అభిముఖం యాతే = ఎదురుగా; యా లలాటతిలకః స్మృతః = లలాటతిలకముగా చెప్పబడినది; కురులయార్ధేన = కురులయార్ధముతో; చరణాభ్యాం మనోహరాగతిః = పాదముల అందమైన గమనము (గతి);

**తాత్పర్యము** : పాలమందు, ఎదురుగా లలాటతిలకముగాచెప్పబడినది. కురులయార్ధముతో పాదములఅందమైన గమనము (గతి);

**ఫేల్లణాపాల ఇత్యేష కథితో నృత్యకోవిదైః ।**
**ఊరౌ తదన్యపాదేన సంగమో లగపాలకః ॥ 174 ॥**

**ప్రతిపదార్థము** : ఏషః = ఇది; నృత్యకోవిదైః = నాట్యశాస్త్రజ్ఞులచే; ఫేల్లణాపాల ఇతి కథితః = ఫేల్లణాపాటపదమని చెప్పబడుచున్నది; ఊరౌ = ఊరువునందు; తదన్యపాదేన = ఆమరియొక పాదముచే; సంగమః = కలయిక; లగపాలకః = లగపాలకమగును.

**తాత్పర్యము** : ఇది నాట్యశాస్త్రజ్ఞులచే ఫేల్లణాపాటపదమని చెప్పబడుచున్నది. ఊరువునందు ఆమరియొక పాదముచే కలయిక లగపాలకమగును.

**పురీడిధావచ్చరణస్తదన్యః (?)కురులయాన్వితః ।**
**పాలోవింధవణః ప్రోక్తో నృత్యవిద్యావిశారదైః ॥ 175 ॥**

**ప్రతిపదార్థము** : పురుడి ధావత్ = పురీడియందు వలె; తదన్యః చరణః = ఆమరియొక పాదము; కురులయాన్వితః = కురులయాసంగతమైనచో; నృత్యవిద్యావిశారదైః = నాట్యకోవిదులచే; వింధవణః పాలః ప్రోక్తః = వింధవణ పాలపాదమగును.

**తాత్పర్యము** : పురీడియందువలె ఆమరియొక పాదము కురులయాసంగతమైనచో నాట్యకోవిదులచే వింధవణ పాలపాదమగును.

**పిచ్ఛిలాపసృతం యద్వన్నర్తక్యా నర్తనే తథా ।**
**తిర్యక్పాదాపసరణం పాదో నిస్సరథాభిదః ॥ 176 ॥**

**ప్రతిపదార్థము** : నర్తక్యా = నర్తకిచే; నర్తనే = నర్తనమందు; పిచ్ఛలాపసృతంయద్వత్= విడివిడిగా (వికృతిగా); తిర్యక్ పాదాపసరణం = తిరశ్చీనముగా పాదమును చాచిన; నిస్సరడాభిధః స్యాత్ = నిస్సరడపాదమగును.

**తాత్పర్యము** : నర్తకిచే నర్తనమందు విడివిడిగా (వికృతిగా) తిరశ్చీనముగా పాదమును చాచిన నిస్సరడ పాదమగును.

**పాదౌ సమనఖౌ శ్లిష్టౌ విశ్లిష్టౌ చ ప్రయోగతః ।**
**చేచ్చారీ సమపాదాఖ్యా నానాస్థానసమాశ్రయా ॥ 177 ॥**

**ప్రతిపదార్థము** : పాదౌ = పాదములు; సమనఖౌ శ్లిష్టౌ = సమమైన నఖములు కలవి; ప్రయోగతః = ప్రయోగమువలన; విశ్లిష్టౌ = విడినవియు; చేత్ = అయినయెడల; నానాస్థానసమాశ్రయా = అనేక స్థానముల నాశ్రయించిన; సమపాదాఖ్యా చారీ స్యాత్ = సమపాదమను చారియని చెప్పబడినది.

**తాత్పర్యము** : పాదములు సమమైన నఖములు కలవి, కలసినవియు, ప్రయోగమువలన విడినవియు, అయినయెడల అనేక స్థానములనాశ్రయించిన సమపాదమను చారియని చెప్పబడినది.

**॥ ఇతి (పయ?)పాలలక్షణమ్ ॥**

**॥ అథోత్ప్లుతీకరణమ్ ॥**

**కథ్యన్తే దర్పసరణం బిందుః సా లోహలీ తథా ।**
**అంచితశ్చేతి చత్వారో యోగభేదాస్తదాంతరే ॥ 178 ॥**

**ప్రతిపదార్థము** : దర్పసరణము, బిందు(వు)లోహలీ, అంచితము; ఇతి = అని; చత్వారః= నాల్గు; యోగభేదాః = యోగభేదములు; కథ్యన్తే = చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : దర్పసరణము, బిందు(వు), లోహలీ, అంచితము అని నాల్గు యోగభేదములు చెప్పబడుచున్నవి.

**వైష్ణవస్థానకే స్థిత్వా తిర్యగావర్తి (తామ్రపి?తాంఘ్రికమ్) ।**
**తదుక్తం దర్పసరణం కరణం నృత్తవేదిభిః ॥ 179 ॥**

**ప్రతిపదార్థము** : యత్ = ఏ పాదము; వైష్ణవస్థానకే స్థిత్వా = వైష్ణవస్థానమందుండి;

తిర్యగావర్తితాంఘ్రికం = అడ్డముగా త్రిప్పబడిన పాదము కలదో; తత్ = అది; నృత్తవేదిభిః = నాట్య శాస్త్రజ్ఞులచే; దర్పసరణం కరణం ఉక్తం = దర్పసరణమను కరణమనిచెప్పబడినది.

**తాత్పర్యము** : ఏపాదము వైష్ణవస్థానమందుండి అడ్డముగా త్రిప్పబడిన పాదముకలదో అది నాట్యశాస్త్రజ్ఞులచే దర్పసరణమను కరణమని చెప్పబడినది.

**వామం కూర్పరమానిధాయ భువి తద్ యత్రోత్తలస్థం శిరో -**

> **నిక్షిప్తాహితదీర్ఘకాః కటితటీకాన్నూరుజంఘాః క్షితౌ ।**
> **కృత్వాన్యం చరణం తదూర్ధ్వఫలకే తజ్జానుమత్తస్థితౌ ।**
> **బాహుస్తజ్జలశాయి నామ కరణం యత్ కథ్యతే కోవిదైః ॥ 180 ॥**

**ప్రతిపదార్థము** : భువి = భూమియందు; వామం కూర్పరం అనిధాయ = ఎడమహస్త మూలమునుంచి; యత్ఉత్తలస్థం = పైకెత్తబడిన; శిరః = శిరస్సును; క్షితౌ నిక్షిప్తాహితదీర్ఘకాః = భూమియందు ఉంచబడిన; చాచబడినట్టియు, దీర్ఘములైనట్టి పాదములును; కటితటీకాన్ ఊరుజంఘాః = కటిప్రదేశముమొదలు జంఘలవరకు గల అవయవములుకల్గునట్లు; కృత్వా = చేసి; అన్యం చరణం = మరియొక పాదము; తదూర్ధ్వఫలకే = ఊర్ధ్వఫలకమందు; బాహుః = బాహువు; జానుమత్తస్థితౌ = జానువులున్నట్టుండగా; తత్ =అది; జలశాయి నామ కరణం కథ్యతే = జలశాయి కరణమని చెప్పబడినది.

**తాత్పర్యము** : భూమియందు ఎడమహస్తమూలమునుంచి పైకెత్తబడిన శిరస్సును భూమియందు ఉంచబడిన, చాచబడినట్టియు, దీర్ఘములైనట్టిపాదములును, కటిప్రదేశముమొదలు జంఘలవరకు గల అవయవములుకల్గునట్లు చేసి మరియొక పాదము ఊర్ధ్వఫలకమందు బాహువు జానువులున్నట్టుండగా అది జలశాయికరణమని చెప్పబడినది.

> **స్థిత్వా సమపదేనైవ పురః ప్లుత్యోపవేశనమ్ ।**
> **పురోవలితదోః కాండం దిండుస్తత్ కరణం మతమ్ ॥ 181 ॥**

**ప్రతిపదార్థము** : సమపదేనైవ స్థిత్వా = సమపాదముతోనే నిలిచి; పురః = ముందునకు; ప్లుత్యోపవేశనం = ప్లుతిచే ప్రవేశమును; వలితదోః; కాండం = త్రిప్పబడిన

భుజశిరస్సుకలదైనదేదికలదో; తత్ = అది; దిండు కరణం మతం = దిండు కరణముగా సమ్మతము.

**తాత్పర్యము** : సమపాదముతోనే నిలిచి ముందునకు ప్లుతిచే ప్రవేశమును త్రిప్పబడిన భుజశిరస్సుకలదైన దేదికలదో అది దిండుకరణముగా సమ్మతము.

**తదేవ దిండుకరణమ(వ)సానస్థితం యది ।**
**అలగం కించిదుద్వృత్తం తదేవోర్ధ్వాలగం మతమ్ ॥ 182 ॥**

**ప్రతిపదార్థము** : తదేవ దిండుకరణం = ఆదిండుకరణమే; అవస్థానస్థితం యది = అవసాన (చివర)మందున్నయెడల; అలగం స్యాత్ = అలగకరణమగును; తదేవ = ఆఅలగమే; కించిత్ ఉద్వృత్తం = కొంచెమెత్తబడిన ముఖముకలదైనచో; ఊర్ధ్వాలగం మతం = ఊర్ధ్వాలగమగును.

**తాత్పర్యము** : ఆదిండుకరణమే అవసాన (చివర)మందున్నయెడల అలగకరణమగును. ఆఅలగమే కొంచెమెత్తబడిన ముఖముకలదైనచో ఊర్ధ్వాలగమగును.

**అలగం నతపృష్ఠంచేన్నితంబాలంబిమస్తకమ్ ।**
**ఉత్తానస్థానకోపేతమతేరాలగముచ్యతే ॥ 183 ॥**

**ప్రతిపదార్థము** : అలగం = అలగకరణము; నతపృష్ఠం = వంచబడిన పృష్ఠ(వీపు) భాగముకలదియు; నితంబాలంబిమస్తకం = నితంబమువరకువ్రేలాడిన (వంగిన) మస్తకము కలదియు; ఉత్తాన స్థానకోపేతం = ఉన్నతమైన స్థానమును పొందినయెడల; (ఉత్తానస్థానమును పొందినయెడల); అతేరాలగం ఉచ్యతే = అతేరాలగముగా చెప్పబడును.

**తాత్పర్యము** : అలగకరణము వంచబడిన పృష్ట(వీపు) భాగముకలదియు నితంబమువరకు వ్రేలాడిన (వంగిన) మస్తకముకలదియు, ఉన్నతమైన స్థానమును పొందినయెడల (ఉత్తానాస్థానమును పొందినయెడల) అతేరాలగముగా చెప్పబడును.

**(మా?నా) భిబాహ్వోరసంగేన శిరః స్పృష్టమహీతలమ్ ।**
**స్పృష్ట్వా పదాభ్యామత్తనం (?) కపాలం చూర్ణనం భవేత్ ॥ 184 ॥**

**ప్రతిపదార్థము** : నాభిబాహ్వోః అసంగేన = నాభిబాహువుల కలయికలేక; శిరః

స్పృష్టమహీతలః = శిరస్సుచే తాకబడిన భూమికలదగుచు; పదాభ్యాం = పాదములతో; మత్తనం = ?; స్పృష్ట్వా = తాకినయెడల; కపాలం చూర్ణనం భవేత్ = కపాలచూర్ణకరణ మగును.

**తాత్పర్యము** : నాభిబాహువులు కలయికలేక శిరస్సుచే తాకబడిన భూమికలదగుచు పాదములతో తాకినయెడల కపాలచూర్ణకరణమగును.

**సమపాస్థితేరూర్ధ్వం యత్రత్రికవివర్తనమ్ ।**
**ఉత్పత్య పతనం తిర్యగ్ లోహడీ సైవ కథ్యతే ॥ 185 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; సమపాదస్థితే = సమపాదస్థితియందు; ఊర్ధ్వం = ఊర్ధ్వముగా (పైకి); త్రికవివర్తనం =త్రికము వివర్తనమగు(నో)చు; ఉత్పత్య = ఎగిరి; తిర్యక్ పతనం = అడ్డుగా పడుట; సైవ = అదియే; లోహడీ కథ్యతే = లోహడిగా చెప్పబడును.

**తాత్పర్యము** : ఎక్కడ సమపాదస్థితియందు ఊర్ధ్వముగా (పైకి) త్రికము వివర్తనమగు(నో) చు ఎగిరి అడ్డుగా పడుట అదియే లోహడిగా చెప్పబడును.

**లోహడీపతనే యత్ర స్ఫురితేనాభిపాతనమ్ ।**
**కరణం తత్ షరభృత + + +నిగద్యతే ॥ 186 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; లోహడీపతనే = లోహడిపతనమందు; స్ఫురితేన= హఠాత్తుగా (మెఱుపువలె); అభిపాతనం = నిపతనము; తత్ = అది; ష(ప)రభృతకరణం నిగద్యతే = ష(ప)ర భృతకరణముగాచెప్పబడినది.

**తాత్పర్యము** : ఎక్కడ లోహడిపతనమందు హఠాత్తుగా (మెఱుపువలె) నిపతనము అదిష(ప)రభృతకరణముగా చెప్పబడినది.

**ఉత్ప్లుత్యసమపాదేన పరావృత్య సమస్థితిః ।**
**పశ్చాద్ద్వయవి+భ+భ మంచితం కరణం విదుః ॥ 187 ॥**

**ప్రతిపదార్థము** : సమపాదేన ఉత్ప్లుత్య = సమపాదముచే పైకెగిరి; పరావృత్య = వెనుకనుండి చుట్టబడి; సమస్థితి = సమస్థితి కలదిగా; పశ్చాత్ = తరువాత; ద్వయవిభః భమంచితం కరణం విదుః = భమంచిత కరణముగా తెలియుదురు.

**తాత్పర్యము** : సమపాదముచే పైకెగిరి వెనుకనుండి చుట్టబడి సమస్థితికలదిగా తరువాత భమంచిత కరణముగా తెలియుదురు.

**అంచితే పతనం తిర్యక్ పరావృత్యోపవేశనమ్ ।**
**కరణం నృత్తతత్త్వజ్ఞైర్లంకాదహనమీరితమ్ ॥ 188 ॥**

**ప్రతిపదార్థము** : అంచితే = అంచితకరణమందు; తిర్యక్ పతనం = తిర్యక్పతనము (అయి); పరావృత్య ఉపవేశనం = వెనుకనుండి తిరిగివచ్చి ఉపవేశనము (కూర్చుండుట); నృత్తతత్త్వజ్ఞైః = నాట్యకోవిదులచే; లంకాదహనం కరణం ఈరితం = లంకాదహన కరణముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : అంచితకరణమందు తిర్యక్పతనము (అయి) వెనుకనుండి తిరిగివచ్చి ఉపవేశనము (కూర్చుండుట) లంకాదహన కరణముగా చెప్పబడినది.

**అంచితస్థానకే యత్ స్యాన్నితంబాలంబిమస్తకమ్ ।**
**బేంకోలం పార్ష్ణి (?) చద్రాయ ద్రాయ బేంకోలముచ్యతే ॥ 189 ॥**

**ప్రతిపదార్థము** : అంచితస్థానకే = అంచితస్థానమందు; యత్ నితంబాలంబిమస్తకం= నితంబము వరకు వ్రేలాడు శిరస్సుకల్గియుండునో; పార్ష్ణిచ = మడమకూడ (నడుము); బేంకోలంద్రాయ; తత్ = అది; ద్రాయబేంకోలం ఉచ్యతే = ద్రాయ బేంకోలకరణముగా చెప్పబడుచున్నది; ఏకపాదాం చ, కర్తవ్య, త, (?)భైరవాంచిత, దండప్రణామగ, స్వేచ్ఛాకరణ, పద్మాసాన, సమసూచి, విషమసూచి, గండసూచి, గరుడాసన, కూర్మాసన, గోముఖాసన, జానుభజత, నాగబంధ ఇతి బహువిధస్థానకాని కరణానాముపరి సమేతాని చేత్ స్థానకసహితాని కరణనామాని భవన్తి = నాగబంధమని; బహువిధస్థానకాని = అనేకవిధములైన స్థానములు; కరణానాముపరి = కరణములకు పైన; సమేతాని చేత్ = కూడినవైనచో; స్థానకసహితాని కరణనామాని భవంతి = స్థానములతో కలసినవి కరణనామములగుచున్నవి.

**తాత్పర్యము** : అంచితస్థానమందు నితంబము వరకు వ్రేలాడు శిరస్సు కల్గియుండునో మడమ కూడ (నడుము) అది ద్రాయబేంకోల కరణముగా చెప్పబడుచున్నది. ఏకపాదాం చ కర్తవ్యత(?) భైరవాంచిత, దండప్రణామగ, స్వేచ్ఛాకరణ, పద్మాసన, సమసూచి, విషమసూచి, గండసూచి, గరుడాసన, కూర్మాసన, గోముఖాసన, జానుభజత, నాగబంధమని అనేక విధములైన స్థానములు కరణములకు పైన కూడినవైనచో స్థానములతో కలసినవి కరణనామములగుచున్నవి.

**ఛత్రభ్రమరికా చైవ చక్రభ్రమరికా తథా ।**
**అంతర్భ్రమరికా చైవ బాహుభ్రమరికా తథా ॥ 190 ॥**

**కపాలభ్రమరీ చేతి పంచ భ్రమరికాః స్మృతాః ।**
**అథ పూర్వైరనుక్తాని దేశ్యంగాని వదామ్యహమ్ ॥ 191 ॥**

**ప్రతిపదార్థము :** చత్రభ్రమరికా, చక్రభ్రమరికా, అంతర్భ్రమరిక, బాహుభ్రమరిక, కపాలభ్రమరి, ఇతి = అని; పంచభ్రమరికాః స్మృతాః = ఐదు (5)భ్రమరికలు చెప్పబడినవి; అథ = తరువాత; పూర్వైః = పూర్వీకులచే; అనుక్తాని = చెప్పబడని; దేశ్యంగాని = దేశ్యంగములను; అహం వదామి = నేను చెప్పుచున్నాను.

**తాత్పర్యము :** చత్రభ్రమరిక, చక్రభ్రమరిక, అంతర్భ్రమరిక,బాహుభ్రమరిక, కపాల భ్రమరి అని ఐదు (5)భ్రమరికలు చెప్పబడినవి. తరువాత పూర్వీకులచే చెప్పబడని దేశ్యంగములను నేను చెప్పుచున్నాను.

**ముఖర(బ్ధః ?సః) సౌష్ఠవం చ లలిభావౌ చ తూకలీ ।**
**అనుమానం ప్రమాణం చ ఝుంకా రేవా సురేఖతా ॥ 192 ॥**

**అంగాణంగం తతో ధాలం ధీలాయి నవణిస్తథా ।**
**కిత్తు (తరహరోల్లా) సా వేవర్తనమతః పరమ్ ॥ 193 ॥**

**స్థాపనం చ క్రమాదేషాం లక్షణం ప్రతిపాద్యతే ।**

**ప్రతిపదార్థము :** ముఖరసము, సౌష్ఠవము, లలి, భావము, తూకలా, అనుమానము, ప్రమాణము, ఝుంకా, రేవా, సురేఖత, అంగాణంగం, (అణంగము), ధాలము, ధీలాయి, నవణి, కిత్తు, తరహరము, ఉల్లాసము, వేవర్తనము, స్థాపనము, క్రమాత్ = వరుసగా, ఏషాం = వీటికి; లక్షణం ప్రతిపాద్యతే = లక్షణము నిరూపించబడుచున్నది.

**తాత్పర్యము :** ముఖరసము, సౌష్టవము, లలి, భావము, తూకలీ, అనుమానము, ప్రమాణము, ఝుంకా, రేవా, సురేఖత, అంగాణంగం, (అణంగము), ధాలము, ధీలాయి, నవణి, కిత్తు, తరహరము, ఉల్లాసము, వేవర్తనము, స్థాపనము వరుసగా వీటికి లక్షణము నిరూపింపబడుచున్నది.

మాల్యాభరణవస్త్రాద్యైర్నృత్యనై (క?ప)థ్యకల్పనాత్ ॥ 194 ॥

**ప్రతిపదార్థము** : మాల్యాభరణవస్త్రాద్యైః = పూమాలలు, అలంకారములు, వస్త్రములు మొదలగువానితో; నృత్యనైపథ్యకల్పనాత్ = నృత్యమునకు తగినవనేపథ్యము (వేషధారణము, అలంకరణము) కల్పించుటవలన;

**తాత్పర్యము** : పూమాలలు, అలంకారములు, వస్త్రములు మొదలగువానితో నృత్యమునకు తగిన నేపథ్యము (వేషధారణము, అలంకరణము) కల్పించుటవలన;

**ప్రమోదప్రభవా వక్త్రకాంతిర్ముఖరసాభిధః ।**
**వామదక్షిణపాశ్చత్త్యపురోభాగేష్వనామితమ్ ॥ 195 ॥**

**ప్రతిపదార్థము** : ప్రమోదప్రభవా = సంతోషమువలన జనించిన; వక్త్రకాంతిః = ముఖకాంతి; ముఖరసాభిధః = ముఖరసనామకము; వామదక్షిణపాశ్చాత్య పురోభాగేషు= సర్వత్ర; అనామితం = అసదృశమైన;

**తాత్పర్యము** : సంతోషమువలన జనించిన ముఖకాంతి ముఖరసనామకము సర్వత్ర అసదృశమైన;

**గాత్రం యది స్థితం సమ్యక్ సౌష్ఠవం తదుదాహృతమ్ ।**
**నహి సౌష్ఠవహీనాంగం శోభతే నాట్యనృత్యయోః ॥ 196 ॥**

**ప్రతిపదార్థము** : గాత్రం = శరీరము; సమ్యక్ స్థితం యది = బాగుగానున్నయెడల; తత్ = అది; సౌష్టవం ఉదాహృతం = సౌష్టవముగా చెప్పబడినది; సౌష్టవహీనాంగం = సౌష్టవములేని శరీరము; నాట్యనృత్యయోః = నాట్యనృత్యములందు; న శోభతే = ప్రకాశించదు.

**తాత్పర్యము** : శరీరము బాగుగానున్నయెడల అది సౌష్ఠవముగా చెప్పబడినది. సౌష్ఠవములేని శరీరము నాట్యనృత్యములందు ప్రకాశించదు.

**నాట్యం నృత్తం చ సర్వం హి సౌష్ఠవే సంప్రతిష్ఠితమ్ ।**
**సంగీతసుఖసంజాతో లావణ్యరసపోషకః ॥ 197 ॥**

**ప్రతిపదార్థము** : నాట్యం = నాట్యము; నృత్తం చ = నృత్తమును; సర్వం = ఇదంతయు; సౌష్ఠవేసంప్రతిష్ఠితం = సౌష్ఠవమందు నిల్చియున్నది (స్థిరముచేయబడినది); సంగీతసుఖసంజాతః = సంగీతసుఖమునుండి పుట్టినదియు; లావణ్యరసపోషకః = సౌందర్యరేఖా (రస) పోషకమును అయిన;

**తాత్పర్యము** : నాట్యము నృత్తమును ఇదంతయు సౌష్ఠవమందు నిల్పియున్నది (స్థిరముచేయబడినది). సంగీతసుఖమునుండి పుట్టినదియు సౌందర్యరేఖా (రస) పోషకమును అయిన;

> **హర్షోత్కర్షస్తు భావజ్ఞైర్లలిరిత్యభిధీయతే ।**
> **యది మానం సమార(భ్యా?భ్య) వాద్యతాలసముద్భవమ్ ॥ 198 ॥**

**ప్రతిపదార్థము** : హర్షోత్కర్షః = ఉత్కృష్టమైన సంతోషము; లలిరితి = లలియని; అభిధీయతే = చెప్పబడినది; మానం సమారభ్య = మానమునారంభించి; వాద్యతాలసముద్భవం = వాద్యతాలములనుండి పుట్టిన;

**తాత్పర్యము** : ఉత్కృష్టమైన సంతోషము లలియని చెప్పబడినది. మానమునారంభించి వాద్యతాలములనుండి పుట్టిన;

> **నర్తనౌత్సుక్యజశ్చిత్తవికారో భావ ఉచ్యతే ।**
> **స్థానకేన మనోజ్ఞేన స్థిత్వా గంభీరభావతః ॥ 199 ॥**
>
> **అంగస్యాందోలనం (తా)ల సమానం తూకలీ భవేత్ ।**
> **యత్యాభినయయోగాయ నర్తకీచిత్తదోలనమ్ ॥ 200 ॥**
>
> **అనుమానం సముద్దిష్టం ప్రమాణం సామ్యముచ్యతే ।**
> **వామే వా దక్షిణే వాపి కించిదుద్ధృత భావతః ॥ 201 ॥**

**ప్రతిపదార్థము** : నర్తనౌత్సుక్యజం = నర్తనమందలి ఉత్సుకతవల్ల కలిగిన; చిత్తవికారః= మనోవికారము; భావ ఉచ్యతే = భావముగా చెప్పబడినది; వామే వా = ఎడమవైపుగాని; దక్షిణే వాపి = కుడివైపుగాని; కించిత్ ఉద్ధృతభావతః = కొంచెము ఉద్ధృతభావమువలన; నృత్యే = నృత్యమందు;

**తాత్పర్యము** : నర్తనమందలి ఉత్సుకతవల్లకలిగిన మనోవికారము భావముగా చెప్పబడినది. ఎడమవైపుగాని, కుడివైపుగాని కొంచెము ఉదృత భావమువలన నృత్యమందు;

> **అంగస్య చాలానా నృత్యే ఝుంకేతి పరికీర్తితా ।**
> **శిరస్యపాంగయోశ్చైవ పించితుల్లోలతా యది ॥ 202 ॥**

**ప్రతిపదార్థము :** అంగస్యచాలనా = శరీరచలనము; ఝంకాఇతి పరికీర్తితా = ఝంకా యని పిలువబడుచున్నది; శిరసి = శిరస్సునందు(ను); అపాంగయోశ్చైవ = నేత్రాంచలముల యొక్కయే; భావమాధుర్యాత్ = భావమధురతవలన; పించితుః = అందముయొక్క; ల్లోలతా యది = చలనము కలిగెనేని;

**తాత్పర్యము :** శరీరచలనము ఝంకాయని పిలువబడుచున్నది. శిరస్సునందు (ను)నేత్రాంచలముల యొక్కయే భావమధురతవలన అందము యొక్క చలనము కలిగెనేని;

> **దృశ్యతే భావమాధుర్యాత్ సోక్తా రేవా విచక్షణైః ।**
> **ఆంగికాభినయో నృత్యే వికటాంగవివర్జితమ్ ॥ 203 ॥**

**ప్రతిపదార్థము :** భావమాధుర్యాత్ = భావమధురతవలన; యాదృశ్యతే = ఏది అగుపించుచున్నదో; సా = అది; విచక్షణైః = పండితులచే; రేవా ఉక్తా = రేవాప్రభేదముగా చెప్పబడినది; నృత్యే = నృత్యమందు; వికటాంగవివర్జితం = వికృతాంగత్యకమైన; ఆంగికాభినయః = శరీరాభినయము.

**తాత్పర్యము :** అది రేవాప్రభేదముగా చెప్పబడినది. నృత్యమందు వికృతాంగత్యకమైన శరీరాభినయము.

> **యది ప్రవర్తతే తజ్ఞైః సురేఖత్వం తదీరితమ్ ।**
> **తాండవాదిషు నృత్తేషు ప్రస్తుతేషు పృథక్ పృథక్ ॥ 204 ॥**

**ప్రతిపదార్థము :** ప్రవర్తతే యది = ప్రవర్తించినయెడల; తత్ = అది; తజ్ఞైః = నాట్యశాస్త్రపండితులచే; సురేఖత్వం ఈరితం = సురేఖతగా చెప్పబడినది; తాండవాదిషు నృత్తేషు = తాండవాదినృత్తములు; పృథక్ పృథక్ = వేరువేరుగా; ప్రస్తుతేషు= ప్రవర్తించగా;

**తాత్పర్యము :** ప్రవర్తించినయెడల అది నాట్యశాస్త్రపండితులచే సురేఖతగా చెప్పబడినది. తాండవాదినృత్తములు వేరువేరుగా ప్రవర్తించగా;

> **ఉక్తోంగమంగముద్దిష్టమణంగం త్వన్యసంశ్రయమ్ ।**
> **లలితాభినయాః సర్వే లలి(తా?) భావసమాశ్రయాః ॥ 205 ॥**

**ప్రతిపదార్థము :** అంగమగంఉక్తః = అంగాంగము చెప్పబడినది; తత్ = అది;

అణంగంఉద్దిష్టం = అణంగముగా నిర్దేశింపబడినది; లలితాభినయాః సర్వే = మృదు(అందమైన) అభినయములన్నియు; లలితాభావనమాశ్రయాః = లలి(తా)భావములనాశ్రయించినవి.

**తాత్పర్యము** : అంగాంగము చెప్పబడినది. అది అణంగముగా నిర్దేశింపబడినది. మృదు(అందమైన) అభినయములన్నియు లలి(తా)భావములనాశ్రయించినవి.

**నర్తకీచిత్తసారస్యాత్ తస్మాద్ఢాలం తదుచ్యతే ।**
**స్థానే వా మందగమనే నర్తక్యాం యది వక్ష్యతే ॥ 206 ॥**

**ప్రతిపదార్థము** : నర్తకీచిత్తసారస్యాత్ = నర్తకియొక్క మానసిక సరళత వలన; తస్మాత్= అందువలన; తత్ = అది; ఢాలం ఉచ్యతే = ఢాలముగా చెప్పబడినది; స్థానేవా = స్థానమందు గాని; మందగమనే వా = మందగమనమందుగాని; నర్తక్యాం = నర్తకియందు;

**తాత్పర్యము** : నర్తకియొక్క మానసికసరళత వలన అందువలన దానిని ఢాలముగా చెప్పబడినది. స్థానమందుగాని, మందగమనమందుగాని నర్తకియందు;

**లలితం గాత్రశైథిత్యం ధిల్లాయీతి నిగద్యతే ।**
**యది ఘర్మాంగనమనమనాయాసేన వర్తతే ॥ 207 ॥**

**ప్రతిపదార్థము** : లలితం = మృదువైన; గాత్రశైథిల్యం = శరీరశిథిలత; యది వక్ష్యతే= చెప్పబడినయెడల; ధిల్లాయీ ఇతినిగద్యతే = ధిల్లాయీ అని చెప్పబడుచున్నది; ఘర్మాంగనమనం = చర్మావయవ గమనము (వంచుట); అనాయాసేవ = కష్టములేక; వర్తతే యది = ఉన్నయెడల;

**తాత్పర్యము** : మృదువైన శరీరశిథిలత చెప్పబడినయెడల ధిల్లాయీ అని చెప్పబడుచున్నది. మిషమప్రయోగములందు చర్మావయవగమనము (వంచుట) కష్టములేక ఉన్నయెడల;

**విషమేషు ప్రయోగేషు తవణిః సముదాహృతా ।**
**భుజయోః స్తనయుగ్మే వా తాలపాదసమం యది ॥ 208 ॥**

**ప్రతిపదార్థము** : విషమేషు ప్రయోగేషు = విషమప్రయోగములందు; తవణిః సముదాహృతా = త(న)వణియని చెప్పబడుచున్నది; భుజయోః వా = భుజములందు

గాని; స్తనయుగ్మే వా = కుచయుగళమందుగాని; తాలపాదసమం యది = తాలపాదసమానమైన యెడల;

**తాత్పర్యము** : విషమప్రయోగములందు త(న)వణియని చెప్పబడుచున్నది. భుజములందు గాని, కుచయుగళమందుగాని తాలపాదసమానమైన యెడల;

> **(స్య?స్పం) న్దనం సుకుమారం స్యాదేతత్ కిత్తు నిగద్యతే ।**
> **నర్తనే యది నర్తక్యాః స్తనయోః క్షిప్రకంపనమ్ ॥ 209 ॥**

**ప్రతిపదార్థము** : సుకుమారం = సున్నితమైన; స్పందనం స్యాత్ యది = స్పందనము జరిగిన యెడల; ఏతత్ = ఇది; కిత్తు నిగద్యతే = కిత్తు అని చెప్పబడుచున్నది; నర్తనే= నర్తనమందు; నర్తక్యాః = నర్తకియొక్క; స్తనయోః బాహుపర్యంతంక్షి ప్రకంపనం= బాహువులవఱకు స్తనముల కంపనము.

**తాత్పర్యము** : సున్నితమైన స్పందనము జరిగినయెడల ఇది కిత్తు అని చెప్పబడుచున్నది. నర్తనమందు నర్తకియొక్క బాహువులవఱకు స్తనములకంపనము.

> **లక్ష్యతే బాహుపర్యంతమేతత్ తరహరం విదుః ।**
> **యది వాద్యో+ సదృశం నర్తక్యంగం ముహుర్ముహుః ॥ 210 ॥**

**ప్రతిపదార్థము** : లక్ష్యతే = గుర్తింపబడినచో; ఏతత్ =అది; తరహరం విదుః = తరహరముగా తెలియుదురు; నర్తక్యంగం = నర్తకిఅవయవము; అసదృశం = అసామాన్యముగా; ముహుర్ముహుః = మాటిమాటికి; యది వాద్యః = మ్రోగినయెడల;

**తాత్పర్యము** : గుర్తింపబడినచో అది తరహరముగా తెలియుదురు. నర్తకి అవయవము అసామాన్యముగా మాటిమాటికి మ్రోగినయెడల;

> **యద్యుల్లసతి భావేన తముల్లాసం ప్రచక్షతే ।**
> **ఆంగికాభినయో వాద్యపాదానాముచితః సమః ॥ 211 ॥**

**ప్రతిపదార్థము** : బావేన = భావముచే; యది ఉల్లసతి = ప్రకాశించునో; తం = దానిని; ఉల్లాసం ప్రచక్షతే = ఉల్లాసముగా చెప్పుచున్నారు; ఆంగికాభినయః = ఆంగికాభినయము; వాద్యపాదానాం = వాద్యపాదములకు; ఉచితః = తగినవిధముగా; సమః= సమముగా;

**తాత్పర్యము** : భావముచే ప్రకాశించునో దానిని ఉల్లాసముగా చెప్పుచున్నారు. ఆంగికాభినయము వాద్యపాదములకు తగినవిధముగా సమముగా;

> **యది ప్రవర్తతే తజ్జైస్తద్ వైవర్తనమీరితమ్ ।**
> **కరణాబినయస్యాంతే విషమస్యాపరస్య వా ॥ 212 ॥**

**ప్రతిపదార్థము** : యది ప్రవర్తతే = ప్రవర్తించినయెడల; తత్ = అది; వైవర్తనం ఈరితం= వైవర్తనప్రభేదముగా చెప్పబడినది; కరణాభినయస్యాంతే = కరణాభినయము చివర; విషమస్య అపరస్యవా = విషమము యొక్కగాని, సమముయొక్కగాని;

**తాత్పర్యము** : ప్రవర్తించినయెడల అది వైవర్తనప్రభేదముగా చెప్పబడినది. కరణాభినయము చివర విషమము యొక్కగాని, సమముయొక్కగాని;

> **రూపసౌష్ఠవరేఖాభిః స్థితిః స్థాపనముచ్యతే ।**
> **క్రమేణ పేరణాదీనాం పద్ధతిః కథ్యతేకధునా ॥ 213 ॥**

**ప్రతిపదార్థము** : రూపసౌష్ఠవరేఖాభిః = రూపసౌష్ఠవరేఖలచే; స్థితిః = స్థితి(ఉనికి); స్థాపనం ఉచ్యతే = స్థాపనముగా చెప్పబడుచున్నది; క్రమేణ = క్రమముగా; పేరణాదీనాం పద్ధతిః = పేరణాదుల పద్ధతి; అధునా = ఇప్పుడు; కథ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : రూపసౌష్ఠవరేఖలచే స్థితి (ఉనికి) స్థాపనముగా చెప్పబడుచున్నది. క్రమముగా పేరణాదుల పద్ధతి ఇప్పుడు చెప్పబడుచున్నది.

> **నృత్తం తతశ్చ కైవారో ఘర్ఘరో వాగడస్తథా ।**
> **గీతం చేతి బుధాః ప్రాహుః పేరణస్యాంగపంచకమ్ ॥ 214 ॥**

**ప్రతిపదార్థము** : నృత్తము, తతము, కైవారము, ఘర్ఘరము; వాగడము, గీతము, ఇతి= అని; బుధాః = పండితులు; పేరణస్య అంగపంచకం ప్రాహుః = పేరణమునకు అంగ పంచకమును చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : నృత్తము, తతము, కైవారము, ఘర్ఘరము, వాగడము, గీతము అని పండితులు పేరణమునకు అంగపంచకమును చెప్పుచున్నారు.

> **నృత్తం తద్ద్వివిధం జ్ఞేయం తాండవం లాస్యమిత్యపి ।**
> **తత్రాప్యుపలయాంగః స్యాత్ ప్రాయస్తాలలయాశ్రయమ్ ॥ 215 ॥**

**ప్రతిపదార్థము** : తాండవం లాస్యం ఇతి అపి = తాండవము లాస్యము అని; తత్ నృత్తం = ఆనృత్తము; ద్వివిధం జ్ఞేయం = రెండువిధములని తెలియదగినది; తత్రాపి= అందును; ప్రాయః = తరచుగా; తాలలయాశ్రయం = తాలలయలనాశ్రయించినది; ఉపలయాంగః స్యాత్ = ఉపలయాంగమగును.

**తాత్పర్యము** : తాండవము, లాస్యము అని ఆనృత్తము రెండువిధములని తెలియదగినది. అందును తరచుగా తాల, లయలనాశ్రయించినది ఉపలయాంగ మగును.

**వర్ణయిత్వా గుణాన్ పూర్ణాన్ పురాతనమహీభుజామ్ ।**
**తత్తద్గుణసమారోపః కైవారః స్యాత్ సభాపతేః ॥ 216 ॥**

**ప్రతిపదార్థము** : పురాతనమహీభుజం = పూర్వరాజులయొక్క; పుర్ణాన్ గుణాన్ = సంపూర్ణగుణములను; వర్ణయిత్వా = వర్ణించి; సభాపతేః = సభాపతియొక్క; తత్తద్గుణ సమారోపః = ఆయా గుణారోపము; కైవారః స్యాత్ = కైవారమగును.

**తాత్పర్యము** : పూర్వరాజులయొక్క సంపూర్ణగుణములను వర్ణించి సభాపతియొక్క ఆయా గుణారోపము కైవారమగును.

**రవణే వశతః క్షుద్రఘంటికాపయపాలనాః ।**
**తాలపాత్యాథవా ప్రోక్తా ఘర్ఘరేతి విచక్షణైః ॥ 217 ॥**

**ప్రతిపదార్థము** : రవణే = రవణమందు; వశతః = వశమువలన; క్షుద్ర ఘంటికాపయపాలనాః తాలపాత్యాః = క్షుద్రఘంటికాదుల తాలధ్వనులసముదాయము; విచక్షణైః = పండితులచే; ఘర్ఘరా ఇతి ప్రోక్తా = ఘర్ఘరయని చెప్పబడినది.

**తాత్పార్యము** : రవణమందు వశమువలన క్షుద్రఘంటికాదుల తాలధ్వనుల సముదాయము పండితులచే ఘర్ఘరయని చెప్పబడినది.

**యన్మర్కటపిశాచాదిహాస్యవేషసమాశ్రయమ్ ।**
**వికటాభినయోపేతం వాగడం తత్ ప్రచక్షతే ॥ 218 ॥**

**ప్రతిపదార్థము** : మర్కటపిశాచాది = మర్కటపిశాచాదుల; హాస్యవేషసమాశ్రయం = హాస్యవేషము నాశ్రయించిన; వికటాభినయోపేతం యత్ = వికటాభినయముతో కూడినదేదికలదో; తత్ = దానిని; వాగడం ప్రచక్షతే = వాగడముగా చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : మర్కటపిశాచాదుల హాస్యవేషము నాశ్రయించిన వికటాభినయముతో కూడినదేదికలదో దానిని వాగడముగా చెప్పుచున్నారు.

**+ ధైః సంకీర్ణరాగైర్వా ++స్తాలప్తిసంయుతమ్ ।**
**గాయతే గీతముక్తం తత్ సభ్యచిత్తానురంజనమ్ ॥ 219 ॥**

**ప్రతిపదార్థము** : గాధైః = గాథలచేతనుగాని; సంకీర్ణరాగైర్వా = సంకీర్ణరాగముచేతను గాని; లయతాలప్తిసంయుతం = (లయ) తాళములతో కూడినదిగ; యది గీయతే = గానము చేయబడినచో; తత్ = అది; సభ్యచిత్తానురంజనం = సభ్యులమనస్సుల నానందింప జేయు; గీతం = గీతముగా; ఉక్తం = చెప్పబడినది.

**తాత్పర్యము** : గాధలచేతను గాని సంకీర్ణరాగముచేతనుగాని (లయ)తాళములతో కూడినదిగ గానము చేయబడినచో అది సభ్యుల మనస్సులనానందింప జేయు గీతముగా చెప్పబడినది.

**రంగే స్థితాంతరాన్ వాద్యసముదాయత్రయే క్రమాత్ (?) ।**
**ఉద్గ్రాహాదిత్రయం యత్ర గానం శ్రేష్ఠం తదీరితమ్ ॥ 220 ॥**

**ప్రతిపదార్థము** : రంగే = రంగమందు; స్థితాంతరాన్ = ఉన్న అంతరములను; క్రమాత్ = క్రమముగా; వాద్యసముదాయత్రయే = వాద్యసముదాయత్రయ మందు; యత్ర = ఎక్కడ; ఉద్గ్రాహాదిత్రయం స్యాత్ = ఉద్గ్రాహాదిత్రయముండునో; తత్ = అది; శ్రేష్ఠం గానం ఈరితం = శ్రేష్ఠమైన గానమని చెప్పబడినది.

**తాత్పర్యము** : రంగమందు ఉన్న అంతరములను క్రమముగా వాద్యసముదాయ మందు ఎక్కడ ఉద్గ్రాహాదిత్రయముండునో అది శ్రేష్ఠమైన గానమని చెప్పబడినది.

**సమహస్తం భవేదాదౌ తతో రిప్పణీ భవేత్ ।**
**తతః పరం పదం జ్ఞేయం వేసారం తదనంతరమ్ ॥ 221 ॥**

**తుడుకాఖ్యం తతో వాద్యం తతః పహరణాభిదమ్ ।**
**వాద్యపద్ధతిరిత్యుక్తా పేరణస్య విచక్షణైః ॥ 222 ॥**

**ప్రతిపదార్థము** : ఆదౌ = మొదట; సమహస్తం భవేత్ = సమస్తహస్తమగును; తతః రిప్పశాంభవేత్ = తరువాత రిప్పణి యగును; తతః పరం = తరువాత; పదంజ్ఞేయ = పదము గుర్తింపదగినది; తదనంతరం = తరువాత; వేసారం = వేసారము; తతః

= తరువాత; తుడుకాఖ్యంవాద్యం = తుడుకావాద్యము; తతః = తరువాత; పహరణాభిధం = పహరణము; ఇతి = ఇట్లు; పేరణస్య = పేరణముయొక్క; వాద్యపద్ధతిః ఉక్తా = వాద్యప్రకారము చెప్పబడినది.

**తాత్పర్యము** : మొదట సమస్తహస్తమగును. తరువాత రిప్పవణియగును. తరువాత పదము గుర్తింపదగినది. తరువాత వేసారము, తరువాత తుడుకా వాద్యము, తరువాత పహరణము. ఇట్లు పేరణముయొక్క వాద్యప్రకారము చెప్పబడినది.

**ఝేంకారం వాదయేత్ పూర్వం ఘల్లణం చ తతః పరమ్ ।**
**తతో వాద్యం చ కపితామంతరాం చ తతః క్రమాత్ ॥ 223 ॥**

**అవఝామలపం చేతి పేక్షణే వాద్యపద్ధతిః ।**
**సమహస్తం పహరణా తతస్త్వారభటాహ్వయః ॥ 224 ॥**

**ప్రతిపదార్థము** : పూర్వం = ముందు; ఝేంకారం వాదయేత్ = ఝేంకారమును వాదించవలెను; తతః పరం = తరువాత; ఘల్లణం = ఘల్లణమును; తతః కంపితాం= తరువాత కపితను; తతః = తరువాత; అంతారం = అంతరను; పేక్షణే వాద్యపద్ధతిః= పేక్షణమునందు వాద్యప్రకారము; సమహస్తం = సమహస్తము; పహరణా = పహరణము; తతః = తరువాత; ఆరభటాహ్వాయః = ఆరభటము.

**తాత్పర్యము** : ముందు ఝేంకారమును వాదించవలెను. తరువాత ఘల్లణమును, తరువాత కపితను, అంతరను, పేక్షణమునందు వాద్యప్రకారము సమహస్తము పహరణము తరువాత ఆరభటము.

**ముఖవాద్యం తతో జ్ఞేయం తకారం తదనంతరమ్ ।**
**ఝేంకారం చ తతః పశ్చాద్ దువక్కరసమాహ్వాయమ్ ॥ 225 ॥**

**తతో రిఘుమణి (వా?ర్వా)ద్యం తతః పహరణాభిధః ।**
**తుడుకశ్చేతి విజ్ఞేయా గుండలీవాద్యపద్ధతిః ॥ 226 ॥**

**ప్రతిపదార్థము** : తతః =తరువాత; ముఖవాద్యం = ముఖవాద్యము; తదనంతరం = తరువాత; తకారం = తకారమును; తతః ఝేంకారం = తరువాత ఝేంకారమును; పశ్చాత్ దువక్కరసమాహ్వాయః = తరువాత దువక్కరము; తతః రిఘుమణి వాద్యం= తరువాత రిఘుమణివాద్యము; తతః పహరణాభిధః = తరువాత పహరణము;

తుడుక్కశ్చ ఇతి = తుడుక్కఅని; గుండలీవాద్యద్ధతిః విజ్ఞేయా = గుండలీవాద్య ప్రకారము తెలియదగినది.

**తాత్పర్యము** : తరువాత ముఖవాద్యము, తరువాత తకారమును, తరువాత ఝేంకారమును, తరువాత దువక్కరము, తరువాత రిఘమణివాద్యము, తరువాత పహరణము తుడుక్కఅని గుండలీ వాద్య ప్రకారము తెలియదగినది.

> **పేరణాదిత్రయే గీతపద్ధతిః కథ్యత్యేధుధునా ।**
> **వాద్యేన సహ గీతాయాః మేలాయాం తదనంతరమ్ ॥ 227 ॥**
>
> **తేనైవ ఖలు తాలేన వాద్యతే గుష్కమంతరా (?) ।**
> **ప్రతిరూపకపర్యంతం యత్ర సా శుద్ధ (పద్ధ)తిః ॥ 228 ॥**

**ప్రతిపదార్థము** : పేరణాదిత్రయే = పేరణాదిత్రయమందు; గీతపద్ధతిః = గీతపద్ధతి; అధునా = ఇప్పుడు; కథ్యతే = చెప్పబడుచున్నది; వాద్యేన సమగీతాయాః = వాద్యముతో కలసిగీతమునకు; మేలాయాం = మేళనమందు; తదనంతరం = తరువాత; తేనైవ తాలేన = ఆతాళముచేతనే; గుష్కమంతరా వాద్యతే = గుష్కాంతరికముగా; ప్రతిరూపకపర్యంతం = ప్రతిరూపకమువఱకు; యత్ర = ఎక్కడ; వాద్యతే = వాదించబడునో; సా = అది; శుద్ధపద్ధతిః = శుద్ధపద్ధతి.

**తాత్పర్యము** : పేరణాదిత్రయమందు గీతపద్ధతి ఇప్పుడు చెప్పబడుచున్నది. వాద్యముతో కలసి గీతమునకు మేళనమందు తరువాత ఆ తాళము చేతనే గుష్కాంతరికముగా ప్రతిరూపకము వఱకు ఎక్కడ వాదించబడునో అది శుద్ధపద్ధతి.

> **ప్రథమం పాటకరణం బంధాఖ్యం చిత్రసంజ్ఞకమ్ ।**
> **కైవారో వర్ణసరకస్త్వన్యే వా పాటమిశ్రితాః ॥ 229 ॥**
>
> **ప్రబంధా యత్ర గీయంతే వాద్యంతే చ యథాక్షరమ్ ।**
> **యథాక్షరం చ నృత్యంతే సా చిత్రా శుద్ధపద్ధతిః ॥ 230 ॥**

**ప్రతిపదార్థము** : ప్రథమం = మొదట; పాటకరణం = పాటకరణము; బంధాఖ్యం చిత్రసంజ్ఞకం = చిత్రబంధమును; కైవారం = కైవారము; వర్ణసరకః = వర్ణసరకము; అన్యే వా పాటమిశ్రితాః ప్రబంధాః = మిగిలిన పాటమిశ్రితములైన ప్రబంధములు; గీయంతే = గానముచేయబడునో; యథాక్షరం = యథాక్షరముగా; వాద్యంతే =

వాదింప బడునో; యథాక్షరం నృత్యంతే = యథాక్షరముగా నాట్యము చేయబడునో; సా = అది; చిత్రాశుద్ధపద్ధతిః = చిత్రశుద్ధపద్ధతియగును.

**తాత్పర్యము** : మొదట పాటకరణము చిత్రబంధమును కైవారము వర్ణసరకము మిగిలిన పాటమిశ్రితములైన ప్రబంధములు గానముచేయబడునో యథాక్షరముగా వాదింపబడునో యథాక్షరముగా నాట్యము చేయబడునో అది చిత్రశుద్ధపద్ధతి యగును.

**ధ్రువా మట్టశ్చ నిస్సారుశ్చండనిస్సారుకస్తథా ।**
**అడ్డతాలీ రాసకిశ్చ తతః స్యాదేకతాలికా ॥ 231 ॥**

**ఇత్యేషా పద్ధతిర్జ్ఞేయా సాలగాఖ్యా విచక్షణైః ।**
**పేరణ్యాఖ్యా చ మండల్యా శుద్ధే ఛాయలగే తథా ॥ 232 ॥**

**దువక్కరం పహరణా యతిశ్చాంతరవాదనమ్ ।**
**పద్ధతిత్రితయే శుద్ధచిత్రే సాలగసంజ్ఞకే ॥ 233 ॥**

**తత్తత్పద్ధతిభేదేన వాద్యం కుర్యాద్ యథోచితమ్ ।**
**యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః ॥ 234 ॥**

**ప్రతిపదార్థము** : ధ్రువా = ధ్రువము; మట్టశ్చ = మట్టతాలము; నిస్సారు = నిస్సారు; తథా = అట్లే; చండనిస్సారుకః = చండనిస్సారు; అడ్డతాళి = అడ్డతాళము; రాసకిః = రాసకి, తతః = తరువాత; ఏకతాలికా = ఏకతాళము; ఇతి = అను; ఏషా = ఇది; సాలగాఖ్యా పద్ధతిః జ్ఞేయా = సాలగపద్ధతియని తెలియదగినది; పేరణాఖ్యాచ మండల్యా= పేరణాఖ్యమండలిచే; తథా = అట్లే; శుద్ధే = శుద్ధమందును; చాయాలగే= ఛాయాలగమందును; అంతరవాదనం యతిశ్చ = అంతరవాదనయతియు; శుద్ధచిత్రే సాలగసంజ్ఞకే = శుద్ధముందు, చిత్రము, సాలగమను; పద్ధతిత్రితయే = మూడుపద్ధతులయందు; తత్తత్పద్ధతిభేదేన = ఆయా పద్ధతివిభేదముచే; యథోచితం= తగినవిధముగా; వాద్యం కుర్యాత్ = వాదనము చేయవలెను; యతః = ఎటువేపు; హస్తః = హస్తమో; తతః దృష్టిః = అటు వేపు దృష్టియు; యతఃదృష్టిః = ఎటుదృష్టియో; తతః మనః = అటుమనస్సు;

**తాత్పర్యము** : ధ్రువము, మట్టతాలము, నిస్సారు, చండనిస్సారు, అడ్డతాళము, రాసకి, తరువాత ఏకతాళము అను ఇది సాలగపద్ధతియని తెలియదగినది. పేరణాఖ్యమండలిచే అట్లే శుద్ధమందును, ఛాయాలగమందును, అంతరవాదనయతియు శుద్ధ, చిత్ర,

సాలగమను మూడు పద్ధతులయందు, ఆయా పద్ధతివిభేదముచే తగినవిధముగా వాదనముచేయవలెను. ఎటు హస్తమో అటుదృష్టియు, ఎటు దృష్టియో అటుమనస్సు;

**యతో మనస్తతో భావో యతోభావస్తతో రసః ।**
**యత్ర వ్యగ్రావుభౌ తత్ర + + దృష్టివిలోకితైః ॥ 235 ॥**

**ప్రతిపదార్థము** : యతః మనః = ఎటు మనసుండునో; తతః భావః = అటు భావము; యతో భావః తతః రసః = ఎటు భావమో అటు రసము అగును (హస్త -దృష్టి-మనో-భావ- రసములు పరస్పర సాపేక్షితములు); యత్ర = ఎక్కడ, ఉభౌ = మనోభావములు రెండును; వ్యగ్రౌ = వ్యగ్రములగునో; తత్ర = అక్కడ; రసదృష్టి విలోకితైః = రసదృష్టి విలోకనములచే;

**తాత్పర్యము** : ఎటు మనసుండునో అటు భావము- ఎటు భావమో- అటు రసము అగును. (హస్త-దృష్టి-మనో-భావ-రసములు పరస్పర సాపేక్షితములు) ఎక్కడ మనోభావములు రెండును వ్యగ్రములగునో అక్కడ రసదృష్టి విలోకనములచే;

**వ్రీలితోకభినయం కుర్యాద్ విమతైరర్థదర్శనైః ।**
**అంగేనాలంబయేద్ గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్ ॥ 236 ॥**

**ప్రతిపదార్థము** : విమతైః అర్థదర్శనైః = విశిష్ట అర్థదర్శనములు (విమతము = మతవివర్యయము)చే; వ్రీలితే = ప్రత్యేకముగా; అభినయం కుర్యాత్ = అభినయించవలయును;అంగేన = అంగముచే; గీతం ఆలంబయేత్ = గీతమును ఆధారించవలయును; హస్తేన = చేతితో; అర్థం ప్రదర్శయేత్ = అర్థమును చూపవలెను.

**తాత్పర్యము** : విశిష్టఅర్థదర్శనములు (మతవిపర్యయము)చే ప్రత్యేకముగా అభినయించవలయును. అంగముచే గీతము ఆధారించవలయును. చేతితో అర్థమును చూపవలెను.

చక్షుర్భ్యాం భావయేద్ భావం పాదాభ్యాం తాలనిర్ణయమ్ ।
తాలశ్చ కాంస్యతాలశ్చ ఘంటికా జయపూర్వికా ॥ 237 ॥

పటహశ్చ హుడుక్కా చ మృదంగః కరటా తతః ।
ఇత్యాదివాద్యసందోహో వాద్యతే దండరాసకే ॥ 238 ॥

**ప్రతిపదార్థము** : చక్షుర్భ్యాం = నేత్రములతో; భావం భావయేత్ = భావమునూహింప జేయవలెను; పాదాభ్యాం తాలనిర్ణయం కుర్యాత్ = పాదములతో తాలనిర్ణయమును చేయవలయును; తాలశ్చ = తాళమును; కాంస్యతాలశ్చ = కంచుతాళమును; ఘంటికా= ఘంటిక; జయపూర్వికాచ = జయపూర్వికము; హుడుక్కా = హుడుక్కయు; మృదంగః = మృదంగము; తతః = తరువాత; కరటా = కరటయు; ఇత్యాదివాద్యసందోహః = ఈమొదలగు వాద్యసముదాయము; దండరాసకే వాద్యతే= దండరాసకమునందు వాదింపబడును.

**తాత్పర్యము** : నేత్రములతో భావమునూహింపజేయవలెను. పాదములతో తాలనిర్ణయము చేయవలయును. తాళమును, కంచుతాళమును, ఘంటిక, జయపూర్వికము, హుడుక్కయు మృదంగము తరువాత కరటయు ఈ మొదలగు వాద్య సముదాయము దండరాసకము నందు వాదింపబడును.

**రూపయౌవనవర్ణైస్తు సమానా దీర్ఘలోచనాః ।**
**(శుక?కృశ) మధ్యా నితంభాఢ్యాః పీనవృత్తపయోధరాః ॥ 239 ॥**

**చల్లణైః కంచుకైర్యుక్తా నానావర్ణవిచిత్రితైః ।**
**+ + + + + +++ నూపురాలంకృతాంఘ్రయః ॥ 240 ॥**

**మాల్యానులేపసంపన్నాః సర్వాభరణంభూషితాః ।**
**సావధానాః ప్రగల్భాశ్చ స్త్రియః పాత్రం ప్రకల్పితాః ॥ 241 ॥**

**ప్రతిపదార్థము** : రూపయౌవనవర్ణైః = సౌందర్యము, వయస్సు, వర్ణములచే; సమానాః= సమాన(వయస్కు)లును; దీర్ఘలోచనాః = దీర్ఘములైన నేత్రములు కలవారును; కృశమధ్యాః = సన్ననినడుములు కలవారును; నితంబాఢ్యాః = గొప్ప పిరుదులు కలవారును; పీనవృతపయోధరాః = బలసిన స్తనములు కలవారును; నానావర్ణవిచిత్రితైః చల్లణైః కంచుకైః యుక్తాః = అనేకములైన రంగులచే చిత్రములైన, బిగుతైన రవికలుకలవారును; నూపురాలంకృతాంఘ్రయః = నూపురములచే అలంకరింపబడిన పాదములు కలవారును; మాల్యాను లేపసంపన్నాః = పూమాలలు లేపనములు కలవారును; సర్వాభరణభూషితాః = అన్ని నగలచేతను అలంకృతులు; సావధానాః= అవధానముకలవారును; ప్రగల్భాః = ప్రౌఢనేర్పరులును అయిన; స్త్రియః పాత్రం = స్త్రీ పాత్రలు; ప్రకల్పితాః = కల్పింపబడినవి.

**తాత్పర్యము** : సౌందర్యము, వయస్సు, వర్ణములచే సమాన(వయస్కు)లును దీర్ఘములైన నేత్రములు కలవారును, సన్నని నడుములు కలవారును, గొప్ప పిరుదులు కలవారును, బలసిన స్తనములు కలవారును, అనేకములైన రంగులచే చిత్రములైన బిగుతైన రవికలు కలవారును, నూపురములచే అలంకరింపబడిన పాదములు కలవారును, పూమాలలు లేపనములు కలవారును, అన్ని నగలచేతను అలంకృతులు అవధానము కలవారును, ప్రౌఢనేర్పరులును అయిన స్త్రీ పాత్రలు కల్పింపబడినవి.

> **పాత్రద్వయం సమారభ్య ద్వే ద్వే పాత్రే వివర్ధయేత్ ।**
> **భవేయురష్టద్వంద్వాని యావత్ తావద్ యథారుచి ॥ 242 ॥**
>
> **అన్యోన్యాభిముఖం వాపి పరావృత్తముఖం తథా ।**
> **ముఖో దండానువిద్ధం చ(?) వాద్యతాలసమన్వితమ్ ॥ 243 ॥**
>
> **స్థానకై + + + + ర్హస్తచలనైర్వర్తనైర్యుతమ్ ।**
> **నానాబంధైః సమాయుక్తం లయత్రయ సమన్వితమ్ ॥ 244 ॥**
> **దండరాయమితిప్రోక్తం నృత్తభేదవిచక్షణైః ॥ 244½ ॥**

**ప్రతిపదార్థము** : పాత్రద్వయం సమారభ్య = రెండుపాత్రలనారంభించి; ద్వే ద్వే పాత్రే= రెండు రెండు పాత్రలు; వివర్ధయేత్ = వృద్ధినొందించవలెను; తావత్ అష్టద్వంద్వాని యథారుచి భవేయుః = యథేష్టముగా ఎనిమిది ద్వంద్వములగువఱకు చేయవలెను; అన్యోన్యా = పరస్పరము; అభిముఖం వా = ఎదురుగా గాని; పరావృత్తముఖం వా అపి = వినివృత్తముఖముగా గాని; దండానువిద్ధముఖం వా = దండానవిద్ధముఖముగా గాని; వాద్యతాల సమన్వితం = వాద్యతాలయుతముగ; స్థానకైః = స్థానములచేతను; హస్తచలనైః = హస్తచలనములతోను; వర్తనైః యుతం = వర్తనములతో కూడునట్లుగను; లయత్రయసమన్వితం = మూడులయలు కలదిగను ఉన్నట్టిదానిని; దండరాయమితి= దండరాయమని; నృత్తభేదవిచక్షణైః ప్రోక్తం = నృత్తభేములను తెలిసిన పండితులచే చెప్పబడినది.

**తాత్పర్యము** : రెండుపాత్రల నారంభించి రెండు రెండు పాత్రలు వృద్ధినొందించవలెను. యథేష్టముగా ఎనిమిది ద్వంద్వములగువఱకు చేయవలెను. పరస్పరము ఎదురుగా గాని, వినివృత్తముఖముగా గాని, దండానువిద్ధముఖముగా గాని, వాద్యతాలయుతముగ స్థానములచేతను హస్తచలనములతోను వర్తనములతో కూడునట్లుగను మూడు లయలు

కలదిగను ఉన్నట్టిదానిని దండరాయమని నృత్తభేదములను తెలిసిన పండితులచే చెప్పబడినది.

**ఇతి సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే సంగీతసమయసారే**

**నృత్తలక్షణం నామ షష్ఠమధికరణమ్**

## ॥ అథ సప్తమ మధికరణమ్ ॥

**గీతం వాద్యం చ నృత్తం చ లయం తా(లం?లే)విరాజతే ।**
**తస్మాత్ తాలస్వరూపం చ వక్ష్యే లక్ష్యానుసారతః ॥ 1 ॥**

**ప్రతిపదార్థము** : గీతం = గీతము; వాద్యం = వాద్యము; నృత్తం = నృత్యము; లయం= లయమును; తాలే = తాళమందు; విరాజతే = ప్రకాశించుచున్నది; తస్మాత్ = అందువలన; తాలస్వరూపం = తాలస్వరూపమును; లక్ష్యానుసారతః = లక్ష్యములననుసరిచి; వక్ష్యే = చెప్పుచున్నాను.

**తాత్పర్యము** : గీతము, వాద్యము, నృత్యము, లయమును, తాళమందు ప్రకాశించుచున్నది. అందువలన తాలస్వరూపమును లక్ష్యముననుసరించి చెప్పుచున్నాను.

**ఉపర్యుపరివిన్యస్తపద్మపత్రశతే సకృత్ ।**
**యః కాలఃసూచిసంభేదాత్ తత్ క్షణం సాదజం ప్రతి (?) ॥ 2 ॥**

**ప్రతిపదార్థము** : ఉపర్యుపరివిన్యస్తపద్మపత్రశతే = పైపైన (ఒకదానిమీద ఒకటి) ఉంచబడిన పద్మముయొక్క దళములనూటియందు; సకృత్ = ఒకసారి; సూచిసంభేదాత్ యః కాలః స్యాత్ = సూది భేదించుటకేకాలమగునో, తత్ = అది; సాదజం ప్రతి = సాదజమునుగూర్చి; క్షణం స్యాత్ = క్షణకాలమగును.

**తాత్పర్యము** : పైపైన (ఒకదానిమీద ఒకటి) ఉంచబడినపద్మముయొక్క దళములనూటి యందు ఒకసారి సూది భేదించుటకేకాలమగునో అది సాదజమును గూర్చి క్షణకాలమగును.

లవః క్షణైరష్టభిః స్యాత్ కాష్ఠా చాష్టలవాత్మికా ।
అష్టౌ కాష్ఠాః నిమేషః స్యాత్ కాలస్త్వష్టనిమేషకైః ॥ 3 ॥

**ప్రతిపదార్థము** : అష్టభిః క్షణైః = ఎనిమిది క్షణములచే; లవః స్యాత్ = లవమగును; అష్టలవాత్మికా కాష్ఠా = ఎనిమిది కాష్ఠలు; నిమేషః స్యాత్ = నిమిషమగును; అష్టనిమేషకైః కాలః స్యాత్ = ఎనిమిది నిమిషములతో ఒకకాలము అగును.

**తాత్పర్యము** : ఎనిమిది క్షణములచే లవమగును. ఎనిమిది కాష్ఠలు నిమిషమగును. ఎనిమిది నిమిషములతో ఒకకాలము అగును.

**కాలైస్తృటిశ్చతుర్భిః స్యాత్ తాభ్యామర్ధద్రుతం భవేత్ ।**
**అర్ధద్రుతాభ్యాం బిందుఃస్యాద్ బిందుభ్యాం తు లఘుర్భవేత్ ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : చతుర్భిః కాలైః = నాల్గు కాలములచే; తృటిః భవేత్ = ఒక తృటియగును; తాభ్యాం = ఆరెండు తృటుల కాలముతో; అర్ధద్రుతం భవేత్ = అర్ధద్రుతము అగును; అర్ధద్రుతాభ్యాం = రెండు అర్ధద్రుతములచే; బిందుఃస్యాత్= ఒకబిందువగును; బిందుభ్యాం లఘుఃభవేత్ = రెండుబిందువులతో ఒక లఘువగును.

**తాత్పర్యము** : నాల్గు కాలములచే ఒక తృటియగును. ఆరెండు తృటుల కాలముతో అర్ధద్రుతము అగును. రెండు అర్ధద్రుతములచే ఒకబిందువగును. రెండు బిందువులతో ఒక లఘువగును.

**లఘుభ్యాం తు గురుః ప్రోక్తో లైస్త్రిభిః ప్లుత ఏవ చ ।**
**ఇతి మానగతః ప్రోక్తో మనోగా తాలవేదిభిః ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : లఘుభ్యాం = రెండులఘువులచే; గురుఃప్రోక్తః = గురువు చెప్పబడినది; లైఃత్రిభిః = మూడులఘువులతో; ప్లుతఃస్యాత్ = ప్లుతమగును; ఇతి = ఈవిధముగా; తాలవేదిభిః = తాళవేత్తలచే; మనోగాః = మనోగతములైన; మానగతః ప్రోక్తః = మానగతము చెప్పబడినది.

**తాత్పర్యము** : రెండులఘువులచే గురువు చెప్పబడినది. మూడు లఘువులతో ప్లుతమగును. ఈవిధముగా తాళవేత్తలచే మనోగతములైన మానగతము చెప్పబడినది.

**ఆవాపాది ర్ధ్రువాదిర్వా + + + పరికీర్తితాః ।**
**తత్రావా(పే?పో)థ నిష్క్రామో విక్షేపోవథప్రవేశనమ్ ॥ 6 ॥**

**శమ్యా తాలశ్చ విజ్ఞేయః సన్నిపాతశ్చ సప్తమః ।**
**ఆవాపసంజ్ఞకం జ్ఞేయముత్తానాంగులికుంచనమ్ ॥ 7 ॥**

**ప్రతిపదార్థము** : ఆవాపాదిర్ధ్రువాదిర్వా = ఆవాపాదులుగాని,ధ్రువాదులుగాని; పరికీర్తితాః = చెప్పబడినవి; తత్ర = అందు; ఆవాపః = ఆవాపము; నిష్క్రామః = నిష్క్రామము; విక్షేపః = విక్షేపము; ప్రవేశనం = ప్రవేశనము; శమ్యా = శమ్య; తాలః = తాళము; సప్తమః = ఏడవది; సన్నిపాతః = సన్నిపాతముగా; విజ్ఞేయః = తెలియదగినది; ఉత్తానాంగలికుంచనం = ఎత్తబడిన వేళ్ళుముడుచుట; ఆవాససంజ్ఞకం జ్ఞేయం = ఆవాపముగా తెలియదగినది.

**తాత్పర్యము** : ఆవాపాదులుగాని, ధ్రువాదులుగాని చెప్పబడినవి. అందు ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశనము, శమ్యతాళము ఏడవది సన్నిపాతముగా తెలియదగినవి. ఎత్తబడిన వేళ్లుముడుచుట ఆవాపముగా తెలియదగినది.

**అతస్తలేన హస్తేన నిష్క్రామాఖ్యం ప్రసారణమ్ ।**
**తస్య దక్ష(గ)తః క్షేపో విక్షేపః పరిభాష్యతే ॥ 8 ॥**

**ప్రతిపదార్థము** : అతః = (ఆవాపమువల్లనైన) అందువలన; తలేన హస్తేన = తాలహస్తముచే; ప్రసారణం = ప్రసారణము(విప్పుట) చేయుట ఏదికలదో; తత్ నిష్క్రామాఖ్యం స్యాత్ = నిష్క్రామమగును; తస్య దక్షగతఃక్షేపః = ఆనిష్క్రామహస్తముయొక్క విదిలింపు దక్షిణగతమైనచో (కుడివైపునకు జరిగినచో); విక్షేపః పరిభాష్యతే = విక్షేపముగా చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : (ఆవాపము వల్లనైన) అందువలన తాలహస్తముచే ప్రసారణము (విప్పుట) చేయుట ఏదికలదో నిష్క్రామమగును ఆనిష్క్రామహస్తముయొక్క విదిలింపు దక్షిణగతమైనచో (కుడివైపునకు జరిగినచో) విక్షేపముగా చెప్పబడుచున్నది.

**భూయవ్వాకుంచనం జ్ఞేయం ప్రవేశాఖ్యమతస్తలమ్ ।**
**శమ్యా దక్షిణపాతస్తు తాలో వామస్తు కీర్తితః ॥ 9 ॥**

**ప్రతిపదార్థము** : భూయః = మరల; తలం = అరచేతిని; ఆకుంచనం = (విక్షేపముచేసిన దానిని) ముడుచుకొనుటను, (స్వస్థానమునకు చేర్చుట); ప్రవేశాఖ్యం స్యాత్ = ప్రవేశమగును; దక్షిణపాతః = (కుడిహస్తముపై)దెబ్బవేయుట; శమ్యా = శమ్యయగును; వామస్తు = (ఎడమహస్తముపై) కుడిచేతితో పాతమేదికలదో అది; తాలః కీర్తితః = తాళముగా చెప్పబడినది.

**తాత్పర్యము** : మరల అరచేతిని (విక్షేపముచేసిన దానిని) ముడుచుకొనుటను

(స్వస్థానమునకు చేర్చుట) ప్రవేశమగును. (కుడిహస్తము)దెబ్బవేయుట శమ్యయగును. (ఎడమహ్తాముపై) కుడిచేతితో పాతమేదికలదో అది తాళముగా చెప్పబడినది.

**ఉభయోర్హస్తయోః పాతః సన్నిపాత ఇతి స్మృతః ।**
**ధ్రువకా సర్పిణీ కృష్యా బంధినీ చ వి(వ?స)ర్జితా ॥ 10 ॥**

**ప్రతిపదార్థము :** ఉభయోః హస్తయోః పాతః = రెండుహస్తములతోనైన సమానఘాతము; సన్నిపాత ఇతి స్మృతః = సన్నిపాతమనబడును; ధ్రువకా = ధ్రువకము; సర్పిణీ = సర్పిణి; కృష్యా = కృష్య; బంధినీ చ = బంధినియు; విసర్జితా = విసర్జితము.

**తాత్పర్యము :** రెండుహస్తములతోనైన సమానఘాతము సన్నిపాతమనబడును. ధ్రువకము, సర్పిణి, కృష్య, బంధినియు, విసర్జితము.

**విక్షిప్తా చ పతాకా చ పతితా చాష్టమీ మతా ।**
**ఘనాభిఘాతో ధ్రువకః సర్పిణ్యగ్రే ప్రసారితా ॥ 11 ॥**

**ప్రతిపదార్థము :** విక్షిప్తా = విక్షిప్తయు; పతాకా = పతాకయు; పతితా = పతితయని; అష్టమీ మతా = ఎనిమిదవదిగా సమ్మతము; ఘనాభిఘాతః =గట్టిగా (సశబ్దముగా) దెబ్బవేయుట; ధ్రువకః = ధ్రువ(క)ము; అగ్రే ప్రసారితా సర్పిణీ = ముందునకు చాచిన (ది)సర్పిణి.

**తాత్పర్యము :** విక్షిప్తయు, పతాకయు, పతితయని ఎనిమిదవదిగా సమ్మతము. గట్టిగా (సశబ్దముగా) దెబ్బవేయుట ధ్రువ(క)ము. ముందునకు చాచిన (ది)సర్పిణి.

**కృష్యా కుంచనమాత్రా చ బంధాకారా చ బంధినీ ।**
**విసర్జితోపరిష్ఠేన విక్షిప్తోత్తానవామతః ॥ 12 ॥**

**ప్రతిపదార్థము :** కుంచనమాత్రా = ముడుచుటమాత్రము; కృష్యాస్యాత్ = కృష్యయగును; బంధాకారా బంధినీ = బంధాకారమైనది బంధినియగును; ఉపరిష్ఠేన= పైకెత్తుటచే; విసర్జితా = విసర్జితమగును; ఉత్తాన వామతః = ఎడమగా ఎత్తిన; విక్షిప్తా = విక్షిప్తమగును.

**తాత్పర్యము :** ముడుచుట మాత్రము కృష్యయగును. బంధాకారమైనది బంధిని యగును. పైకెత్తుటచే విసర్జితమగును. ఎడమగా ఎత్తిన విక్షిప్తమగును.

**ఊర్ధ్వాంగులిః పతాకా స్యాత్ పతితా పతితా పునః ।**
**లఘ్వక్షరాణాం పంచానాం మానముచ్చారణే హి యత్ ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : ఊర్ధ్వాంగులిః = పైకెత్తబడిన అంగుళులుకలది; పతాకా స్యాత్ = పతాకయగును; పతితా = పడునది, పాతముకలది; పతితా స్యాత్ =పతితమగును; లఘ్వక్షరాణాం పచానాంమానం = లఘ్వక్షరముల ఐదింటిమానము(లెక్క); ఉచ్చరణే = ఉచ్చారణమందు; యత్ = యేదికలదో; సా = అది; బుధైః = పండితులచే; తాలగతాప్రమాణామాత్రా = తాళగతమైన, రపామణమాత్ర(ము)గా; పరిజ్ఞేయా = తెలియదగినది.

**తాత్పర్యము** : పైకెత్తబడిన అంగుళులు కలది పతాక యగును. పడునది. పాతముకలది పతితమగును. లఘ్వక్షరముల ఐదింటి మానము(లెక్క) ఉచ్చారణమందు యేదికలదో అది పండితులచే తాళగతమైన ప్రమాణమాత్ర(ము)గా తెలియదగినది.

**తత్ప్రమాణాపరిజ్ఞేయా మాత్రా తాలగతా బుధైః ।**
**ద్విమాత్రా స్యాత్ కలా చిత్రే చతుర్మాత్రానువర్తికే ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : చిత్రే = చిత్రమందు; ద్విమాత్రా కలాస్యాత్ = ద్విమాత్రికమైన కలయగును; అనువర్తికే = అనువర్తికమందు; చతుర్మాత్రాస్యాత్ = చతుర్మాత్రికమగును.

**తాత్పర్యము** : చిత్రమందు ద్విమాత్రికమైన కలయగును. అనువర్తికమందు చతుర్మాత్రికమగును.

**అష్టమాత్రా చ విద్వద్భిర్దక్షిణే సముదాహృతా ।**
**తాలాంతరాలవర్తీ యః కాలోసౌ లయనాల్లయః ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : దక్షిణే = దక్షిణమందు; అష్టమాత్రా సముదాహృతా = ఎనిమిది మాత్రలు కలదిగా చెప్పబడినది; యః కాలాంతరాలవర్తీ = ఏదికాలాంతరాల వర్తియగునో; అసౌకాలః = ఈకాలము; లయనాత్ = తీసికొనిపోబడుటచే (లీనముచేయబడుటచే నడిపింపబడుటచే); లయఃఖ్యాతః = లయగాప్రసిద్ధము.

**తాత్పర్యము** : దక్షిణమందు ఎనిమిదిమాత్రలు కలదిగా చెప్పబడినది. ఏదికాలాంతరాల వర్తియగునో ఈకాలము తీసికొనిపోబడుటచే (లీనముచేయుబడుటచే, నడిపింపబడుటచే) లయగాప్రసిద్ధము.

**త్రివిధః స చవిజ్ఞేయో ద్రుతో మధ్యోవిలంబితః ।**
**లయయానాద్ యతిః ప్రోక్తశ్చిత్రాదిషు యథాక్రమమ్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : సచలయః = ఆలయ; ద్రుతః = ద్రుతము; మధ్యః = మధ్యము; విలంబితః ఇతి = విలంబితమని; త్రివిధ విజ్ఞేయః = మూడు విధములుగా తెలియదగినది; చిత్రాదిషు = చిత్రాదులయందు; యథాక్రమం = వరుసగా; లయయానాత్ = లయనడచుటవలన; యతిః ప్రోక్తః = యతి చెప్పబడినది.

**తాత్పర్యము** : ఆ లయ ద్రుతము మధ్యము విలంబితమని మూడువిధములుగా తెలియదగినది. చిత్రాదులయందు వరుసగా లయ నడచుటవలన యతి చెప్పబడినది.

**సమా స్రోతవహాఖ్యా చ గోపుచ్ఛా చేతి సా త్రిధా ।**
**అథ దేశీగతా మార్గా వక్ష్యంతే లక్షసంభవాః ॥ 17 ॥**

**ప్రతిపదార్థము** : సా = ఆ; యతి; సమా = సమము; స్రోతవహాఖ్యా = స్రోతవహము; గోపుచ్ఛాఇతి = గోపుచ్ఛమనియు; త్రిధా = మూడువిధములు; అథ = తరువాత; దేశీగతాః = దేశీతములైన; లక్షసంభవాః మార్గాః = లక్షణ(లక్ష్యజనితములు) ములైనవి; వక్ష్యంతే = చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : ఆ యతి సమము, స్రోతవాహము, గోపుచ్ఛమనియు మూడువిధములు. తరువాత దేశీగతములైన లక్షణ(లక్ష్యజనితములు)ములైనవి చెప్పబడుచున్నవి.

**తత్ర చిత్రతరశ్చైకస్తథా చిత్రతమోఽపరః ।**
**అతిచిత్రతమశ్చేతి తత్స్వరూపం నిరూప్యతే ॥ 18 ॥**

**ప్రతిపదార్థము** : తత్ర = అందు; చిత్రతరః ఏకః = చిత్రమొకటి; అపరః = రెండవది; చిత్రతమః = చిత్రతమము; అతిచిత్రతమఃఇతి = అతిచిత్రతమమనునది మరియొకటి; తత్ స్వరూపం నిరూప్యతే = వాటి స్వరము నిరూపింపబడుచున్నది.

**తాత్పర్యము** : అందు చిత్రమొకటి, రెండవది చిత్రతమము, అతిచిత్రతము మనునది మరియొకటి. వాటిస్వరూపము నిరూపింపబడుచున్నది.

**మాత్రా చిత్రతారా జ్ఞేయా ద్వ్యర్థం చిత్రతమే మతా ।**
**అతిచిత్రతమే మార్గే కలా ను ద్రుతసంజ్ఞితా ॥ 19 ॥**

**ప్రతిపదార్థము** : మాత్రాచిత్రతరా జ్ఞేయా = చిత్రతరమేకమాత్రికము; చిత్రతమే =

చిత్రతమమందు; ద్వ్యర్ధం మతా = 2స్వర మాత్రలు సమ్మతము; అతి చిత్రతమేమార్గే= అతిచిత్రతమమార్గమందు; (అనుద్రుసంజ్ఞితకలాజ్ఞేయా = అనుద్రుత సంజ్ఞకలదియగును); ద్రుతసంజ్ఞితకలా జ్ఞేయా = ద్రుత సంజ్ఞకలదిగా గుర్తింపబడినది; (మనవి-)ఇందు ఏది యోగ్యమైన ఆ యర్థమును గ్రహించునది.

**తాత్పర్యము** : చిత్రతరమేక మాత్రికము. చిత్రతమమందు 2స్వర మాత్రలు సమ్మతము. అతిచిత్రతమమార్గమందు (అనుద్రుతసంజ్ఞకలదియగును) ద్రుతసంజ్ఞ కలదిగా గుర్తింపదగినది. (మనవి-) ఇందు ఏది యోగ్యమైన ఆ యర్థమును గ్రహించునది.

**అథ చిత్రాదిమార్గేషు స తాలః స్యాచ్చతుర్విధః ।**
**చతురశ్రస్తథా త్ర్యశ్రో మిశ్రః ఖండనామకః ॥ 20 ॥**

**ప్రతిపదార్థము** : అథ = తరువాత; చిత్రాదిమార్గేషు = చిత్రాదిమార్గములందు; స తాలః = ఆతాళము; చతుర్విధః స్యాత్ = నాల్గువిధములగును; చతురశ్రః = చతురశ్రము; త్ర్యశ్రః = త్ర్యశ్రము; మిశ్రః = మిశ్రము; ఖండనామకః = ఖండనమను పేరుగలది.

**తాత్పర్యము** : తరువాత చిత్రాదిమార్గములందు ఆ తాళము నాల్గువిధములగును. చతురశ్రము, త్ర్యశ్రము, మిశ్రము, ఖండనమను పేరుగలది.

**తత్ర చచ్చత్పుటః ప్రోక్తశ్చతురశ్రో మనీషిభిః ।**
**స త్రిధైకకలః పూర్వం ద్వికలశ్చ చతుష్కలః ॥ 21 ॥**

**ప్రతిపదార్థము** : తత్ర =అందు; చచ్చత్పుటః = చచ్చత్పుటతాళము; చతురశ్రః = చతురశ్రముగా; ప్రోక్తః = చెప్పబడినది; సః =అది; త్రిధా = మూడువిధములు; ఏకకలః = ఏకకల; ద్వికలః = ద్వికలము; చతుష్కలః = చతుష్కలమని.

**తాత్పర్యము** : అందు చచ్చత్పుటతాళము చతురశ్రముగా చెప్పబడినది. అది మూడువిధములు, ఏకకల, ద్వికలము, చతుష్కలమని.

**తథా చాచపుటస్త్ర్యశ్రో యుగ్మో + + చ మిశ్రణాత్ ।**
విశ్లిష్టైరప్య(వి)శ్లిష్టైః స్థాలాంగైర్యో ద్రుతాదిభిః ॥ 22 ॥

**ప్రతిపదార్థము** : తథా = అట్లే; చాచపుటః =చాచపుటతాళము; త్ర్యశ్రః = త్ర్యశ్రము;

యుగ్మ్మః = ద్వికలము; మిశ్రమణాత్ = మిశ్రణమువలన; విశ్లిష్టైః =విశ్లేషము (విడిపోవుట)లచేతను; అవిశ్లిష్టైః = సంశ్లేషముచేతను అయిన; తాలాంగైః = తాళాంగములైన; ద్రుతాదిభిః = ద్రుతాదులచే.

**తాత్పర్యము** : అట్లే చాచపుటతాళము త్ర్యశ్రము ద్వికలము మిశ్రమమువలన విశ్లేషము (విడిపోవుట) లచేతను సంశ్లేషములచేతను అయిన తాళాంగములైన ద్రుతాదులచే.

**క్రియతే బహుభంగీభిః స తాలః ఖండసంజ్ఞకః ।**
**ఖండోఽపి చతురశ్రాఖ్యస్త్ర్యశ్రో మిశ్రస్తథైవ చ ॥ 23 ॥**
**సంకీర్ణశ్చేతి నిర్దిష్టశ్చతుర్ధా తాలవేదిభిః ।**

**ప్రతిపదార్థము** : బహుభంగిభిః = అనేకప్రకారములచే; యః = ఏది; క్రియతే = చేయబడునో; సః తాలః = ఆతాళము; ఖండసంజ్ఞకః = ఖండతాళమగును; ఖండోఽపి= ఖండతాళముకూడ; చతురశ్రాఖ్యః = చతురశ్రము; త్ర్యశ్రః = త్ర్యశ్రము; మిశ్రః = మిశ్రము; సంకీర్ణః ఇతి = సంకీర్ణము అని; తాళవేదిభిః = తాళము నెఱిగిన పండితులచే; చతుర్ధాః = నాల్గువిదములుగా; నిర్దిష్టః = నిర్దేశింపబడినది. అథతాలోద్దేశః ।

**తాత్పర్యము** : అనేకప్రకారములచే ఏది చేయబడునో ఆతాళము ఖండతాళమగును. ఖండతాళముకూడ చతురశ్రము, త్ర్యశ్రము, మిశ్రము, సంకీర్ణము అని నాల్గువిధములుగా నిర్దేశింపబడినది.

**చచ్చత్పుటశ్చాచపుటః షట్పితాపుత్రకస్తథా ॥ 24 ॥**

**సంపక్వేష్టక ఉద్ఘట్ట ఆదితాలశ్చ దర్పణః ।**
**చచ్చరీ సింహలీలశ్చ కందర్పః సింహవిక్రమః ॥ 25 ॥**

**శ్రీరంగో రతిలీలశ్చ రంగతాలః పరిక్రమః ।**
**ప్రత్యంగో గజలీలశ్చ త్రిభిన్నో వీరవిక్రమః ॥ 26 ॥**

**హంసలీలో వర్ణరాజశ్చూడామణివరస్తతః ।**
**రంగోద్యోతో రాజతాలః సింహవిక్రాడితస్తతః ॥ 27 ॥**

**వనమాలీ వర్ణతాలస్తతో రంగప్రదీపకః ।**
**హంసనాదః సింహనాదో మల్లికామోదసంజ్ఞకః ॥ 28 ॥**

**భవేచ్చరభలీలశ్చ రంగాభరణ ఏవ చ ।**
**తతస్తురగలీలః స్యాత్ స్యాత్తతః సింహనందనః ॥ 29 ॥**

**జయశ్రీర్విజయానందః ప్రతితాలో ద్వితీయకః ।**
**మకరందః కీర్తితాలో విజయో జయమంగలః ॥ 30 ॥**

**ప్రతిపదార్థము :** చచ్చత్పుటము, చాచపుటము, షట్పితాపుత్రకము, సంపర్క్వేష్టకము, ఉద్ఘటము, ఆదితాలము, దర్పణము, చచ్చరీ సింహలీల, కందర్పము సింహవిక్రమము, శ్రీరంగము, రతిశీలము, రంగతాలము, పరిక్రమము, ప్రత్యంగము, గజలీల, త్రిభిన్నము, వీరవిక్రమము, హంసలీల, వర్ణరాజము, చూడామణివరము, రంగోద్యోతము, రాజతాలము, సింహవిక్రీడితము, వనమాలివర్ణతాలము, రంగప్రదీపకము, హంసనాదము, సింహనాదము, మల్లికామోదము, శరభలీల, రంగాభరణము, తురగలీల, సింహనందనము, జయశ్రీ, విజయానందము, ప్రతితాలము, ద్వితీయకము, మకరందము, కీర్తితాలము, విజయము, జయమంగళము.

**తాత్పర్యము :** చచ్చత్పుటము, చాచపుటము, షట్పితాపుత్రకము, సంపర్క్వేష్టకము, ఉద్ఘటము, ఆదితాలము, దర్పణము, చచ్చరీ సింహలీల, కందర్పము సింహవిక్రమము, శ్రీరంగము, రతిశీలము, రంగతాలము, పరిక్రమము, ప్రత్యంగము, గజలీల, త్రిభిన్నము, వీరవిక్రమము, హంసలీల, వర్ణరాజము, చూడామణివరము, రంగోద్యోతము, రాజతాలము, సింహవిక్రీడితము, వనమాలిమవర్ణతాలము, రంగప్రదీపకము, హంసనాదము, సింహనాదము, మల్లికామోదము, శరభలీల, రంగాభరణము, తురగలీల, సింహనందనము, జయశ్రీ, విజయానందము, ప్రతితాలము, ద్వితీయకము, మకరందము, కీర్తితాలము, విజయము, జయమంగళము.

**రాజవిద్యాధరోమట్టో జయతాలః కుడుక్కకః ।**
**తతో నిస్సారుకః క్రీడా త్రిభంగిః కేరలప్రియః ॥ 31 ॥**

**ప్రతిపదార్థము :** రాజవిద్యాధరము, మట్టజయతాలము, కుడుక్కము, నిస్సారుకము, క్రీడా, త్రిభంగి, కేరల ప్రియము.

**తాత్పర్యము :** రాజవిద్యాధరము, మట్టజయతాలము, కుడుక్కము, నిస్సారుకము, క్రీడా, త్రిభంగీ, కేరల ప్రియము.

**శ్రీకీర్తిర్బిందుమాలీ చ సమతాలశ్చ నందనః ।**
**ఉదీక్ష(మా?)ణో మట్టికా చ ఢేంకికా వణుమట్టికా ॥ 32 ॥**

**అభినందో నరక్రీడా మల్లతాలశ్చ దీపకః ।**
**అనంగతాలో విషమో నాందీపుక్కుందకందకౌ ॥ 33 ॥**

**ఏకతాలశ్చ కంకాలశ్చతుస్తాలశ్చ డోంబులీ ।**
**అహంకాగారాయబేంకోలస్తథైవ లఘుశేఖరః ॥ 34 ॥**

**ప్రతిపదార్థము :** శ్రీకీర్తి, బిందుమాలీ, సమతలము, నందనము, ఉదీక్షమాణము, మట్టాకా, ఢేంకికా, వణుమట్టికా, అభినందనము, సరక్రీడ, మల్లతాలము, దీపకము, అనంగతాలము, విషమము, నాందీపుక్కుందము, కందకము, ఏకతాలము, కంకాలము, చతుస్తాలము, డోంబులీ, అహంకగారాయబేంకోలము, లఘుశేఖరము.

**తాత్పర్యము :** శ్రీకీర్తి, బిందుమాలీ, సమతలము, నందనము, ఉదీక్షమాణము, మట్టాకా, ఢేంకికా, వణుమట్టికా, అభినందనము, సరక్రీడ, మల్లతాలము, దీపకము, అనంగతాలము, విషమము, నాందీపుక్కుందము, కందకము, ఏకతాలము, కంకాలము, చతుస్తాలము, డోంబులీ, అహంకగారాయబేంకోలము, లఘుశేఖరము.

**ప్రతాపశేఖరశ్చాన్యో జగఝంపా చతుర్ముఖః ।**
**ఝంపా చ ప్రతిమట్టశ్చ తథా తాలస్తృతీయకః ॥ 35 ॥**

**తస్మాదుపరి విజ్ఞేయో వసతా లలితో రతిః ।**
**కరుణాఖ్యయతిశ్చైవ షట్తాలో వర్ధనస్తథా ॥ 36 ॥**

**తతో వర్ణయతిశ్చైవ రాజనారాయణః స్మృతః ।**
**మదనశ్చైవ విజ్ఞేయః పార్వతీలోచనస్తతః ॥ 37 ॥**

తతో గారుకితాలః స్యాత్ తతః శ్రీనందనో జయః ।
లీలావిలోకితశ్చాన్యో లలితప్రియసావచ (?) ॥ 38 ॥

జనకట్టేశ్చవలక్ష్మీకో రాగవర్ధన సంజ్ఞకః (?) ।
ఉత్సవశ్చేతి తాలానామే (కో?కే) నాభ్యదికం శతమ్ ॥ 39 ॥

చతురశ్రాదితాలానాం మధ్యే వ్యవహారయోగ్య తాలలక్షణం ప్రస్తార సహితం వక్ష్యే

**ప్రతిపదార్థము :** ప్రతాపశేఖరము, జగఝుంపా, చతుర్ముఖము, ఝుంపా, ప్రతిమట్టము, తృతీయతాలము, లలితము, రతి, కరుణయతి, షట్టాలము, వర్ధనము, వర్ణయతి, రాజనారాయణము, మదనము, పార్వతీలోచనము, గారుకి, శ్రీనందనము, జయము, లీలావిలోకితము, లలితప్రియము, ఉత్సవము, (101) ఇతి = అని; తాలానాం = తాళములయొక్క; ఏకేన అభ్యధికం శతం = 101 భేదములు; చతురశ్రాదితాలానాం మధ్యే = చతురశ్రాదితాలములలో; వ్యవహార యోగతాలలక్షణం = వ్యవహార యోగ్యములైన తాళముల లక్షణమును; ప్రస్తారసహితం వక్ష్యే = ప్రస్తారసహితముగా చెప్పుచున్నాను.

**తాత్పర్యము :** ప్రతాపశేఖరము, జగఝుంపా, చతుర్ముఖము, ఝుంపా, ప్రతిమట్టము, తృతీయతాలము, లలితము, రతి, కరుణయతి, సట్టాలము, వర్ధనము, వర్ణయతి, రాజనారాయణము, మదనము, పార్వతీలోచనము, గారుకి, శ్రీనందనము, జయము, లీలావిలోకితము, లలితప్రియము, ఉత్సవము, (101)అని తాళములయొక్క 101 బేదములు చతురశ్రాదితాలములలో వ్యవహార యోగ్యములైన తాళముల లక్షణమును ప్రస్తారసహితముగా చెప్పుచున్నాను.

**ప్రస్తారే తాలసంబంధి హ్యక్షరం స్యాచ్చతుర్విధమ్ ।**
**సంజ్ఞయా తత్ పరిజ్ఞేయం ద్రుతం లఘు గురు ప్లుతమ్ ॥ 40 ॥**

**ప్రతిపదార్థము :** ప్రస్తారమందు, తాలసంబంధి అక్షరం = తాలమునకు సంబంధించిన అక్షరము; చతుర్విధం స్యాత్ = నాల్గువిధములగును; తత్ = ఆయక్షరము; ద్రుతము, లఘువు, గరువు, ప్లుతము అని, సంజ్ఞయా = పేరుచేతను; పరిజ్ఞేయం = తెలియదగినది.

**తాత్పర్యము :** ప్రస్తారమందు తాలమునకు సంబంధించిన అక్షరము నాల్గువిధములగును. ఆయక్షరము ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము అని పేరుచేతను తెలియదగినది.

**ప్రత్యేకం చ ద్రుతాదీనాం భవేత్ పర్యాయపంచకమ్ ।**

**అర్ధమాత్రం ద్రుతం వ్యోమ వ్యంజనం బిందుకం తథా ॥ 41 ॥**

**ప్రతిపదార్థము :** ప్రత్యేకం = ప్రత్యేకముగా; ద్రుతాదీనాం = ద్రుతము మొదలగు వాటికి; పర్యాయపంచకం = పర్యాయపంచకము; భవేత్ = ఉండును; అర్ధమాత్రం =

అర్ధమాత్రము; ద్రుతం = ద్రుతము; వ్యోమ = వ్యోమ; వ్యంజనం = వ్యంజనము; బిందుకం = బిందుకము (అని);

**తాత్పర్యము** : ప్రత్యేకముగా ద్రుతము మొదలగు వాటికి పర్యాయ పంచకము ఉండును. అర్ధమాత్రము ద్రుతము వ్యోమ వ్యంజనము బిందుకము (అని);

> **మాత్రికం సరళం హ్రస్వం లఘు వ్యాపకమిత్యపి ।**
> **ద్విమాత్రికం కలా వక్రం గురు దీర్ఘమితి స్మృతమ్ ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : మాత్రికం = మాత్రికము; సరలం = సరళము; హ్రస్వం = హ్రస్వము; లఘు = లఘువు; వ్యాపకం = వ్యాపకము; ద్విమాత్రికం = ద్విమాత్రికము; కలావక్రం= వక్రము; గురు = గురువు; దీర్ఘం ఇతి = దీర్ఘమని; స్మృతం = చెప్పబడినది.

**తాత్పర్యము** : మాత్రికము సరళము, హ్రస్వము, లఘువు, వ్యాపకము, ద్విమాత్రికము వక్రము, గురువు, దీర్ఘమని చెప్పబడినది.

> **సామోద్భవం ప్లుతం దీప్తం తథా త్ర్యంగం త్రిమాత్రికమ్ ।**
> **అథ దుత్రాదినిష్పనాంస్తాలాన్ వక్ష్యామి సాంప్రతమ్ ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : సామోద్భవం = సామోద్భవము; ప్లుతం = ప్లుతము; దీప్తం = దీప్తము; త్ర్యంగం = త్ర్యంగము; త్రిమాత్రికం = త్రిమాత్రికము; అథ = తరువాత; ద్రుతాది నిష్పన్నాన్ తాలాన్ = ద్రుతాదిజనితతాళములను; సాంప్రతం = ఇప్పుడు; వక్ష్యామి= చెప్పుచున్నాను.

**తాత్పర్యము** : సామోద్భవము, ప్లుతము, దీప్తము, త్ర్యంగము, త్రిమాత్రికము. తరువాత ద్రుతాదిజనితతాళములను ఇప్పుడు చెప్పుచున్నాను.

> **తాలే చచ్చత్పుటే జ్ఞేయం గురుద్వంద్వం లఘు ప్లుతమ్ ।**
> **గురుర్లఘూ గురుశ్చైవ భవేచ్చాపుటాభిధే ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : చచ్చత్పుటేతాలే = చచ్చత్పుటతాళమందు; గురుద్వంద్వం = రెండు గురువులు; లఘు = ఒక లఘువు; ప్లుతం = ఒక ప్లుతముగా; జ్ఞేయం = తెలియదగినది; చాచపుటాభిధే తాలే = చాచపుటతాళమునందు; గురుః = ఒక గురువు; లఘూ = రెండు లఘువులు; గరుశ్చ = ఒకగురువును; భవేత్ = ఉండును.

**తాత్పర్యము** : చచ్చుత్పుటతాళమందు రెండుగురువులు ఒక లఘువు ఒక ప్లుతముగా తెలియదగినది. చాచపుట తాళమునందు ఒక గురువు రెండు లఘువులు ఒక గురువును ఉండును.

**పలగా గలపాశ్చైవ షట్పితాపుత్రకే స్మృతాః ।**
**మగణాద్యంతం ప్లుతం జ్ఞేయం సంపర్కేష్టకసంజ్ఞకమ్ ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : షట్పితాపుత్రకే = షట్పితాపుత్రక తాళమందు; పలగాః = ప్లుతము, లఘువు, గురువు; గలపాశ్చ; ఏవ = గురువు, లఘువు, ప్లుతమును; స్మృతాః = చెప్పబడినవి; మగణాద్యంతం = మగణమున కాద్యంతమును; ప్లుతం = ప్లుతముకలదిగా; సంపర్కేష్టక సంజ్ఞకం = సంపర్కేష్టకమగును.

**తాత్పర్యము** : షట్పితాపుత్రకతాళమందు ప్లుతము, లఘువు, గురువు, గురులఘువు ప్లుతమును చెప్పబడినది. మగణమునకాద్యంతమును ప్లుతముకలదిగా సంపర్కేష్టక మగును.

**ఉద్ఘట్టే మగణస్త్వేక ఆదితాలే దఘు స్మృతః ।**
**అష్టకృత్వస్తు చచ్చర్యాం విరామాంతో ద్రుతౌ లఘు (?) ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : ఉద్ఘటే = ఉద్ఘటమందు; మగణః ఏకః = మగణమొకటి (మూడు గురువులు కలది); ఆదితాలే = ఆదితాలమందు; (అఘుస్మృతః = ద్రుతము, లఘువు, గురువు (ఘాతము) కలదియగును, అనుద్రుతము లఘువు కలదియగును); చచ్చర్యాం = చచ్చరియందు; అష్టకృత్వస్తు = 8 ద్రుతములు, లఘువులు; విరామాంతం= విరామాంతము(న); ద్రుతౌ = రెండు ద్రుతములు; లఘు = ఒక లఘువు ఉండును.

**తాత్పర్యము** : ఉద్ఘటమందు మగణమొకటి (మూడుగురువులు కలది) ఆదితాలమందు (ద్రుతము, లఘువు, గురువు (ఘాతము)కలదియగును. అనుద్రుతము లఘువు కలదియగును) చచ్చరియందు 8 ద్రుతములు లఘువులు, విరామాంతము (న) రెండు ద్రుతములు, ఒక లఘువు ఉండును.

**సింహలీలే విధాతవ్యం లఘ్వాద్యంతద్రుతత్రయమ్ ।**
**సింహవిక్రమతాలే స్యుర్మగణో లపలా గపౌ ॥ 47 ॥**

**ప్రతిపదార్థము** : సింహలీలే = సింహలీలాతాళమందు; లఘ్వాద్యంతద్రుతత్రయం = ఆద్యంతములందు లఘువు, మూడు ద్రుతములును; విధాతవ్యం = చేయదగినది; సింహవిక్రమతాలే = సింహవిక్రమతాళమందు; మగణః = మూడు గురువులు; లపలా గపౌ = లఘువు ప్లుతము రెండు లఘువులు, గురువు రెండు ప్లుతములు; స్యుః = ఉండును.

**తాత్పర్యము** : సింహలీలాతాళమందు ఆద్యంతములందు లఘువు మూడు ద్రుతములును చేయదగినది. సింహవిక్రమతాళమందు మూడు గురువులు లఘువు ప్లుతము రెండు లఘువులు, గురువు రెండు ప్లుతములు కలవు.

**లచతుష్కం విరామాంతం గజలీలే ప్రకీర్తితమ్ ।**
**సవిరామం లఘుద్వంద్వ తాలే స్యాద్ధంసలీలకే ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : గజలీలే = గజలీలాతాళమందు; లచతుష్కం = నాలుగు లఘువులు; విరామాంతం = విరామాంతముగా; ప్రకీర్తితం = చెప్పబడినది; హంసలీలకే తాలే = హంసలీలాతాళమందు; సవిరామం = విరామముతో కూడ; లఘుద్వంద్వం = రెండు లఘువులు; స్యాత్ = అగును.

**తాత్పర్యము** : గజలీలాతాళమందు నాలుగు లఘువులు విరామాంతముగా చెప్పబడినది. హంసలీలాతాళమందు విరామముతో కూడ రెండు లఘువులు అగును.

**రాజచూడామణే(?) తాలే ద్రుతౌ నశ్చ ద్రుతౌ లగౌ ।**
**ద్వితీయం యగణం చైవ సింహవిక్రీడితే లపౌ ॥ 49 ॥**

**ప్రతిపదార్థము** : రాజ చూడామణే(ణౌ)తాలే = రాజచూడామణి తాళమందు; ద్రుతౌ= రెండు ద్రుతములు; నశ్చ = మూడు లఘువులును; లగౌ = లఘుగురువులును ఉండును; ద్వితీయం యగణం = (ఒక లఘువు రెండు గురువులు, ఒక లఘువు రెండు లఘువులు) రెండు ప్లుతములు ఒక లఘువు రెండు గురువులు, అయినను కావచ్చును. (ద్వితీయం అనునది రెండు ప్లుతములైన యెడల రెండవది యగును. లేనిచో రెండు యగణములు అన్నచో మొదటిది యగును); లపౌ = లఘుప్లుతములు; సింహవిక్రీడితే = సింహవిక్రీడిత తాళమందుండును.

**తాత్పర్యము** : రాజచూడమణితాలమందు రెండు ద్రుతములు, మూడు లఘువులు,

లఘుగురువులును ఉండును. (ఒక లఘువు రెండు గురువులు, ఒక లఘువు రెండు లఘువులు) రెండు ప్లుతములు ఒక లఘువు రెండు గురువులు, అయిననుకావచ్చును. (ద్వితీయం అనునది రెండు ప్లుతములైనయెడల రెండవదిగను, లేనిచో రెండు యగణములు అన్నచో మొదటిది యగును) లఘుప్లుతములు సింహవిక్రీడిత తాళమందుండును.

**యగణౌల్లో గరుశ్చైవ సింహనాదే విరూపితాః ।**
**లఘుద్రుతచతుష్కంలౌ స్యాతాం శరభలీలకే ॥ 50 ॥**

**ప్రతిపదార్థము** : తురంగలీలాతాలే = తురంగలీలాతాళమందు; ద్రుతద్వంద్వం = రెండు ద్రుతములు; లఘుః = లఘువు; తతః = తరువాత; తపః = రెండు గురువులు లఘువు ప్లుతము; లగః = లఘువు గురువు; ద్రుతౌ = రెండుద్రుతములు; గౌలః = రెండు గురువులు లఘువు; పలపాకః = ప్లుతము లఘువు రెండు ప్లుతములు గరువును; లద్వయం = రెండు లఘువులు; స్యాత్ = ఉండును.

**తాత్పర్యము** : తురంగలీలాతాళమందు రెండు ద్రుతములు లఘువు తరువాత రెండు గురువులు లఘువు ప్లుతము లఘువు గురువు రెండు ద్రుతములు, రెండు గురువులు లఘువు ప్లుతము లఘువు రెండు ప్లుతములు గురువును రెండు లఘువులు ఉండును.

**నిశ్శబ్దలచతుష్కం చ తాలే స్యాత్ సింహనందనే ।**
**లో ద్రుతౌ ప్రతితాలః స్యాద్ ద్రుతౌ లశ్చ ద్వితీయకే ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : సింహనందనే తాలే = సింహనందనతాలమందు; నిశ్శబ్ద లచతుష్కం= నిశ్శబ్దములైన నాల్గులఘువులు; స్యాత్ = ఉండును; లః = లఘువు; ద్రుతౌ = రెండు ద్రుతములు; ప్రతితాలఃస్యాత్ = ప్రతితాలమగును; ద్వితీయకే = ద్వితీయకతాళమందు; ద్రుతౌ = రెండు ద్రుతములు; లశ్చ = లఘువును ఉండును.

**తాత్పర్యము** : సింహనందనతాలమందు నిశ్శబ్దములైన నాల్గు లఘువులు ఉండును. లఘువు రెండు ద్రుతములు ప్రతితాలమగును. ద్వితీయకతాళమందు రెండు ద్రుతములు లఘువును ఉండును.

ధకారశ్చ సకారశ్చ జయమంగలనామని ।
సకారాన్మట్టతాలే స్యాన్నిశ్శబ్దం చ చతుష్టయమ్ ॥ 53 ॥

**ప్రతిపదార్థము** : ధకారః = ధ్రువము; నకారః = లఘువు; జయమంగళనామని = జయమంగళతాళమందు ఉండును;. మట్టతాలే = మట్టతాలమందు; సకారాత్ = లఘువు తరువాత; వచతుష్టయం = నాల్గుగురువులు; నిశ్శబ్దం = శబ్దరహితముగానుండును.

**తాత్పర్యము** : ధ్రువము లఘువు జయ మంగళతాలమందు ఉండును. మట్టతాలమందు లఘువు తరువాత నాల్గు గురువులు శబ్దరహితముగానుండును.

> **ద్రుతద్వయం లఘుద్వంద్వం భవేత్ తాలే కుటుక్కకే ।**
> **లఘుద్వంద్వం విరామాంతం తాలే నిస్సారుకే భవేత్ ॥ 54 ॥**

**ప్రతిపదార్థము** : కుటుక్కకే = కుటుక్క(క)తాలమందు; ద్రుతద్వయం = రెండు ద్రుతములు; లఘుద్వంద్వం = రెండు లఘువులు; భవేత్ = ఉండును; నిస్సారుకే తాళే = నిస్సారుకతాలమందు; లఘుద్వంద్వం = లఘుద్వయము; విరమాంతం స్యాత్= విరామంతమగును.

**తాత్పర్యము** : కుటక్కు(క)తాలమందు రెండు ద్రుతములు రెండు లఘువులు ఉండును. నిస్సారుకతాలమందు లఘుద్వయము విరామంతమగును.

> **మట్టికాయాం విధాతవ్యా గురుబిందుః ప్లుతః క్రమాత్ ।**
> **ఢేంకికా రగణే న స్యాత్ కేషాంచిత్ సైవ యోజనా ॥ 55 ॥**

**ప్రతిపదార్థము** : మట్టికాయాం = మట్టికాతాళమందు; క్రమాత్ = వరుసగా; గురుః= గురువు; బిందుః = ద్రుతము; ప్లుతః = ప్లుతమును ఉండును; ఢేంకికా = ఢేంకికా తాళము; రగణే = గురువు లఘువు గురువులందు; న స్యాత్ = మూడు లఘువులుండును; కేషాంచిత్ = కొందఱికి; సా ఏవ = రెండు లఘువులే; యోజనా= కూర్పు.

**తాత్పర్యము** : మట్టికాతాళమందు వరుసగా గురువు, ద్రుతము, ప్లుతమును ఉండును. డేంకికా తాళము గురువు, లఘువు గురువులందు మూడు లఘువులుండును. కొందఱికి రెండు లఘువులే కూర్పు.

> **ఏకేనైవ ద్రుతేన స్యాదేకతాలేతి సంజ్ఞయా ।**
> **చతుస్తాలే గురుః పూర్వం తతో బిందుత్రయం భవేత్ ॥ 56 ॥**

**ప్రతిపదార్థము** : ఏకేన ద్రుతేన ఏవ = ఒక్కద్రుతముతోనే; ఏకతాలేతి సంజ్ఞయా స్యాత్ = ఏకతాలమగును; చతుస్తాలే = చతుస్తాలమందు; పూర్వం = మొదట; గురుః = గురువు; తతః = తరువాత; బిందుత్రయం భవేత్ = మూడు ద్రుతములును ఉండును.

**తాత్పర్యము** : ఒక్క ద్రుతముతోనే ఏకతాలమగును. చతుస్తాలమందు మొదట గురువు తరువాత మూడు ద్రుతములును ఉండును.

> **ఏ(కై)కేన విరామేణ లఘునా లఘుశేఖరః ।**
> **ప్రతాపశేఖరే త్ర్యంగా విరామాంతద్రుతద్వయమ్ ॥ 57 ॥**

**ప్రతిపదార్థము** : ఏకైకేన విరామేణ = ఒక్కొక్క విరామముచేతనైన (కల); లఘునా = లఘువుచేతను; లఘుశేఖరః స్యాత్ = లఘుశేఖరమగును; ప్రతాపశేఖరే = ప్రతాపశేఖరమందు; త్ర్యంగా = ఒకప్లుతము; విరామాంతద్రుతద్వయం = విరామాంతమందు రెండు ద్రుతములు ఉండును.

**తాత్పర్యము** : ఒక్కొక్క విరామము చేతనైన (కల) లఘువు చేతను లఘుశేఖరమగును. ప్రతాప శేఖరమందు ఒక ప్లుతము విరామాంతమందు రెండు ద్రుతములు ఉండును.

> **వ్యోమద్వయం విరామాంతం లశ్చ ఝంపాభిధే భవేత్ ।**
> **గలౌ తు ప్రతిమట్టశ్చ తాలలక్షణకోవిదైః ॥ 58 ॥**

**ప్రతిపదార్థము** : ఝంపాభిధే = ఝంపతాళమందు; వ్యోమద్వయం = రెండు ద్రుతములు; విరామాంతం లశ్చ = విరామాంతమును లఘువు చెప్పబడెను; తాలలక్షణ కోవిదైః = తాలలక్షణము నెఱిగిన పండితులచే; గలౌ = గురువు రెండు లఘువులు; ప్రతిమట్టః = ప్రతిమట్టమని చెప్పబడినది.

**తాత్పర్యము** : ఝంపాతాళమందు రెండు ద్రుతమలు విరామాంతమును లఘువు చెప్పబడెను. తాలలక్షణము నెఱిగిన పండితులచే గురువు రెండు లఘువులు ప్రతిమట్టమని చెప్పబడినది.

> **తృతీయతాలే బిందుః స్యాద్ విరామాంతం ద్రుతత్రయమ్ ।**
> **తాలే కరణ య(ప్యా?త్యా)ఖ్యే నేయం బిందుచతుష్టయమ్ ॥ 59 ॥**

**ప్రతిపదార్థము** : కరణయుత్యాఖ్యే తాలే =కరణయతితాలమందు; బిందుచతుష్టయం

నేయం = నాల్గు ద్రుతములు పొందించదగినవి; తృతీయతాలే = తృతీయతాళమందు; బిందుః = ద్రుతము; విరామాంతం = విరామాంతమున; ద్రుతద్వయం = రెండు ద్రుతములుండును.

**తాత్పర్యము** : కరణయతితాలమందు నాల్గు ద్రుతములు పొందించదగినవి. తృతీయ తాళమందు ద్రుతము విరామాంతమున రెండు ద్రుతములుండును.

**గరరుగిట్ కథ్యతే తజ్జైర్విరామాంతం చతుర్ద్రుతమ్ ।**
**గరుషే+ + + + +ద్వాత్రింశల్లవగస్తథా ॥ 60 ॥**

**ప్రతిపదార్థము** : విరామాంతం = విరామాంతమందు; చతుర్ద్రుతం = నాల్గుద్రుతములు కలదిగా; గిరురుగిట్ (గిరుగి) = గరరుగి తాళము; కథ్యతే = చెప్పబడినది; గరుషః = గరుషమునకు; ద్వాత్రింశత్ = 32; ల = లఘువులు; వ = గురువులు; గ = గురుకలది.

**తాత్పర్యము** : విరామాంతమందు నాల్గుద్రుతములు కలదిగా, గరరుగితాళము చెప్పబడినది. గరుషమునకు 32 లఘువులు, గురువులు, గురుకలది.

**చతుష్షష్టిర్ద్రుతా పాతా చతుర్ధాక్షిప్తకస్తథా ।**

**ఆక్షిప్తకః ॥**

**సప్త గుర్వక్షరాణాదౌ దశ లఘ్వక్షరాణి చ ॥ 61 ॥**

**ప్రతిపదార్థము** : చతుష్షష్టిః ద్రుతాః = 64 ద్రుతములు; పాతాః = పాతములు; చతుర్ధా = నాల్గు విధములు, ఆక్షిప్తకః = ఆక్షిప్తక మగును; ఆదౌ = మొదట; సప్త గుర్వక్షరాణి = 7 గురువులు; దశ లఘ్వక్షరాణి చ = 10 లఘువులును;

**తాత్పర్యము** : 64 ద్రుతములు, పాతములు, నాల్గు విధములు. ఆక్షిప్తకమగును. మొదట 7 గురువులు 10 లఘువులును;

**(అహే ?అంతే) చ గురుణీ యత్ర మద్రకః స్యాభిధీయతే ।**
**తాలమూలాని గేయాని తాలే సర్వం ప్రతిష్ఠితమ్ ॥ 62 ॥**

**తాలహీనాని గేయాని మంత్రహీనా యధాహుతిః ॥ 621/2 ॥**

**ప్రతిపదార్థము** : అంతే చ = చివర; గురుణీ = రెండు గురువులు; యత్ర = ఎక్కడ ఉండునో; సః = అది; మద్రకః అభిధీయతే = మద్రకమని చెప్పబడుచున్నది; భంగః

ఉపభంగః, విభంగ, చచ్చత్పుట, చాచపుట = చాచపుటము; ఉద్ఘట = ఉద్ఘటము; షట్పితా పుత్రక = షట్పితా పుత్రకము; సంపర్కేష్టక = సంపర్కేష్టకము; హేలాత్రిగతా= హేలాత్రిగతము; మనత్కుట = మనత్కుటము; నత్కుటీ = సత్కుటి, ఖంజ = ఖంజము; ఖంజిక = ఖంజికము; ఆక్రీడిత విలంబా = ఆక్రీడిత విలంబము; ఇతిద్వాదశ భంగాః = అని 12 భంగములు. చతురశ్రాచ చటలా, మిశ్రా షడేతే ఉప (భోగాః ? భంగాః)ఇతరే విభంగాఃగేయాని = గేయములు; తాలమూలాని = తాళప్రధానములు; సర్వం = అంతయు; ప్రతిష్ఠితం = స్థాపింపబడినది; మంత్రహీనాః = మంత్రములేని; ఆహుతిః యథా = హోమమువలె; తాలహీనాని గేయాని = తాళహీనములైన గేయములు; నిస్సారాః = నిస్సారములు.

**తాత్పర్యము** : చివర రెండుగురువులు ఎక్కడఉండునో అది మద్రకమని చెప్పబడుచున్నది. భంగము, ఉపభంగము, విభంగము, చచ్చత్పుటము, చాచపుటము, ఉద్ఘటము, షట్పితాపుత్రకము, సంపర్కేష్టకము, హేలాత్రిగతము, మనత్కుటము, నత్కుట, ఖంజము, కంజికము, అక్రీడిత విలంబము అని 12 భంగములు. గేయములు తాళప్రధానములు అంతయు స్థాపింపబడినది. మంత్రములేని హోమమువలె తాళహీనములైన గేయములు నిస్సారములు.

ఇతి సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవవిరచితే

సంగీతసమయసారే తాలలక్షణంనామ సప్తమమధికరణమ్ ।

## ॥ అథాష్టమమధికరణమ్ ॥

గీతే వాద్యే చ నృత్తే చ తత్తద్విద్యాః పరస్పరమ్ ।
భవే(యు)ర్వాదినస్తస్మాద్ వక్ష్యతే (ప?వా)దనిర్ణయః ॥ 1 ॥

**ప్రతిపదార్థము** : గీతే = గీతమందును; వాద్యే = వాద్యమందును; నృత్తేచ = నృత్తమందును; తత్తద్విద్యాః = ఆయావిద్యలు; పరస్పరం = ఒకదానికొకటి; వాదినః భవేయుః = వాదులగుచున్నవి; తస్మాత్ = అందువలన; వాదనిర్ణయః వక్ష్యతే = వాదనిర్ణయము చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : గీతమందును, వాద్యమందును, నృత్తమందును, ఆయావిద్యలు ఒకదానికొకటి వాదులగుచున్నవి. అందువలన వాదనిర్ణయము చెప్పబడుచున్నది.

**పరస్పరసమాక్షేపో యో వాదిప్రతివాదినోః ।**
**స్వపక్షపరపక్షాభ్యాం వాదః స(హ?) ఇతి కీర్తితః ॥ 2 ॥**

**ప్రతిపదార్థము** : వాదిప్రతివాదినోః = వాదిప్రతివాదులయొక్క; యః = ఏది; పరస్పరసమాక్షేపః = అన్యోన్యఆక్షేపమో; సః = అది; స్వపక్షపరపక్షాభ్యాం = ఉభయ పక్షముల చేత; వాదః ఇతి కీర్తితః = వాదమని చెప్పబడినది.

**తాత్పర్యము** : వాదిప్రతివాదులయొక్క ఏది అన్యోన్యము ఆక్షేపమో అది ఉభయ పక్షములచేత వాదమని చెప్పబడినది.

**సభాపతిశ్చ స(భా?భ్యా)శ్చ తౌ వాదప్రతివాదినౌ ।**
**ఇతి ప్రోక్తం మతంగాద్యైర్వాదస్యాంగచతుష్టయమ్ ॥ 3 ॥**

**ప్రతిపదార్థము** : సభాపతిశ్చ = సభాపతియు; సభ్యాః = సామాజికులు (సహృదయులు); తౌవాదప్రతివాదినౌ = వాదప్రతివాదులు; ఇతి = అని; వాదస్య అంగచతుష్టయం = వాదమునకు నాలుగంగములుగా; మతంగాద్యైః ప్రోక్తం = మతంగాదులచే చెప్పబడినది.

**తాత్పర్యము** : సభాపతియు, సామాజికులు (సహృదయులు) వాదప్రతివాదులు అని వాదమునకు నాలుగంగములుగా మతంగాదులచే చెప్పబడినది.

**కథయామి క్రమాదేషాం లక్షణం చ సమాసతః ।**
**ఆస్థానమండపే రమ్యే సర్వలక్షణసంయుతే ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : ఏషాం = వీటియొక్క; లక్షణం = లక్షణమును; క్రమాత్ = క్రమముగా; సమానతః = సంగ్రహముగా; కథయామి = చెప్పుచున్నాను; రమ్యే = అందమైన; నర్వలక్షణనంయుతే = అన్నిలక్షణములతో కూడిన; ఆస్థానమండపే = ఆస్థానమండపమునందు;

**తాత్పర్యము** : వీటియొక్క లక్షణమును క్రమముగా సంగ్రహముగా చెప్పుచున్నాను. అందమైన అన్నిలక్షణములతో కూడిన ఆస్థానమండపమునందు;

**చిత్రాభాసవిచిత్రాల్య(?) చిత్రచిత్రోపశోభితే ।**
**చందనాగరుకర్పూరధూపైస్తు పరవాసితే ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : చిత్రాభాసవిచిత్రాదిచిత్రచిత్రోపశోభితే = చిత్రాభాసిత విచిత్రములైన విచిత్రవర్ణశోభితములైనట్టియు; చందనాగరుకర్పూరధూపైః పరివాసితే = చందనము, అగరు, కర్పూర, ధూపములచే సువాసితమైనట్టియు;

**తాత్పర్యము** : చిత్రాభాసితవిచిత్రములైన విచిత్రవర్ణశోభితములైనట్టియు చందనము, అగరు, కర్పూర, దూపములచే సువాసితమైనట్టియు;

> **బహువర్ణపటీపట్టవితానపరిశోభితే ।**
> **నానారత్నసమాకీర్ణం నానలంకారశోభితమ్ ॥ 6 ॥**

**ప్రతిపదార్థము** : బహువర్ణపటీపట్టవితానపరిశోభితే = అనేక రంగులు పట్టువస్త్రములు చాందినీగలసభాస్థానమునందు; నానారత్నసమాకీర్ణం = అనేకరత్నములతో కూడినట్టియు; నానాలంకారశోభితం = అనేక అలంకారములతో ప్రకాశించునట్టి;

**తాత్పర్యము** : అనేక రంగులు పట్టువస్త్రముల ఛాందినిగల సభాస్థానమునందు అనేక రత్నములతో కూడినట్టియు అనేక అలంకారములతో ప్రకాశించునట్టి;

> **సింహాసనం పూర్వముఖం మధ్యతో వినివేశయేత్ ।**
> **శ్రీమాన్ దాతా గుణగ్రాహీ భావజ్ఞః కీర్తిలంపటః ॥ 7 ॥**

**ప్రతిపదార్థము** : సింహాసనం = సింహాసనమును; మధ్యతః = సభాస్థానమధ్యముగా; పూర్వముఖం = తూర్పుముఖముగా; వినివేశయేత్ = ప్రవేశపెట్టవలెను (వేయవలెను); శ్రీమాన్ = శోభాయుతుడు; దాతా = పదాన్యుడు;గుణాగ్రాహీ = గుణములను గ్రహించు వాడు; బావజ్ఞః = అభిప్రాయము నెరిగినవాడును; కీర్తిలంపటః = కీర్తియందిష్టము కలవాడు.

**తాత్పర్యము** : సింహాసనమును సభాస్థానమధ్యముగా తూర్పుముఖముగా ప్రవేశపెట్టవలెను (వేయవలెను). శోభాయుతుడు, పదాన్యుడు, గుణములను గ్రహించువాడు, అభిప్రాయము నెరిగినవాడు, కీర్తియందిష్టముకలవాడు.

> **సంగీతగుణదోషజ్ఞః సర్వభాషావిచక్షణః ।**
> **ప్రియవాగ్వాదమధ్యస్థః పారితోషకదాయకః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము** : సంగీతగుణదోషజ్ఞః = సంగీతమందలి గుణదోషములనెరిగినవాడును; సర్వభాషావిచక్షణః = అన్ని భాషలను తెలిసినవాడును; ప్రియవాక్ = ప్రియముగా మాట్లాడువాడును; వాదమధ్యస్థః = వాదమునకు మాధ్యమికుడుగానున్నవాడును; పారితోషికదాయకః = బహుమానములనిచ్చువాడును.

**తాత్పర్యము** : సంగీతమందలి గుణదోషములనెరిగినవాడును, అన్ని భాషలను తెలిసినవాడును, ప్రియముగా మాట్లాడువాడును, వాదమునకు మాధ్యమికుడుగా

నున్నవాడును, బహుమానములనిచ్చువాడును.

**సభ్యవాదీ చ శృంగారీ మార్గదేశీప్రభేదవిత్ ।**
**ధీమాన్ సర్వకలాదక్షస్తదధ్యాసితభూపతిః ॥ 9 ॥**

**ప్రతిపదార్థము** : సభ్యవాదీ = యోగ్యముగా మాట్లాడువాడు; శృంగారీ = అలంకృతుడు, రసజ్ఞుడును; ధీమాన్ = బుద్ధిమంతుడు; సర్వకలాదక్షః = అన్నికళలందును సమర్థుడు అయినవాడు; తదధ్యాసితభూపతిః = ఆసింహాసనమునధిష్ఠించినవాడు రాజు(కావలయును).

**తాత్పర్యము** : యోగ్యముగా మాట్లాడువాడు, అలంకృతుడు, రసజ్ఞుడును, బుద్ధిమంతుడు, అన్నికళలందును సమర్థుడు అయినవాడు ఆసింహాసనము నధిష్ఠించినవాడు రాజు (కావలయును).

**రూపయౌవనసంపన్నా సదా శృంగారలోలుపా ।**
**సౌభాగ్యశాలినీ భర్తుశ్చిత్తనేత్రానుసారిణీ ॥ 10 ॥**

**ప్రతిపదార్థము** : రూపయౌవనసంపన్నా = అందమైనదియు, యౌవనవతియు; సదా= ఎల్లప్పుడు; శృంగారలోలుపా = అలంకారణాభిలాష కలదియు; సౌభాగ్యశాలినీ = సౌభాగ్యవతియు; భర్తుః = భర్తయొక్క; చిత్తనేత్రానుసారిణీ = మనస్సు, నేత్రములను అనుసరించి నడచునదియు అయిన;

**తాత్పర్యము** : అందమైనదియు, యౌవనవతియు ఎల్లప్పుడు అలంకారణాభిలాష కలదియు, సౌభాగ్యవతియు, భర్తయొక్క మనస్సు, నేత్రములను అనుసరించి నడచునదియు అయిన;

**దేవీ చోప (వే?వి)శే(త్తు?భర్తుః) వామభాగే మహీపతేః ।**
**రూపయౌవనసంపన్నాః సర్వాభరణభూషితాః ॥ 11 ॥**

**ప్రతిపదార్థము** : దేవీ = పట్టపురాణి; మహీపతేః వామభాగే = రాజునకు ఎడమభాగమున; ఉపవిశేత్ = కూర్చొండవలెను; రూపయౌవనసంపన్నా = రూపము, యౌవనముగల; సర్వాభరణ భూషితాః = అన్ని అలంకారముల చేతను అలంకృతులును;

**తాత్పర్యము** : పట్టపురాణి రాజునకు ఎడమభాగమున కూర్చొండవలెను. రూపము యౌవనముగల అన్ని అలంకారములచేతను అలంకృతులును;

**భావాభావవిలాసాఢ్యాః విభ్రమాదిగుణాన్వితాః ।**
**విలాసినీర్మహీపస్య పశ్చాద్భాగే నివేశయేత్ ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : భావాభావవిలాసాఢ్యాః = భావాభావవిలాససంపన్నలు; విభ్రమాది గుణాన్వితాః = విలాసాది గుణములు గల; విలాసినీః = విలాసవంతులను; మహీపస్య= రాజుయొక్క; పశ్చాత్ భాగే = వెనుకవైపున; నివేశయేత్ = కూర్చొండపెట్టవలెను.

**తాత్పర్యము** : భావాభావవిలాససంపన్నులు, విలాసాది గుణములుగల విలాసవంతులను, రాజుయొక్క వెనుకవైపు కూర్చొండపెట్టవలెను.

**కార్యాకార్యవిభాగజ్ఞాః నీతిశాస్త్రవిశారదాః ।**
**స్వామిభక్తాశ్చ సచివాః సర్వకార్యకృతిక్షమాః ॥ 13 ॥**

**ప్రతిపదార్థము** : కారాకార్యవిభాగజ్ఞాః = కార్యాకార్యములను విభజించుట తెలిసినవారును; నీతిశాస్త్రవిశారదాః = నీతిశాస్త్రమునందు పండితులును; స్వామిభక్తాః = ప్రభుభక్తి గలవారును; సర్వకార్యకృతిక్షమాః = సమస్త కార్యములను చేయు సమర్థులును అయిన; సచివాః = మంత్రులు.

**తాత్పర్యము** : కార్యాకార్యములను విభజించుట తెలిసినవారును, నీతిశాస్త్రమునందు పండితులును, ప్రభు భక్తి గలవారును, సమస్తకార్యములను చేయు సమర్థులును అయిన మంత్రులు.

**స(భ్యాః?భాః) సంగీతశాస్త్రజ్ఞాస్తల్లక్ష్యజ్ఞా అనుద్ధతాః ।**
**మధ్యస్థా వాదసమయే గుణదోషనిరూపకాః ॥ 14 ॥**

**ప్రతిపదార్థము** : సభ్యాః = సభాసదులు(సహృదయులు); సంగీతశాస్త్రజ్ఞాః = సంగీతశాస్త్రమును తెలిసినవారు; తల్లక్ష్యజ్ఞాః = ఆ సంగీతలక్ష్యములను తెలిసినవారు; అనుద్ధతాః = నిగర్వులు; వాదసమయే = వాదసమయమందు; మధ్యస్థాః = మాధ్యమికులు; గుణదోషనిరూపకాః = గుణదోషములను నిరూపించువారును;

**తాత్పర్యము** : సభాసదులు (సహృదయులు) సంగీతశాస్త్రమును తెలిసినవారు, ఆ సంగీతలక్ష్యములను తెలిసినవారు, నిగర్వులు, వాదసమయమందు మాధ్యమికులు, గుణదోషములను నిరూపించువారును;

**కవయోః రసభావజ్ఞాశ్ఛందోలంకారవేదినః ।**
**అమందాః ప్రతిభాయుక్తా రీతినిర్వాహకోవిదాః ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : కవయః = కవులు; రసభావజ్ఞాః = రసభావములనెఱింగినవారు; ఛందోలంకారవేదినః = ఛందస్సు అలంకారములను తెలిసినవారు; అమందాః = జ్ఞానులు (వివేకవంతులు); ప్రతిభాయుక్తాః = ప్రతిభగలవారు; రీతినిర్వాహకోవిదాః= రీతిని నిర్వహించు పండితులు.

**తాత్పర్యము** : కవులు, రసభావములనెఱింగినవారు, ఛందస్సు అలంకారములను తెలిసినవారు, జ్ఞానులు (వివేకవంతులు), ప్రతిభగలవారు, రీతిని నిర్వహించు పండితులు.

**కావ్యనాటకసంజాతరసాస్వాదనలంపటాః ।**
**రసికాః సూక్ష్మభావార్థజ్ఞానానందితచేతసః ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : కావ్యనాటక సంజాతరసాస్వాదనలంపటాః = దృశ్యశ్రవ్యకావ్యములందలి రసములననుభవించుటయందు ఆసక్తిగలవారును; సూక్ష్మభావార్థజ్ఞానానందిత చేతసః రసికాః = సూక్ష్మభావార్థ జ్ఞానముచే ఆనందింపబడిన మనస్సులు గల రసికులు.

**తాత్పర్యము** : దృశ్యశ్రవ్యకావ్యములందలి రసములననుభవించుటయందు ఆసక్తి గలవారును, సూక్ష్మభావార్థ జ్ఞానముచే ఆనందింపబడిన మనస్సులు గల రసికులు.

**ఏతే సర్వే యథాయోగ్యం భవేయుస్తస్య దక్షిణే ।**
**వాగ్గేయకారకవితాకారా యే నర్తకాదయః ॥ 17 ॥**

**ప్రతిపదార్థము** : ఏతే సర్వే = వీరందరు; యథాయోగ్యం = యోగ్యతకు తగినట్లు; తస్య దక్షిణే = ఆరాజునకు కుడివైపున; భవేయుః = ఉండవలెను; యే వాగ్గేయకార కవితాకారాః = ఏ వాగ్గేయకారులు, కవులు; నర్తకాదయః = నాటకులు మొదలగువారు.

**తాత్పర్యము** : వీరందరు యెగ్యతకు తగినట్లు ఆరాజునకు కుడివైపున ఉండవలెను. ఏ వాగ్గేయకారులు, కవులు, నటకులు మొదలగువారు.

**లక్ష్యలక్షణదక్షాశ్చ సంగీతాంగవిచక్షణాః ।**
**వామభాగే మహీపస్య స్యాత్తేషాముపవేశనమ్ ॥ 18 ॥**

**ప్రతిపదార్థము** : లక్ష్య లక్షణ దక్షాః = లక్ష్య- లక్షణములందు సమర్థులును; సంగీతాంగ విచక్షణాః = సంగీతాంగములందు కోవిదులును; మహీపస్య వామభాగే = రాజుయొక్క ఎడమభాగమున; తేషాం = వారియొక్క; ఉపవేశనం స్యాత్ = కూర్చుండుట జరగవలెను.

**తాత్పర్యము** : లక్ష్య- లక్షణములందు సమర్థులును సంగీతాంగములందు కోవిదులును రాజుయొక్క ఎడమభాగమున వారియొక్క కూర్చొనుట జరగవలెను.

**అన్యేపి యే యథాయోగ్యా స్తత్తద్విద్యావిశారదాః ।**
**భవేయుస్తస్య భూపస్య నాతిదూరోపవేశినః ॥ 19 ॥**

**ప్రతిపదార్థము** : అన్యేపితత్తద్విద్యావిశారదాః = మిగిలిన ఆయా పండితులు; యథాయోగ్యాః = యోగ్యతకు తగినవిధముగా; తస్య భూపస్య = ఆరాజునకు; నాతిరోపవేశినః భవేయుః = దగ్గఱలో కూర్చొండవలెను.

**తాత్పర్యము** : మిగిలిన ఆయా పండితులు యోగ్యతకు తగినవిధముగా ఆరాజునకు దగ్గఱలో కూర్చొండవలెను.

**అనువాదదృఢప్రజ్ఞః స్వశాస్త్రశ్రవణాన్వితః ।**
**పరోక్తదూషణోద్ధర్తా వాదీ స్యాత్ పక్షసాధకః ॥ 20 ॥**

**ప్రతిపదార్థము** : అనువాద దృఢప్రజ్ఞః = అనువాదమందు దృఢమైన ప్రజ్ఞకలవాడును; స్వశాస్త్రశ్రవణాన్వితః = తన శాస్త్రశ్రవణముతో కూడినవాడును; పరోక్తదూషణోద్ధర్తా= ఇతరుల దోషములను పైకి తీయువాడును; పక్షసాధకః = (తన) పక్షమును సాధించు వాడును; వాదీ స్యాత్ = వాదియగును.

**తాత్పర్యము** : అనువాదమందు దృఢమైన ప్రజ్ఞకలవాడును, తన శాస్త్రశ్రవణముతో కూడినవాడును, ఇతరుల దోషములను పైకితీయువాడును, (తన)పక్షమును సాధించువాడును వాదియగును.

**వక్తారం శాస్త్రవేత్తారం బుద్ధిమంతం + + + + ।**
**వాదిప(క్షే?క్ష) నిహంతారం తం విద్యాత్ ప్రతివాదినమ్ ॥ 21 ॥**

**ప్రతిపదార్థము** : వక్తారం = చక్కగామాట్లాడువాడును; శాస్త్రవేత్తారం = శాస్త్రమునెఱిగినవాడును; బుద్ధిమంతం = వివేకియును; విచక్షణం = మంచిచెడుల గుర్తింపుకలవాడును (కార్యజ్ఞుడు); వాదిపక్షనిహంతారం = వాదిపక్షమును నిరసించువాడును; తం = అట్టివానిని; ప్రతివాదినం విద్యాత్ = ప్రతివాదిగా నెఱుగవలెను.

**తాత్పర్యము** : చక్కగామాట్లాడువాడును, శాస్త్రమునెఱిగినవాడును, వివేకియును, మంచిచెడుల గుర్తింపుగలవాడును (కార్యజ్ఞుడు) వాదిపక్షమును నిరసించువాడును అట్టివానిని ప్రతివాదిగా నెఱుగవలెను.

**నిర్వాహాధిక్యవాంఛా చ మత్సరః స్వామికౌతుకమ్ ।**
**స్వైరగోష్ఠీపరిభవః కారణాంతరవైరతా ॥ 22 ॥**

**ప్రతిపదార్థము** : నిర్వాహాధిక్యవాంఛా = నిర్వహణమందు అధికమైన కోరిక; మత్సరః = మాత్సర్యము; స్వామికౌతుకం = ప్రభుత్వమందువేడుక; స్వైరగోష్ఠీ పరిభవః = స్వేచ్ఛా గోష్ఠీ పరాభవము; కారణాంతర వైరతా = మరియొక కారణముచే విరోధము.

**తాత్పర్యము** : నిర్వహణమందు అధికమైన కోరిక, మాత్సర్యము, ప్రభుత్వమందు వేడుక, స్వేచ్ఛాగోష్ఠీపరాభవము, మరియొక కారణముచేవిరోధము.

**ప్రతిపత్తిః స్పృహ్యాసూయా కీర్తివ్యసనతా తథా ।**
**విద్యామదశ్చ నిర్దిష్టాస్తజ్జైర్వాదస్య హేతవః ॥ 23 ॥**

**ప్రతిపదార్థము** : ప్రతిపత్తిః స్పృహాః = జనమందలికోరిక; అసూయా = కోపము; కీర్తివ్యసనతా = యశమందువ్యసనము; విద్యామదః = విద్యాగర్వము; వాదస్యహేతవః నిర్దిష్టాః = వాదమునకు కారణములుగా సూచితములు.

**తాత్పర్యము** : జనమందలికోరిక, కోపము, యశమందు వ్యసనము విద్యాగర్వము వాదమునకు, కారణములుగా సూచితములు.

**స్త్రీపుంసయోర్వృద్ధయూనోర్దరిద్రశ్రీమతోస్తథా ।**
**వినీతోద్ధతయోః ఖిన్నతుష్టమానసయోరపి ॥ 24 ॥**

**ప్రతిపదార్థము** : స్త్రీపుంసయోః = స్త్రీపురుషులకు; వృద్ధయూనోః = వృద్ధులకు, యువకులకు; దరిద్రశ్రీమతోః = దరిద్ర-ధనవంతులకు; వినీతోద్ధతయోః = వినయముగలవారికి-గర్వితులకు; ఖిన్నతుష్టమానసయోః = బాధపడిన మనస్సుగలవారికి, సంతుష్టమనస్కులకు కూడ;

**తాత్పర్యము** : స్త్రీపురుషులకు, వృద్ధులకు, యువకులకు, దరిద్ర, ధనవంతులకు, వినయముకలవారికి, గర్వితులకు, బాధపడిన మనస్సుగలవారికి, సంతుష్ట మనస్కులకు కూడ;

**శి(ష్టో?ష్యో) పాధ్యాయయోర్భిన్నవిద్యోర్భీరుశూరయోః ।**
**న వాద్యోభిహితః సద్భిర్వాదహేతుషు సత్స్వపి ॥ 25 ॥**

**ప్రతిపదార్థము** : శిష్యోపాధ్యాయయోః = శిష్యునకు ఉపాధ్యాయులకు; భిన్నవిద్యయోః = భిన్నవిద్యావంతులకు; భీరుశూరయోః = భయస్తునకు వీరునికి; వాదహేతుషు సత్స్వపి = వాదన హేతులున్నను; వాదః = వాదము; న అభిహితః = చెప్పబడలేదు.

**తాత్పర్యము** : శిష్యునకు ఉపాధ్యాయులకు, భిన్నవిద్యావంతులకు, భయస్తునకువీరునికి వాదనహేతులున్నను వాదము చెప్పబడలేదు.

**విత్తేన విద్యయా రూఢ్యా సమయోర్వాద ఇష్యతే ।**
**తస్మాదత్ర ప్రవక్ష్యంతే గుణా దోషాశ్చ వాదినామ్ ॥ 26 ॥**

**ప్రతిపదార్థము** : విత్తేన = విత్తము(ధనము)చేతను; విద్యయా = విద్యచేతను; రూఢ్యా= స్థిరతచేతను; సమయోః = సమానమైన వారికి; వాదః ఇష్యతే = వాదము ఇష్టమగుచున్నది; తస్మాత్ = అందువలన; అత్ర = ఇక్కడ; వాదినాం = వాదులయొక్క; గుణాః = గుణములు; దోషాః = దోషములును; ప్రవక్ష్యంతే = చెప్పబడుచున్నవి.

**తాత్పర్యము** : విత్తము(ధనము)చేతను, విద్యచేతను, స్థిరతచేతను సమానమైన వారికి వాదము ఇష్టమగుచున్నది. అందువలన ఇక్కడ వాదులయొక్క గుణములు దోషములును చెప్పబడుచున్నవి.

**గ్రంధార్థస్య పరిజ్ఞానం తాత్పర్యార్థ నిరూపణమ్ ।**
**ఆద్యంతమధ్యవ్యాఖ్యానశక్తిః శాస్త్రవిదో గుణాః ॥ 27**

**ప్రతిపదార్థము** : గ్రంథార్థస్య = గ్రంథమునందలి అర్థము యొక్క; పరిజ్ఞానం = ఎఱుక; (మరియు) తాత్పర్యార్థ నిరూపణం = తాత్పర్యార్థమును నిరూపించుట; (మరియు) ఆద్యంత మధ్య వ్యాఖ్యాన శక్తిః = గ్రంథముయొక్క ఆరంభము, మధ్య భాగము మరియు చివరిభాగములను వివరించగల సామర్థ్యము; శాస్త్రవిదః = శాస్త్రజ్ఞుని యొక్క; గుణాః = గుణములు;

**తాత్పర్యము** : గ్రంథమునందలి అర్థము యొక్క ఎఱుక, (మరియు) తాత్పర్యార్థమును నిరూపించుట, (మరియు) గ్రంథము యొక్క ఆరంభము, మధ్య భాగము, చివరి భాగములను (అనగా సంపూర్ణగ్రంథాంశములను) వివరించ గల సామర్థ్యము ఇవి శాస్త్రజ్ఞునియొక్క గుణములు.

**పూర్వాపరవిరోధానామజ్ఞ(త:?త్వ)మవిదగ్ధతా: ।**
**నిరుత్తరత్వం ప్రశ్నేషు సంప్రదాయవిహీనతా ॥ 28 ॥**

**ప్రతిపదార్థము** : పూర్వాపరవిరోధానాం అజ్ఞత్వం = పూర్వాపరముల విరోధములు (యొక్క) తెలియకపోవుట; అవిదగ్ధతా = పాండిత్యములేకుండుట (మూర్ఖత); ప్రశ్నేషు నిర్తురత్వం = ప్రశ్నించునపుడు సమాధానము చెప్పక(లేక)పోవుట; సంప్రదాయ విహీనతా = సంప్రదాయము తెలియకపోవుట;

**తాత్పర్యము** : పూర్వాపరముల విరోధములు (యొక్క)తెలియకపోవుట, పాండిత్యము లేకుండుట, (మూర్ఖత) ప్రశ్నించునపుడు సమాధానముచెప్పక (లేక)పోవుట, సంప్రదాయము తెలియకపోవుట;

**ఇత్యాదయస్తు శాస్త్రజ్ఞైర్దోషా: సద్భిరుదాహృతా: ।**
**లక్షలక్ష్యం చ యో వేత్తి మార్గదేశిసమాశ్రయమ్ ॥ 29 ॥**

**ప్రతిపదార్థము** : ఇత్యాదయః = ఈమొదలైనవి; సద్భిః శాస్త్రజ్ఞైః= సహృదయులగు పండితులచే; దోషాః సముదాహృతాః = దోషములుగా ఉద్ధరింపబడినవి; మార్గదేశిస మాశ్రయం = మార్గదర్శకత్వమునకాధారమైన; లక్షలక్ష్యంచ = లక్షణోదాహరణములను; యః వేత్తి = ఎవడెఱుగునో;

**తాత్పర్యము** : ఈమొదలైనవి సహృదయులగు పండితులచే దోషములుగా ఉద్ధరింపబడినవి. మార్గదర్శకత్వమునకాధారమైన లక్షణోదాహరణములను ఎవడెఱుగునో;

**ఉత్తమ: స పరిజ్ఞేయ: శాస్త్రజ్ఞేషు మనీషిభి: ।**
**వేత్తి మార్గాశ్రయం లక్ష్యం లక్షణం య: స మధ్యమ: ॥ 30 ॥**

**ప్రతిపదార్థము** : సః = అతడు; శాస్త్రజ్ఞేషు = శాస్త్రవేత్తలయందు; ఉత్తమః పరిజ్ఞేయః = ఉత్తముడుగా తెలియవలెను; మార్గాశ్రయం = మార్గమునాశ్రయించిన; లక్ష్యం = లక్ష్యమును; లక్షణం చ = లక్షణమును; యః వేత్తి = ఎవడు తెలిసికొనునో; సః మధ్యమః = అతడు మధ్యముడు.

**తాత్పర్యము** : అతడు శాస్త్రవేత్తలయందు ఉత్తముడుగా తెలియవలెను. మార్గమునా శ్రయించిన లక్ష్యమును, లక్షణమును ఎవడు తెలిసికొనునో అతడు మధ్యముడు.

**సమ్యగ్జానాతి యో దేశీలక్ష్మ లక్షం చ స్యోధమః ।**
**శాస్త్రవాదే సముత్పన్నే గుణదోషైస్తదీయకైః ॥ 31 ॥**

**ప్రతిపదార్థము** : యః = ఎవడు; దేశీలక్ష్మ లక్షంచ = దేశీలక్ష్యలక్షణములను; సమ్యక్ జానాతి = బాగుగా నెఱుగునో; సః అధమః = అతడు అధముడు; శాస్త్రవాదే సముత్పన్నే = శాస్త్రవాదము జరుగగా; తదీయకైః గుణదోషైః = వాదిప్రతివాదుల గుణదోషములచే;

**తాత్పర్యము** : ఎవడు ధేశీలక్ష్యలక్షణములను బాగుగా నెఱుగునో అతడు అధముడు. శాస్త్రవాదము జరుగగా వాదిప్రతివాదుల గుణదోషములచే;

**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయ పరాజయౌ ।**
**శబ్దశాస్త్రపరిజ్ఞానం ఛందోవిచితినైపుణమ్ ॥ 32 ॥**

**ప్రతిపదార్థము** : తయోః = వారిద్దరియందు; తారతమ్యం జ్ఞాత్వా = తేడాను గుర్తించి; జయపరాజయౌదద్యాత్ = జయపరాజయములనొసగును; శబ్దశాస్త్రపరిజ్ఞానం = వ్యాకరణ శాస్త్రజ్ఞానము; ఛందోవిచితి నైపుణం = ఛందశ్శాస్త్రమందలి నేర్పు.

**తాత్పర్యము** : వారిద్దరియందు తేడాను గుర్తించి జయ పరాజయములనొసగును. వ్యాకరణశాస్త్రజ్ఞానము ఛందశ్శాస్త్రమందలి నేర్పు.

**అభిధానేషు దక్షత్వం కలానామపి కౌశలమ్ ।**
**సప్తగీతిప్రవీణత్వం చాతుర్యం రసభావయోః ॥ 33 ॥**

**అలంకారేషు చాతుర్యం సు(ర?)తాలత్వం సురాగతా ।**
**సుస్వరత్వం సుగేయత్వం దేశీరాగేష్వభిజ్ఞతా ॥ 34 ॥**

**ప్రతిపదార్థము** : అలంకారేషు చాతుర్యం = అలంకారములయందు నేర్పరితనము; సుతాలత్వం = మంచితాలజ్ఞానము; సురాగతా = యోగ్యమైన రాగజ్ఞానము; సుస్వరత్వం = మంచిస్వరజ్ఞానము; సుగేయత్వం = చక్కటి గేయ (పాడదగియుండుట) జ్ఞానము; దేశీరాగేషు = దేశీరాగములయందు; అభిజ్ఞాతా = పాండిత్యము.

**తాత్పర్యము** : అలంకారములయందు నేర్పరితనము, మంచి తాలజ్ఞానము, యోగ్యమైన రాగజ్ఞానము, మంచి స్వరజ్ఞానము, చక్కటి గేయ (పాడదగియుండుట) జ్ఞానము, దేశీరాగములయందు పాండిత్యము.

**దేశభాషాపరిజ్ఞానం ప్రభుచిత్తానువర్తనమ్ ।**
**నృత్తే వాద్యే ప్రవీణత్వం తథైవాస్థానశూరతా ॥ 35 ॥**

**ప్రతిపదార్థము** : దేశభాషాపరిజ్ఞానం = దేశీయభాషలయందు విజ్ఞత; ప్రభుచిత్తానువర్తనం = ప్రభువుయొక్క మనస్సును తెలిసికొని మసలుట; నృత్తే = నృత్తమందును; వాద్యే = వాద్యమందును; ప్రవీణత్వం = నైపుణ్యమును; తథైవ = అట్లే; ఆస్థానశూరతా = ఆస్థాన (సభా)శౌర్యమును;

**తాత్పర్యము** : దేశీయభాషలయందు విజ్ఞత, ప్రభువుయొక్క మనస్సుతెలిసికొని మసలుట, నృత్తమందును, వాద్యమందును, నైపుణ్యము, అట్లే ఆస్థాన (సభా)శౌర్యమును;

**ప్రతిభానం వచస్విత్వం సభ్యచిత్తానురంజనమ్ ।**
**అనిబద్ధస్వరజ్ఞానం చతుర్ధాతుషు పాటవమ్ ॥ 36 ॥**

**ప్రతిపదార్థము** : ప్రతిభానం = ప్రతిభకల్గి యుండుట (తేజోవంతుడగుట); వచస్విత్వం= చక్కగామాట్లాడు నేర్పుకల్గియుండుట; సభ్యచిత్తానురంజనం = సభాసదుల (సహృదయుల) మనస్సులను సంతోషపఱచుట; చతుర్ధాతుషు పాటవం = చతుర్ధాతుస మర్థతయు;

**తాత్పర్యము** : ప్రతిభకల్గియుండుట (తేజోవంతుడగుట), చక్కగా మాట్లాడు నేర్పుకల్గియుండుట, సభాసదుల (సహృదయుల) మనస్సులను సంతోషపఱచుట, చతుర్ధాతుసమర్థతయు;

**సర్వప్రబంధబోధశ్చ ముక్తికాలే ప్రదక్షతా ।**
**త్రిస్థానవ్యాప్తిసుభగః ప్రయోగః కోపవర్జనమ్ ॥ 37 ॥**

**ప్రతిపదార్థము** : సర్వప్రబంధబోధః = అన్ని ప్రబంధముల జ్ఞానమును; ముక్తికాలే ప్రదక్షతా = మోక్షణ(విడుపు) కాలమందు సమర్థత; త్రిస్థానవ్యాప్తిసుభగః = త్రిస్థానములయందు వ్యాప్తి శోభమైన; ప్రయోగః = ప్రయోగమును; కోపవర్జనం = కోప త్యాగమును;

**తాత్పర్యము** : అన్ని ప్రబంధముల జ్ఞానమును మోక్షణ(విడుపు) కాలమందు సమర్థత త్రిస్థానములయందు వ్యాప్తిప్రయోగమును కోపత్యాగమును;

**ఆదిష్టార్థస్య నిర్వాహః సాశ్చర్యకవితా తథా ।**
**యథోచితపదన్యాసప్రాగల్భ్యం వశ్యక(ర్ణ?ణ్ఠతా) ॥ 38 ॥**

**ప్రతిపదార్థము** : ఆదిష్టార్థస్య నిర్వాహః = ఆదేశింపబడిన ప్రయోజనమును నిర్వహించుట; సాశ్చర్యకవితా = అద్భుతయుత కవిత్వము; యథోచితపదన్యాస ప్రాగల్భ్యం = యోగ్యమైన పదముల కూర్పునందలి పాటవము; వశ్యకంఠతా = తనకు లొంగిన కంఠము;

**తాత్పర్యము** : ఆదేశింపబడిన ప్రయోజనమును నిర్వహించుట అద్భుతయుత కవిత్వము యోగ్యమైన పదముల కూర్పునందలి పాటవము, తనకు లొంగిన కంఠము;

**సావధానత్వమేకాంగప్రౌఢిర్వక్త్రే ప్రసన్నతా ।**
**ఏతే వాగ్గేయకారస్య గుణాః సద్భిరుదాహృతాః ॥ 39**

**ప్రతిపదార్థము** : సావధానత్వం = ప్రణిధానమును కలిగియుండుట; ఏకాంగప్రౌఢిత్వం= స్వవిషయమున నేర్పరితనము; వక్త్రే = ముఖమునందు; ప్రసన్నతా = ప్రశాంతత; ఏతే = ఇవి; వాగ్గేయకారస్య = వాగ్గేయకారుని యొక్క; గుణాః = గుణములుగ; సద్భిః = విద్వాంసులచే; ఉదాహృతాః = చెప్పబడినది.

**తాత్పర్యము** : ప్రణిధానమును కలిగియుండుట, స్వవిషయమున నేర్పరితనము, ముఖమునందు ప్రశాంతత, ఇవి వాగ్గేయకారుని యొక్క గుణములుగ విద్వాంసులచే చెప్పబడినవి.

**గ్రామ్యోక్తిరపశబ్దశ్చ తద్వదప్రస్తుతస్తుతిః ।**
**గమకే చ పదే జాడ్యం ప్రబంధ జ్ఞానహీనతా ॥ 40**

**ప్రతిపదార్థము** : గ్రామ్యోక్తిః = గ్రామ్యశబ్దము, అపశబ్దః = అపభ్రంశము; తద్వత్ = అట్లే; అప్రస్తుతస్తుతిః = అప్రకృతములైన విషయముల ప్రస్తావన; గమకే = గమకమునందు; పదే చ = పదమునందును; జాడ్యం = అజ్ఞానము; ప్రబంధ జ్ఞాన హీనతా = ప్రబంధములను గుఱించి తెలియకపోవుట;

**తాత్పర్యము** : గ్రామ్యశబ్దము, అపభ్రంశము, అట్లే అప్రకృతములైన విషయముల యొక్క ప్రస్తావన, గమకమునందు, పదమునందును అజ్ఞానము, ప్రబంధములను గుఱించి తెలియక పోవుట.

**రసానురూపరాగాణా మజ్ఞత్వమవిదగ్ధతా ।**
**క్రియా నిర్వహణాజ్ఞత్వం మందశారీరతా తథా ॥ 41**

**ప్రతిపదార్థము** : రసానురూపరాగాణాం = రసములకు అనుగుణమగు రాగముల యొక్క; అజ్ఞత్వమ్ = అజ్ఞానము; అవిదగ్ధతా = చాతుర్యము లేకపోవుట; క్రియా నిర్వహణాజ్ఞత్వం = క్రియలను నిర్వహించుట తెలియకపోవడము; తథా = అట్లే; మందశారీరతా = బద్ధకరూపమగు శరీరగుణము.

**తాత్పర్యము** : రసములకు అనుగుణమగు రాగములయొక్క అజ్ఞానము, చాతుర్యము లేకపోవుట; క్రియలను నిర్వహించుట తెలియకపోవడము, అట్లే బద్ధకరూపమగు శరీరగుణము.

**మానే న్యూనాధికాజ్ఞత్వం రీతిభంగం తథా పునః ।**
**ఛాయాపరచ్యుతిస్తద్వద్ గానం చాసమయే తథా ॥ 42 ॥**

**ప్రతిపదార్థము** : మానే న్యూనాధికాజ్ఞత్వం = అభిమానము (గణనయందు) నందు హెచ్చుతగ్గులు తెలియకపోవుట; రీతిభంగం = రీతిభంగమును; ఛాయాపరిచ్యుతః= ఛాయాత్యాజ్యత; తద్వత్ = అట్లే; అసమయే గానం = సమయము కానప్పుడు పాడుటయు;

**తాత్పర్యము** : అభిమానము (గణనయందు)నందు హెచ్చుతగ్గులు తెలియకపోవుట, రీతిభంగమును, ఛాయాత్యాజ్యత, అట్లే సమయముకానప్పుడు పాడుటయు;

**అశ్రావ్యం లక్షణం త్యక్త్వా ధాతుర్త్రాతూకరోతి యః ।**
**దోషైరేతైరుపేతో యో నింద్యవాగ్గేయకారకః ॥ 43 ॥**

**ప్రతిపదార్థము** : అశ్రావ్యం = వినదగునట్టియు; లక్షణం త్యక్త్వా = లక్షణమును విడిచి; యః = ఎవడు; ధాతుర్త్రాతూకరోతి = ధాతుర్త్రాతు (మాతు) వులను చేయునో; ఏతైః దోషైః = ఇట్టి దోషములతో; ఉపేతః = కూడినవాడగునో; సః = అతడు; నింద్యవాగ్గేయ కారకః = నింద్యవాగ్గేయకారుడగును.

**తాత్పర్యము** : వినదగునట్టియు లక్షణమును విడిచి ఎవడు ధాతుర్త్రాతు(మాతు)వులను చేయునో ఇట్టిదోషములతో కూడినవాడగునో అతడు నింద్యవాగ్గేయకారుడగును.

**సూడక్రమవశాదేషాం తారతమ్యమథోచ్యతే ।**
**శుద్ధసాలగయోః సూడం విషమం ప్రాంజలం తథా ॥ 44 ॥**

**ప్రతిపదార్థము** : సూడక్రమాత్ = సూడక్రమముగా; ఏషాం = వీటియొక్క తారతమ్యం=

తేడా; ఉచ్యతే = చెప్పబడుచున్నది; శుద్ధసాలగయోః సూడం = శుద్ధసాలగ సూడము; విషమం = విషమముగను; ప్రాంజలం = ప్రాంజలముగను; యః = ఎవడు; కరోతి= చేయునో;

**తాత్పర్యము** : సూడక్రమముగా వీటియొక్క తేడాను చెప్పబడుచున్నది. శుద్ధసాలగ సూడము విషమముగను ప్రాంజలముగను ఎవడు చేయునో;

**కరోతి (బ?గే)యకారో యః సభవేదుత్తమోత్తమః ।**
**కర్తా విషమసూలస్య తయోరుత్తమమధ్యమః ॥ 45 ॥**

**ప్రతిపదార్థము** : సః = అతడు; ఉత్తమోత్తమః గేయకారః భవేత్ = ఉత్తమోత్తమ గేయకారుడగును; విషమసూలస్య కర్తా = విషమసూడకర్త; ఉత్తమ మధ్యమఃస్యాత్ = ఉత్తమమధ్యముడగును.

**తాత్పర్యము** : అతడు ఉత్తమోత్తమ గేయకారుడగును. విషమసూడకర్త ఉత్తమమధ్యముడగును.

**తయోః ప్రాంజలసూడస్య కర్తా స్యాదుత్తమాధమః ।**
**యః కుర్యాత్ సాలగే సూడం విషమం ప్రాంజలం తథా ॥ 46 ॥**

**ప్రతిపదార్థము** : తయోః = వాటిలో; ప్రాంజలసూడస్య కర్తా = ప్రాంజలసూడకర్త; ఉత్తమాధమః స్యాత్ = ఉత్తమాధముడగును; యః = ఎవడు; సాలగే = సాలగమందు; విషమం ప్రాంజలం సూడం కుర్యాత్ = విషమ, ప్రాంజలసూడము(ల)ను చేయునో;

**తాత్పర్యము** : వాటిలో ప్రాంజలసూడకర్త ఉత్తమాధముడగును. ఎవడు సాలగమందు విషమ, ప్రాంజలసూడము (ల)ను చేయునో;

**జఘన్యేషూత్తమః స్యోయముద్దిష్టో(యం?గే)యకారకః ।**
**కర్తా విషమసూడస్య సాలగే తేషు మధ్యమః ॥ 47 ॥**

**ప్రతిపదార్థము** : స్యోయం= అతడు; జఘన్యేషు = నింద్యులలో; ఉత్తమః గేయకారకః ఉద్దిష్టః = ఉత్తమ గేయకారుడుగ నిర్దేశింపబడెను; తేషు = వారిలో; సాలగే = సాలగమందు; విషమసూడస్య కర్తా = విషమసూడకర్త; మధ్యమః = మధ్యముడు.

**తాత్పర్యము** : అతడు నింద్యులలో ఉత్తమగేయకారుడుగ నిర్దేశింపబడెను. వారిలో సాలగమందు విషమసూడకర్త మధ్యముడు.

**సాలగే ప్రాంజలస్యైవ కర్తా తేష్వధమః స్మృతః ।**
**అధమో మాతుకారశ్చ మధ్యమ + + + ++ ॥ 48 ॥**

**ప్రతిపదార్థము** : సాలగే = సాలగమందు; ప్రాంజలస్య ఏవ కర్తా = ప్రాంజలము యొక్కయే కర్త; తేషు = వారిలో; అధమః స్మృతః = అధముడగుచున్నాడు; మాతుకారః = మాతుకారకుడు; అధమః = అధముడు; ధాతుకారకః = ధాతుకారుడు (మాత్రమే); మధ్యమః = మధ్యముడు.

**తాత్పర్యము** : సాలగమందు ప్రాంజలముయొక్కయే కర్త వారిలో అధముడగు చున్నాడు. మాతుకారకుడు అధముడు, ధాతుకారకుడు (మాత్రమే) మద్యముడు.

**ధాతు(త్రా)తుక్రియాయుక్త ఉత్తమః పరికీర్తితః ।**
**వాగ్గేయకారయోర్వాదే సూడం గాతుం ప్రదాపయేత్ ॥ 49 ॥**

**ప్రతిపదార్థము** : ధాతుమాతుక్రియాయుక్తః = ధాతుత్రాతుక్రియాయుతుడు; ఉత్తమః పరికీర్తితః = ఉత్తముడుగా చెప్పబడుచున్నాడు; వాగ్గేయకారయోః వాదే = వాగ్గేయకారుల వాదమందు; సూడం గాతుం = సూడప్రబంధము పాడుటకు; ప్రదాపయేత్ = ఇప్పించవలెను.

**తాత్పర్యము** : ధాతుత్రాతు క్రియాయుతుడు ఉత్తముడుగా చెప్పబడుచున్నాడు. వాగ్గేయ కారుల వాదమందు సూడప్రబంధము పాడుటకు ఇప్పించవలెను.

**ఉత్తారం బంధగీతం వా పట్టాంతరమథాపి వా ।**
**కురుపుంగం తతస్తద్వద్ గుణదోషాన్ నిరూపయేత్ ॥ 50 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్తారం = ఉత్తారమును; బంధగీతం = బంధగీతమును; అథాపివా= లేక; కురుపుంగం = కురుపుంగమునుగాని; ప్రదాపయేత్ = ఇప్పించవలెను; తతః = తరువాత; గుణదోషాన్ నిరూపయేత్ = గుణదోషములను నిరూపించవలెను.

**తాత్పర్యము** : ఉత్తారమును, బంధగీతమును, లేక కురుపుంగమును గాని ఇప్పించ వలెను. తరువాత గుణదోషములను నిరూపించవలెను.

**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ।**
**అనింద్యాశ్చైవ నింద్యాశ్చ ద్వివిధా గాయకా మతాః ॥ 51 ॥**

**ప్రతిపదార్థము** : తయోః తారతమ్యం జ్ఞాత్వా = వారిలో తేడానెఱిగి; జయపరాజయౌ దద్యాత్ = జయపరాజయములు ఈయవలెను; అనింద్యాః = అనింద్యులు; నింద్యాశ్చ = నింద్యులు అని; గాయకాః = గాయకులు; ద్వివిధాః మతాః = రెండు విధములగుచున్నారు.

**తాత్పర్యము** : వారిలో తేడానెఱిగి జయపరాజయములు ఈయవలెను. అనింద్యులు, నింద్యులు అని గాయకలు రెండువిధములగుచున్నారు.

**క్రమేణ వక్ష్యతే తేషాం లక్ష్మోద్దేశపురస్సరమ్ ।**
**క్రియాపరః క్రమస్థశ్చ గతిస్థః సుఘటస్తథా ॥ 52 ॥**

**ప్రతిపదార్థము** : క్రమేణ = క్రమముగా; తేషాం = వారియొక్క; లక్ష్మ = లక్షణము; ఉద్దేశపురస్సరం = లక్ష్యసహితముగా; వక్ష్యతే = చెప్పబడుచున్నది; క్రియాపరః = క్రియాపరుడు; క్రమస్థః = క్రమస్థుడు; గతిస్థః = గతిస్థుడు; తథా = అట్లే; సుఘటః = సుఘటుడు.

**తాత్పర్యము** : క్రమముగా వారియొక్క లక్షణము లక్ష్యసహితముగా చెప్పబడుచున్నది. క్రియా పరుడు, క్రమస్థుడు, గతిస్థుడు, సుఘటుడు.

**సుసంజః శికషశ్చై(వ) రసికో భావకస్తథా ।**
**రర్ధకః పరరీతిజ్ఞః సుగంధ్యోనియమస్తథా ॥ 53 ॥**

**ప్రతిపదార్థము** : సుసంజుడు, శికషుడు (శికకారుడు), రసికుడు, భావకుడు, రర్ధకుడు (రంజకుడు), పరరీతిజ్ఞుడు, సుగంధుడు, అనియముడు.

**తాత్పర్యము** : సుసంజుడు, శికషుడు (శికకారుడు), రసికుడు, భావకుడు, రర్ధకుడు (రంజకుడు), పరరీతిజ్ఞుడు, సుగంధుడు, అనియముడు.

**ఆలప్తిగాయనో గీతగాయనశ్చోపణస్తథా ।**
**వితాలశ్చ విబంధశ్చ మిశ్రశ్చానింద్యగాయకాః ॥ 54 ॥**

**ప్రతిపదార్థము** : ఆలప్తిగాయనః = ఆలప్తిగాయకుడు; గీతగాయనః = రూపక(గీత)గాయకుడు; తథా ఉపణః = అట్లే ఉపణుడు (చోపణుడు), వితాలుడు, విబంధుడు, మిశ్రుడు(మిశ్రకుడు)అని; ఏతే = వీరు; అనింద్యగాయకాః = అనింద్య గాయకులు.

**తాత్పర్యము :** ఆలప్తిగాయకుడు, రూపక(గీత)గాయకుడు, ఉపణుడు (చోపణుడు), విలాపుడు, బిబంధుడు, మిశ్రుడు(మిశ్రకుడు)అని వీరు అనింద్యగాయకులు.

**యథాశాస్త్రప్రయోగేణ మార్గదేశీయమేవ చ ।**
**యో గాయతి వినా దోషాన్ కథ్యతే స క్రియాపరః ॥ 55 ॥**

**ప్రతిపదార్థము :** యథాశాస్త్రప్రయోగేణ = శాస్త్రోక్తప్రయోగముగా; మార్గదేశీయమేవ= మార్గదేశీయములను; వినా దోషాన్ = దోషరహితముగా; యః గాయతి = ఎవడు గానముచేయునో; సః క్రియాపరః కథ్యతే = అతడు క్రియాపరుడని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము :** శాస్త్రోక్తప్రయోగముగా మార్గదేశీయములను దోషరహితముగా ఎవడు గానము చేయునో అతడు క్రియాపరుడని చెప్పబడుచున్నాడు.

**ఉత్తమోత్తమసూడాది సూడాన్ గాయతి యః క్రమాత్ ।**
**ప్రతిరూపకపర్యంతం క్రమస్థః స ఉదాహృతః ॥ 56 ॥**

**ప్రతిపదార్థము :** ఉత్తమోత్తమసూడాదిసూడాన్ = ఉత్తమోత్తమము మొదలగు సూడప్రబంధములను; ప్రతిరూపకపర్యంతం = ప్రతిరూపకమువఱకు; యః = ఎవడు; క్రమాత్ = వరుసగా; గాయతి = గానముచేయునో; సః = అతడు; క్రమస్థః ఉదాహృతః = క్రమస్థుడుగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము :** ఉత్తమోత్తమము మొదలగు సూడప్రబంధములను ప్రతిరూపకమువఱకు ఎవడు వరుసగా గానముచేయునో అతడు క్రమస్థుడుగా చెప్పబడుచున్నాడు.

**వశ్యకంఠతయా సమ్యగ్ గమకాన్ యః పృథక్ పృథక్ ।**
**గమయేల్లక్షణోపేతం గతిస్థః స తు కీర్తితః ॥ 57 ॥**

**ప్రతిపదార్థము :** యః = ఎవడు; వశ్యకంఠతయా = వశమైన (లోబడిన) కంఠముచే; సమ్యక్ = బాగుగా; గమకాన్ = గమకములను; పృథక్ పృథక్ = వేరువేరుగా; లక్షణోపేతం = లక్షణయుతముగా; గమయేత్ = పలికించునో; సః = అతడు; గతిస్థ స్యాత్ = గతిస్థుడగును.

**తాత్పర్యము :** ఎవడు వశమైన (లోబడిన) కంఠముచే బాగుగా గమకములను వేరువేరుగా లక్షణయుతముగా పలికించునో అతడు గతిస్థుడగును.

**స్వరో వర్ణశ్చ తాలశ్చ వ్యక్తంపా యతిట త్రయమ్ ।**
**శోభనధ్వనిసంయుక్తం సుఘటం తం ప్రచక్షతే ॥ 58 ॥**

**ప్రతిపదార్థము** : శోభనధ్వనిసంయుక్తం = యోగ్యమైన ధ్వనికల్గునట్లుగ; స్వరః = స్వరము; వర్ణః = వర్ణము; తాలశ్చ = తాళమును; వ్యక్తం = స్పష్టముగా; త్రయం = ఈమూడింటిని; పాటయతి = సమర్థముగా వ్యక్తము (గానము) చేయునో; తం = అతడిని; సుఘటం ప్రచక్షతే = సుఘటుడందురు.

**తాత్పర్యము** : యోగ్యమైన ధ్వనికల్గునట్లుగ స్వరము, వర్ణము, తాళమును స్పష్టముగా ఈమూడింటిని సమర్థముగా వ్యక్తము (గానము)చేయునో అతడిని సుఘటుడందురు.

**సుశారీరవశాత్ తత్త్రాగం చ (స్వ)కృతిక్ష(మ): ।**
**అనాయాసేన గీతజ్ఞః సుసంజః పరికీర్తితః ॥ 59 ॥**

**ప్రతిపదార్థము** : సుశారీరవశాత్ = శోభనములైన అవయవముల వశమువలన; తత్త్రాగం = ఆయారాగమును; అనాయాసేన = సులువుగా (తేలికగా); స్వకృతిక్షమః = స్వకార్య(గేయ) దక్షుడు; గీతజ్ఞః = గానము (సాంప్రదాయమునెరిగిన)వాడు ఎవడో; సః = అతడు; సుసంజః పరికీర్తితః = సుసంజునిగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : శోభనములైన అవయవముల వశమువలన ఆయా రాగమును సులువుగా (తేలికగా) స్వకార్య(గేయ) దక్షుడు గానము (సాంప్రదాయమునెరిగిన)వాడు ఎవడో అతడు సుసంజునిగా చెప్పబడుచున్నాడు.

**ద్రుతం యః శిక్షతే గీతం విషమం ప్రాంజలం తథా ।**
**శుద్ధే ఛాయాలగే సమ్యక్ శికాకారః స కథ్యతే ॥ 60 ॥**

**ప్రతిపదార్థము** : యః = ఎవడు; శుద్ధే = శుద్ధమందును; ఛాయాలగే = ఛాయాలగమందును; సమ్యక్ = బాగుగా; విషమం గీతం = విషమప్రభేదగీతమును; ప్రాంజలం గీతం = ప్రాంజలగీతమును; ద్రుతం = శీఘ్రముగా; శిక్షతే = శిక్షించునో (బోధించునో); సః = అతడు; శికాకారః కథ్యతే = శికాకారుడని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : ఎవడు శుద్ధమందును, ఛాయాలగమందును, బాగుగా విషమప్రభేద గీతమును ప్రాంజలగీతమును శీఘ్రముగా శిక్షించునో (బోధించునో) అతడు శికాకారుడని చెప్పబడుచున్నాడు.

**సుశ్రయం గీతమాకర్ణ్య భవేద్ యః పులకాన్వితః ।**
**ఆనందాశ్రుకణాకీర్ణః సోఽయం రసికగాయకః ॥ 61 ॥**

**ప్రతిపదార్థము** : సుశ్రయం = చక్కని గాయకునాశ్రయించిన; గీతం ఆకర్ణ్య = గీతమును విని; యః = ఎవడు; పులకాన్వితః = పులకాన్వితుడగునో; ఆనందాశ్రుకణా కీర్ణః = ఆనంద బాష్పములతో వ్యాప్తుడగునో; సః అయం = ఆయితడు; రసికగాయకః స్యాత్ = రసికగాయకుడగును.

**తాత్పర్యము** : చక్కని గాయకునాశ్రయించిన గీతమును వినిఎవడు పులకాన్వితుడగునో ఆనందబాష్పములతో వ్యాప్తుడును అగునో ఆయితడు రసికగాయకుడగును.

**నిరసం సరసం కుర్వన్ నిభావం భావసంయుతమ్ ।**
**శ్రోతుశ్చిత్తం పరిజ్ఞాయ యో గాయేత్ సతు భావకః ॥ 62 ॥**

**ప్రతిపదార్థము** : నిరసం = రసరహితమైన దానిని; సరసం = రసవంతముగను; నిభావం = భావరహితమును; భావసంయుతం = భావసహితమును; కుర్వన్ = చేయుచు; శ్రోతుః = వినువానియొక్క (సామాజికునియొక్క); చిత్తం = మనస్సును; పరిజ్ఞాయ = గుర్తించి; యః = ఎవడు; గాయేత్ = గానముచేయునో; సః = అతడు; భావకః = భావకుడు.

**తాత్పర్యము** : రసరహితమైన దానిని, రసవంతముగను, భావరహితమును భావసహితమును చేయుచు వినువానియొక్క (సామాజికునియొక్క) మనస్సును గుర్తించి ఎవడు గానముచేయునో అతడు భావకుడు.

**చేతోహరేణ గీతే విదిత్వా శ్రోతురాశ్రయమ్ ।**
**రంగం గీతే విధత్తే యో ర(జ?ంజ)కః స్యోభిధీయతే ॥ 63 ॥**

**ప్రతిపదార్థము** : శ్రోతుః ఆశయం విదిత్వా = సహృదయుని అభిప్రాయమునెఱిగి; చేతోహరేణ గీతేన = మనోహరమైన గానముచే; యః = ఎవడు; గీతే = గానమందు; రంగం విధత్తే = ప్రసాధనముచేయునో; సః = అతడు; రంజకః అభిధీయతే = రంజకుడుగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : సహృదయుని అభిప్రాయమునెఱిగి మనోహరమైన గానముచే ఎవడు గానమందు ప్రసాదనముచేయునో అతడు రంజకుడుగా చెప్పబడుచున్నాడు.

**గీతశారీర చేష్టానా మాలప్తౌ చానుకారకృత్ ।**
**గీతోత్తమగుణైర్యుక్తః పరరీతిజ్ఞ ఇష్యతే ॥ 64 ॥**

**ప్రతిపదార్థము** : గీతశారీర చేష్టానాం = గానముచేయునపుడు చేసెడి శరీర వికారముల యందును; ఆలప్తౌచ = ఆలాపమునందును; అనుకారకృత్ = అనుకరణము చేయువాడు; గీతోత్తమగుణైః = గానముయొక్క ఉత్తమ గుణములచే; యుక్తః = కూడినవాడై; పరరీతిజ్ఞః = పరరీతిజ్ఞుడుగ; ఇష్యతే = చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : గానము చేయునపుడు చేసెడి శరీర వికారముల యందును, ఆలాపమునందును అనుకరణము చేయువాడు గానము యొక్క ఉత్తమ గుణములచే కూడినవాడై పరరీతిజ్ఞుడుగ చెప్పబడుచున్నాడు.

**విషమం ప్రాంజలం వ్యాపి సుచిరం యస్య గాయతః ।**
**కంఠే న యాతి మాధుర్యం సుగంధః స తు కీర్తితః ॥ 65 ॥**

**ప్రతిపదార్థము** : విషమం = విషమమైనను; అపిదా = లేక; ప్రాంజలం = సరళమైనను; యస్య గాయతః = ఏ గాయకుని యొక్క; సుచిరం = దీర్ఘత్వము; కంఠే = కంఠమునందు; మాధుర్యం = మాధుర్యమును; న యాతి = పొందనిదైనచో; సః = ఆ గాయకుడు; సుగంధః = 'సుగంధుడుగ'; కీర్తితః = పిలవబడుచున్నాడు.

**తాత్పర్యము** : విషమమైనను లేక సరళమైనను ఏ గాయకునియొక్క దీర్ఘత్వము కంఠమునందు మాధుర్యమును పొందనిదైనచో ఆగాయకుడు 'సుగంధుడు'గ పిలవబడుచున్నాడు.

**విషమం ప్రాంజలం వాఽపి గతిస్త్వవధివర్జితా ।**
**వర్తతే యత్ర గీతజ్ఞైరనియమః స తు కీర్తితః ॥ 66 ॥**

**ప్రతిపదార్థము** : విషమం = విషమమైనను; అపివా = లేక; ప్రాంజలం = సరళమైనను; యత్ర = ఏ గాయకునియందు; అవధివర్జితా = అవధిరహితమగు; గతిః = గమనము; వర్తతే = ఉండునో; సః = అట్టి గాయకుడు; గీతజ్ఞైః = సంగీత శాస్త్రవిదులచే; అనియమః = 'అనియముడు'గ; కీర్తితః = పిలవబడుచున్నాడు.

**తాత్పర్యము** : విషమమైనను, సరళమైనను, ఏ గాయకునియందు అవధిరహిత మగు గమనము ఉండునో అట్టి గాయకుడు సంగీతశాస్త్ర విదులచే 'అనియముడు'గ పిలవబడుచున్నాడు.

**గీతాదపి యదాలప్తిః శ్రుతౌ సౌఖ్య విధాయినీ ।**
**ఆలిప్తగాయనః సోఽయం నిర్దిష్టో గీతవేదిభిః ॥ 67 ॥**

**ప్రతిపదార్థము** : గీతాదపి = గీతముకంటెను; ఆలప్తిః = ఆలాపన; యదా = ఎప్పుడైతే; శ్రుతౌ = వినుటయందు; సౌఖ్యవిధాయినే = మిక్కిలి సుఖము నిచ్చునో; సః అయం = అటువంటిగాయకుడు; గీతవేదిభిః = సంగీత శాస్త్రజ్ఞులచే; ఆలిప్తగాయనః = 'ఆలిప్తగాయకుడు'గ; నిర్దిష్టః = పేర్కొనబడుచున్నాడు.

**తాత్పర్యము** : గీతముకంటెను ఆలాపన ఎప్పుడైతే వినుటయందు మిక్కిలి సుఖము నిచ్చునో, అటువంటి గాయకుడు సంగీతశాస్త్రజ్ఞులచే 'ఆలిప్తగాయకుడు'గ పేర్కొన బడుచున్నాడు.

**ఆలప్తేరపి యద్గీతం భవేదతిమనోహరమ్ ।**
**ఉక్తో గాయకభేదజ్ఞైః సోఽయం రూపకగాయనః ॥ 68 ॥**

**ప్రతిపదార్థము** : యత్ గీతం = ఏ గీతము; ఆలప్తేః అపి = ఆలాపముకంటెను; అతి మనోహరం = మిక్కిలి హృదయంగమము; భవేత్ = అగునో; సః అయం = అటువంటి గాయకుడు; గాయకభేదజ్ఞైః = గాయకుల తారతమ్యమునెఱిగిన పండితులచే; రూపకగాయనః = 'రూపకగాయకుడు'గ; ఉక్తః = చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : ఏ గీతము ఆలాపముకంటెను మిక్కిలి హృదయంగమమగునో, అటువంటి గాయకుడు, గాయకుల తారతమ్యము నెఱిగిన పండితులచే, 'రూపకగాయకుడు'గ చెప్పబడుచున్నాడు.

**శుద్ధే ఛాయలకే చైవ గీతమాలప్తి సంయుతమ్ ।**
**యో గాయతి సవిజ్ఞేయశ్చోపణో గీతవేదిభిః ॥ 69 ॥**

**ప్రతిపదార్థము** : శుద్ధే = శుద్ధమునందును; ఛాయలకే చైవ = ఛాయలకము నందును; ఆలప్తిసంయుతం = ఆలాపనతో కూడిన; గీతం = గీతమును; యః = ఎవడు; గాయతి = పాడునో; సః = అతడు; గీతవేదిభిః = సంగీత విద్వాంసులచే; చోపణః = 'చోపణుడు'గ; విజ్ఞేయః = తెలియబడవలయును.

**తాత్పర్యము** : శుద్ధమునందును, ఛాయలకమునందును ఆలాపనతో కూడిన గీతమును ఎవడు పాడునో అతడు సంగీత విద్వాంసులచే 'చోపణుడు'గ తెలియబడ వలయును.

**ధ్వనిశారీరయోర్యస్య నానాదేశేషు రీతయః ।**
**విలగంతి స విజ్ఞేయో వితాలో గీతవేదిభిః ॥ 70 ॥**

**ప్రతిపదార్థము** : యస్య = ఎవనియొక్క; ధ్వనిశారీరయోః = ధ్వని శరీరములందలి; నానాదేశేషు రీతయః = అనేక ప్రదేశములందలి రీతులు (పద్ధతులు); విలగంతి = కలసియుండునో; సః వితాలః విజ్ఞేయః = అతడు వితాలుడని తెలియదగినది.

**తాత్పర్యము** : ఎవనియొక్క ధ్వని- శరీరములందలి అనేక ప్రదేశములందలి రీతులు(పద్ధతులు) కలసియుండునో అతడు వితాలుడని తెలియదగినది.

**నానావిధం విభక్తం చ ధ్వనౌ యశ్చిం(త్త?త) యేద్ గతిమ్ ।**
**విబంధః స పరిజ్ఞేయో గీతతత్త్వవిచక్షణైః ॥ 71 ॥**

**ప్రతిపదార్థము** : యః = ఎవడు; ధ్వనౌ = ధ్వనియందు; నానావిధం = అనేకవిధమైన; విభక్తం = విభజన పూర్వకమైన; గతిం = గతిని; చింతయేత్ = ఆలోచించునో; సః = అతడు; గీతతత్త్వ విచక్షణైః = సంగీతతత్త్వమునెఱిగిన వారలచే; వింబధః పరిజ్ఞేయః= విబంధునిగా గుర్తించవలెను.

**తాత్పర్యము** : ఎవడు ధ్వనియందు అనేకవిధమైన విభజనపూర్వకమైన గతిని ఆలోచించునో అతడు సంగీతతత్త్వమునెఱిగిన వారలచే విబంధునిగా గుర్తించవలెను.

**రాగే+ + + +++++ద్ దోషవర్జితమ్ ।**
**ప్రవీణత్వేన యో గాయేత్ సో(యం) మిశ్ర ఉదాహృతః ॥ 72 ॥**

**ప్రతిపదార్థము** : రాగే = రాగమునందు; దోషవర్జితం = దోషరహితముగా; ప్రవీణత్వేన = నిపుణముగా; యః గాయేత్ = ఎవడు గానముచేయునో; సః =అతడు; మిశ్రః ఉదాహృతః = మిశ్రుడుగా చెప్పబడుచున్నాడు

**తాత్పర్యము** : రాగమునందు దోషరహితముగా నిపుణముగా ఎవడు గానముచేయునో అతడు మిశ్రుడుగా చెప్పబడుచున్నాడు.

**సందష్టః కపిలో భీతః శంకితః సానునాసికః ।**
**ఉద్ఘృష్టశ్చ తథా కాకీ శూత్కారీ చావ్యవస్థితః ॥ 73 ॥**

**కరాలీ ఝోంబకో (వక్రీ ప్రసారీ చ)నిమీలకః ।**
**తథా నిరవధానశ్చ వి(త్త?తా)లశ్చోష్ట్రకీ తథా ॥ 74 ॥**

**ఉద్ధడో మిశ్రకశ్చేతి నింద్యా ఏకోనవింశతిః ।**
**(స?ద)స్తసందష్టలో గాతా సందష్టః పరికీర్తితః ॥ 75 ॥**

**ప్రతిపదార్థము** : సందష్టుడు, కపిలుడు, భీతుడు, శంకితుడు, సానునాసికుడు, ఉద్ఘృష్టుడు, కాకీ, శూత్కారీ, అవ్యవస్థితుడు, కరాలి, ఝొంబకుడు, వక్రి, ప్రసారి, నిమీలకుడు, నివరధానుడు, వితాలుడు, ఉష్ట్రకుడు, ఉద్ధకుడు, మిశ్రకుడు అని, నింద్యాః ఏకోనవింశతిః = నింద్యులు 19 మంది; దంతసందష్టతః = దంతములను కరచుచు (తాకుచు); గాతా = గానముచేయువాడు; సందష్టః పరికీర్తితః = సందుష్టుడని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : సందష్టుడు, కపిలుడు, భీతుడు, శంకితుడు, సానునాసికుడు, ఉద్ఘృష్టుడు, కాకి, శూత్కారి, అవ్యవస్థితుడు, కరాలి, ఝొంబకుడు, వక్రి, ప్రసారి, నిమీలకుడు, నివరదానుడు, వితాలుడు, ఉష్ట్రకుడు, ఉద్ధకుడు, మిశ్రకుడుఅని నింద్యులు 19 మంది దంతముు కరచుచు(తాకుచు) గానముచేయువాడు సందష్టుడని చెప్పబడుచున్నాడు.

**న్యూనాధికైః స్వరైర్గాతా కపిలః సముదాహృతః ।**
**యో గాయ(తి?భ)యావిష్టస్తం భీతం గాయనం విదుః ॥ 76 ॥**

**ప్రతిపదార్థము** : న్యూనాధికైః స్వరైః గాతా = తక్కువ ఎక్కువ స్వరములతో గానముచేయువాడు; కపిలః సముదాహృతః = కపిలుడనబడుచున్నాడు; యః = ఎవడు; భయావిష్టః గాయతి = భయముతో పాడునో; తం గాయనం = ఆగాయకుడిని; భీతం విదుః = భీతుడని తెలియుదురు.

**తాత్పర్యము** : తక్కువ ఎక్కువ స్వరములతో గానముచేయువాడు. కపిలుడన బడుచున్నాడు. ఎవడు భయముతో పాడునో ఆ గాయకుడిని భీతుడని తెలియుదురు.

**శంకాకులస్తు యో గాయేత్ స శంకిత ఉదాహృతః ।**
**గీతం నాసికయా గాయేద్ విజ్ఞేయః సానునాసికః ॥ 77 ॥**

**ప్రతిపదార్థము** : యః శంకాకులః గాయేత్ = ఎవడు సందేహముతో పాడునో; సః = అతడు; శంకితః ఉదాహృతః= శంకితుడనబడును; గీతం = గీతమును; నాసికయా యో గాయేత్ = ముక్కుతో పాడువాడు; సానునాసికః విజ్ఞేయః = సానునాసికునిగా తెలియబడవలెను.

**తాత్పర్యము** : ఎవడు సందేహముతో పాడునో అతడు శంకితుడనబడును. గీతమును ముక్కుతో పాడువాడు సానునాసికునిగా తెలియబడవలెను.

**ఉద్ఘృష్టః సర్వతః క్షబ్ధో గాయన్ గాయన ఇష్యతే ।**
**కాకస్యేవ స్వరో యస్య స కాకీ పరికీర్తితః ॥ 78 ॥**

**ప్రతిపదార్థము** : సర్వతః = అంతటా; క్షుబ్ధః = క్షోభ(పెట్టుచు) బడుచు; గాయన్ = పాడుచు; ఉద్ఘృష్టః గాయనః ఇష్యతే = ఉద్ఘృష్టగాయకుడు అగుచున్నాడు.

**తాత్పర్యము** : అంతటా క్షోభపెట్ట(పెట్టుచు)బడుచు పాడుచు ఉద్ఘృష్టగాయకుడు అగుచున్నాడు.

**శూత్కారీ శూత్కృతిప్రాయో గాయకః కథితో బుధైః ।**
**అవ్యవస్థిత ఇత్యుక్తః స్థానకేష్వవ్యవస్థితః ॥ 79 ॥**

**ప్రతిపదార్థము** : బుధైః = పండితులచే; శూత్కృతిప్రాయః = శూత్కారప్రాయుడు; శూత్కారీ గాయకః కథిత = శూత్కారి గాయకుడని చెప్పబడెను; స్థానకేషు = స్థాన(క)ములందు; అవ్యవస్థితః = అసావధానుడు; అవ్యవస్థితః ఉచ్యతే = అవ్యవస్థితునిగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : పండితులచే శూత్కారప్రాయుడు శూత్కారిగాయకుడని చెప్పబడెను. స్థాన(క)ములందు అసావధానుడు అవ్యవస్థితునిగా చెప్పబడుచున్నాడు.

**ఉద్ఘాట్య వదనం గాయన్ కరాలీతి నిగద్యతే ।**
**ఉత్ఫుల్లగల్లనయననాసికో ఝోంబకః స్మృతః ॥ 80 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్ఫుల్లగల్లనయననాసికః = వికసించి (వెడల్పయిన) గొంతు, కండ్లు, ముక్కులు కలవాడు; ఝోంబకః స్మృతః = ఝోంబకుడగుచున్నాడు; వదనం ఉద్ఘాట్య= నోరుతెఱచి; యః గాయేత్ = ఎవడు పాడునో; సః కరాలీ ఇతి నిగద్యతే = అతడు కరాలీయని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : వికసించి(వెడల్పయిన) గొంతు, కండ్లు, ముక్కులు కలవాడు. ఝోంబకుడగుచున్నాడు. నోరుతెఱచి ఎవడు పాడునో అతడు కరాలీయని చెప్పబడు చున్నాడు.

గాయన్ వక్రీకృతగ్రీవో నామ్నా వక్రీ ప్రకీర్తితః ।
గీతస్యాతిప్రసారేణ ప్రసారీతి నిగద్యతే ॥ 81 ॥

**ప్రతిపదార్థము** : గాయన్ = పాడుచు; వక్రీకృతగ్రీవః = మెడ వంకరగా చేసినవాడు; వక్రీ ఇతి ప్రకీర్తితః = వక్రియని పిలువబడెను; గీతస్య = గీతముయొక్క; అతిప్రసారేణ= మిక్కిలి ప్రసారము(సాగదీయుట)చే; ప్రసారీ ఇతి నిగద్యతే = ప్రసారియని చెప్పబడును.

**తాత్పర్యము** : పాడుచు మెడ వంకరగా చేసినవాడు వక్రియని పిలువబడెను. గీతము యొక్క మిక్కిలి ప్రసారము (సాగదీయుట)చే ప్రసారియని చెప్పబడును.

**నిమీల్య నయనే గాయన్ కథితోఽసౌ నిమీలకః ।**
**గీతావధానరహితః స స్యాన్నిరవధానకః ॥ 82 ॥**

**ప్రతిపదార్థము** : నయనే నిమీల్య = కండ్లుమూసికొని; గాయన్ = పాడుచు; నిమీలకః కథితః = నిమీలకుడనబడుచున్నాడు; గీతావధానరహితః = పాడుచున్న గీతమందు అవధానములేనివాడు; నిరవధానకః స్యాత్ = నిరవధానకుడగుచున్నాడు.

**తాత్పర్యము** : కండ్లుమూసి పాడుచు, నిమీలకుడనబడుచున్నాడు.పాడుచున్న గీతమందు అవధానములేనివాడు నిరవధానకుడగుచున్నాడు.

**వితాలో గాయకః ప్రోక్తో వితాలం యస్తు గాయతి ।**
**గాయన్నుష్ట్రవదాసీన ఉష్ట్రకీ సంప్రకీర్తితః ॥ 83 ॥**

**ప్రతిపదార్థము** : యః = ఎవడు; వితాలం = తాళరహితముగా; గాయతి = గానముచేయునో; సః వితాలః గాయకః = అతడు వితాలుడనబడు గాయకుడు; గాయన్ = పాడుచు; ఉష్ట్రవదాసీనః =ఒంటెవలె కూర్చున్నవాడు; ఉష్ట్రకీ సంప్రకీర్తితః = ఉష్ట్రకియని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : ఎవడు తాళరహితముగా గానముచేయునో అతడు వితాలుడనబడు గాయకుడు. పాడుచు ఒంటెవలె కూర్చున్నవాడు ఉష్ట్రకియని చెప్పబడుచున్నాడు.

**హనుసంచలనాద్ గాయన్ ఛాగవద్ గమకాన్వితః ।**
**ఉద్ఘడః సోపహా + + +కీర్తితో గీతవేదిభిః ॥ 84 ॥**

**ప్రతిపదార్థము** : ఛాగవత్ = మేకవలె; హనుసంచలనాత్ = దవడల కదలికవలన; సోపహాసైః = అపహాస్యములతో (అపహసింపబడుచు); గమకాన్వితః గాయన్ = గమకముతో పాడుచు; గీతవేదిభిః = సంగీతజ్ఞులచే; ఉద్ఘడః కీర్తితః = ఉద్ఘడుడని చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : దవడల కదలికవలన అపహాస్యములతో (అపహసింపబడుచు) గమకులతో పాడుచు, సంగీతజ్ఞులచే ఉద్ధడుడని చెప్పబడుచున్నాడు.

**కరోతి శుద్ధరాగస్య చ్ఛాయాగలవిమిశ్రణమ్ ।**
**మిశ్రకః స పరిజ్ఞేయో గీతతత్త్వార్థదర్శిభిః ॥ 85 ॥**

**ప్రతిపదార్థము** : శుద్ధరాగస్య = శుద్ధరాగమునకు; చాయాగలవిమిశ్రణం = ఛాయలగముతో కలిపి (పాడి)నవాడు; గీతతత్త్వార్థదర్శిభిః = సంగీతమర్మముల నెఱిగిన వారిచే; మిశ్రకః పరిజ్ఞేయః = మిశ్రకుడుగ తెలియబడవలెను.

**తాత్పర్యము** : శుద్ధరాగమునకు ఛాయలగముతో కలిపి (పాడి)నవాడు సంగీత మర్మములనెఱిగినవారిచే మిశ్రకుడుగ తెలియబడవలెను.

**(వా?ఏ)కలో యమలౌ చైవ సాముదాయిక ఇత్యపి ।**
**గాయత్యన్యానపేక్షో యః సుగీతం లక్షణాన్వితమ్ ॥ 86 ॥**

**ప్రతిపదార్థము** : ఏకలః = ఒక గాయకుడు; యమలౌ = ఇద్దరు గాయకులు; సాముదాయక ఇత్యపి = సముదాయము (గా)కూడ; యః = ఎవడు; లక్షణాన్వితం = లక్షణోపేతమైన; సుగీతం = సుగీతమును; (దోషరహితగీతమును); అన్యానపేక్షః = మరిదేనిని అపేక్షింపక; గాయతి = గానముచేయునో (స,వరః = అతడు శ్రేష్టుడు) అదిశ్రేష్టము.

**తాత్పర్యము** : ఒకగాయకుడు ఇద్దరు గాయకులు సాముదాయకము (గా)కూడ ఎవడు లక్షణోపేతమైన సుగీతమును (దోషరహిత గీతమును) మరిదేనిని అపేక్షింపక గానముచేసిన (అతడుశ్రేష్ఠుడు) అదిశ్రేష్ఠము.

**ఏకలో గాయకః స స్యాద్ ద్వౌ చేద్యమలగాయకౌ ।**
**మిలిత్వా బహుభిర్యస్తు గీతం గాయతి గాయనః ॥ 87 ॥**

**ప్రతిపదార్థము** : ఏకలః గాయకః = ఏక(ల)గాయకుడు; సః స్యాత్ = అతడగును; ద్వౌచేత్ = ఇద్దరయినచో; యమలగాయకౌ = యమలగాయకులు; బహుభిః గాయనః మిలిత్వా = చాలామంది గాయకులతో కలసి; యః గీతం గాయతి = ఎవడు గీతమును పాడునో; సః = అది; సాముదాయిక ఇతి = సాముదాయకమని; ఉక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఏక(ల)గాయకుడు అతడగును. ఇద్దరయినచో యమలగాయకులు.

చాలామంది గాయకులు కలసి ఎవడు గీతమును పాడునో అది సాముదాయకమని చెప్పబడినది.

**స బృందగాయనస్తేషాం పూర్వః పూర్వో భవేద్వరః ।**
**గుణైర్బహుభిరల్పైశ్చ తారతమ్యమథోచ్యతే ॥ 88 ॥**

**ప్రతిపదార్థము** : తేషాం = ఆముగ్గురిలో; పూర్వః పూర్వః వరః = వెనుక వెనుకశ్రేష్ఠము (సాముదాయికము కంటె; యమలము, యమములముకంటె ఏకలముశ్రేష్ఠము;) బహుభిః గుణైః = అనేక గుణములచే; అల్పైః = తక్కువ గుణములచేతను; అథ = తరువాత; తారతమ్యం = భేదము; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : ఆ ముగ్గురిలో వెనుకవెనుక శ్రేష్ఠము (సాముదాయికము కంటె యమలము, యమలముకంటె ఏకలము శ్రేష్ఠము) అనేక గుణములు తక్కువ గుణములచేతను తరువాత భేదము(ను) చెప్పబడుచున్నది.

**వివిధాలప్తిచాతుర్యం గ్రహే మోక్షే చ దక్షతా ।**

**స్థానత్రయప్రయోగశ్చ గంభీరమధురధ్వనిః ॥ 89 ॥**

**ప్రతిపదార్థము** : వివిధాలప్తిచాతుర్యం = వివిధములైన ఆలప్తులయందు నిపుణత; గ్రహే మోక్షే చ దక్షతా = గ్రహణమోక్షములందు సమర్థత; స్థానత్రయప్రయోగః = మంద్ర-మధ్య-తారస్థాయిల ప్రయోగము; గంభీరమధుర ధ్వనిః = గంభీరమైన మధురమైన ధ్వనియు;

**తాత్పర్యము** : వివిధములైన ఆలప్తుల నిపుణత గ్రహణమోక్షములందు సమర్థత, మంద్ర-మధ్య-తారస్థాయిల ప్రయోగము గంభీరమైన మధురమైన ధ్వనియు;

**సర్వవస్తుషు గాతృత్వం తాలజ్ఞత్వం సురేఖతా ।**
**ప్రయోగే (షు?సు) ఘటత్వం చ రాగరాగాంగకౌశలమ్ ॥ 90 ॥**

**ప్రతిపదార్థము** : సర్వవస్తుషు గాతృత్వం = సర్వవస్తులయందు గాతృత్వము; తాలజ్ఞత్వం = తాలజ్ఞానము; సరేఖతా = సురేఖత్వము; ప్రయోగేసు ఘటత్వం = ప్రయోగ మందును యోజనము; రాగరాగాంగకౌశలం = రాగరాగాంగ నైపుణ్యము.

**తాత్పర్యము** : సర్వవస్తువులయందు గాతృత్వము, తాలజ్ఞానము, సురేఖత్వము, ప్రయోగమందును యోజనము, రాగరాగాంగ నైపుణ్యము.

**జితశ్రమత్వం కంఠస్య వశ్యత్వమవధారణా ।**
**మధ్యే మధ్యే చ రాగస్య ప్రౌఢౌచిత్యోపవేశనమ్ ॥ 91 ॥**

**ప్రతిపదార్థము** : జితశ్రమత్వం = శ్రమను జయించుట; కంఠస్య వశ్యత్వం = గొంతునదుపులోనుంచుకొనుట; అవధారణా = గ్రహణశక్తి; రాగస్య మధ్యేమధ్యే = రాగమునకు మధ్యమధ్యన; ప్రౌఢౌచిత్యనివేశనం = ప్రౌఢత్వఉచితత్వాదుల ప్రవేశనము.

**తాత్పర్యము** : శ్రమనుజయించుట, గొంతునదుపులోనుంచుకొనుట, గ్రహణశక్తి, రాగముకు మధ్యమధ్యన ప్రౌఢత్వఉచితత్వాదుల ప్రవేశనము.

**శిక్షా చ తదుపాధ్యాయాదుత్తమే గాయకే గుణాః ।**
**(యే?ఏ)షాం మధ్యే గుణైర్ద్విత్రైర్విహీనో మధ్యమః స్మృతః ॥ 92 ॥**

**ప్రతిపదార్థము** : తదుపాధ్యాయాత్ = ఆ ఉపాధ్యాయునివలన; శిక్షా చ = శిక్షణయు; ఉత్తమే గాయకే గుణాః = ఉత్తమగాయకునియందలి గుణములు; ఏషాం మధ్యే = వీటిలో; ద్విత్రైః గుణైః విహీనః = రెండుమూడు గుణములచే హీనుడైన వాడు (తక్కువ అయిన వాడు).

**తాత్పర్యము** : ఆ ఉపాధ్యాయునివలన శిక్షణయు ఉత్తమ గాయకునియందలి గుణ ములు వీటిలో రెండుమూడు గుణములచే హీనుడైన వాడు (తక్కువ అయినవాడు).

**చతుర్భిః పంచభిర్వాపి గుణైర్హీనః కనిష్టకః ।**
**ఉత్తమోత్తమపూర్వం చ భేదజాతమథోచ్యతే ॥ 93 ॥**

**ప్రతిపదార్థము** : చతుర్భిః పంచభిః వా గుణైః హీనః = 4,5, గుణములు తక్కువఅయినవాడు; కనిష్ఠకః = కనిష్ఠుడు; ఉత్తమోత్తమపూర్వం = ఉత్తమోత్తమ పూర్వకమైన; భేదజాతం = భేదసముదాయము; అథ = తరువాత; ఉచ్యతే = చెప్పబడు చున్నది.

**తాత్పర్యము** : 4,5, గుణములు తక్కువఅయినవాడు కనిష్ఠుడు, ఉత్తమోత్తమ పూర్వకమైన భేదసముదాయము తరువాత చెప్పబడుచున్నది.

**శుద్ధం ఛాయాలగం చైవ గీతమాలప్తిసంయుతమ్ ।**
**స్థానత్రయేణ యో గాయేద్ గీతా స్యాదుత్తమోత్తమః ॥ 94 ॥**

**ప్రతిపదార్థము :** శుద్ధం = శుద్ధమును; ఛాయాలగం చ గీతం = ఛాయాలగగీతమును కూడ; ఆలప్తి సంయుతం = ఆలప్తి సహితముగా; స్థానత్రయేణ = స్థానత్రయముచేతను; యః గాయేత్ = ఎవడు గానముచేయునో; సః ఉత్తమోత్తమః స్యాత్ = అతడు ఉత్తమోత్తమ గాయకుడగును.

**తాత్పర్యము :** శుద్ధమును ఛాయాలగగీతమునుకూడ ఆలప్తిసహితముగా స్థానత్రయము చేతను ఎవడు గానము చేయునో అతడు ఉత్తమోత్తమ గాయకుడగును.

**స్థానకద్వితయేనైతద్ గాయన్నుత్తమమధ్యమః ।**
**స్థానేనైకేన యో గాయేత్ స భవేన్మధ్యమాధమః ॥ 95 ॥**

**ప్రతిపదార్థము :** స్థానకద్వితయేన = రెండుస్థానములచేతనే; ఏతత్ = ఈగీతమును; గాయన్ = పాడుచు; సః = అతడు; ఉత్తమమధ్యమః = ఉత్తమమధ్యముడగును; ఏకేన స్థానేన యః గాయేత్ = ఒకస్థానముచేతనే ఎవడు పాడునో; సః = అతడు; మధ్యమాధమః స్యాత్ = మధ్యమాధముడగును.

**తాత్పర్యము :** రెండు స్థానము చేతనే ఈగీతమును పాడుచు, అతడు ఉత్తమమధ్యము డగును. ఒకస్థానముచేతనే ఎవడు పాడునో అతడు మధ్యమాధము - డగును.

**గీతంవ ఛాయాలగం సమ్యక్ సమ్యగాలప్తిమీదృశీమ్ ।**
**స్థానత్రయేణ యో గాయేత్ స కనిష్ఠోత్తమః స్మృతః ॥ 96 ॥**

**ప్రతిపదార్థము :** ఛాయాలగం గీతం = చాయాలగగీతమును; సమ్యక్ = బాగుగా; ఆలప్తిం ఈదృశీం = ఆలప్తిసదృశముగా; స్థానత్రయేణ = స్థానత్రయముచేతను; యః గాయేత్ = ఎవడు పాడునో; సః కనిష్ఠోత్తమః స్మృతః = అతడు కనిష్ఠోత్తముడుగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము :** ఛాయాలగగీతమును బాగుగా ఆలప్తిసదృశముగా స్థానత్రయముచేతను ఎవడు పాడునో అతడు కనిష్ఠోత్తముడుగా చెప్పబడుచున్నాడు.

**స్థానద్వయేన యో గాయేత్ స కనిష్ఠేషు మధ్యమః ।**
**స్థానేనైకేన యో గాయేత్ స కనిష్ఠాధమః స్మృతః ॥ 97 ॥**

**ప్రతిపదార్థము :** స్థానద్వయేన యః గాయేత్ = స్థానద్వయముతో ఎవడు పాడునో; సః = అతడు; కనిష్ఠేషు మధ్యమధ్యమః = కనిష్ఠులలో మధ్యముడు; ఏకేన స్థానేన

యః గాయేత్ = ఒకస్థానముచే ఎవడు పాడునో; సః కనిష్ఠాధమః స్మృతః = అతడు కనిష్ఠాధముడగుచున్నాడు.

**తాత్పర్యము** : స్థానద్వయముతో ఎవడు పాడునో అతడు కనిష్ఠులలో మధ్యముడు. ఒక స్థానముచే ఎవడు పాడునో అతడు కనిష్ఠాధముడగుచున్నాడు.

**జాతే నాయకయోర్వాదే శుద్ధచ్ఛాయాలగ్యేథవా ।**
**సూడౌ తాయౌ తయోరత్ర ప్రవక్ష్యేతే యథాక్రమమ్ ॥ 98 ॥**

**ప్రతిపదార్థము** : నాయకయోః వాదే జాతే = వాదప్రతివాదనాయకులకు వాదము జరుగగా; శుద్ధచ్ఛాయాగే అథవా = శుద్ధచ్ఛాయాలగములందు గాని లేక; సూడౌ = సూడములు; తాయౌ = తాయములు; తయోః = ఆరెండిటికి; అత్ర = ఇక్కడ; యథాక్రమం = వరుసగా; తారతమ్యం = భేదము; ప్రవక్ష్యేతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : వాదప్రతివాదనాయకులకు వాదము జరుగగా శుద్ధచ్ఛాయాలగములందు గాని లేక సూడములు, తాయములు ఆరెండింటికి ఇక్కడ వరుసగా భేదము చెప్పబడుచున్నది.

**ఏళా విషమకాలస్య ఝోంబడం చ ప్రదాపయేత్ ।**
**ఆలప్తిం తాదృశీమేవ థాయీమేకాదశాంగులమ్ ॥ 99 ॥**

**ప్రతిపదార్థము** : ఏళా విషమకాలస్య = ఏళావిషమకాలముయొక్క; ఝోంబడం ప్రదాపయేత్ = ఝోంబడమును ఇప్పించవలెను; ఆలప్తిం = ఆలప్తిని; తాదృశీమేవ = అటువంటిదానినే; థాయీం = థాయిని; ఏకదశాంగుళం = 12 అంగుళములను ప్రదాపయేత్ = ఇప్పించవలెను.

**తాత్పర్యము** : ఏళావిషమకాలముయొక్క ఝోంబడమును ఇప్పించవలెను. ఆలప్తిని అటువంటిదానినే దాయిని 12 అంగుళములను ఇప్పించవలెను.

**సూడం ఛాయాలగే దద్యాద్ ధ్రువాదివిషమం తథా ।**
**+ + + ++ +++ థాయీమపి ధశాంగులమ్ ॥ 100 ॥**

**ప్రతిపదార్థము** : ఛాయాలగే = ఛాయాలగమందు; సూడం దద్యాత్ = సూడమునీయవలెను; తథా = అట్లే; ధ్రువాదివిషయం = ధ్రువాదివిషయమును; థాయీమపి = థాయినికూడ; దశాంగులం దాపయేత్ = 10 అంగుళములను ఈయవలెను.

**తాత్పర్యము** : ఛాయాలగమందు సూడమునీయవలెను. అట్లే ధ్రువాదివిషయమును థాయినికూడ 10 అంగుళములను ఈయవలెను.

**గాయన్యా యది వాదః స్యాచ్ఛుద్ధే ఛాయాలగ్యేథవా ।**
**స్థాయ్యామేవ విశేష్యోస్తి సూడాలప్తిస్తు పూర్వవత్ ॥ 101 ॥**

**ప్రతిపదార్థము** : గాయన్యా = గాయకితో; వాదః యది స్యాత్ =వాదమైన యెడల; శుద్ధే = శుద్ధమందు; అథవా =లేక; ఛాయాలగే = ఛాయాలగమందుగాని; స్థాయ్యామేవ= స్థాయియందే; విశేషః అస్తి = విశేషముకలదు; సూడాలప్తిస్తు = సూడ ఆలప్తిమాత్రము; పూర్వవత్ స్యాత్ = పూర్వమువలెనగును.

**తాత్పర్యము** : గాయకితో వాదమైన యెడల శుద్ధమందు లేక ఛాయాలగమందు గాని స్థాయియందు విశేషము కలదు. సూడ ఆలప్తి మాత్రము పూర్వమువలెనగును.

**చతుర్దశాంగులా స్థాయీ శుద్ధే దద్యాద్విచక్షణైః ।**
**శ్రావ్యే ఛాయాలగే దద్యాద్ ద్వాదశాంగులసమ్మితా ॥ 102 ॥**

**ప్రతిపదార్థము** : శుద్ధే = శుద్ధమందు; చతుర్దశాంగులస్థాయీ దద్యాత్ = 14 అంగుళముల స్థాయినీయవలెను; శ్రావ్యే ఛాయాలగే = శ్రావ్యమైన ఛాయాలగమందు; ద్వాదశాంగులసమ్మితా దద్యాత్ = 12 అంగుళములతో కూడిన స్థాయిని కల్పించవలెను.

**తాత్పర్యము** : శుద్ధమందు 14 అంగులముల స్థాయినీయవలెను. శ్రావ్యమైన ఛాయాలగమందు 12 అంగుళములతో కూడిన స్థాయిని కల్పించవలెను.

**అత్యుచ్చస్థానకం గీతం తాలపాదైరలంకృతమ్ ।**
**ప్రయోగబహులం రూక్షవిషమం వాదివల్లభమ్ ॥ 103 ॥**

**ప్రతిపదార్థము** : అత్యుచ్చస్థానకం గీతం = మిక్కిలి ఉచ్చస్థానకగీతము; తాలపాదైరలంకృతం = తాలపాదములతో నలంకరింపబడినదియు; ప్రయోగబహులం = బహుళ ప్రయోగముగలదియు; రూక్షవిషమం = రూక్షవిషమమైనదియు; వాదివల్లభం= వాదిప్రియమైనదియును.

**తాత్పర్యము** : మిక్కిలి ఉచ్చస్థానక గీతము తాలపాదములతోనలంకరింపబడినదియు బహుళ ప్రయోగముగలదియు రూక్షవిషమమైనదియు వాదిప్రియమైనదియును.

**జయశ్చ విజయో నందో మహానందాభిధస్తథా ।**
**వంశాశ్చత్వార ఇత్యుక్తా వాదేషు భరతర్షిణా ॥ 104 ॥**

**ప్రతిపదార్థము** : జయః = జయము; విజయః = విజయము; నందః = నందము; మహానందాభిదః = మహానందమను; వంశాః = వంశములు; వాదేషు = వాదములయందు; చత్వారః ఇతి = 4 అని; భరతర్షిణా ఉక్తాః = భరతమునిచేత చెప్పబడినవి.

**తాత్పర్యము** : జయము, విజయము, నందము, మహానందమను వంశములు వాదములయందు 4 అని భరతమునిచేత చెప్పబడినవి.

**అథ సూడాశ్చ ధార్యశ్చ వామే నియమకల్పనా ।**
**ఇత్యుక్తేన ప్రకారేణ + + ++ నిరూప్య చ ।- 105 ॥**

**ప్రతిపదార్థము** : అథ = తరువాత; సూడాశ్చ = సూడలు; ధార్యః = ధారులు; వామే= వామమందు; నియమకల్పనా = నియమప్రకల్పనము; ఇత్యుక్తేన ప్రకారేణ = ఈ చెప్పబడిన రీతిగా; సుపామర్థ్యం = ఉత్తమమైన యోగ్యతను; నిరూప్య చ = నిరూపించియు;

**తాత్పర్యము** : తరువాత సూడలు ధారులు వామమందు నియమప్రకల్పనము ఈ చెప్పబడిన రీతిగా ఉత్తమమైన యోగ్యతను నిరూపించియు;

**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ।**
**జితేంద్రియః ప్రగల్భశ్చ స్థిరాసనపరిగ్రహః ॥ 106 ॥**

**ప్రతిపదార్థము** : తయోః = వాదప్రతివాదులలో; తారతమ్యం జ్ఞాత్వా = తేడాను తెలిసికొని; జయపరాజయౌ దద్యాత్ = విజయమును ఓటమిని ఈయవలెను; జితేంద్రియః = ఇంద్రియజయము గలవాడును; ప్రగల్భః = గంభీరుడును; స్థిరాసన పరిగ్రహః = ఆసనశుద్ధిగలవాడును;

**తాత్పర్యము** : వాదప్రతివాదులలో తేడాను తెలిసికొని విజయమును ఓటమిని ఈయవలెను. ఇంద్రియజయముగలవాడును, గంభీరుడును ఆసనశుద్ధిగలవాడును;

శరీరసౌష్ఠవోపేతః కరయోర్విజితశ్రమః ।
సావధానో భయత్యక్తో రాగరాగాంగతత్త్వవిత్ ॥ 107 ॥

**ప్రతిపదార్థము** : శరీరసౌష్ఠవోపేతః = శరీరసౌష్ఠవము కలవాడును; కరయోః విజితశ్రమః= హస్తములందుశ్రమను జయించినవాడును; సావధానః = సావధానుడును; భయత్యక్తః= భయమును విడిచిన వాడును; రాగరాగాంగతత్త్వవిత్ = రాగరాగాంగములయథార్థ స్వరూపమునెఱిగినవాడును;

**తాత్పర్యము** : శరీరసౌష్ఠవము కలవాడును, హస్తములందు శ్రమను జయించినవాడును, సావధానుడును, భయమును విడిచినవాడును, రాగరాగాంగముల యథార్థ స్వరూపమునెఱిగినవాడును;

**గీతవాదనదక్షశ్చ వైణికః కథితో వరః ।**
**వృత్తిత్రయానవగతిరవధానవిహీనతా ॥ 108 ॥**

**ప్రతిపదార్థము** : గీతవాదనదక్షః = గీతమువాదించు(యించు) సమర్థుడు; వైణికః వరః కథితః = శ్రేష్ఠుడైన వైణికుడుగా చెప్పబడుచున్నాడు; వృత్తిత్రయానవగతిః = వృత్తిత్రయము తెలియకపోవుట; (అభిదాలక్షణావ్యంజనావృత్తులు 3); అవధాన విహీనతా = అవధానరాహిత్యము.

**తాత్పర్యము** : గీతమువాదించు (యించు) సమర్థుడు శ్రేష్ఠుడైన వైణికుడుగా చెప్పబడుచున్నాడు. వృత్తిత్రయము తెలియకపోవుట అవధానరాహిత్యము.

**అలంకారస్వరాజ్ఞత్వం వికలాంగత్వమేవ చ ।**
**రాగగీతస్వరాణాం చ వాదనేష్వసమర్థతా ॥ 109**

**ప్రతిపదార్థము** : అలంకారస్వరాజ్ఞత్వం = అలంకారములు మరియు స్వరములు తెలియకుండుట; చ = మరియు; వికలాంగత్వమేవ = వికలాంగత్వమును; రాగగీతస్వరాణాం చ = రాగము, గీతము మరియు స్వరముల యొక్క; వాదనేషు = వాదనములందు; అసమర్థతా = సామర్థ్యము లేకపోవుట;

**తాత్పర్యము** : అలంకారములు మరియు స్వరములు తెలియకుండుట, మరియు వికలాంగత్వమును, రాగము, గీతము మరియు స్వరముల యొక్క వాదనములందు సామర్థ్యము లేకపోవుట.

**ఇత్యాదయః సముద్దిష్టా దోషా వైణికసంశ్రయాః ।**
**పౌరత్వం సుస్వరత్వం చ ఘనత్వం పూత్కృతే గుణాః ॥ 110 ॥**

**ప్రతిపదార్థము** : ఇత్యాదయః దోషాః = ఈమొదలగు దోషములు; వైణిక సంశ్రయాః సముద్దిష్టాః = వైణికునిగా ఆశ్రయించినవిగా ఉద్దేశింపబడినవి; పౌరత్వం = పౌరత్వము; సుస్వరత్వం =సుస్వరత; ఘనత్వం = గాంభీర్యము; ఫూత్కృతే = ఫూత్కృతి యందలి; గుణాః = గుణములు.

**తాత్పర్యము** : ఈమొదలగు దోషములు వైణికుని ఆశ్రయించినవిగా ఉద్దేశింపబడినవి. పౌరత్వము, సుస్వరత, గాంభీర్యము, ఫూత్కృతియందలి గుణములు.

**అర్ధముక్తిరముక్తిశ్చ ముక్తిశ్చేత్యంగులీవహాః ।**
**అంగులీసారణా గమ్యగమకేషు చ సప్తసు ॥ 111 ॥**

**ప్రతిపదార్థము** : అర్ధముక్తి, అముక్తి, ముక్తి, అంగుళీవహము, అంగుళీ, సారణ, గమ్యగమకములనబడు, సప్తసు = ఏడింటియందును;

**తాత్పర్యము** : అర్ధముక్తి, అముక్తి, ముక్తి, అంగుళీవహము, అంగుళీ, సారణ, గమ్యగమకములనబడు ఏడింటియందును;

**స్వస్థానతా సురాగత్వం దక్షతా గీతవాదనే ।**
**క్రియాభాషావిభాషాసు రాగరాగాంగయోరపి ॥ 112 ॥**

**ప్రతిపదార్థము** : స్వస్థానతా = స్వస్థానత్వము; సురాగత్వం = సురాగత; గీతవాదనే దక్షతా = గీతవాదనాసమర్థతయు; క్రియాభాషావిభాషాసు = క్రియ, భాష, విభాషలయందు; రాగరాగాంగయోః అపి = రాగ-రాగాంగములందును;

**తాత్పర్యము** : స్వస్థానత్వము, సురాగత, గీతవాదనాసమర్ధతయు, క్రియ, భాష, విభాషలయందు రాగ-రాగాంగములందును;

**స్వస్థానే చాప్యవస్థానే రాగనిర్మాణనైపుణ్యమ్ ।**

**గాత్రాణాం స్థానదాతృత్వం తద్దోషచ్ఛాదనం తథా ॥ 113 ॥**

**ప్రతిపదార్థము** : స్వస్థానే = స్వస్థానమందు; అవస్థానే = అవస్థానమందు; రాగనిర్మాణనైపుణం = రాగనిర్మాణకౌశలమును; గాత్రాణాం = గాయకులకు; స్థానదాతృత్వం = స్థానదానముచేయుట; తద్దోషచ్ఛాదనం = వారి దోషములను కప్పిపుచ్చుట.

**తాత్పర్యము** : స్వస్థానమందు, అవస్థానమందు, రాగనిర్మాణకౌశలము, గాయకులకు స్థానదానము చేయుట వారి దోషములను కప్పిపుచ్చుట.

**ఏవమాదిగుణైర్యుక్తో వాంశికః ప్రవరో మతః ।**
**ఫూత్కారస్ఖలితస్తోకయమలస్ఫూత్కృతస్తథా ॥ 114 ॥**

**ప్రతిపదార్థము** : ఏవమాదిగుణైః యుక్తః = ఈ మొదలగు గుణములు కలవాడు; వాంశికః ప్రవరః స్మృతః = వాంశికోత్తముడుగా చెప్పబడుచున్నాడు; ఫూత్కార = ఫూత్కారము; స్ఖలితః = స్ఖలితము; స్తోక = అల్పము; యమలః = యమలము; ఫూత్కృతః = ఫూత్కృతము.

**తాత్పర్యము** : ఈమొదలగు గుణములు కలవాడు వంశికోత్తముడుగా చెప్పబడుచున్నాడు. ఫూత్కారము స్ఖలితము, స్తోకము, యమలము ఫూత్కృతము.

**నిందనీయా ఇమే ప్రోక్తా వంశవిద్యావిశారదైః ।**
**వహణిః కంపితో మూర్ధస్వస్థానాప్రాప్తిరేవ చ ॥ 115 ॥**

**ప్రతిపదార్థము** : ఇమే = ఇవి; వంశవిద్యావిశారదైః = వంశవిద్యయందు నిష్ణాతులచే; నిందనీయాః ప్రోక్తాః= నింద్యములుగా చెప్పబడినవి; వహణిః = వహణి; కంపితః = కంపము; మూర్ధస్వస్థానాప్రాప్తిః = మూర్ధ(మునుండి) స్వస్థానమును పొందకుండుట.

**తాత్పర్యము** : ఇవి వంశవిద్యయందు నిష్ణాతులచే నింద్యములుగా చెప్పబడినవి. వహణి, కంపము, మూర్ధ(మునుండి) స్వస్థానమును పొందకుండుట.

మిథ్యాప్రయోగప్రాచుర్యమజ్ఞత్వం గీతవాదనే ।
ఏతే దోషా విశేషేణ వాంశికస్య ప్రకీర్తితాః ॥ 116 ॥

**ప్రతిపదార్థము** : మిథ్యాప్రయోగప్రాచుర్యం = మిథ్యాప్రయోగాధిక్యము; గీతవాదనే = గీతవాదనమందు; అజ్ఞత్వం = తెలియనితనము; ఏతే దోషా = ఈ దోషములు; విశేషేణ = ప్రత్యేకముగా; వాంశికస్య = వాంశికునికి; ప్రకీర్తితాః = చెప్పబడినవి.

**తాత్పర్యము** : మిథ్యాప్రయోగాధిక్యము, గీతవాదనమందు తెలియనితనము ఈదోషములు ప్రత్యేకముగా వాంశికునికి చెప్పబడినవి.

రాగం చ గమకం గీతం శుద్ధే ఛాయాలగ్యేథవా ।
యో వాదయేత్ స విజ్ఞేయో వాదకైరుత్తమోత్తమః ॥ 117 ॥

**ప్రతిపదార్థము** : శుద్దే = శుద్ధమందు; అథవా = లేక; ఛాయాలగే = ఛాయాలగమందు; రాగం = రాగమును; గమకం = గమకమును; గీతం చ = గీతమును; యః వాదయేత్= ఎవడు వాయించునో; సః వాదకైః ఉత్తమోత్తమఃవిజ్ఞేయః = అతడు వాదకులచే ఉత్తమోత్తమునిగా తెలియబడవలెను.

**తాత్పర్యము** : శుద్ధమందు లేక ఛాయాలగమందు రాగమును, గమకమును, గీతమును ఎవడు వాయించునో అతడు వాదకులచే ఉత్తమోత్తమునిగా తెలియబడవలెను.

**వాద్యంతే రాగగమకా యేన రాగస్య కేవలాః ।**
**తావుభౌ చ క్రమాజ్జ్ఞేయావుత్తమే మధ్యమాధమౌ ॥ 118 ॥**

**ప్రతిపదార్థము** : యాభ్యాం = ఏయిద్దరిచేతను అనవలెను; యేన = ఎవనిచేతను; రాగగమకాః = రాగగమకములును; కేవలాః = కేవలములుగ; రాగస్య = రాగమునకు; వాద్యంతే (వాద్యతే) = వాదింపబడునో; తావుభౌ = వారిద్దరు; క్రమాత్ = క్రమముగా; ఉత్తమే = ఉత్తమమందు; మధ్యమాధమౌ = మధ్యమ - అధములు.

**తాత్పర్యము** : ఏయిద్దరిచేతను అనవలెను. ఎవనిచేతను రాగగమకములును కేవలము రాగమునకు మాత్రము వాదింపబడునో వారిద్దరు క్రమముగా ఉత్తమమందు మధ్యమ-అధములు.

**రాగం చ గమకం గీతం శుద్దే యో వాదయేత్ తథా ।**
**వాదకః స పరిజ్ఞేయో గీతజ్ఞైర్మధ్యమోత్తమః ॥ 119 ॥**

**ప్రతిపదార్థము** : రాగం = రాగమును; గమకం = గమకమును; గీతం = గీతమును; శుద్దే = శుద్ధమందు; యః వాదయేత్ = ఎవడు వాయించునో; సః వాదకః = ఆ వాదకుడు; మధ్యమోత్తమః పరిజ్ఞేయః = మధ్యమోత్తమునిగా గుర్తింపబడవలెను.

**తాత్పర్యము** : రాగమును, గమకమును, గీతమును, శుద్ధమందు ఎవడు వాయించునో ఆ వాదకుడు మధ్యమోత్తమునిగాగుర్తింపబడవలెను.

**వాద్యంతే రాగగమకాః యేన రాగశ్చ కేవలాః ।**
**తావుభౌ చ క్రమాజ్ జ్ఞేయౌ మధ్యమే మధ్యమాధమౌ ॥ 120 ॥**

**ప్రతిపదార్థము** : రాగగమకాః = రాగ, గమకములు; యేన = ఎవనిచేతను; కేవలాః = కేవలముగా; రాగశ్చ = రాగము; వాద్యంతే = వాదింపబడునో; తావుభౌ = వారిద్దరు;

క్రమాత్ = క్రమముగా; మధ్యమే = మధ్యమమందు; మధ్యమాధమౌ స్యాతాం = మధ్యమ, అధములగుచున్నారు.

**తాత్పర్యము** : రాగ, గమకములు, ఎవనిచేతను కేవలముగా రాగము వాదింపబడునో వారిద్దరు క్రమముగా మధ్యమమందు మధ్యమ, అధములగుచున్నారు.

> **రాగం చ గమకం గీతం (తా?సా)లగే యశ్చ వాదయేత్ ।**
> **వాదకః స పరిజ్ఞేయో జఘన్యేషూత్తమో బుధైః ॥ 121 ॥**

**ప్రతిపదార్థము** : రాగం = రాగమును; గీతం = గీతమును; గమకం చ = గమకమును; సాలగే = సాలగమందు; యః వాదయేత్ = ఎవడువాయించునో; సః వాదకః = ఆ వాదకుడు; బుధైః = పండితులచే; జఘన్యేషు ఉత్తమః పరిజ్ఞేయః = అధములలో ఉత్తముడని తెలియబడవలెను.

**తాత్పర్యము** : రాగమును, గీతమును, గమకమును సాలగమందు ఎవడు వాయించునో ఆ వాదకుడును పండితులచే అధములలో ఉత్తముడని తెలియబడవలెను.

> **వాద్యంతే రాగగమకా యేన రాగశ్చ కేవలాః ।**
> **తావుభౌ చ క్రమాజ్జ్ఞేయౌ జఘన్యే మధ్యమాధమౌ ॥ 122 ॥**

**ప్రతిపదార్థము** : యేన = ఎవనిచే; రాగగమకాః = రాగగమకములును; యేన = ఎవనిచే; కేవలాః రాగశ్చ = కేవలము రాగము మాత్రము; వాద్యంతే = వాదించబడునో; తావుభౌ = వారిద్దరు; జఘన్యేషు క్రమాత్ మధ్యమాధమౌ జ్ఞేయౌ = అధములలో క్రమముగ మధ్యమాధములుగ తెలియబడవలెను.

**తాత్పర్యము** : ఎవనిచే రాగ గమకములును ఎవనిచే కేవలము రాగముమాత్రము వాదించబడునో వారిద్దరు అధములలో క్రమముగ మధ్యమాధములుగ తెలియబడవలెను.

> **ప్రత్యేకం నవధా జ్ఞేయావిత్థం వైణికవాంశికౌ ।**
> **వాదే వైణికయోర్జాతే తథా వాంశికయోరపి ॥ 123 ॥**

**ప్రతిపదార్థము** : ఇత్థం = ఈవిధముగా; వైణికవాంశికౌ = వైణికులును, వాంశికులును; ప్రత్యేకం = ప్రత్యేకముగా; నవధా జ్ఞేయౌ = తొమ్మిదివిధములుగా తెలియబడవలెను; వైణికయోః వాదే జాతే = వైణికులకు వాదము కాగా;

**తాత్పర్యము :** ఈవిధముగా వైణికులును, వాంశికులును, ప్రత్యేకముగా తొమ్మిదివిధములుగా తెలియబడవలెను. వైణికులకు వాదముకాగా;

**వాదనే రాగగమకౌ తాలపాఠ్యాః ప్రదాపయేత్ ।**
**శుద్ధసాలగయోః సూడౌ పూర్వవచ్చ పరస్పరమ్ ॥ 124 ॥**

**ప్రతిపదార్థము :** వాదనే = వాదనమందు; రాగగమకౌ = రాగమును, గమకమును; తాలపాఠ్యాః = తాలగీతములను; ప్రదాపయేత్ = ఈయవలెను; శుద్ధసాలగయోః = శుద్ధసాలగములయందు; సూడౌ = సూడమందును; పూర్వవత్ = పూర్వమువలెనే (గాయకులందువలె); పరస్పరం = అన్యోన్యము.

**తాత్పర్యము :** వాదనమందు రాగమును, గమకమును, తాలగీతములను ఈయవలెను. శుద్ధసాలగములయందు సూడమందును పూర్వమువలెనే (గాయకులందువలె) అన్యోన్యము.

**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ।**
**విద్వాన్ కులీనో మతిమాన్ నీరోగో రూపవాంఛుచిః ॥ 125 ॥**

**ప్రతిపదార్థము :** తారతమ్యం = తేడాను; తయోః = వారియందు; జ్ఞాత్వా = తెలిసికొని; జయపరాజయౌ దద్యాత్ = జయపరాజయములను ఈయవలెను; విద్వాన్ = పండితుడు; కులీనః = సత్కులప్రసూతుడు; మతిమాన్ = బుద్ధిమంతుడు; నీరోగః= ఆరోగ్యవంతుడు; రూపవాన్ = అందగాడు; శుచిః = శుభ్రత(పవిత్రత)కలవాడును;

**తాత్పర్యము :** తేడాను వారియందు తెలిసికొని జయపరాజయములను ఈయవలెను. పండితుడు, సత్కులప్రసూతుడు, బుద్ధిమంతుడు,ఆరోగ్యవంతుడు, అందగాడు, శుభ్రత (పవిత్రత)కలవాడును;

**షణ్మార్గకాలభేదజ్ఞో యతిగ్రాహవిశారదః ।**
**ఆలాపాదిక్రియాజ్ఞశ్చ తథైవ ధ్రువకాదివత్ ॥ 126 ॥**

**ప్రతిపదార్థము :** షణ్మార్గకాలభేదజ్ఞః = షణ్మార్గకాలభేదములనెఱిగినవాడు; యతిగ్రాహవిశారదః = యతులందును, గ్రాహములందును పండితుడైనవాడును; ఆలాపాదిక్రియాజ్ఞశ్చ = ఆలాపము మొదలగు క్రియలను తెలిసినవాడును; తథైవ = అట్లే; ధ్రువకాదివిత్ = ధ్రువాదులను తెలిసినవాడును;

**తాత్పర్యము** : షణ్మార్గకాలభేదములనెఱిగినవాడు, యతులందును, గ్రాహములందును, పండితుడైనవాడును ఆలాపము మొదలగు క్రియలను తెలిసినవాడును అట్లే ధ్రువాదులను తెలిసినవాడును;

**యథా వాద్యాక్షరాణాం చ పాటప్రకటనే పటుః ।**
**కర్తా కులకవాద్యస్య తాలవాద్యవిధానవిత్ ॥ 127 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యాక్షరాణాం = వాద్యాక్షరములయొక్క; పాటప్రకటనే = పాటప్రకటనమందు; పటుః = సమర్థుడును; కులకవాద్యస్య కర్తా = కులకవాద్యమునకు నిర్మాత; తాలవాద్యవిధానవిత్ = తాలవాద్యపద్ధతులను తెలిసినవాడును;

**తాత్పర్యము** : వాద్యాక్షరములయొక్క (ప్రకటనమందు) పాటప్రకటనమందు సమర్థుడును, కులక వాద్యమునకు నిర్మాత, తాలవాద్యపద్ధతులను తెలిసినవాడును;

**యథాక్షర వినిష్పత్తిస్తథైవ యతి పూరకః ।**
**చతురశ్రాదితాలేషు బంధవాద్య కృతిక్షమః ॥ 128 ॥**

**ప్రతిపదార్థము** : యథా = ఏవిధముగ; అక్షరవినిష్పత్తిః = అక్షరములయొక్క విభాగముండునో; తథైవ = అట్లే; యతిపూరకః = యతి పూరణము; చతురశ్రాది తాలేషు = చతురశ్రము మొదలగు తాళములందు; బంధవాద్యకృతి క్షమః = బంధము మరియు వాద్యక్రియలందు నేర్పరియైనవాడు;

**తాత్పర్యము** : ఏవిధముగ అక్షరములయొక్క విభాగముండునో అట్లే యతి పూరణ చతురశ్రము మొదలగు తాళములందు, బంధము మరియు వాద్యక్రియలయందు నేర్పరియైనవాడు;

**వాద్యాక్షరాణాం సంబంధేష్వర్థోత్పాదనకోవిదః ।**
**ప్రశస్త కవితాకారో గుణైరేభిః సమన్వితః ॥ 129 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యాక్షరాణాం = వాద్యాక్షరములయొక్క; సంబంధేషు = పరస్పర సంబంధముల యందు; అర్థోత్పాదన కోవిదః = అర్థమును కల్పించుట యందు పండితుడైన వాడు; ప్రశస్తకవితాకారః = శ్రేష్ఠమైన కవితాశక్తిగలవాడు; ఏభిః గుణైః = ఈ గుణములచే; సమన్వితః = కూడినవాడు;

**తాత్పర్యము** : వాద్యాక్షరములయొక్క పరస్పర సంబంధములయందు, అర్థమును

కల్పించుటయందు పండితుడైనవాడు, శ్రేష్ఠమైన కవితాశక్తి గలవాడు ఈ గుణములచే కూడినవాడు.

**ఏభ్యో యే విపరీతాస్తే దోషాః సద్భిరుదాహృతాః ।**
**అర్థయుక్తస్య వాద్యస్య కర్తా స్యాదుత్తమాభిధః ॥ 130 ॥**

**ప్రతిపదార్థము** : ఏభ్యః = ఈ చెప్పబడిన గుణములకంటె; యే = ఏవి; విపరీతాః = విపరీతములో; తే = అవి; దోషాః ఉదాహృతాః = దోషములుగా చెప్పబడినవి; అర్థయుక్తస్య వాద్యస్య కర్తా = అర్థవంతమైన వాద్యమును చేయువాడు; ఉత్తమాభిధః స్యాత్ = ఉత్తముడగును.

**తాత్పర్యము** : ఈ చెప్పబడిన గుణములకంటె ఏవి విపరీతములో అవి దోషములుగా చెప్పబడినవి. అర్థవంతమైన వాద్యమును చేయువాడు ఉత్తముడగును.

**తథైవ బంధవాద్యస్య కర్తా మధ్యమ ఇష్యతే ।**
**కర్తా కులకవాద్యస్య కనిష్ఠః కథితో+ + ॥ 131 ॥**

**ప్రతిపదార్థము** : తథైవ = అట్లే; బంధవాద్యస్య కర్తా = బంధవాద్యనిర్మాత; మధ్యమః ఇష్యతే = మధ్యముడుగా ఇష్టుడు; కులకవాద్యస్య కర్తా = కులకవాద్యకర్త; కనిష్ఠః కథితః = కనిష్ఠుడుగా చెప్పబడెను.

**తాత్పర్యము** : అట్లే బంధవాద్యనిర్మాత మధ్యముడుగా ఇష్టుడు కులక వాద్యకర్త కనిష్ఠుడుగా చెప్పబడెను.

**కవితాకారయోర్వాదే గుణదోషైస్తదీయకైః ।**
**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ॥ 132 ॥**

**ప్రతిపదార్థము** : కవితాకారయోః వాదే = కవితాకారులకు (కవులకు) వాదము జరుగగా; తదీయకైః గుణదోషైః = వారి గుణదోషములచే; తారతమ్యం = భేదమును; తయోః = వారిద్దరియందు; జ్ఞాత్వా = తెలిసి; జయపరాజయౌ దద్యాత్ = గెలుపుఓటముల నీయవలెను.

**తాత్పర్యము** : కవితాకారులకు (కవులకు) వాదము జరుగగా వారి గుణదోషములచే భేదమును వారిద్దరియందు తెలిసి గెలుపు- ఓటములనీయవలెను.

**సర్వేంద్రియేష్వవికలో నిపుణో నిశ్చలః స్వయమ్ ।**
**అంగదోషపరిత్యక్త ఆలాపస్య ప్రమాణే విత్ ॥ 133 ॥**

**ప్రతిపదార్థము** : సర్వేంద్రియేషు అవికలః= అన్ని ఇంద్రియములయందును వికలత్వము లేనివాడును; నిపుణః = నేర్పరియు; స్వయం= స్వయముగా; నిశ్చలః = స్థిరమైనవాడును; అంగదోషపరిత్యక్తః = అంగదోషములచే త్యాజ్యుడును; ఆలాపస్య ప్రమాణవిత్ = ఆలాపముయొక్క ప్రమాణమును తెలిసినవాడును;

**తాత్పర్యము** : అన్ని ఇంద్రియములయందును వికలత్వములేనివాడును, నేర్పరియు, స్వయముగా స్థిరమైనవాడును, అంగదోషములచే త్యాజుడును, ఆలాపముయొక్క ప్రమాణమును తెలిసినవాడును;

**సుస్వరాతోద్య(వాదిత్ర)వాదితా సాంప్రదాయికః ।**
**నాదవృద్ధిక్షయజ్ఞశ్చ గ్రహమోక్ష్యేప్యలక్షితః ॥ 134 ॥**

**ప్రతిపదార్థము** : సుస్వరాతోద్య(వాదిత్ర) వాదితాదసాంప్రదాయికః = చక్కని స్వరముగల ఆతోద్యావాద్యములను వాదించు సంప్రదాయమునెఱిగినవాడును; నాదవృద్ధిక్షయజ్ఞశ్చ= నాదముయొక్క వృద్ధిక్షయములను తెలిసినవాడును; గ్రహే = గ్రహ(ణ)మందును; మోక్ష్యేపి = మోక్షణ(విడుపు, విడుచుట)మందును; అలక్షితః = అలక్షితుడును;

**తాత్పర్యము** : చక్కనిస్వరముగల ఆతోద్యావాద్యములను వాదించు సంప్రదాయమునెఱిగినవాడును నాదముయొక్క వృద్ధిక్షయములను తెలిసినవాడును గ్రహణమందును మోక్షణ (విడుపు, విడుచుట)మందును అలక్షితుడును;

**తాలప్రపంచకుశలః సమాదిగ్రహవేదితా ।**
**న్యాసాపన్యాసకాలజ్ఞస్తాలకోణప్రహారవిత్ ॥ 135 ॥**

**ప్రతిపదార్థము** : తాలప్రపంచకుశలః = తాళప్రపంచము(సముదాయము) నందునేర్పరియు; సమాదిగ్రహవేదితా = షడ్జమధ్యమాదిగ్రహములను తెలిసినవాడును; న్యాసాపన్యాసకాలజ్ఞః = న్యాస- అపన్యాస- సమయములను తెలిసినవాడు; తాలకోణప్రహారవిత్ = తాలకోణప్రహారములను గుర్తించువాడు.

**తాత్పర్యము** : తాళప్రంపచము(సముదాయము)నందు నేర్పరియు, షడ్జమద్యమాది గ్రహములను తెలిసినవాడును, న్యాస- అపన్యాస- సమయములను తెలిసినవాడు తాలకోణ ప్రహారములను గుర్తించువాడు.

**లఘుహస్తో వితానజ్ఞః కాలవేత్తా జితశ్రమః ।**
**తాలానుగో లయజ్ఞశ్చ తాలగీతానుగస్తథా ॥ 136 ॥**

**ప్రతిపదార్థము** : లఘుహస్తః = లాఘవమైన హస్తముకలవాడు; వితానజ్ఞః = వితానజ్ఞుడును; కాలవేత్తా = కాలవేత్తయును; జితశ్రమః = శ్రమను జయించినవాడును; తాలానుగః =తాళముననుసరించువాడును; లయజ్ఞః= లయతెలిసినవాడును; తాలగీతానుగః = తాళగీతములననుసరించువాడును; తథా =అట్లే;

**తాత్పర్యము** : లాఘవమైన హస్తముకలవాడు, వితానజ్ఞుడును, కాలవేత్తయును, శ్రమను జయించినవాడును, తాలముననుసరించువాడును, లయతెలిసినవాడును, తాళగీతములననుసరించువాడును అట్లే;

**జ్ఞాతా కులకవాదస్య న్యాసాపన్యాసకోవిదః ।**
**గీతే వాద్యే చ నృత్తే చచ్ఛిద్రావరణపండితః ॥ 137 ॥**

**ప్రతిపదార్థము** : కులకవాద్యస్య జ్ఞాతా = కులకవాద్యమునెఱిగినవాడు; న్యాసాపన్యాసకోవిదః = న్యాస- అపన్యాసములందుదక్షుడు; గీతే = గీతమునందు; వాద్యే = వాద్యమునందు; నృత్తే చ = నృత్తమందును; ఛిద్రావరణపండితః = ఛిద్రములను తెలియు పండితుడును;

**తాత్పర్యము** : కులకవాద్యమునెఱిగినవాడు, న్యాస-అపన్యాసములందు దక్షుడు, గీతమునందు వాద్యమునందు నృత్తమందును ఛిద్రములను తెలియుపండితుడును,

**ధృఢప్రహారోఽప్యక్షుబ్ధో రంజకో వాదకః శుభః ।**
**స్విన్నాంగత్వం జడత్వం చ భీతిర్నిరవధానతా ॥ 138 ॥**

**చంచలత్వమదక్షత్వమప్రగల్భత్వమేవ చ ।**
**రాగరాగాధికత్వం చ శాస్త్రశ్రవణహీనతా ॥ 139 ॥**

**ప్రతిపదార్థము** : దృఢప్రహారోఽపి = దృఢప్రహారము గలవాడైనను; అక్షుబ్ధః = కలతపడనివాడును; రంజకః = సహృదయులను రంజింప (సంతోషపెట్టు)జేయువాడు; శుభః వాదకః = ఉత్తమవాదకుడు; స్విన్నాంగత్వం = స్వేదముతో తడసిన శరీరము గలవాడు; జడత్వం = జడత్వమును; భీతిః = భయము; నిరవధానతా = అశ్రద్ధయు; చంచలత్వం = అస్థిరత్వము; అదక్షత్వం = అసమర్థత; అప్రగల్భత్వం = గంభీరత

లేకుండుటయు; రాగరాగాధికత్వం = రాగరాగాధికత; శాస్త్రశ్రవణహీనతా = శాస్త్రముయొక్క వినికిడి లేకపోవుట;

**తాత్పర్యము** : దృఢప్రహారముగలవాడైనను, కలతపడనివాడును, సహృదయులను రంజింప (సంతోషపెట్టు)జేయువాడు ఉత్తమవాదకుడు. స్వేదముతో తడసిన శరీరము కలవాడు, జడత్వము, భయము, అశ్రద్ధయు, అస్థిరత్వము, అసమర్థత, గంభీరత లేకుండుటయు రాగరాగాధికత శాస్త్రముయొక్క వినికిడి లేకపోవుట;

**ఇత్యాదయః సముద్దిష్టా దోషా వాదకసంశ్రయాః ।**
**స్కంధస్య మణిబంధస్య కూర్పరాంగుష్ఠయోరపి ॥ 140 ॥**

**ప్రతిపదార్థము** : ఇత్యాదయః = ఈమొదలగునవి; వాదకసంశ్రయాః దోషాః సముద్దిష్టాః = వాదకులనాశ్రయించిన దోషములుగా నుద్దేశింపబడినవి; స్కంధస్య = భుజము యొక్క; మణిబంధస్య = మోచేయియొక్క; కూర్పరాంగుష్ఠయోః అపి = పాణిమూలాంగుష్ఠములయొక్కయు;

**తాత్పర్యము** : ఈమొదలగునవి వాద కులనాశ్రయించిన దోషములుగా నుద్దేశింపబడినవి. భుజముయొక్క మోచేయియొక్క పాణిమూలాంగుష్ఠముల యొక్కయు;

**వామస్య చరణస్యాపి కంపాత్ సంచస్తు పంచధా ।**
**సంచభేదాత్ పాటహికస్త్రిధా హౌడుక్కకోఽపి చ ॥ 141 ॥**

**ప్రతిపదార్థము** : వామస్య చరణస్య అపి = ఎడమపాదముయొక్కయు; కంపాత్ = కంపనమువలన; సంచస్తు పంచధా = సంచ ఐదువిధములు; సంచభేదాత్ = సంచభేదమువలన; పాటహికః = పటహము మ్రోగించువాడును; హౌడుక్కకః అపి= హౌడుక్కకుడుకూడ; త్రిధా = మూడు విధములు.

**తాత్పర్యము** : ఎడమపాదముయొక్కయు కంపనమువలన సంచ ఐదువిధములు. సంచభేదమువలన పటహముమ్రోగించువాడును, హౌడుక్కకుడు కూడ మూడు విధములు.

**ఉత్తమాదిప్రకారేణ తత్స్వరూపం నిరూప్యతే ।**
**అంగుష్ఠమణిబంధోద్యత్సంచాత్ పాటహికః శుభః ॥ 142 ॥**

**ప్రతిపదార్థము** : ఉత్తమాదిప్రకారేణ = ఉత్తముడు మొదలగువిధముగా; తత్స్వరూపం నిరూప్యతే = వారి స్వరూపము నిరూపింపబడుచున్నది; అంగుష్ఠమణిబంధోద్యత్ = అంగుష్ఠ మణిబంధములనెత్తుటవలన; సంచాత్= కదలికవలన (సంచవలన); శుభః పాటహికః = ఉత్తమపాటహికుడు.

తాత్పర్యము : ఉత్తముడు మొదలగు విధముగా వారి స్వరూపము నిరూపింపబడు చున్నది. అంగుష్ఠ మణిబంధములనెత్తుటవలన, కదలికవలన, (సంచవలన), ఉత్తమ పాటహికుడు.

**సంచాత్ కూర్ప(తో?జో)జాతాన్మణిబంధాచ్ఛ మధ్యమః ।**
**స్కంధకూర్పరసంచేన యో వాదయతి స్యోధమః ॥ 143 ॥**

**ప్రతిపదార్థము** : కూర్పరతో జాతాత్ మణిబంధాత్ సంచాత్ = కూర్పరమువలన కలిగిన మణిబంధసంచమువలన; మధ్యమః = మధ్యముడగును; స్కంధదకూర్పరసంచేన = స్కంధకూర్పరసంచముచే; యో వాదయతి = ఎవడు వాదనచేయునో; సః అధమః = అతడు అధముడు.

**తాత్పర్యము** : కూర్పరమువలన కలిగిన మణిబంధసంచము వలన మధ్యముడగును. స్కంధకూర్పర సంచముచే ఎవడు వాదన చేయునో అతడు అధముడు.

**త్రిసంధిచాలనాజ్జాతసంచాద్దౌడుక్కుకః శుభః ।**
**సంచాత్ కూర్పరతో జాతాన్మణిబంధాచ్ఛ మధ్యమః ॥ 144 ॥**

**ప్రతిపదార్థము** : త్రిసంధిచాలనాత్ జాతసంచాత్ = త్రిసంధిచాలనవలన కలిగినసంచము వలన; శుభః ఔడుక్కుకః = ఉత్తమ ఔడుక్కుకుడు; కూర్పరతో జాతాత్ = కూర్పరమునుండి పుట్టిన; మణిబంధాత్ సంచాత్ = మణిబంధసంచమునుండి; మధ్యమః = మధ్యముడు.

**తాత్పర్యము** : త్రిసంధిచాలనవలన కలిగినసంచమువలన ఉత్తమ ఔడుక్కుకుడు, కూర్పరమునుండి పుట్టిన మణిబంధసంచమునుండి మధ్యముడు.

**వామపాదప్రకంపోత్థసచాద్దౌడుక్కికోధమః ।**
**దక్షిణే వార్తికే తాలవాద్యం నైవావగచ్ఛతి ॥ 145 ॥**

ప్రతిపదార్థము : వామపాదప్రకంపోత్థసంచాత్ = ఎడమపాదకంపనమువలన పుట్టిన

సంచమువలన; ఔడుక్కుకః అధమః = ఔడుక్కుకఅధముడు; దక్షిణే వార్తికే = దక్షిణవార్తికమందు; తాలవాద్యం నైవ అవగచ్ఛతి = తాలవాద్యమును తెలిసికొనడు.

**తాత్పర్యము** : ఎడమ పాదకంపనమువలన పుట్టిన సంచమువలన ఔడుక్కుక అధముడు, దక్షిణవార్తికమందు తాలవాద్యమును తెలిసికొనడు.

**శేషలక్షణసంయుక్తః స భవేదుత్తదమాధమః ।**
**శుద్ధసాలగగీతానాం యేన నృత్తత్రయస్య చ ॥ 146 ॥**

**ప్రతిపదార్థము** : శేషలక్షణసంయుక్తః = శేషలక్షణముగలవాడు; ఉత్తమాధమః = ఉత్తమాధముడు; భవేత్ = అగును; శుద్ధసాలగగీతానాం = శుద్ధసాలగ గీతములయొక్కయు; నృత్తత్రయస్య చ = నృత్తత్రయముయొక్కయు;

**తాత్పర్యము** : శేషలక్షణముగలవాడు, ఉత్తమాధముడు అగును. శుద్ధసాలగ గీతములయొక్కయు నృత్తత్రయముయొక్కయు;

**తత్త(ల్ల)క్ష్మానుసారేణ స స్యాన్మధ్యమమధ్యమః ।**
**యేన సాలగగీతానాం నృత్తానాం ప్రతికౌశలమ్ ॥ 147 ॥**

**వాద్యతే లక్షణోపేతం స భవేన్మధ్యమాధమః ।**
**+ + + పేరణాఖ్యస్య గుండల్యాః పేక్షణస్య చ ॥ 148 ॥**

**ప్రతిపదార్థము** : తత్తలక్ష్మానుసారేణ = ఆయా లక్షణానుసారముగా; యేన = ఎవనిచేత వాద్యమగునో; సః = అతడు; మధ్యమమధ్యమః = మధ్యమధ్యముడు; యేన = ఎవనిచేతను; సాలగగీతానాం = సాలగగీతములకు; నృత్తానాం ప్రతి = నృత్తములను గూర్చి; కౌశలం = నేర్పుగా; లక్షణోపేతం వాద్యతే = లక్షణయుతముగా వాయించబడునో; సః = అతడు; మధ్యమాధమః భవేత్ = మధ్యమాధముడగును; పేరణాఖ్యస్య గుండల్యాః = పేరణయొక్క గుండలియొక్క; పేక్షణస్యచ = పేక్షణయుతముగా; వాద్యతే = వాదించబడునో;

**తాత్పర్యము** : ఎవనిచేత వాద్యమగునో అతడు మధ్యమ మధ్యముడు. ఎవనిచేతను సాలగ గీతములకు నృత్తములను గూర్చి నేర్పుగా లక్షణయుతముగా వాయించబడునో అతడు మధ్యమాధముడగును. పేరణ యొక్క గుండలి యొక్క పేక్షణయుతముగా వాదించ బడునో;

**యేన లక్షణసం + + + జఘన్యోత్తమః స్మృతః ।**
**పేరణస్య చ గుండల్యాః వాదకస్తేషు మధ్యమః ॥ 149 ॥**

**ప్రతిపదార్థము** : స జఘన్యోత్తమః స్మృతః = అతడు జఘన్యులలో ఉత్తముడగును; పేరణస్య = పేరణమునకు(యొక్క); గుండల్యాః = గుండలికి; వాదకః = వాదకుడు; తేషు = వారిలో; మధ్యమః = మధ్యముడగుచున్నాడు.

**తాత్పర్యము** : అతడు జఘన్యులలో ఉత్తముడగును.పేరణమునకు యొక్క గుండలికి వాదకుడు వారిలో మధ్యముడగు చున్నాడు.

**+ + + + +కస్తజ్జైరధమః పరికీర్తితః ।**
**యది వాదో భవేత్ తాలవాద్యవాదకయోస్తదా ॥ 150 ॥**

**ప్రతిపదార్థము** : గుండల్యాః వాదకః = గుండలీవాదకుడు; అధమః పరికీర్తితః = అధముడుగా చెప్పబడుచున్నాడు; తాలవాద్యవాదకయోః = తాలవాద్యవాదకులకు; యది వాదః భవేత్ = వాదమైనయెడల;

**తాత్పర్యము** : గుండలీ వాదకుడు అధముడుగా చెప్పబడుచున్నాడు. తాలవాద్య వాదకులకు వాదమైనయెడల;

**తాలవాద్యం చంద్రకలాం త్రిగుణాం చ ప్రదాపయేత్ ।**
**గీతవాదకయోర్వాదే సూడమేకాదిసంజ్ఞకమ్ ॥ 151 ॥**

**ప్రతిపదార్థము** : తాలవాద్యం చంద్రకలాం = తాలవాద్యమైన చంద్రకళను; త్రిగుణాం= త్రిగుణమైనదానిని; ప్రదాపయేత్ = ఇప్పించవలెను; గీతావాదకయోః వాదే = గీతావాదకుల వాదమందు; ఏకాదిసంజ్ఞకం సూడం= ఏకసూడమును;

**తాత్పర్యము** : తాలవాద్యమైన చంద్రకళను త్రిగుణమైన దానిని ఇప్పించవలెను. గీతావాదకుల వాదమందు ఏకసూడమును;

**చిత్రాం చ పద్ధతిం దద్యాద్ వాదన్యాయః పురోదితః ।**
**నృత్తవాదకయోర్వాదే వాద్యమోతాది దాపయేత్ ॥ 152॥**

**తత్తద్విద్యావశాదేవ మాన్యానపి పరీక్ష్య చ ।**
**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ॥ 153 ॥**

**ప్రతిపదార్థము** : చిత్రాం పద్ధతిం చ దద్యాత్ = చిత్రపద్ధతిని కూడనీయవలెను; వాదన్యాయః పురా ఉదితః = వాదన్యాయము పూర్వము చెప్పబడినది; నృత్తవాదకయోర్వాదే = నృత్తవాదకుల వాదమందు; ఓతాదివాద్యం దాపయేత్ = ఓతాదివాద్యమిప్పించవలెను; తత్తద్విద్యావశాత్ ఏవ = ఆ యా విద్యలవలననే; మాన్యాన్ అపి పరీక్ష్య = నిపుణగణనను పరీక్షించి; తయోః తారతమ్యం జ్ఞాత్వా = వారి తేడాను తెలిసికొని; జయ పరాజయౌ దద్యాత్ = గెలుపు ఓటములనీయవలెను.

**తాత్పర్యము** : చిత్రపద్ధతిని కూడ నీయవలెను. వాదన్యాయము పూర్వముచెప్పబడినది. నృత్తవాదకుల వాదమందు ఓతాదివాద్యమిప్పించవలెను. ఆయా విద్యలవలననే నిపుణగణనను పరీక్షించి వారితేడాను తెలిసికొని గెలుపు ఓటముల నీయవలెను.

**సర్వప్రయోగకుశలః సురేఖాతముఖస్తథా (?) ।**
**ప్రాజ్ఞః కలాజ్ఞస్తాలోజ్ఞో నర్తనాసు విశారదః ॥ 154 ॥**

**ప్రతిపదార్థము** : సర్వప్రయోగకుశలః = అన్ని ప్రయోగములందు నిపుణుడు; సరేఖత్వముపాగతః = సురేఖతను పొందినవాడును; ప్రాజ్ఞః = మనీషియు; కలాజ్ఞః = కళాభిజ్ఞుడు; తాలజ్ఞః = తాళవేత్త; నర్తనాసు విశారదః = నర్తనములందు కోవిదుడును.

**తాత్పర్యము** : అన్ని ప్రయోగములందు నిపుణుడు సురేఖతను పొందినవాడును, మనీషియు కళాభిజ్ఞుడు తాళవేత్త నర్తనములందు కోవిదుడును.

**(గీ)తితాలకలాభిజ్ఞో లయవిన్నిర్జితేంద్రియః ।**
**పాత్రసంక్రమణోపా(య)కుశలో నర్తకః స్వయమ్ ॥ 155 ॥**

**సంక్రామతః ప్రయోగాణాం ముఖనృత్తస్య వేదితా ।**
**శిష్యనిష్పాదకో న్యూనాధికవిద్ గతమత్సరః ॥ 156 ॥**

**చార్యంగహారకుశలః ఖండమండలపండితః ।**
**నానాదేశసముత్థస్య దేశీనృత్తస్య వేది(తా) ॥ 157 ॥**

**స గీతాద్యోతనిపుణో నర్తకః ప్రవరః స్మృతః ।**

**ప్రతిపదార్థము** : గీతితాలకలాభిజ్ఞః = గీత తాళకళలను తెలిసినవాడును; లయవిత్= లయవేత్తయు; నిర్జితేంద్రియః= ఇంద్రియములను జయించినవాడును;

పాత్రసంక్రమణో పాయకుశలః = పాత్రసంక్రమణ ఉపాయకుశలుడును; స్వయం నర్తకః = స్వయముగా నర్తకుడును; ప్రయోగాణాం సంక్రమతః = ప్రయోగ మేళనము వలన; ముఖనృత్తస్య వేదితా = ముఖనృత్తమునెఱిగినవాడును; శిష్యనిష్పాదకః = శిష్యులను ఉత్పాదనచేయువాడును; న్యూనాధికవిత్ = అల్పఆధిక్యములను తెలిసినవాడును; గతమత్సరః = మాత్సర్యములేనివాడును; చార్యంగహారకుశలః = చారిఅంగహారములయందు నేర్పరియు; ఖండమండలపండితః = ఖండమండల పండితుడు; నానాదేశ సముత్థస్య = అనేకదేశములందు పుట్టిన; దేశీనృత్తస్య వేదితా= దేశీనృత్తమునెఱిగినవాడును; గీతాద్యోతనిపుణః = గీతమును వ్యక్తీకరించుటలో నేర్పరిఅయిన; సః = అతడు; ప్రవరః నర్తకః స్మృతః = నర్తకశ్రేష్ఠుడుగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** : గీత-తాళకళలను తెలిసినవాడును, లయవేత్తయు ఇంద్రియములను జయించినవాడును, పాత్రసంక్రమణ ఉపాయకుశలుడును, స్వయముగా నర్తకుడును, ప్రయోగ మేళనముకలవాడును, ముఖనృత్తమునెఱిగినవాడును, శిష్యులను ఉత్పాదన చేయువాడును, అల్పఆధిక్యములను తెలిసినవాడును, మాత్సర్యము లేని వాడును, చారిఅంగహారములయందు నేర్పరియు, ఖండమండలపండితుడు, అనేక దేశములందు పుట్టిన దేశీనృత్తము నెఱిగినవాడును గీతమును వ్యక్తీకరించుటలో నేర్పరి అయిన అతడు నర్తక శ్రేష్ఠుడుగా చెప్పబడుచున్నాడు.

**వాద్యతాలయతీనాం చ మానే న్యూనాధిక్యేఽజ్ఞతా ॥ 158 ॥**

**స్వరో లాస్యవిహీనత్వం రసహావావివేకితా ।**
**వైరూప్యమంగవైకల్యం ప్రయోగేష్వప్యకౌశలమ్ ॥ 159 ॥**

**దేశీమార్గవిభేదేన నృత్తశిక్షాస్వనైపుణమ్ ।**
**ఇత్యాదయః సముద్దిష్టా దోషా నర్తకసంశ్రయాః ॥ 160 ॥**

**ప్రతిపదార్థము** : వాద్యతాలయతీనాం = వాద్యతాళయతుల; మానే = ప్రమాణమునందు; న్యూనాధికే అజ్ఞతా = తక్కువ ఎక్కువలు తెలియకుండుట; స్వరః = స్వరము; లాస్యవిహీనత్వం = లాస్యరాహిత్యము; రసహావఅవివేకితా = రసము హావములందు అజ్ఞానము; వైరూప్యం = కురూపము; అంగవైకల్యం = అంగవికలత్వము; ప్రయోగేషు అపి = ప్రయోగములందు కూడ; అకౌశలం = నేర్పులేకుండుట;

దేశీమార్గవిభేదేన = దేశీమార్గభేదముచేత; నృత్తశిక్షాసు = నృత్తశిక్షణలయందు; అనైపుణం = కౌశలములేకుండుట; ఇత్యాదయః = ఈమొదలగునవి; నర్తకసంశ్రయాః దోషాః సముద్దిష్టాః = నర్తకునాశ్రయించి దోషములుగా ఉద్దేశింపబడినవి.

**తాత్పర్యము** : వాద్యతాళయతుల ప్రమాణమునందు తక్కువ ఎక్కువలు తెలికుండుట, స్వరము, లాస్యరాహిత్యము, రసము, హావములందు అజ్ఞానము, కురూపము, అంగవికలత్వము, ప్రయోగములందు కూడ నేర్పులేకుండుట దేశీమార్గభేదముచేత నృత్తశిక్షణలయందు కౌశలములేకుండుట ఈ మొదలగునవి నర్తకునాశ్రయించిన దోషములుగా ఉద్దేశింపబడినవి.

> **యథోక్తలక్షణోపేతం మార్గదేశీయమేవ చ ।**
> **నృత్తం సుశిక్షయేద్ (యస్తు) స భవేన్నర్తకోత్తమః ॥ 161 ॥**

**ప్రతిపదార్థము** : యథోక్తలక్షణోపేతం = చెప్పబడినరీతిలో లక్షణయుతమైన; మార్గదేశీయమేవ నృత్తం = మార్గదేశీనృత్తమును; యః సుశిక్షయేత్ =ఎవడు బాగా శిక్షణ నిచ్చునో; సః నృత్తకోత్తమః భవేత్ = అతడు ఉత్తమనృత్తకుడగును.

**తాత్పర్యము** : చెప్పబడినరీతిలో లక్షణయుతమైన మార్గదేశినృత్తమును ఎవడు బాగా శిక్షణ నిచ్చునో అతడు ఉత్తమనృత్తకుడగును.

> **కేవలం మార్గనృత్తం యః శిక్షయేత్ స తు మధ్యమః ।**
> **అధమః స పరిజ్ఞేయో దేశీనృత్తస్య శిక్షకః ॥ 162 ॥**

**ప్రతిపదార్థము** : కేవలం = కేవలముగా; మార్గనృత్తం = మార్గనృత్తమును; యః శిక్షయేత్= ఎవడు శిక్షణనిచ్చునో; స తు మధ్యమః = అతడు మధ్యముడు; దేశీనృత్తస్య శిక్షకః అధమః = దేశీనృత్తశిక్షకుడు అధముడు.

**తాత్పర్యము** : కేవలముగా మార్గనృత్తమును ఎవడు శిక్షణనిచ్చునో అతడు మధ్యముడు. దేశినృత్త శిక్షకుడు అధముడు.

> **భావకత్వం రసికతా నానాభాషాసు నైపుణమ్ ।**
> **నానాదేశసుచారిత్రవ్యవహారేషు దక్షతా ॥ 163 ॥**

> **పంచాంగపరిపూర్ణత్వం రంజకత్వం విదగ్ధతా ।**
> **ప్రౌ (ఢి?ఢిః) ప్రస్తావవాక్యేషు వికృతాంశవిదగ్ధతా ॥ 164 ॥**

**ఆలాపనం (?)తథారాగరాగాఙ్గాదిప్రవీణతా ।**
**ఇత్యాదయః సముద్దిష్టా(గుణాః)పేరణిసంశ్రయాః ॥ 165॥**

**ప్రతిపదార్థము** : భావకత్వం = భావకత; రసికతా = రసికత్వము; నానాభాషాసు నైపుణం = అనేక భాషలయందు నేర్పరితనము; నానాదేశసుచారిత్రవ్యవహారేషు దక్షతా= అనేక దేశముల యోగ్యమైన చరిత్రకు సంబంధించిన వ్యవహారములందు సమర్థత; పంచాంగ పరిపూర్ణత్వం = పంచాంగపూర్ణత; రంజకత్వం = సంతోషపఱచుట; విదగ్ధతా= పాండిత్యము; ప్రస్తావవాక్యేషు ప్రౌఢిః = ప్రస్తావవాక్యములందు వాక్పటిమ; వికృతాంశవిదగ్ధతా = వికృతాంశములందు కోవిదత్వము; ఆలాపనం = ఆలాపన; తథా = అట్లే; రాగరాగాంగాది ప్రవీణతా = రాగరాగాంగాదుల నైపుణ్యము; ఇత్యాదయః = ఈ మొదలగునవి; పేరణి సంశ్రయాః గుణాః సముద్దిష్టా = పేరణిని ఆశ్రయించిన గుణములుగా నుద్దేశింపబడినవి.

**తాత్పర్యము** : భావకత, రసికత్వము, అనేక భాషలయందు నేర్పరితనము, అనేక దేశముల యోగ్యమైన చరిత్రకు సంబంధించిన వ్యవహారములందు సమర్థత, పంచాంగ పూర్ణత సంతోషపఱచుట, పాండిత్యము ప్రస్తావవాక్యములందు వాక్పటిమ; వికృతాంశములందు కోవిదత్వము, ఆలాపన, అట్లే రాగ రాగాంగాదుల నైపుణ్యము ఈ మొదలగునవి పేరణిని ఆశ్రయించిన గుణములుగానుద్దేశింపబడినవి.

**ఏభ్యో యే విపరీతాస్తే దోషాః సద్భిరుదాహృతాః ।**
**+ + + ++విజ్ఞేయః పంచాంగైః సమ్యగన్వితః ॥ 166 ॥**

**ఘర్ఘరాగీతకైవారప్రౌఢో మధ్యమ ఇష్యతే ।**
**నృత్తం వాగంధ(?) కైవారనిపుణస్త్వధమో మతః ॥ 167 ॥**

**ప్రతిపదార్థము** : ఏభ్యః = వీటికంటె; యే విపరీతాః తే = విపరీతమైనవి; దోషాః ఉదాహృతాః= దోషములుగానుద్దేశింపబడినవి; పంచాంగైః సమ్యగన్వితః = పంచాంగములతో కూడనదిగ; విజ్ఞేయః = తెలియదగినది; ఘర్ఘరాగీతకైవారప్రౌఢః = ఘర్ఘరాగీతకైవాప్రౌఢిమ కలవాడు; మధ్యమః = మధ్యముడగును; నృత్తం = నృత్తము; వాక్ = వాక్కు; అంధకైవార నిపుణః = అంధకైవారమునందు నిపుణుడు; అధమః మతః = అధముడగును.

**తాత్పర్యము** : వీటికంటె విపరీతమైనవి దోషములుగానుద్దేశింపబడినవి.

పంచాంగములతో కూడినదిగ తెలియదగినది. ఘర్ఘరాగీతకైవారప్రౌఢిమకలవాడు మధ్యముడగును. నృత్తము వాక్కు అంధకైవారమునందు నిపుణుడు అధముడగును.

**పేరణీనోరే + + + +ర్గణే + భా + + తి (?) ।**
**తారత్యమం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ॥ 168 ॥**

**ప్రతిపదార్థము** : పేరణీ నర్తకయోర్వాదే = పేరణీ నర్తకుల వాదమందు; తారతమ్యం తయోర్జ్ఞా = తారతమ్యమును వారిలో గుర్తించి; జయపరాజయౌ దద్యాత్ = గెలుపు ఓటములను నిర్ణయించవలెను.

**తాత్పర్యము** : పేరణీ నర్తకుల వాదమందు తారతమ్యమును వారిలో గుర్తించి గెలుపు ఓటములను నిర్ణయించవలెను.

**ప్రాగల్భ్యం సౌష్ఠవం రూపం యౌవనం చ సురేఖతా ।**
**లాఘవం గాత్రవశ్యత్వం గీతావాద్యానువర్తనమ్ ॥ 169 ॥**

**సౌమనస్యమరోగిత్వం స్మితపూర్వాభిభాషణమ్ ।**
**నాత్యు(చ్ఛవామన)స్థూలకృశదేహత్వమేవ చ ॥ 170 ॥**

**వలనం వర్తనం గాత్రే దక్షత్వం గ్రహమోక్షయోః ।**
**చారీతాలగతిజ్ఞత్వం శ్యామత్వం గౌరతాథవా ॥ 171 ॥**

**అవ + + సుమేధత్వం దీర్ఘలోచనతా తథా ।**
**చరణన్యాసచాతుర్యం మలపాదిషు కౌశలమ్ ॥ 172 ॥**

**పాటజ్ఞతా రంగశోభా నానాదేశప్రదర్శితా ।**
**ఏవం గుణగణోపేతా ప్రశస్తా నర్తకీ మతా ॥ 173 ॥**

**ప్రతిపదార్థము** : ప్రాగల్భ్యం = ప్రగల్భత; సౌష్ఠవం = శరీరసౌష్ఠవము; రూపం = రూపము; యౌవనం = వయస్సు; సురేఖతా = సురేఖత్వము; లాఘవం = లఘుత్వము; గాత్రవశ్యత్వం = శరీరము వశములోనుండుట; గీతవాద్యానువర్తనం = గీత వాద్యములు అనువర్తించుట; సౌమనస్యం = సుమనస్కత్వము; అరోగితా = ఆరోగ్యము; స్మితపూర్వాభిభాషణం = చిరునవ్వుతో కూడిన సంభాషణము; నాత్యుచ్ఛవామన = అతిపొడవు అతిపొట్టికాని; స్థూలకృశదేహత్వం = అతిస్థూలము; అతికృశమునొందని (సమానమైన) శరీరముకల్గియుండుట; గాత్రే = గాత్రమందు; వలనం = వలనము;

వర్తనం = వర్తనము; గ్రహమోక్షయోః దక్షత్వం= గ్రహణమోక్షములందు సమర్థత; చారీతాలగతిజ్ఞత్వం = చారితాలగతులను తెలిసియుండుట; శ్యామత్వం = శ్యామత; అథవా = లేక; గౌరత్వం = గౌరత; క్రతా = ఋజత్వము; అవసుమేధత్వం = శోభనమైన బుద్ధియు; దీర్ఘాలోచనతా = దీర్ఘనేత్రత్వము; చరణన్యాసచాతుర్యం = పాదన్యాస చతురత; మలపాదిషు కౌశలం = మలపాదులందు నేర్పు; పాటజ్ఞాతా = పాటజ్ఞత్వము; రంగశోభా = అలంకారమువలన శోభయు (రంగమునకు శోభయును), నానాదేశప్రదర్శితా = అనేకప్రదేశములందు ప్రదర్శనలను ఇచ్చుట; ఏవం గుణ గణోపేతా = ఈవిధమైన గుణసముదాయముతో కూడినది; ప్రశస్తా నర్తకీ మతా = ఉత్తమనర్తకిగా సమ్మతము.

**తాత్పర్యము** : ప్రగల్భత, శరీరసౌష్ఠవము, రూపము, వయస్సు, సురేఖత్వము, లఘుత్వము, శరీరము వశములోనుండుట, గీతవాద్యములను అనువర్తించుట, సుమనస్కత్వము ఆరోగ్యము చిరునవ్వుతో కూడిన సంభాషణము, అతిపొడవు, అతిపొట్టి కాని అతిస్థూలత, అతికృశత్వమునొందని (సమానమైన) శరీరము కల్గియుండుట గాత్రమందు వలనము, వర్తనము, గ్రహణ మోక్షములందు సమర్థత, చారితాల గతులను తెలిసియుండుట, శ్యామత లేక గౌరత, ఋజత్వము, శోభనమైన బుద్ధియు, దీర్ఘనేత్రత్వము, పాదన్యాసచతురత, మలపాదులందు నేర్పు, పాటజ్ఞత్వము అలంకారమువలన శోభయు (రంగమునకు శోభయును) అనేక ప్రదేశములందు ప్రదర్శనలను ఇచ్చుట ఈవిధమైన గుణ సముదాయముతో కూడినది ఉత్తమ నర్తకిగా సమ్మతము.

**అంచితాద్యైశ్చ విషమం ప్రాంజ + + + + + + ।**
**యానృత్యతి సమీచీనం పేఖణే సోత్తమా మతా ॥ 174 ॥**

**యానృత్యతి సమీచీనం నృత్తగీతసమాశ్రయమ్ ।**
**విషమత్వం సమీచీనం పేఖణే సా తు మధ్యమా ॥ 175 ॥**

**ప్రతిపదార్థము** : పేఖణే = పేఖణమందు; అంచితాద్యైః = అంచితాదులచే; విషమం= విషమమును; ప్రాంజలం = ప్రాంజలము; నృత్తగీతగం = నృత్తగీతానుసారముగా; యా = ఏ స్త్రీ; సమీచీనం = బాగుగా; నృత్యతి = నాట్యముచేయునో; సా ఉత్తమా మతా = ఆమె ఉత్తమ నర్తకిగా సమ్మతము; యా = ఏస్త్రీ; సమీచీనం = యోగ్యముగా; నృత్తగీత సమాశ్రయం = నృత్తగీతాశ్రయముగా; విషమత్వం = విషమముగా; నృత్యతి=

నాట్యముచేయునో; సా =ఆమె; మధ్యమా = మధ్యమయగును.

**తాత్పర్యము** : పేఖ్ఖణమందు అంచితాదులచే విషమమును ప్రాంజలము, నృత్తగీతానుసారముగా ఏస్త్రీ బాగుగా నాట్యముచేయునో ఆమె ఉత్తమనర్తకిగా సమ్మతము. ఏస్త్రీ యోగ్యముగా నృత్తగీతాశ్రయముగా విషమముగా నాట్యముచేయునో ఆమె మధ్యమయగును.

**విషమం తు సమీచీనం సా మా + + +++ + ।**
**+ + + + + రిజ్ఞేయో పేఖ్ఖణే సా కనీయసీ ॥ 176 ॥**

**ప్రతిపదార్థము** : విషమం = విషమమును; సమీచీనం = బాగుగా; సా = ఆమె; పేఖ్ఖణే= పేఖ్ఖణమందు; కనీయసీ జ్ఞేయా = కనిష్ఠగా తెలియదగినది.

**తాత్పర్యము** : విషమమును బాగుగా ఆమె పేఖ్ఖణమందు కనిష్ఠగా తెలియదగినది.

**నర్తసోయ్య + +++ పేఖ్ఖణే తద్గుణాగుణైః ।**
**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయపరాజయౌ ॥ 177 ॥**

**ప్రతిపదార్థము** : నర్తసోయ్య పేఖ్ఖణే =పేఖ్ఖణమందు; తద్గుణాగుణైః = వారి గుణదోషములచే; తయోః = వారియందలి; తారతమ్యం = తేడాను; జ్ఞాత్వా = తెలిసికొని; జయపరాజయౌ = గెలుపు-ఓటములను; దద్యాత్ = ఈయవలెను.

**తాత్పర్యము** : పేఖ్ఖణమందు వారిగుణదోషములచే వారియందలి తేడాను తెలిసికొని గెలుపు ఓటములను ఈయవలెను.

**తతో బహులికత్వం చ రంజకత్వం విదగ్ధతా ।**
**అంగానంగపరిజ్ఞానప్రౌఢిర్మత్సరహీనతా ॥ 179 ॥**

**+ నిశ్రేష్ఠం చ శారీరతారే గానం మనోహ(రమ్) ।**
**+ + ++ + ++ + యేపాతశ్చాంశకపూర్వకః ॥ 180 ॥**

**ఇత్యాదయస్తు గుండల్యా గుణాః సద్భిరుదాహృతాః ।**
**ఏభ్యో యే విపరీతాస్తే దోషాస్తజ్జైరుదాహృతాః ॥ 181 ॥**

**ప్రతిపదార్థము** : తతః బాహులికత్వం = తరువాత బహుత్వము; రంజకత్వం = రంజకత; విదగ్ధతా = పాండిత్యము; అంగానంగపరిజ్ఞానప్రౌఢిః= అంగ-

అనంగపరిజ్ఞానసమర్థత; మత్సరహీనతా = అసూయారాహిత్యము; ధ్వనిశ్రేష్ఠం = శబ్దశ్రేష్ఠతయు; శారీరతారమందు; మనోహరం గానం = అందమైన గానము; రాయేపశ్చాంకపూర్వకః = రాయపశ్చాంక పూర్వకము; ఇత్యాదయః = ఈమొదలగునవి; సద్భిః = పండితులచే; గుండాల్యాః గుణాః ఉదాహృతాః = గుండలీ గుణములుగా చెప్పబడినవి; ఏభ్యః = వీటికంటె; యే విపరీతాః = ఏవి విపరీతములో; తే దోషాః = ఆ దోషములు; తజ్ఞైః ఉదాహృతాః = పండితులచే చెప్పబడినవి.

**తాత్పర్యము** : తరువాత బహుత్వము రంజకత, పాండిత్యము, అంగఅనంగ పరిజ్ఞాన సమర్థత, అసూయారాహిత్యము, శబ్దశ్రేష్ఠత శారీరతారమందు అందమైన గానము, రాయపశ్చాంశకపూర్వకము ఈమొదలగునవి పండితులచే గుండలీగుణములుగా చెప్పబడినవి. వీటికంటె ఏవి విపరీతములో ఆ దోషములు పండితులచే చెప్పబడినవి.

**యత్ర గీతం చ నృత్తం చ ++ మతిమనో + + ।**
**++++++++++లీషూత్తమా బుధైః ॥ 182 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; నృత్తం = నృత్తము; గీతం = గీతము; మతిమానః = మనీషులు; గుండలీషు = గుండలులలో; ఉత్తమా = ఉత్తమమైనది.

**తాత్పర్యము** : ఎక్కడ నృత్తము గీతము మనీషులు గుండలులలో ఉత్తమమైనది.

**సామాన్యనర్తనం యత్ర సమ్యగ్గీతం ప్రవర్తతే ।**
**మధ్యమా కథితా సేయం గుండలీతి మనీషిభిః ॥ 183 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; సామాన్యనర్తనం = సామాన్యనర్తనము; సమ్యక్ = బాగుగా; గీతం = గానము; ప్రవర్తతే = ప్రవర్తించునో; సాఽఇయం = ఆ ఈమె; గుండలీషు = గుండలులలో; మధ్యమా కథితా = మధ్యమనర్తకిగా చెప్పబడినది.

**తాత్పర్యము** : ఎక్కడ సామాన్యనర్తనము బాగుగా గానము ప్రవర్తించునో ఆ ఈమె గుండలులలో మధ్యమనర్తకిగా చెప్పబడినది.

**యత్ర ప్రవర్తతే సద్యో నృత్తగీతం తు మధ్యమః ।**
**అధమా సా పరిజ్ఞేయా + + + + + ++ + + +క్షణైః ॥ 184 ॥**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; సద్యః = వెంటనే; నృత్తగీతం ప్రవర్తతే = నృత్తగీతములు ప్రవర్తించునో; సః మధ్యమః = అది మధ్యమము (నృత్తమాత్రం

యత్రప్రవర్తతే = నృత్తమాత్రము ఎక్కడప్రవర్తించునో); సా = ఆమె; అధమా = అధమనర్తకి.

**తాత్పర్యము** : ఎక్కడ వెంటనే నృత్తగీతములు ప్రవర్తించునో అది మధ్యమము. (నృత్తమాత్రము ఎక్కడ ప్రవర్తించునో) ఆమె అధమనర్తకి.

**గుండల్యోర్యది వాదః స్యాదేభిరేవ గుణాగుణైః ।**
**తారతమ్యం తయోర్జ్ఞాత్వా దద్యాజ్జయాపరాజయౌ ॥ 185 ॥**

**ప్రతిపదార్థము** : గుండల్యోః = గుండలులకు; యది వాదః స్యాత్ = వాదమైనయెడల; ఏభిరేవ గుణాగుణైః = ఈగుణదోషములచేతనే; తయోః = వారిద్దరియందు; తారతమ్యం జ్ఞాత్వా = తేడానుతెలిసికొని; జయపరాజయౌ దద్యాత్ = గెలుపు-ఓటములనీయవలెను.

**తాత్పర్యము** : గుండలులకు వాదమైనయెడల ఈ గుణదోషములచేతను వారిద్దరియందు తేడాను తెలిసికొని గెలుపు- ఓటములనీయవలెను.

**మతేన పణబంధేన వాదినోర్వాదకల్పనా ।**
**+ + ++ + + +++ ++ పణశేషతః ॥ 186 ॥**

**ప్రతిపదార్థము** : మతేన = మతముచేతను; పణబంధేన = పణబంధముచేతను; వాదినోః = వాది - ప్రతివాదులకు; వాదకల్పనా = వాదమును కల్పించుట (జరుగవలెను); పణశేషతః = పణశేషమువలన;

**తాత్పర్యము** : మతముచేతను, పణబంధముచేతను వాది-ప్రతివాదులకు వాదమును కల్పించుట (జరుగవలెను) పణశేషమువలన;

**అత్యుక్తిం దేహదండం చ సర్వస్వహరణం తథా ।**
**దుర్వాక్యం చైవ కైవారం వాదకాలే సభాపతిః ॥ 187 ॥**

**మీమాంసాద్వయవేదాంతన్యాయవైశేషికాగమైః ।**
**+ + +++ ++ + గమ్యో గీతేన సంకరః ॥ 188 ॥**

**ప్రతిపదార్థము** : అత్యుక్తిం = అత్యుక్తిని; దేహదండం = దేహదండమును; సర్వస్వహరణం = వాదులయొక్క ధనమంతటిని హరించుట; దుర్వాక్యం = దురుక్తి;

కైవారం = కైవారము; వాదకాలే = వాదనసమయమందు; సభాపతిః = రాజు; మీమాంసాద్యయ వేదాంతన్యాసవైశేషికాగమైః = మీమాంసాదిసకలశాస్త్రములచేతను; గీతేన = గీతముచేతను; సంకరః = సాంకర్యము (కలయిక); గమ్యః = గమ్యము.

**తాత్పర్యము** : అత్యుక్తిని, దేహదండమును, వాదులయొక్క ధనమంతటిని హరించుట, దురుక్తి, కైవారము, వాదనసమయమందు రాజు మీమాంసాది సకలశాస్త్రముల చేతను, గీతముచేతను, సాంకర్యము (కలయిక) గమ్యము.

> పారాశర్యపరాశరౌ భృగుమయౌ సంవర్తకార్త్యాయనా -
> వాపస్తంబబృహస్పతీ సలిఖితౌ హారితదక్షౌ మనుః ।
> విష్వగ్రీవసగౌత(మ)+ + + ++ + పి దిక్షాయ +
> సర్వే మోక్షదమిత్యు (ఛ?శ)న్తి మునయో గీతం తదేవోక్తితః ॥ 189 ॥

**ప్రతిపదార్థము** : పారాశర్యపరాశరౌ = పరాశర- పరాశరాత్మజులు; భగుమయౌ = బృగుమహర్షి, మయుడును; సంవర్తకర్తాయనౌ = సంవర్తకార్త్యాయనులు; ఆపస్తంబబృహస్పతీ = ఆపస్తంబ బృహస్పతులు; సలిఖితౌ హారితదక్షౌ = హారితదక్షులు; మనుః = మనువు; విష్వగ్రీవసగౌతమ = విష్వగ్రీవగౌతములతో కూడ; దాక్షాయణాః= దాక్షాయణాదులు; సర్వే = అందఱు; మనయః = మహర్షులు; తదేవ ఉక్తితః = ఏకకంఠముతో; గీతం = గీతము; మోక్షదమితి ఉశంతి = మోక్షప్రదమని చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : పరాశర -పరాశరాత్మజులు, భగుమహర్షి, మయుడును, సంవర్తకార్త్యాయనులు, ఆపస్తంబ - బృహస్పతులు, హారితదక్షులు, మనువు, విష్వగ్రీవగౌతములతో కూడ దాక్షాయణాదులు అందరు మహర్షులు ఏకకంఠముతో గీతము మోక్షప్రదమని చెప్పుచున్నారు.

ఇతి సంగీతాకరనామదేయశ్రీపార్శ్వదేవవిరచితే సంగీతసమసారే
గీతాదికరణమష్టమమ్

# అథ నవమమధికరణమ్

**తాలస్య లక్షణం + + + + +++ + + + ।**
**తథా సలక్షణం వక్ష్యే పూర్వశాస్త్రానుసారతః ॥ 1 ॥**

**ప్రతిపదార్థము :** తాలస్య లక్షణం = తాళముయొక్క లక్షణమును; తథా = అట్లే; పూర్వశాస్త్రానుసారతః = పూర్వశాస్త్రములననుసరించి; సలక్షణం వక్ష్యే = (దాని) లక్షణమును చెప్పు(చున్నాను)దును.

**తాత్పర్యము :** తాళముయొక్కలక్షణమును అట్లే పూర్వశాస్త్రములననుసరించి (దాని)లక్షణమును చెప్పు(చున్నాను) దును.

**శ్రీసోమేశ్వరదత్తిలప్రభృతిభిస్తాలస్వరూపం పురా**
**ప్రోక్తం సర్వజగద్ధితాయ చతురశ్రాదిప్రభేదా + + ।**
**+ + + (తాది)తాదిభేదసహితం తాలస్య షట్ప్రత్యయమ్**
**సంగీతాకరసూరిణా నిగదితం చిత్రాయమానం భువి (?) ॥ 2 ॥**

**ప్రతిపదార్థము :** శ్రీసోమేశ్వరదత్తిలప్రభృతిభిః = శ్రీసోమేశ్వరుడు; దత్తిలుడు మొదలగువారిచే; పురా పూర్వము జగద్ధితాయ = లోకోపకారము కొఱకు; తాలస్వరూపం ప్రోక్తం = తాలస్వరూపము చెప్పబడినది; తాదిభేదసహితం = తాదిభేదముతో; తాలస్య షట్ప్రత్యయం = తాలముయొక్క షట్ప్రత్యయము; భువి = భూలోకమునందు; చిత్రాయమానం = విచిత్రమగునటుల; సంగీతాకరసూరిణా = పార్శ్వదేవునిచే; నిగదితం= చెప్పబడినది.

**తాత్పర్యము :** శ్రీసోమేశ్వరుడు, దత్తిలుడు మొదలగువారిచే లోకోపకారముకొఱకు తాలస్వరూపము చెప్పబడినది. (తాది) భేదముతో తాలముయొక్క షట్ప్రత్యయము భూలోకమునందు విచిత్రమగునటుల పార్శ్వదేవునిచే చెప్పబడినది.

**తాలద్వయం కంసమయం త్రిహస్త శాఖాంత + + ద్యవమానపిండమ్ ।**
**గుంజాప్రమాచ్ఛిద్రితనిమ్నమధ్యం + + + +మేవ చ ॥ 3 ॥**

**పరస్పరం సన్నిభవర్తులాననం ప్రచిత్రపట్టావలిబంధితమ్ ।**
**కనిష్ఠికానామికమధ్యమాంగులీః ప్రసార్య సాంగుష్ఠకతర్జనీధృతమ్ ॥ 4 ॥**

**ప్రతిపదార్థము** : పరస్పరం = అన్యోన్యము; సన్నిభవర్తులాసనం = సమానవర్తుల గుండ్రనిముఖమును; ప్రచిత్రపట్టావలి బంధితం = విచిత్రముఖపట్టమందలి ముడుతల వరసచే బంధింపబడినదియు; కనిష్ఠికానామికమధ్యమాంగులీః = కనిష్ఠిక; అనామిక, మధ్యమాంగుళులు; ప్రసార్య = చాచి; సాంగుష్ఠకతర్జనీధృతం = అంగుష్టముతో తర్జనిని పట్టుకొన్నదియు;

**తాత్పర్యము** : అన్యోన్యము సమానవర్తులగుం(డని)ముఖమును విచిత్రముఖ పట్టమందలి ముడుతల వరసచే బంధింపబడినదియు కనిష్ఠిక, అనామిక, మధ్యమాంగుళులు, చాచి అంగుష్టముతో తర్జనిని పట్టుకొన్నదియు.

**సవ్యేన హస్తేన తుతాణ+++ ++++++రమణీయనాదమ్।**
**బిందూద్భవం శక్తిశివస్వరూపమాధారకా++++ శాదనింత్యమ్? ॥ 5 ॥**

**ప్రతిపదార్థము** : సవ్యేన హస్తేన = కుడిచేతితో; - - - - - రమణీయబిందుజనితమును; బిందూద్భవం = బిందుజనితమును; శక్తి శివస్వరూపం= పరమేశ్వర రూపమును; ఆధారకా- - - - - శాదనింత్యం = ఆధారకమైన----

**తాత్పర్యము** : కుడిచేతితో అందమైన నాదము(కలదియు)ను బిందుజనితమును పరమేశ్వర రూపమును ఆధారకమైన------

**మనోగా హస్తగా చాస్య ద్వివిధా మానకల్పనా ।**
**ప్రమాణం మానసం యత్తు చతుర్భాగ ఇతీరితః ॥ 6 ॥**

**ప్రతిపదార్థము** : అస్య = దీనికి; మనోగా = మనోగము; హస్తగా = హస్తగముఅని; మాన కల్పనా = మానకల్పన; ద్వివిధా = రెండు విధములైనది; యత్ మానసం ప్రమాణం = మానస ప్రమాణము; చతుర్భాగః ఇతి ఈరితః = నాల్గుభాగములని చెప్పబడినది.

**తాత్పర్యము** : దీనికి మనోగము, హస్తగము అని మానకల్పన రెండు విధములైనది. మానసప్రమాణము నాల్గుభాగములని చెప్పబడినది.

**హస్తగమనమానం యత్ తదర్ధాద్ ద్రుతముచ్యతే?।**
**అంగులీద్వయసంయోగాన్మనోగః సార్ధపాదకః ॥ 7 ॥**

**ప్రతివదార్థము** : యత్హస్తాగమనమానం = కరాగమనము వచ్చు

కాలపరిమితియేదికలదో; తదర్ధాత్ = దాని సగభాగము వలన; ద్రుతం ఉచ్యతే = ద్రుతము చెప్పబడుచున్నది; అంగులీద్వయసంయోగాత్ = రెండువ్రేళ్లకలయిక వలన; మనోగః= మనోగము; సార్ధపాదకః = ఒకటిన్నర పాద (కాలపరిమితి కలది) మగును.

**తాత్పర్యము** : కరాగమనము వచ్చు కాల పరిమితియేదికలదో దాని సగభాగము వలన ద్రుతము చెప్పబడుచున్నది రెండువ్రేళ్లకలయికవలన మనోగము ఒకటిన్నర పాద(కాలపరిమితి కలది)మగును.

**ఛోటికావపమానం యద్ బిందుస్తాలస్తతస్తతః ।**
**బిందుభ్యాం తు లఘు ప్రోక్తం లఘుభ్యాం తు గురుః స్మృతః ॥ 8 ॥**

**ప్రతిపదార్థము** : ఛోటికావపమానం = రెండు ఛోటికలకంటె తక్కువ కాలము; యత్= ఏదియో; తత్ = అది; బిందుః = బిందువు; తతః = తరువాత; బిందుభ్యాం = రెండుబిందువులచే; లఘు ప్రోక్తం = లఘువు చెప్పబడినది; లఘుభ్యాం గురుః స్మృతః = రెండు లఘువులతో గురువు చెప్పబడినది.

**తాత్పర్యము** : రెండు ఛోటికలకంటె తక్కువ కాలము ఏదియో అది బిందువు. తరువాత రెండు బిందువులచే లఘువు చెప్పబడినది. రెండు లఘువులతో గురువు చెప్పబడినది.

**లైస్త్రిభిశ్చ ప్లుతో జ్ఞేయ ఇతి మాన ఉదాహృతః ।**
**సమతాలసుమధ్యవివర్జితః సమయ్యోయమభూల్లయాలయః ॥9॥**

**ప్రతిపదార్థము** : లైఃత్రిభిః = మూడు లఘువులచే; ప్లుతఃజ్ఞేయః = ప్లుతముగా తెలియదగినది; ఇతి = ఈవిధముగా; మానః ఉదాహృతః = మానము చెప్పబడినది; అయం సమయః = ఈకాలము; లయాలయః అభూత్ = లయాలయమగును.

**తాత్పర్యము** : మూడు లఘువులచే ప్లుతముగా తెలియదగినది. ఈ విధముగా మానము చెప్పబడినది. ఈకాలము లయాలయమగును.

**ద్రుతమధ్యవిలంబితమానస్త్రివిధో లయభేద ఉదాహృతః ।**

**ప్రోక్తా యతిః స్యాల్లయయా సమానా త్రేధే + పశ్చాదనతిక్రమేణ ।**
**చిత్రాదిమార్గేషు యతిః సమా స్యాత్ స్రోత్రోవహా గోకులపుచ్ఛికేతి ॥ 10 ॥**

**ప్రతిపదార్థము** : ధ్రుతమధ్య విలంబితమానః = ధ్రుతము; మధ్య(మ)ము, విలంబితము అని; లయభేదః త్రివిధః ఉదాహృతః = లయ భేదము మూడువిధములని చెప్పబడినది; లయయా సమానా = లయతో సమానమగు; యతిః స్యాత్ = యతియగును; త్రిధే= మూడువిధములైన లయయందు; పశ్చాత్ = తరువాత; అనతిక్రమేణ = మించకుండ; యతిః ప్రోక్తా = యతిచెప్పబడినది; చిత్రాదిమార్గేషు = చిత్రాదిమార్గములందు; యతి = యతి; సమా = సమము; స్రోతోహా = స్రోతోవహము; గోకులపుచ్ఛికా ఇతి = గోకులపుచ్ఛికయని; భిద్యతే = భిన్నమగుచున్నది.

**తాత్పర్యము** : ధ్రుతము, మధ్య(మ)ము, విలంబితము అని లయభేదము మూడు విధములని చెప్పబడినది. లయతో సమానమగు యతియగును. మూడు విధములైన లయయందు తరువాత మించకుండ యతిచెప్పబడినది. చిత్రాది మార్గములందు యతిసమము స్రోతోవహము గోకులపుచ్ఛికయని భిన్నమగుచున్నది.

**ప్రస్తారసంఖ్యయా యుక్తం (నష్ట)ముద్దిష్టమేవ చ ॥ 11 ॥**

**ఏకద్వ్యాదిలఘూపేతమధ్వయోగం ప్రచక్ష్మహే ।**
**దలగపపిండం ప్రాక్తనపిండం భిత్వా యథాక్షరం రచయేత్ ।**
**తత్సమమాలిఖ పురతో యావల్లఘు బిందుతామేతి ॥ 12 ॥**

**ప్రతిపదార్థము** : ప్రస్తారసంఖ్యయా = ప్రస్తారసంఖ్యతో; యుక్తం = కూడినది; నష్టం ఉద్దిష్టం = నష్టముగా ఉద్దిష్టము; ఏకద్వ్యాదిలఘూపేతం = ఒకటి రెండు మొదలుగల లఘువులతో కూడినది; మధ్వయోగప్రచక్ష్మహే = మధ్వయోగముగా (మధ్య)చెప్పుచున్నాము; దలగప పిండం = ధ్రుతము, లఘువు, గురువు, ప్లుతము పిండం; ప్రాక్తన పిండం = ప్రాక్తగణ నగణ (పిండం); యథాక్షరం భిత్వా = యథాక్షరముగా ఛేదించి; రచయేత్ = రచించవలెను; యావత్ లఘుబిందుతాం ఏతి= లఘువు బిందుత్వమునొందువఱకు; పురతః = ఎదుట; తత్సమం = తత్సమమును; ఆలిఖ = వ్రాయుము.

**తాత్పర్యము** : ప్రస్తారసంఖ్యతో కూడినది. నష్టముగా ఉద్దిష్టము. ఒకటి రెండు మొదలుగల లఘువులతో కూడినది. మధ్వయోగముగా (మధ్య)చెప్పుచున్నాము. ధ్రుతము, లఘువు, గురువు, ప్లుతము పిండం, ప్రాక్ తగణ, నగణ (పిండం) యథాక్షరముగా ఛేదించి రచించవలెను. లఘువు బిందుత్వము నొందువరకు ఎదుట తత్సమమును వ్రాయుము.

పీయుష ద్యుతిలోచనత్రిపురజిద్దివ్యాంబరం దివ్యదృగ్ ।
గ్రంథోపేతదశాంకమాలిఖ పురా తత్రాంతిమాంగద్వయమ్ ।
ఏకైకాంతరితైకరాశిసహితం రాశిం విదధ్యాత్ సుధీః ।
సంగీతాకరదేవనిర్మితద్రుతోత్సంఖ్యార్థమాప్రోక్తితః ॥ 13 ॥

॥ ద్రుతసంఖ్యా ॥

**ప్రతిపదార్థము :** పీయూగద్యుతిలోచనత్రిపురజిత్ = అమృతకాంతివంటి కండ్లుకల ఈశ్వరుడు (మూడుసంఖ్య); దివ్యాంబరం = దివ్యమైన ఆకాశము(స్వర్గము) (ఒకటిసంఖ్య); దివ్యదృక్ = ఆత్మదృష్టి (రెండుసంఖ్య); గ్రంథోపేతదశాంకం = గ్రంథసహితదశసంఖ్యను; పురా = ముందు; ఆలిఖ = వ్రాయుము; తత్ర = అందు; అంతిమాంగద్వయం = చివరి అంగద్వయము; ఏకైకాంతరితైకరాశిసహితం = ఒక్కొక్కటి అంతరముగా కలరాశితో కూడిన; రాశిం = రాశిని; సుధీః = పండితుడు; విదధ్యాత్ = చేయవలెను; (1-3-5-7-9-11)(3-1-2); ఆప్రోక్తితః = హితోక్తిననుసరించి; సంగీతాకరదేవ నిర్మిత ద్రుతోత్సంఖ్యార్థం = పార్శ్వదేవునిచే నిర్మింపబడిన; ద్రుతగణన కొఱకు; విదధ్యాత్ = చేయవలెను.

**తాత్పర్యము :** అమృతకాంతివంటి కండ్లుకల ఈశ్వరుడు (మూడుసంఖ్య), దివ్యఆకాశము (స్వర్గము) (ఒకటిసంఖ్య) ఆత్మదృష్టి (రెండుసంఖ్య). గ్రంథసహిత దశసంఖ్యను ముందువ్రాయుము. అందు చివరి అంగద్వయము ఒక్కొక్కటి అంతరముగా కలరాశితో కూడిన రాశిని పండితుడు చేయవలెను. (1-3-5-7-9-11) (3-1-2) హితోక్తిననుసరించి పార్శ్వదేవునిచే నిర్మింపబడిన ద్రుతగణన కొఱకు చేయవలెను.

హిమకరనయనాంభోరాశిసంఖ్యాం లిఖేత్ తత్-
త్రయమిలితమధస్తాత్ తద్వదాసన్నసంస్థమ్ ।
ఉపరితననివిష్టామంకమాలాం క్రమేణ
త్యజ లఘుగణనార్థం యావదస్తి ప్రయోగః ॥ 14 ॥

**ప్రతిపదార్థము :** హికరనయనాంభోం రాశిసంఖ్యాం = విష్ణు అంబోధిసంఖ్యను (1+7) (2-7); లిఖేత్ = వ్రాయవలెను; తత్ త్రయమిలితం అధస్తాత్ = దానిక్రిందుగా మూడును కలసినది యగును; (2-7-3); తద్వదాసన్న సంస్థం ఉపరితననివిష్టాం =

అట్లే దగ్గరలోనున్నపైన ఉన్నట్టి; అంకమాలాం = సంఖ్యామాలను; క్రమేణ = క్రమముగా; లఘుగణనార్థం = లఘువును లెక్కించుటకొఱకు; యావత్ ప్రయోగః అస్తి = ప్రయోగముండు వఱకు; త్యజ = విడువుము.

**తాత్పర్యము** : విష్ణుఅంబోధిసంఖ్యను (1+7)(2+7) వ్రాయవలెను. దాని క్రిందుగా మూడును కలసినది యగును. (2+7+3) అట్లే దగ్గరలోనున్న పైన ఉన్నట్టి సంఖ్యామాలను క్రమముగా లఘువును లెక్కించుటకొఱకు ప్రయోగముండువరకు విడువుము.

**॥ లఘుసంఖ్యా ॥**

**సంఖ్యారాశావపహర తథా నష్టతాలప్రమాణమ్**
**శేషం తస్మిన్నపిచ సదృశే లేఖ్యహీనే చ తత్ర ।**
**వర్ణఃకార్యః స్వపరసహితం చేన్నవర్ణః పరేణ**
**ప్రాగంకేన ద్వయమపి పునర్దీర్ఘమేతత్ ప్లుతం వా ॥ 15 ॥**

**ప్రతిపదార్థము** : సంఖ్యారాశౌ = సంఖ్యారాశియందు; తథా =అట్లే; నష్టతాల ప్రమాణం అపహర = నష్టతాల ప్రమాణమును అపహరించుము (తీసివేయుము); శేషం = మిగిలినది; తస్మిన్ సదృశే లేఖ్య హీనే = సదృశమైన ఆలేఖ్యహీనమందు; తత్ర = అక్కడ; స్వపరసహితం = తన ప్రక్కనున్న దానితో కలసి; వర్ణః కార్యః చేత్ = వర్ణముచేయదగినదైన యెడల; వర్ణః = వర్ణము; పరేణ ప్రాగంకేన = రెండవ అంకెకు ముందటి సంఖ్యతో, ద్వయ మపి ఏతత్ దీర్ఘం ప్లుతం వాన = రెండును దీర్ఘప్లుతములు గాని కాకపోవును.

**తాత్పర్యము** : సంఖ్యారాశియందు అట్లే నష్టతాల ప్రమాణమును అపహరించుము (తీసివేయుము). మిగిలినది సదృశమైన ఆలేఖ్యహీనమందు అక్కడ తనప్రక్కనున్న దానితో కలసి వర్ణము చేయదగినదైన యెడల వర్ణము రెండవ అంకెకు ముందటి సంఖ్యతో రెండును దీర్ఘప్లుతములు గాని కాకపోవును.

**॥ నష్టమ్ ॥**

**లగపానామధస్తాద్ యత్ తదంశకం లోప్యమేవ చ ।**
**సంఖ్యాతం తు తదుద్దిష్టం నిర్దిష్టం శేషదర్శనాత్ ॥ 16 ॥**

**ప్రతిపదార్థము** : లగపానాం అధస్తాత్ = లఘు-గురు-ప్లుతముల క్రిందుగా; యత్ అంశకం = ఏఅంశమో; తత్ = అది; లోప్యమేవ = లోపింపదగినదియే; శేషదర్శనాత్= శేషము కనబడుట వలన; తత్ = అది; సంఖ్యాతం ఉద్దిష్టం = లెక్కింపదగినదిగా ఉద్దేశింపబడినది.

**తాత్పర్యము** : లఘు-గురు- ప్లుతముల క్రిందుగా ఏ అంశమో అది లోపింపదగినదియే. శేషము కనబడుటవలన అది లెక్కింప దగినదిగా ఉద్దేశింపబడినది.

**॥ ఉద్దిష్టమ్ ॥**

**బిందుప్రస్తరణాత్ పరం లిఖ తథా ద్వ్యంతం క్రమాద్ ద్వ్యాదినా**
**యత్తత్ తద్ద్వయమేకశ్యోప్యపహృతం ద్వంద్వం మిలిత్వాధునా ।**
**ఆసన్నద్వయమేలనాత్ ద్రుతలఘుప్రాంతం తదూర్ధ్వక్రమా**
**దేకైకాంతారతోఽంకతః పరిమితం దీర్ఘం ప్లుతం ధీమతా ॥ 17 ॥**

**ప్రతిపదార్థము** : బిందుప్రస్తరణాత్ పరం = బిందుప్రస్తరము తరువాత; క్రమాత్ = క్రమముగా; ద్వ్యాదినా = (2)రెండు మొదలుకొని; ద్వ్యంతం = ద్వి అంతమువఱకు; లిఖ = వ్రాయుము; తద్ద్వయం ఏకశ్యోపి అపహృతం = ఆద్వయము ఒకసారి కూడా; అపహృతం = తొలగించబడును; అధునాద్వంద్వం మిలిత్వా = ఇప్పుడు ద్వంద్వము కలసి; ఆసన్న ద్వయమేలనాత్ = సమీపద్వయమేలనమువలన; ద్రుతలఘుప్రాంతం= ద్రుత లఘుప్రాంతమును; తదూర్ధ్వక్రమాత్ = దానిపై క్రమముగా; ఏకైకాంతరతః = ఒక్కొక్కటి అంతరముగా; అంకతః = లెక్కగా; ధీమతా = కోవిదునిచే; ధీర్ఘం ప్లుతంచ= దీర్ఘమును ప్లుతమును; పరిమితం = హద్దుకలదిగా చేయబడినది.

**తాత్పర్యము** : బిందుప్రస్తరము తరువాత క్రమముగా (2) రెండు మొదలుకొని ద్వి అంతము వరకు వ్రాయుము. ఆ ద్వయము ఒకసారి కూడ తొలగించ బడును. ఇప్పుడు ద్వంద్వము కలసి సమీపద్వయమేలనమువలన ద్రుత లఘు ప్రాంతమును దానిపై క్రమముగా ఒక్కొక్కటి అంతరముగా లెక్కగా కోవిదునిచే దీర్ఘమును, ప్లుతమును హద్దుకలదిగా చేయబడినది.

**॥ ద్రుతస్యైక ద్వ్యాదిలఘుక్రియా ॥**

**ఏకం ద్విపంచక్రమతో మిలిత్వా లఘుప్రసంఖ్యాద్వితయాదియుక్తమ్ ।**
**అథో విఖాసన్నగతిత్రిరాశలఘ్వాది (సం)ఖ్యాపరిమాణహేతోః ॥ 18 ॥**

॥ లఘ్వేకద్వ్యాదిలఘుక్రియా ॥

**ప్రతిపదార్థము** : ఏకం = ఒకటి; ద్వి = రెండు; పంచ = ఐదు; క్రమతః = (ఈ) క్రమముగా; మిలిత్వా = కలిపి; లఘుప్రసంఖ్యా ద్వితయాదియుక్తం = లఘు సంఖ్యచే రెండు రెట్లు చేయబడిన దానితో కూడినదియు; అధః = క్రిందుగా; విఖాసన్నగతి = విఖాససమీప గతిని; త్రి = మూడు; ఆశ = దిక్కు (10); లఘ్వాది సంఖ్యా = లఘువు మొదలగు సంఖ్య(4); పరిమాణ = లెక్క; హేతోః = కారణముగా (అగును).

**తాత్పర్యము** : ఒకటి, రెండు, ఐదు (ఈ) క్రమముగా కలిపి లఘుసంఖ్యచే రెండురెట్లు చేయబడిన దానితో కూడినదియు క్రిందుగా విఖాసమీపగతిని మూడు దిక్కు(1) లఘువు మొదలగు సంఖ్య (4) లెక్క కారణముగా (అగును).

**ఆలిఖ్యతాలసంఖ్యాం తత్సంఖ్యాం ద్విగుణయేత్ పునర్ధీమాన్ ।**
**తత్రైకవిహీనం చేదంగుల్యః స్యాః క్రమాదధ్వే (?) ॥ 19 ॥**

॥ అధ్వయోగః ॥

**ప్రతిపదార్థము** : తాలసంఖ్యాం ఆలిఖ్య = తాలసంఖ్యనువ్రాసి (101); ధీమాన్ = మనీషి; తత్సంఖ్యాం = ఆతాళసంఖ్యను; ద్విగుణయేత్ = రెండు రెట్లు చేయవలెను; తత్ర = అందు; అంగుళ్యః = వ్రేళ్లు; ఏకహీనం = ఒకటితక్కువ; క్రమాత్ = క్రమముగా; అధ్వే = మార్గమందు; స్యాః = అగుచున్నవి.

**తాత్పర్యము** : తాళసంఖ్యనువ్రాసి (101) మనీషి ఆతాళసంఖ్యను రెండు రెట్లు చేయవలెను. అందు వ్రేళ్ల ఒకటితక్కువ. క్రమముగా మార్గమందు అగుచున్నవి.

**ద్వాదశాంగులిభిస్తు వితస్తిస్తద్ద్వయేన తు హస్త ఇతి స్యాత్ ।**
**తచ్చతుర్దండ తద్విసహస్రక్రోశతద్వార్ధయోజన ఏకః ॥ 20 ॥**

**ప్రతిపదార్థము** : ద్వాదశాంగులిభిః = 12 అంగుళములచే; వితస్తిః = వితస్తియు; తద్వయేన = ఆవితస్తిద్వయముచే; హస్తః ఇతిస్యాత్ = హస్తప్రమాణమగును; తచ్చతుః = అవి నాల్గు అయిన; దండః = ఆ దండము; తత్ద్విసహస్ర = ఆ దండములు 2000 అయిన; క్రోశతద్వా = క్రోశములచేగాని; అర్ధయోజనః ఏకః = ఒక అర్ధయోజనము (?)

**తాత్పర్యము :** 12 అంగుళములచే వితస్తియు, ఆవితస్తిద్వయముచే హస్తప్రమాణమగును. అవినాల్గు అయిన దండము, దండములు 2000 అయిన క్రోశములచేగాని ఒక అర్ధయోజనము (?)

> **నానారాజసభాంతరాల (సరి?రసి)కస్తుత్యశ్రుతిజ్ఞాన స**
> **చ్చ్రక్రోశో రసభావభేదనిపుణః సాహిత్యవిద్యాపతిః ।**
> **సంగీతాకరనామధేయవిబుధశ్రీపార్శ్వదేవో + +**
> **చిత్రం సర్వజగత్ప్రియం వ్యరచయత్ తాలస్య షట్ప్రత్యయమ్ ॥ 21 ॥**

**ప్రతిపదార్థము :** నానారాజసభాంతరాలరసికస్తుత్యశ్రుతిజ్ఞానసచ్చ్రక్రోశః = అనేక రాజసభలలో రసికజనముచే స్తోత్రార్హమైన శ్రుతిజ్ఞానముచే (సంపాదింపబడిన) సంచక్రోశము కలవాడును; రసభావ భేదనిపుణః = రసభావభేదములందు నిపుణుడు; సాహిత్యవిద్యాపతిః = సాహత్యవిద్యకుఅధికారియు; సంగీతాకరనామధేయశ్రీపార్శ్వదేవః = సంగీతాకరుడు అనే పేరుగల శ్రీపార్శ్వదేవుడు; చిత్రం = చిత్రమైన; సర్వజగత్ప్రియం= సమస్త లోకమునకు ఇష్టమైనట్టి; తాలస్య షట్ప్రత్యయం = తాలముయొక్క షట్ప్రత్యయమును; వ్యరచయత్ = రచించెను.

**తాత్పర్యము :** అనేక రాజ సభలలో రసికజనముచే స్తోత్రార్హమైన శ్రుతిజ్ఞానముచే (సంపాదింపబడిన) సంచక్రోశము కలవాడును, రసభావభేదములందు నిపుణుడు, సాహిత్య విద్యకు అధికారియు సంగీతాకరుడు అనే పేరుగల శ్రీపార్శ్వదేవుడు చిత్రమైన సమస్త లోకమునకు ఇష్టమైనట్టి తాలముయొక్క షట్ ప్రత్యయమును రచించెను.

**ఇతి శ్రీమదభినవభరతాచార్య సరవిమలహేర్మణార్యవిద్యాపుత్రశ్రుతిజ్ఞానచ(క్ర)వర్తి**
**సంగీతాకరనామధేయపార్శ్వదేవవిరచితే సంగీతసమయసారే**
**తాలషట్ప్రత్యయలక్షణం నామ నవమమధికరణమ్ ।**

# గ్రంథకర్త శ్రీ ద్వారం భావనారాయణరావు గారు వారి శ్రీమతి ద్వారం వెంకట వరదమ్మ

## పరిచయం

జననం : 15-6-1924

తల్లిదండ్రులు : పద్మశ్రీ సంగీత కళానిధి డా॥ ద్వారం వేంకటస్వామి నాయుడు శ్రీమతి ద్వారం జగ్గయమ్మ గారలు

గురువు : పితృపాదులు (వైలిన్, గాత్ర సంగీతం) ఆచార్యులు ప్రొఫెసర్ పి. సాంబమూర్తి, మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులు.

**అధివహించిన పదువులు :**

1. ప్రిన్సిపాల్, బెజవాడ గోపాలరెడ్డి సంగీత నృత్య కళాశాల, కావలి
2. ప్రిన్సిపాల్, మహారాజా ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల, విజయనగరం
3. ప్రిన్సిపాల్, జి.వి.ఆర్. ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల, విజయవాడ
4. ప్రిన్సిపాల్, డి.వి.ఎస్. కళాక్షేత్రం, విశాఖపట్నం
5. గాత్ర సంగీత శాఖాధిపతి, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్
6. మద్రాస్, కేరళ, శ్రీ వేంకటేశ్వర, నాగార్జున, ఆంధ్ర, ఉత్కళ, శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయాల సంగీత పరీక్షాధికారి.
7. ఢిల్లీ విశ్వవిద్యాలయం సంగీతంలో పి.హెచ్.డి. పరీక్షలకు Adjudicator.

**విద్యా ప్రదర్శనలు :**

1. వివిధ సంగీత సభల్లో, ఆలిండియా రేడియోలో గాత్ర, వైలిన్ సంగీత సభలు, దేశ, విదేశాల్లో (USA) సంగీతోపన్యాసాలు.
2. విస్కాన్సిన్ యూనివర్శిటీ తరపున ఆంధ్రరాష్ట్రంలో ఇతర రాష్ట్రాల్లో అనేక సంగీత సాంస్కృతిక సభల్లో సోదాహరణ ప్రసంగాలు.
3. మద్రాస్ మ్యూజిక్ అకాడమీ మొదలైన సభల అఖిలభారత సమావేశాల్లో Lec-demonstrations.
4. నాట్యకళ, గానకళ, మ్యూజిక్ అకాడమీ జర్నల్స్ మొదలైన ప్రముఖ పత్రికలు, సంచికల్లో సంగీత వ్యాస రచన.

**సంగీత రచన, దర్శకత్వం :**

1. వివిధ వర్ణాలు, కృతులు
2. శ్రీకృష్ణ పారిజాతం
3. కళ్యాణ శాకుంతలం సంక్రాంతి సంబరాలు మొదలైన నృత్య నాటకాలకు, సంగీత దర్శకత్వం వహించారు.